క. సరి వత్తురె గుణసంపద, వెఱవక మాపొణ్ణుపాటి వేంకటపతి కా
గ్గురు చక్రవర్తులు పదా,గ్గురు రాజులు ముప్పదిద్దఱు నియోగివరుల్.

క. వరదానాచారంబుల, గరిమ గని వనీపకులును గర్మఠులును భూ
సురమణి యని నిన్నందురు, విరచితవృష పొణ్ణుపాటి వేంకటమంత్రీ.

సూరకవి కాశీయాత్ర కేగి వచ్చుచుండ జగన్నాథములో నీ వేంకటమంత్రి మరణవార్తను విని ఖిన్నుండై యీరీతిగ నొకపద్యమును జెప్పెనఁట—

మ. కరుణాసాగర! పొణ్ణుపాటికుల వేంకట్రామదాసుల్ వసుం
ధరయం దుంచక స్వర్గలోకమునకుల్ దర్శించినా వేమి? త
త్పురి కల్పాదులు లేవె యాచకులకుల్ భూయాచకశ్రేణి కె
వ్వరు ది క్కేమిది? మొండిజగ్గఁడవు గావా? వెఱ్ఱివై పల్కితిల్.

ఈ పద్యమును బట్టి సూరకవి కీవేంకటమంత్రియందుఁ గలగౌరవము తేఁటపడుటయే గాక యామంత్రివరుని వితరణాదిసుగుణసంపదలు గూడ వ్యక్తము లగుచున్నది. ఈ వేంకటమంత్రి క్రీ. శ. 1780 సంవత్సరప్రాంతమునఁ గీర్తిశేషుఁడై యుండవచ్చు నని తోఁచెడిని—

కృతికర్త:—ఈ పద్యములను జెప్పిన అడిదము సూరకవి క్రీ. శ. 1730—1790 వఱకుఁ గల కాలమున శ్రీవిజయనగరసంస్థానమున నాస్థానకవిగా నుండెను. ఇతఁడు ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు, వసిష్ఠసగోత్రుఁడు, చినలచ్చనమంత్రి పౌత్రుఁడు, బాలభాస్కరకవిపుత్రుఁడు, నివాసస్థలము విజయనగరమునకు సమీపమున నున్న భూపాలరాజు రేగ (పూసపాటి రేగ). సూరకవి రచించిన గ్రంథములు. (1) పిల్లవసుచరిత్ర మను నామాంతరము గల కవిజనరంజనము, (2) కవిసంశయవిచ్ఛేదము, (3) ఆంధ్రనామశేషము, (4) ఆంధ్రచంద్రాలోకము, (5) రామలింగేశశతకము, (6) శ్రీరామదండకము. 18-వ శతాబ్దమందుఁ బ్రౌఢప్రబంధరచనకుఁ బేరువడసినవారిలో నీ సూరకవి యొకఁడు. ఇతఁడు క్రీ. శ. 1790 సంవత్సరప్రాంతమునఁ గీర్తిశేషుఁ డయ్యెను.

ఈ వేంకటమంత్రి శతకము నాకు సంపూర్ణముగ లభింపలేదు. కీటకదష్టము గాకుండఁ దాళపత్రములపై నిలిచి యున్నపద్యములను నాంధ్రసాహిత్యపరిషత్తువారి యాదరమున నిందుఁ బ్రకటించి యాంధ్రలోకమునకు సమర్పింపఁ గలిగితి నని సంతోషించుచున్నాఁడను. పరిషత్కార్యనిర్వాహక సభాధ్యక్షులగు శ్రీజయంతి రామయ్యపంతులుగారికి నాకృతజ్ఞతాపూర్వకవందనము లాచరించుచు నీ పీఠిక నింతటితో ముగించుచున్నాఁడను—

అడిదము రామారావు.

శ్రీ

# వేంకటమంత్రిశతకము.

— అడిదము - రామారావుగారిచే సంపాదితము —

కృతికర్త. కృతిపతి.

అడిదము - సూరకవి. పొణ్గుపాటి వేంకటమంత్రి.

క. శ్రీకరగౌతమకూకుద, కాకుత్స్థపదాబ్జసేవకప్రవరుఁడ వై
కైకొను మభీష్టసిద్ధి వి,వేకనిధీ పొణ్గుపాటి వేంకటమంత్రీ. 1

క. వెన్నెలవలెఁ గర్పూరపుఁ, దిన్నెలవలె నీదుకీర్తి, దిగ్దేశములన్
మి న్నంది వన్నె కెక్కెను, విన్నావా పొణ్గుపాటి వేంకటమంత్రీ. 2

క. చుక్కలవలెఁ గర్పూరపు, ముక్కలవలె నీదుకీర్తి ముల్లోకములన్
గ్రిక్కిఱిసి పిక్కటిల్లెను, వెక్కసముగఁ బొణ్గుపాటి వేంకటమంత్రీ. 3

క. లేఁడు భువి వానఁ దడియని, వాఁడు న్నీయింట భుక్తి వడయనిద్విజుఁడున్
బోఁడిమి మీఱఁగ నిన్నున్, వేఁడనికవి పొణ్గుపాటి వేంకటమంత్రీ. 4

క. వరదానాచారంబుల, గరిమ గని వనీపకులునుఁ గర్మఠులును భూ
సురమణి యని ని న్నందురు, విరచితవృష పొణ్గుపాటి వేంకటమంత్రీ. 5

క. జలచరము లబ్ధిఁ బొడమవె, జలరాశికి మోదకరుఁడు చంద్రుం డొకఁడే
కుల ముద్ధరింప నొకఁడే, విలసద్యశ! పొణ్గుపాటి వేంకటమంత్రీ. 6

క. ఘనకులమునఁ బొడమినదు, ర్మనుజుం డిల నింద్యుఁ డగు వమన మూర్ధ్వముఖం
బున వెడలి మంచి దగునా, వినుమవహిత! పొణ్గుపాటి వేంకటమంత్రీ. 7

క. కలుద్రావువానితో మూర్ఖులతో జవ్వనులతోడఁ గోడెలతోడన్
గలహింపఁబోవ రధికులు, విలసన్మతి! పొణ్గుపాటి వేంకటమంత్రీ. 8

క. తనుఁ దాఁబొగడిన నల్పుఁడు, ఘనుఁ డగునా ఘనుని ఖలుఁ డొకఁడు గాదన్నన్
జను లంద ఱతనిఁ బొగడరె, వినుమవహిత! పొణ్గుపాటి వేంకటమంత్రీ. 9

క. జగములకు సాక్షి సూర్యుం, డగు సూర్యుని కొక్కసాక్షి యవనిం గలఁడే
తగ వెఱుఁగఁడు పెనుమూర్ఖుఁడు, విగతకలుష, పొణ్గుపాటి వేంకటమంత్రీ. 10

క. పెనుమూర్ఖుఁ డాడికొనఁడా, "నను నెఱుఁగరె నేతుశీతనగమధ్యోర్వీ
దను వెఱిఁగిన సుకవీంద్రులు" విను మవహిత పొన్నుపాటి వేంకటమంత్రీ. 11

క. నన తేనియఁ గైకొనుభృంగ, గనిరూఢిని దాతమనసు కందక యుండన్
గొనవలె యాచకుఁ డర్థము, విను మనహిత పొన్నుపాటి వేంకటమంత్రీ. 12

క. కినుకమెయిఁ దన్ను లాడఁగ, మొనకట్టిన సరియ గుఱ్ఱమున్ గాడిదయున్
ఘనుఁ డల్పునితోఁ బోరునె, విను మవహిత పొన్నుపాటి వేంకటమంత్రీ. 13

క. యతి దవలవలయు వాగను, గతి ధేనువువెంట నంటి కదలెడునట్లా
కృతి నదియె కవనచతురిమ, వితరణఖని! పొన్నుపాటి వేంకటమంత్రీ. 14

క. కుశలత్వ మెంత యుండిన, వశమా పులినోటికండ వదలింపఁగఁ దా
దృశపాండిత్యము నీదే, విశదయశా పొన్నుపాటి వేంకటమంత్రీ. 15

క. శరమొకటి నేయ రిపుపైఁ, బరుగెత్తినఁ గట్టునడిమె భాస్కరబిం
బం బరిది భవత్సాయకధృతి, వెఱచి కదా పొన్నుపాటి వేంకటమంత్రీ. 16

క. జనపతికి మతి దొలంగినఁ, గొనసాగదు మంత్రిబుద్ధికుశలతయును శాం
తనవాదులు కురుపతికీవి నెగడ్చిరె పొన్నుపాటి వేంకటమంత్రీ. 17

క. ధరణిన్ భౌమాదిగ్రహ, పరీక్షలకె గాక యతఁడు భాస్కరుఁ డనిగో
ర్వుజుపవలెనె లోకులకున్, విరోధిహరణ పొన్నుపాటి వేంకటమంత్రీ. 18

క. సకలామోదసుమద్రుమ, వికసన మొనరించుమధుఁడు నీడిన లేఁడా
యొకఘనుఁడు జాతిలతికా, వికచతకున్ బొన్నుపాటి వేంకటమంత్రీ. 19

... ... ... ... ... ... ...

చల మేల కార్యవాదికి, విలసద్యశ పొన్నుపాటి వేంకటమంత్రీ. 20

క. బలవంతుఁడు బలహీనుఁడు, పొలతురు విధి తప్ప సల్లపూసలు ముత్యాల్
తొలఁగుఁ గద మగఁడు పోయిన, వెలఁదుకకున్ పొన్నుపాటి వేంకటమంత్రీ. 21

క. అని భార్గవుఁ దరిమినశం, తను నితనూజుండు చండతరసాయకముల్
జొనిపెనె శిఖండిమీఁదను, విను మవహిత పొన్నుపాటి వేంకటమంత్రీ. 22

క. ఒక్కసముద్రముఁ దక్కఁగఁ, దక్కినసంద్రములు నీయుదారమహిమచేఁ
జిక్కెఁ గద విప్రభుక్తికి, వెక్కసముగఁ బొన్నుపాటి వేంకటమంత్రీ. 23

క. నీమహిమ మొక్కపోవదు, నీమాటయె విష్ణువరము నీవాక్యము శ్రీ
రాములబాణము గద త, న్వీమన్మథ పొన్నుపాటి వేంకటమంత్రీ. 24

క. కోయక పెరుఁగదు బచ్చలి, మేయక పాలీయ దావు; మేదినిలో డ
బ్బీయక రాదు సుకీర్తియు, వే యేలా, పొణ్గుపాటి వేంకటమంత్రీ. 25

క. చేలకడ దిష్టిపతిమ మె, కాలం బెదరించు ముచ్చుఁ గావంగలదా ?
చాలును మంత్రికుమారుల, వీ లిట్టిది పొణ్గుపాటి వేంకటమంత్రీ. 26

క. * పొగత్రాగ నట్టివోరును, పొగడంగా బ్రతుకనట్టిభూపతిబ్రతుకున్
మగఁ డొల్లనిసతిబ్రతుకును, వెగటు సుమీ పొణ్గుపాటి వేంకటమంత్రీ. 27

క. చెడఁ గొలుకు చీడపురు గొక, పిడికెడుజలక మిడి చెట్టు పెంచునె? చెడు గా
అడి వెట్టుఁగాని, దుర్దశ, వెడలించునె? పొణ్గుపాటి వేంకటమంత్రీ. 28

క. పరపీడనంబుకంటెను, దురితము సూన్పతముకంటెఁ దోరపు (వ్రతమున్
ధర నెంచి చూడఁ గలవా, విరచితవృష పొణ్గుపాటి వేంకటమంత్రీ.) 29

క. జనియింతురు సజ్జనదుర్జను లుపకారాపకారసంఘటన మొన
ర్పను గోవ్యాఘ్రము లట్లను, విను మనహిత పొణ్గుపాటి వేంకటమంత్రీ. 30

క. ... ... సజ్జనుఁడున్, దనదుప్రయత్నంబు లేక ; దధి యైనను ద
చ్చిన గాని వెన్న యొసఁగునె, విను మనహిత పొణ్గుపాటి వేంకటమంత్రీ. 31

క. ... ... ... , దైవముకృప దప్ప భీష్మతరణిసుతాదుల్
ప్రోవం గలిగిరె కురుపృథ్వీవరునిం బొణ్గుపాటి వేంకటమంత్రీ. 32

క. అలవిగురుమెసఁగుకోయిల, ఫలములు భుజియించుచిలుకపలుకుల
కెనయే ... ... ... , ... ... ... ... 33

(3, 4, పాదములుపోయినవి.)

క. వివిధపదార్థంబులు నిల్వవు దక్షత లేనియింట లక్షలకొలఁదిన్
... ... ... ..., (3, 4, పాదములు లేవు.) 34

క. ఎదు రెవ్వరు తనకన నీ, పదునాలుగుజన్మములఁ దపముఁ జేసిన
... ... ..., విదళితమద పొణ్గుపాటి వేంకటమంత్రీ. 35

క. తల యెత్తి మొఱుగుకుక్కకు, ... .. ఘనతలభించెన్
గలభమున కున్నయున్నతి, వెలితిపడెనె పొణ్గుపాటి వేంకటమంత్రీ. 36

---

* కృతిపతి గాని, కృతికర్త గాని యీపొగ త్రాగునభ్యాసమునకు వలవడినవా రేమోయని సందే
హ మీపద్యమువలనఁ గలుగుచున్నది.

క. చౌకట్లు వెట్టి మిన్నా, కోకలు తొడిగినను గలవె గురుతరకీర్తుల్
... ... ... వి,వేకనిధీ పొణ్ణుపాటి వేంకటమంత్రీ. 37

క. పొగడను బరకవికవనము, ... ... ... ... ...
జగమెల్లనన్నుఁ బొగడును, విగతకలుష పొణ్ణుపాటి వేంకటమంత్రీ. 38

క. సరి వత్తురె గుణసంపద, వెఱవక మాపొణ్ణుపాటి, వేంకటపతి కా
ర్గురు చక్రవర్తులు పదా,ర్గురు రాజులు ముప్పదిద్దఱు నియోగివరుల్. 39

వేంకటమంత్రి మరణవార్తను విని సూరకవి చెప్పిన పద్యము—

మ. కరుణాసాగర ! పొణ్ణుపాటి కులవేంకట్రామదాసు న్వసుం
ధరయం దుంచక స్వర్గలోకమునకుఁ దర్లించినా వేమి ? త
త్పురిఁ గల్పాదులు లేవె యాచకులకుఁ భూయాచకశ్రేణి కె
వ్వరు దిక్కే (మిది) ? మొండిజగ్గఁడవు (గావా ? వెఱ్ఱి నైనల్కితిఁ.) 40

(ఈపద్యము శ్రీజగన్నాథములోఁ జెప్పినట్టు వ్రాసుక)—

(99) వినుకొండరామాయణము. (గ్ర. సం. 1220)

అయోధ్యాకాండము సుందరకాండమును మాత్రము గలవు. గద్యము.
"ఇది శ్రీవినుకొండ విజయరామకవిప్రణీతంబైన శ్రీమద్రామాయణ కథయందు"
అని మాత్రమే కలదు. అచ్చటనచ్చట ద్విపదల నడుమఁ గీర్తనలును గలవు.
శైలికై కొన్నిబంతులు—

నెలకొని నీవింక నీతిమార్గమునఁ, దొలఁగక సీతను దోడుకవచ్చి
శరణు చెందుము నీకు జయమును గల్గు, వైరంబులేకుండ వర్తించు మదిని
వలవదువైరంబు వలవదు రిత్త, పోలియకప్రాణములు గాచుకొనిబ్రదుకు
అని బుద్ధి సెప్పిన హనుమంతుఁజూచి, తనమది గర్వించి దశకంఠుఁ డనియె.
ఆఁడదానిమాట లంగీకరించి, చేడెతోఁ గూడుక చెరిపన జేరి
మునివృత్తి వల్కలములు గట్టునరుని, ఘనముసేసెద వేల కడుఁ గ్రొవ్వినీవు
బలవంతులకుమేము బలహీనుసంధి, వలవదు మాకింతవలదు పొమ్మనిన.

100. కుశలవకథ—(గ్రం. భాం. సంఖ్య 1344)

ఇదియొక ద్విపదకావ్యము.—కవి యెవ్వరైనదియు నిందుఁ గానరాదు.
ఒకవేళనిది రంగనాథోత్తరరామాయణములోని భాగమేమో యనికొన్నను
నాద్యంతముల నట్టిసూచనలు కనఁబడలేదు గాని దానింజూచి వ్రాసినట్లు స్పష్ట
పడును—

"శ్రీరామచంద్రుఁ డాశ్రితవార్ధి చంద్రుఁ, డారఘునాయకుం డభయదాయకుఁడు
కారుణ్యవారిధి గాంభీర్యధనుఁడు, చారుయశోనిధి సత్యసంధుఁడు
అమరవిద్రావణుం డైనరావణుని, నమితబలోద్దీర్ణుఁడగు కుంభకర్ణు
హతశాత్రవోపాయుఁడగు నతికాయు, నతులవీర్యోన్మత్తుఁడగు నింద్రజిత్తు ...
చతురంగబలవీర సచివాప్తబంధు, సుతులతోజముఁ డున్నచోటికినినిచి ...

ఇట్లు ప్రారంభింపఁబడి—

"శ్రీరాముసేవయుఁ జేయుచునెప్పుడు, నారూఢనియతితో నవనిఁబాలింప
భూచక్రమునఁ బొలుపొందుచునుండ్రి—(రెండవచరణములేదు)
ఆజ్ఞానుసారిగా నఖిలసంపదల, సుజ్ఞానయుక్తులై సొరిదిరాజ్యంబు
ఏలుచునుండిరి యింపలరార, ఆలవకుశలవోపాఖ్యానమిదియు
ఇదియె యుత్తరభాగమిందుకులేశ.........

ఎవ్వరుచదివిన నెవ్వరువినిన, నెవ్వరువ్రాసిన నిహపరసుఖము ... ... ...

ఇట్లు ముగింపఁబడినది.

కవిత్వము రంగనాథరామాయణమువలెఁ గనఁబడదు. కథలోఁగొన్ని చిత్రములైన మార్పులున్నవి. ఇందుఁగుశలవుల జన్మప్రకారమునుండియుఁ గలదు. ఎట్లనిన:—

ప్రకటితభోగ సౌభాగ్యసంపదల, నొకకొఱంతయు లేకయున్నవై దేహిఁ
గనుఁగొని చూపోపకట యొక్కనాఁడు, తనమదిరోషమెంతయు నిల్పలేక
ధరణిజతో వినోదంబుగాఁగైక, కరమర్థిఁబలికె వెక్కసముదీపింప
నోరామ మారామకోకశంబరారి, నారీమణికి మిన్నగు నాతియుగము
ఏమానవులకును నెఱుఁగరాకుండఁ, గామరూపంబులఁ గరముశోభిల్ల
బాణాకృతిని రామభద్రునియొద్ద, నేణాక్షికలరఁట యెఱుఁగుదో లేదో
యనవుడు సీత ... ... ...
వలఁతులై మనుజులెవ్వరుగానకుండ, లలితవిలాసినులైన భామినులు
గలరఁటమీవద్ద కమలాప్తవంశ్య
అనవుడు రఘురాముఁ డవనీతనూజఁ, గనుఁగొని నేఁడు బొంకగనేలవినుము
గొనకొనియొకనాఁడు కుంభసంభవుని, గనువేడ్కఁజని నమస్కారంబుసేయ...
ఈబాణములు రెండు నేపుమీఱఁగను, బ్రాభవంబుగనెల్ల పనులనుగూర్చు...
కలరూపుచెప్పినఁ గైకొనియేను, దలపోసిదాని విధంబెల్లదెలియ
కొఱకునై యవిదాఁచికొన్నాఁడఁగాని, తెఱవరోమఱియొండు తెఱఁగుగాదనిన...
మొనయుదోషమున రామునిగానకుండ, పొడిచేసి యమ్ములంబువులోనఁగలపి
తడయక త్రావెనత్తరుణి కోపమున ... ... ...

కాళయుక్తినామ సం॥ ఆషాఢ శు ౧౫ లు నాగుల అప్పాస్వామికి కరణము అన్నయ్య వ్రాసియిచ్చిన ప్రతి—

## 101. కన్యకాచరిత్రము. (గ్ర. భాం. సంఖ్య. 1537)

వైశ్యులకులదేవతయగు శ్రీవాసవకన్యక చరిత్రము. యక్షగానము. ఈ గ్రంథకర్త తిమ్మన్న. తండ్రి చెన్నమసెట్టి. తల్లి లక్ష్మాంబ. తాత యుటికెల గురవయ్య. గురువు శ్రీశైలవంశభూషణుండగు కృష్ణమాహ్వయుఁడు. కవిత్వము నందును వ్రాఁతయందును జాలదోషములు గలవు. రెండాశ్వాసములు. శైలికై కొన్నిబంతులు:—

ద్వి. తల్లిదండ్రులమీఁదఁ దాత్పర్యమున్నఁ, జల్లఁగాఁబోయి రా సఖియరో నీవు
శ్రమమార నందికేశ్వరుతోడఁగూడి, క్రమముతోడుత నన్నఁగదలివేవేగ
చనియెఁ జేరెలుఁగక చంద్రబింబాస్య, జనకుఁడుండెడి యాగశాలలోపలికి

వ. ఇటువలె వచ్చి యూపస్తంభంబు సమీపంబున వెన్నాని నిలుచున్న యగ్గిరి కన్నియం జూచి యగ్రకాంతాజనంబులు కలుషించి తమలోఁ దామేమనుచున్నారు.

జంపె. మానవతి యిందురమ్మని పిల్వలేదెవరు, తానేలవచ్చె నిత్తఱి సిగ్గుమాలి
పలుమాఱురమ్మంచుఁ బ్రార్థించి నారారు, కలనైనయెఱుక గల కామినీమణులు.

పరాభవనామ సం॥ మాఘ శు ౨ లు చేపూరి అదెప్పకుమారుఁడురామన్న వ్రాసినప్రతి—

102. రామానుజీయము. (గ్రం. భా. సంఖ్య. 1287)

ఇదియొక వైష్ణవసాంప్రదాయగ్రంథము. ఇందు నమునమమ శాస్త్ర దృష్టాంతములు సంస్కృతశ్లోకాదిరూపమునను వివరణము తెనుఁగున వ్రాయఁబడినది. మొదట నొకపుట విఱిగిపోయినది. తక్కినది పూర్ణముగ నున్నది.
శైలి—

(1) "రుద్రతత్త్వత్రాది కల్పితములైన యాగమములు మోహనార్థమై భగవదాజ్ఞచేతఁ జేయింపఁబడుట యెట్లన్న :—సహస్రనామాభాష్యయమందును, అగస్త్యసంహితయందును మఱియు ననేకస్థలములయందుఁ జెప్పఁబడి యున్నది.

శ్లో॥ త్వంచ రుద్ర మహాబాహో మోహశాస్త్రాణికారయ
అల్పాయాసం దర్శయిత్వా ఫలం శీఘ్రంప్రదర్శయ
కుహకం చేంద్రజాలాని విరుద్ధాచరణానిచ
దర్శయస్వ జనం సర్వం మోహయాశు మహేశ్వర.

రుద్రుఁడా! నీవును, అసురజనులను మోహించెడునట్టుగా శాస్త్రిలను రుచిపుట్టింపుము. ఆ శాస్త్రములయం దాయాస బాహుళ్యమునుఁ గనఁబఱపక యల్పమైన యాయాసమును గనఁబఱచి ఆక్రియకు ఫలము వేగిరమే కనిపింపుమా.

(2) బ్రాహ్మణులకు జన్మప్రభృతి కొంతకాల మూర్ధ్వపుండ్రములు లేకున్నను మధ్యమున సంపాదించుకొనవలయు నని తాత్పర్యము. అటు గనుక గోపులవలెనే బ్రాహ్మణులును శృంగులైననే పూజ్యులు లేకున్నఁద్యాజ్యులు. సర్వత్రశృంగులె శ్రేష్ఠులును బవిత్రులును. ఇతరులు కారా! ఇతరులకును నొకప్పుడు శృంగుల

మలభస్మధారణాదులను బట్టి పవిత్రత్వము కలదు. మఱియుఁ గులచ్యుతియైన బ్రాహ్మణులకు శృంగులయొక్క మూత్రాది పంచకస్వీకారముచేత కులప్రాప్తి యగునని ధర్మశాస్త్రప్రసిద్ధము. కనుక శృంగులైన గోబ్రాహ్మణులను నిందింప రాదు. ప్రతిదినమును నమస్కరింపవలయును.

ఇందలి తెనుఁగు సవరించి వ్రాయఁబడినది.

103. పారలపంచకము. (గ్రం. భాం. సంఖ్య. 1422.)

ఇదియొక వేదాంతగ్రంథము. తెనుఁగువచనము, భాషసలక్షణమైనదికాదు. గ్రంథాదిని కవిం గూర్చిగాని మఱి యేయితర ధ్యానశ్లోకముగాని లేదు. తుదను "యిది శ్రీవేదవ్యాసుల కొమారుఁడు శుకులు చెప్పిన నిర్మాణం, యీగ్రంథం ౧౪ లోకాలకున్ను పూజ్యమైనది, నాలుగు యుగప్రమాణాలకు చేశిన సంస్కృత గ్రంథం గనుక కలియుగమందు మానవులు మోక్షం పొందవలెను. అని తెనుగు చేశిన నిర్మాణం" ఇత్యాది గలదు. మూలము సంస్కృతమేదో తెలియదు. ఈ గ్రంథమునందె "యీగ్రంథానకు మూలం విచారణీయ్యం" అని యున్నది. తెనిఁగించిన వారిపేరు తెల్పకపోవుట యీయొక్క గ్రంథమునకేకాదు. విషయము చక్కనిది. అనేకవిషయము లిందుఁ దేటపడుచున్నవి. ఉపనిషత్తులనుండి యితర శాస్త్రములనుండి సంస్కృతోదాహరణముల నిచ్చియున్నాఁడు. ఇది స్వరశాస్త్ర మని ప్లవ సం॥ మాఘ శు ౧ లు స్థిరవారమునఁ బ్రతివ్రాసికొనిన తిప్పసముద్ర విరూపాక్షయ్యగారు తెల్పుచున్నారు. శైలి—

(1) నాల్గువేదములు చదివినను, ఆఱుశాస్త్రములు చదివినను వ్రాసినను యెన్నియాగాది సత్కర్మలుచేసినను యెన్నిగ్రంథములు వ్రాసినను జదివినను, ఎంత సంగీతసాహిత్య పరుఁడైన నిష్ఫలము. గర్దభము గంధపుఁ జెక్కలు మోసికొని యును వాసనయేమియు గుఱు తెఱుఁగనియట్లు—

శ్లో॥ చతుర్వేదధరోవిప్రః సూక్ష్మంబ్రహ్మ నవిద్యతే
వేదభారభరక్లాంత స్సవై బ్రాహ్మణగర్దభః.

(2) సమానవాయువు సకలమైన వాయువులను సమానముచేయును. దుఃఖించునది, తుమ్మించునది నీల్గించునది, మీటించునది నాగవాయువు. ఎక్కిళ్లు వచ్చునది, కక్కునది, ఓకిలించునది, దగ్గించునది, తేపులువచ్చునది కూర్మవాయువు. ముఖము వికసించునది, నవ్వించునది, కన్నులు మూయునది, పులకరించునది, గగుర్పొడిపించునది, ఆవలించునది యిదికృకరవాయువు, కన్నులెత్తివేయునది, దేవదత్తవాయువు. కన్నులు తెఱచునది, మాటలాడించునది, పరువు బాఱించునది, ఒకరినిజుట్టుకొని తిరుగునది, యుద్ధముచేయునది ధనంజయవాయువు.

ఇందలి తెనుఁగు సవరింపఁబడినది.

ఉ. హా కపినాయకప్రవర హా దశకంధరదండశూకబం
దీకరణాహితుండికపతీకృతవాలధి హా గుణైకర
త్నాకర పోయితే దివికి నంచు వలీముఖు లాచరించి రై
క్ష్వాకునియాజ్ఞ సంస్క్రియలు వాలికి శౌర్యజితాంశుమాలికిన్. 48

క. మహితనయావిభుఁ డంతట, మిహిరజు నభిషిక్తుఁ జేయ మేఘము లీర్ష్యా
వహము లయినట్లు తన్మహి, మహిషిని నభిషిక్తఁ జేయ మఱి దివిఁ దోఁచెన్.

చ. తనుఁ గిష్కింధ వసింప వేఁడుకపినేత న్రాఘవుం డేఁ బురం
బునకున్వచ్చు టయుక్త మీఘనదినంబు ల్వీట నీ వుండి ర
మ్మని వీడ్కొల్ప నతండు నేగి నిజరాజ్యప్రాజ్యసౌఖ్యాప్తిఁ బొ
ల్చెను రాముండును మాల్యవంతమున నిల్చె న్వానకై యయ్యెడన్. 50

— * వర్షాకాలవర్ణనము.

సీ. హలధరహృదయప్రియానహారంభణం బాశాంతవిపినాంతహవ్యవహము
శాంబరాడంబరచ్ఛన్నాబ్జహితబింబ మచిరాంశురుచిదీపితాంబరంబు
నవనవారచితార్జునవికాసగరిమంబు ధార్తరాష్ట్రనిరాసదాయకంబు
శితికంఠబాంధవప్రతిపాదనోచితం బాయతశక్రగోపావనంబు

గీ. వితతఘనఘోషపోషణం బతిశయోద, యాశ్రితకదంబమాత్తమహావనాగ్ర
జాతికమునై తనర్చె వర్షాదినంబు, దేవకీనందనునిఠీవిఁ దెలిపె నపుడు. 51

చ. సరకుఁగొనండు నన్నుఁ దనచాయల వాలినడంచె మత్పురం
దరవిభు సడ్డసేయక యితం డని రాఘవునాలిజాలి ము
న్నరకకుఁ దెచ్చుపోలిక ఘనాఘనమాలిక తత్ప్రియాసమా
హరణ జలాశ లాశలను నాఁగె సగర్జితసింహనాద యై. 52

క. కయికొనియె న్రాజులపస, మొయి లపుడు నిరస్తతాపము న్సత్పథవ
ర్తియుఁ బౌరస్త్యమహాబల, రయచలితము జీవనస్ఫురద్వసుధయు నై. 53

వ. అత్తఱి వియత్తలంబు హత్తి లాగెత్తు మెఱుపుటాఱపులాఁడినర్తనచమత్కృ
తికి నచ్చెరుపడి వియచ్చరోచ్చయంబు లిచ్చిన చిరత్ననవరత్నబిరుదమంజీరవల
యంబుమంజిమం జదల నాఖండలీయకోదండంబు దోఁప, నాపురందరశరా
సనంబుఁ గొని ఘనుం డఖండనిజమండలాసహంబు లిప్పాండురాండజంబు లని
శరాసారంబుఁ గురియింప సొంపుసెడి యంచగుంపు లలక కెలఁకుకొలఁకునకై
పఱవ నవి పఱచి వెఱచఱచుటకుఁ గేకవైచు కేకికలకలంబునకు నలికి

కేతకీతతి భుజంగసంఘం బడంగ, నారీతి భోగినీపతుల కగు మొగలితెగల తగులునకు నగుపగిది వికచకుటజనిచయరుచిర యగునరణ్యానిచే నగణ్య యగు ప్రావృషేణ్యప్రక్రియకు విక్రియం బూని యాజానకీజాని లక్ష్మణు నిరీక్షించి యి ట్లనియె. 54

మ. మెఱుపుందళ్కు మిటారిచాయ దెలుప న్మేఘుండు తన్వంగి పె
న్నెఱిగుంపు న్నెఱయింప జాదినవలా నెత్తావి పై నింప ముం
దఱం జిందుల్గొనునెమ్మికొమ్మ నటన ల్దార్పంగఁ గందర్పుఁ డి
త్తఱి నేపాంథుని నొంపఁ డీనవపయోధారాసమీరాహతిన్. 55

పృథ్వి. చెలంగె నలుదిక్కులన్ శిఖిశిఖావళీకంఠ కా
హళీధ్వని వియోగితా మపి నరేషు నారీషు వా
జలాకులఘనే దినే సపది యాంతి కే కా యితి
చ్ఛలారభటితో మనోజరణవేగసంసూచి యై. 56

ఆ-గీ. అభ్రగర్భనిర్యదంబుధారాకరం, భితసమీరభరసమీర్యమాణ
వికచకుటజకుసుమవిసరంబువలన నా,కాశవలయ మనవకాశ మయ్యె. 57

మ. వనధింగ్రోలెడునీటితోఁ దొడరునౌర్వజ్వాలచేఁ గుక్షి యె
ల్లను దప్తంబగుటం జలించి యవి మర్గం గ్రాయఁజొచ్చెన్ ఘనా
ఘనసందోహము లభ్రచారిదివిషద్గానీక్యమాణేక్యమో
హనభూషామతిదాయివై ద్యుతలతావ్యాజంబుచే నియ్యెడన్. 58

క. సౌమిత్రీ కంటివె చా,లై మహి డిగువర్షధార లభినవజలద
స్తోమశ్యామలపత్త్ర, వ్యోమన్యగ్రోధశాఖయూడలువోలెన్. 59

వ. అని వియోగవ్యథాదూయమానుం డగురఘుసూనుం డొక్కవిధంబునఁ బయోదమలినంబు లగుదినంబులు గడపె నంతట, 60

మ. హరినిద్రాదారజనీదినోదయము హర్షాకర్షణోపాయమం
త్రరహస్యం బచిరోపయోగ్యఫలకేదారం బనాలక్ష్యపా
దరిఖేలానటనాంతమాంగలికగేయం బన్వితాన్యోన్యజై
త్రరణోద్యోగమహీధవంబు శరదారంభంబుదోఁచె న్దిశన్. 61

సీ. కాకుత్స్థసంహారశిలాకారదశఁ బూనుకరణి మేఘుండు పాండురతఁ జెందె
నినవంశ్యుఁ జెత్తు పి ల్లిఁకసంచుఁ డాఁగిపోయినరీతి నిలదమ్మె నింద్రధనువు

రఘువీరకీర్తిన ర్తకిజక్కిణికి యుక్త మగుచామరంబు లై యమరె జెల్లు
కపివాహినులపిండు కాఁగల్గుటూహించి యంబువాహినులెల్ల నాఁడెదొడఁగె

గీ. లంకవంటిది యింక నిశ్శంకరాజ, హంససంచారమునకుఁ దా వగు నటంచుఁ
డెంకిమై తోఁచెఁ బుడమి నిశ్శంకరాజ, హంససంచారమునకు నయ్యవసరమున.

శా. చేతోజాతశరప్రణీతహృదయచ్ఛిద్రవ్రణాళీవిని
ర్యాతస్నేహమయప్రతిశ్రవభరుం డై యుండుమార్తాండి రా
గాతివ్యాప్తి నిరాకరింప భృతకోపాటోపచాపోద్గతిఁ
సీతానాయకుఁ డంప లక్ష్మణుఁడు వచ్చె న్వేగఁ గిష్కింధకున్. 63

— * లక్ష్మణుఁడు కిష్కింధకుఁబోవుట * —

శా. వాలిప్రోద్భవుఁ డప్పు డంతిపురిఁ గ్రేవ న్నిల్చి రాగాంధత
న్రేలెల్ల న్రతిజాగరూకుఁ డగుట న్మేల్కోని సుగ్రీవుని
ద్రాఘుత్వమ్మునకు న్విచారపడుచో రామానుజాలోక భీ
తాలోలప్లవగారవాపహృతనిద్రారక్తనేత్రాబ్జుఁ డై. 64

క. లేచి కొలువుండి సచివుల, వాచోన్నతిఁ బ్రకృతిఁ జెంది వర్తిలు నవ్వై వ
రోచని సౌమిత్రిధను, ర్జ్యాచండధ్వనాదనిశమనానతముఖుఁ డై. 65

మ. ఘనఘోషశ్రుతిచేఁ దలంకునహిరేఖం బీతముం డిగ్గుచో
హనుమంతుండు నినున్ జయోన్నతునిఁ జేయ న్నెయ్యపున్గిన్కఁ ద
మ్మునిఁబంపం జను రాఘువుం డని భయంబు న్మాన్ప సౌమిత్రిసాం
త్వనకై తారనుఁ బూన్ప వెల్వడియె న త్తన్వంగి శుద్ధాంతమున్. 66

గీ. వారుణీయుక్తిఁ దేజంబు వదలి రాజు, కనఁబడ నిశాంత మపుడు నిష్క్రాంతతార
మపగతతమంబు నయ్యెఁ బూర్వాశ న త్త, మిలెను సత్పథసంచారి మిత్రుఁ డమర.

ఉ. తారధరావతారకరతార యుసం దులలేని మేని శృం
గారముతోడ నెన్నడలఁ గార్యవశత్వరఁ దెల్పు నూత్నము
క్తారశనాగుణాంఘ్రికటకస్వనితార్భటితోడ లక్ష్మణుం
జేరఁగవచ్చి కేల్మోగిచి చిలుకఁదోడంగె వచోమరందమున్. 68

చ. బిసరుహబంధుసూతి నొకపెన్గిరిపైఁ జెఱయిడ్డ యింద్రజ
వ్యసనమడంచె మున్ను రఘువర్యుశరం బది యుండఁగాక నేఁ

డాసపరిచంటిగట్టుఁ దిగనోపని యీకపిరాజుపేంద్రజ
వ్యసనముఁ బాపె నద్దిర భవద్దృఢచాపవిటంకటంక్రియల్. 69

శా. లోకాలోకముదాఁక నేకగతి నాలోకింపఁ జాల్పడ్డ యీ
లోకాలోకవిధాయిసూనుఁ డిపు డిల్లు న్వాకిలిం గల్గి వ
ర్షాకాలోదిత మైనపోఁడిమికి నోఁచంజాలె నిన్నాళ్లకు
న్నీ కారుణ్యమువంక నిట్టి హితుని న్నీ రిట్లు కోపింతురా? 70

వ. ఏవంవిధోదారతారావచనచారిమాపనీతకోపాటోపతాసముత్పన్నప్రసన్న
తామిళన్నిరవధికమైత్రి యగుసౌమిత్రివెంబడి హనుమదానీతనానావిధానూన
వానరానీకినీవితానసంసేవ్యమానుం డగునచ్చండభానుసూనుండు రాఘవుం డు
న్నకొండదరి కరిగి యతనియడుగులకొఱఁగి యడుగులకు నెఱఁగి తదాదరణభరిత
కౌతూహలాంతరంగతం జెలంగి యంతట. 71

— * సుగ్రీవుఁడు సీతను వెదకుటకు వానరుల నంపుట. * —

సీ. తళుకుబేగడకొండదండనుండు నితండు పారియాత్రతటీవిహారుఁ డితఁడు
వలిగట్టుచెట్టుపట్టుల మెలంగు నితండు నిషధాద్రిమేఖలానిలయుఁ డితఁడు
తఱిమెట్టుజాళువాదరి కాఁపరి యితండు గంధమాదనవనోత్కంఠుఁ డితఁడు
కడనేలదాల్పు నిల్కడఁ జెలంగు నితండు వింధ్యాటవీజాతవిహృతి యీతఁ

గీ. డని మఱియు నెన్నవసపోని యచలవితతి, నధివసించియు సంఖ్యకు నధికమైన
వానరేశుల వేర్వేఱఁ గానిపించి, యినతనయుఁ డప్పు డారాఘువేంద్రునాజ్ఞ. 72

సీ. మిహిరుండువోడఁగువో మేనుతోల్సంజమంకుమువిన్కఁ బూనుదిక్కునకువినతుఁ
బసవంపువిరిపంటిదొరమత్తకరి యత్తమిలుహరిత్తునకు సమీరతనయు
మొసలిఱేనివయాళిమురిపంపుజగరాతు సామి గా నోఁచునాశకు సుషేణు
జంటనాలుకకంటసరిదంటచెలిసంటు గలదిశకును శతబలికపీంద్రు

గీ. నెలవు జానకినెనవుంబుఁ దెలిసిరం్డ, టనుచుఁ బంచిన వారలు నచట నచట
నరసి ధరణిజఁ గానక మరలి రంత, హనుమదాదులు దక్షిణంబునకు నడచి. 73

శా. పోవం బోవ నఖండకండుజటిలభూరిభంగజాతస్థలీ
భావోదగ్రనరణ్యరణ్యధరణీభాగంబునం దొక్కర
క్షోవీరుం డెదిరింప వానరబలస్తోమంబు గంపింప న
చ్చో వాలిప్రియసూనుఁ డాసశిచరు న్వాలాగ్రభీతామరున్. 74

క. కినుకం దోడరి కచాకచి, యని సలిపి తదీయగాత్ర మసురహితముగా
నొనరించె సురహితం బగు, తనచరితము జనుల కద్భుతము గావింపన్. 75

ఉ. అంతట వానరప్రముఖు లద్రివనద్రుమదంతురీభవ
త్ప్రాంతరయానుజన్య మగుశ్రాంతత వాయ నుపాంతవర్తివే
శంతము పొల్పుఁ దెల్పునవసారససౌరభవంతము న్నభ
స్స్వంతము మెచ్చి యొక్కబిలవాటము సొచ్చి తదంతరంబునన్. 76

చ. మును పజుఁ డొక్కమానితపముం జెలుప న్మది మెచ్చి హేమ కి
చ్చిన మయకౢప్తహేమవనిఁ జెల్వగు మేరుసవర్ణి కూర్మినం
దన నొకతె న్స్వయంప్రభ యనందగు దివ్యవధూటిఁ గాంచి యా
వనిత మహత్త్వశక్తి బిలవాటము వెల్వడి వచ్చి యొక్కెడన్. 77

— * హనుమదాదులప్రాయోపవేశప్రయత్నము. * —

క. మిట్టాడ నరుఁడుపుట్టని, నట్టడవి వసించి కపులు నాథుఁడు మనతోఁ
బెట్టినమితిఁ దప్పియు మహి, పట్టిం గనమైతి మెట్టిపాపం బనుచున్. 78

చ. కళవళమంద నంగదుఁ డిఁక న్మన మూరక పోయినప్పుడే
తలఁ దెగవ్రేయుఁ గాని యొకతప్పును గావఁడు భానుసూనుఁ డా
ఖలమతియుగ్రదండమునఁ గాయము వాయుటకంటె నీవన
స్థలి మునివృత్తిఁ బ్రాణములు దాల్చుట మే లగునంచుఁ బల్కినన్. 79

మ. హనుమంతుం డను నేటిమాట పతికార్యం బట్లు పోకార్చి యీ
వని నెట్లుండెడువార మాదొరకు దవ్వా యివ్వనం బెంపుఁ దూ
త్రినఁ బోనీయక పంపుపెట్టి తల లేటించుం గపిస్వామి యొ
ప్పనియాలోచన మాని మే న్నడలుఁడీ ప్రాయోపవేశంబునన్. 80

గీ. అనుచు హనుమదాదు లైనవానరులు ప్రా,యోపవేశమునకు నుద్యమంబు
సలిపి కుశలయందు శయనించువా రార్తిఁ, తోడఁ జింతసేయఁ దొడఁగి రిట్లు. 81

మ. మనువంశంబునఁ బుట్టనేమిటికి రామస్వామి దాఁ బుట్టఁగా
క నిగాఢాటవి కేల వచ్చె గురువాక్యస్వీకృతి న్వచ్చెఁగా
క నిశాటేశుఁడు సీత నెత్తికొని లంకామార్గముం జేరనే
ల నతండేగ జటాయు వాయసుర నేలా తాఁకి కూలె న్మహిన్. 82

క. కూలినజటాయు వట్టి పొ, కాలక రఘుపతికి సీతఁ గైకొని చనియెం
బౌలస్త్యుఁ డనుచుఁ దెలుపఁగ, నేల యతం డలకబంధు నేలాతునుమన్. 83

గీ. చచ్చినకబంధుఁ డేటికి శబరి తెఱఁగుఁ, జెప్పె నది యేటి కినసూను చెలిమిఁ దెల్పె
వాలి పడనేల సుగ్రీవుఁ డేలనేల, మనము రానేల యీనేల వనరనేల ? 84

క. అని వనరుకపుల పరిదే,వనమునఁ జెవిసోఁకు రాఘవుకథాసుధ ము
న్ననరుచిఁ గమరినఱెక్కలు, పునరాగమ మనుజవిగమమును దెల్పుటయుక్. 85

మ. మది నామోదము ఖేద మొక్కట జనింప న్లేచి తా నున్నవ
న్య దరి న్వెల్వడి వచ్చి యత్తఱి నిజోదంతం బెఱింగించి యే
ల దిగు ల్మీ కిఁక రామదూతలకుఁ గల్యాణంబె సంధిల్లు న
ల్లదె మున్నీ రదె లంక దాశరథియిల్లా లందు వర్తిల్లెడున్. 86

క. జనకజకుశలముఁ దెలియం, జనుఁ డని సంపాతి తెలుప సంతసపడి యా
తని గారవించి యంగద, హనుమన్ముఖు లచటుఁ గదలి యటు చని యెదుటన్. 87

సీ. అంజనగిర్యధిత్యకశాద్వలస్థలి పచ్చఱాకొండిగెలోఁబారువంబు
బలుతుంగమడువులోపలికరేణువు వట చ్ఛదములో నిసువైన శౌరిమూర్తి
దానవారియురంబులోని శ్రీవత్సంబు భానుజాంతరపద్మపత్త్రసమితి
కాదంబవనిఁ దోఁచు నాదిసుశ్యామిక మింటనంటిననీలమేఘరేఖ

గీ. యనఁగ నిజమధ్యమున ధాత్రి దనర మెఱయు
బహుళవాతూలజవముహార్మిహారుదగ్ర
లహరికాజాలడోలికావిహారదంబు
నరవితానంబు జలనిధానంబుఁ గనిరి. 88

గీ. కనిదురాలోకశరత భీకరతఁ జూపు, శరధికి మొగంబుగాక దాశరథిశరధి
యట్టిదగుటకు బెట్టిదం బైనకలఁకఁ, గపు లలుకతోడ నుండ నంగదుఁడు పలికె.

మ. తగునా వానరులార మానయుతు లై తర్కింప మీ కిట్టు డ
న్నగరు ల్దగివ్విన యుప్పుకాలువఁ దరించన్ శక్తి లే కున్నచో
నగనం స్తంభనమానిగాతి కటు దాయంగాక యారాఘ్విశ్నికిం
దెగనాడ న్వసపోని దుర్యశపుటబ్ధి న్నక్కృమా దాటఁగన్. 90

— * జాంబవంతుఁడు హనుమంతుని సముద్రలంఘనమునకుఁ బ్రోత్సహించుట. * —

వ. అని పలుకునంగదుని వలన నంగద లడంగ సకలప్లవంగపుంగవు లభంగుర
తరంగిణీభుజంగపారీణ ప్రసంగరీణత మెలంగెడు తెఱంగు లూహించి యుం
చిత నమోపాయవంతుం డగు జాంబవంతుం డుదయగిరిశిఖరజాత చూతనూ

తనఫలవిమోహకౌతూహలగృహీతాభినవమార్తాండమండల ప్రచల్యబాల్య
చాపల్యకుపితపురుహూతకరవిధూతభిదురపాత నిహతహనుమదతివిఖ్యాతనా
మధేయుండును, జరాచరనిరోధబాధాకరసమీరణ ప్రసాదనాయాతజలజాత
జాతకరుణాసమాసాదితాసాధారణ బహువిధవధానపాయకాయుండును, నఖం
డజవసమానాయమానపవమానవైనతేయుండును, నగునాంజనేయుండున్న
యెడ కరుగుదెంచి, యతనియతిశయంబు బహుధానుతించి, వెండియు నా
వలీముఖశిఖామణుల కిట్లనియె. 91

సీ. శాఖామృగస్వామిశాసనంబుఁ దరింప గండమై యుండిన నుండుఁగాక
విగళితారికళంక యగులంక యిచటికి దూరమై తోఁచినఁ దోఁచుఁగాక
దశకంఠభుజమహాదర్ప మల్పేతరస్థేమ వర్తిలిన వర్తిల్లుఁగాక
యవనిజ యునికి మర్త్యామర్త్యగోచరేతరవృత్తిఁ దొరసిన దొరయుఁగాక
గీ. చింత యేటికి మన కింక నెంతకార్య
మైనఁ బవమానసూనుఁడు పూనుకొన్న
సులభత వహించు నితఁడె కావలయు నన్న
గోష్పదముకంటె మున్నీరు కొంచియంబు. 92

మ. అని భల్లూకనిలింపనేత పలుక న్హర్షాకులస్వాంతుఁడై
హనుమంతుండు త్రివిక్రమానుకృతిచే నంగంబు పొంగం బ్లవం
గనికాయంబు చెలంగఁ దుంగలహరీగంభీరవారాశిలం
ఘనజంఘాలజవానుషంగమునకుం గావించె నుత్సాహముల్. 93

క. తత్తాదృశాసిధారా, కృత్తారాతిక్షితీశకీర్తిశ్రీరా
జత్తర యహార్యధీరా, చిత్తశయాకార యార్యశేఖరగేయా. 94

చ. సలలితరత్నకందుకలసత్కుచభారధురీణహూణికుం
తలరమణీసకంకణఝణత్కరణాంచితపాణిపల్లవాం
చలపరిధూయమానసితచామరమారుతలోలమానమం
జులచికురచ్ఛలభ్రమరచుంబితచారుతరాననాంబుజా. 95

శ. సాధూన్నతిగాంగేయ, ధూమ్రధర ప్రాహ్ణోపరాహ్ణమధ్యాహ్నసమా
రాధితరాధారమణ యసాధారణవారణేంద్రసప్తాంగహరా. 96

ఉత్సాహ. సింగరిక్షితీంద్రచంద్రసేవ్యమానభవ్యతి
ర్వేంగలావనీకళత్రవిశ్రుతాగ్రసంభవా
రంగనాథపాదపద్మ రాజహంసమానసా
సంగరాంగణప్రచండశౌర్యగాండివాయుధా. 97

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వర వరప్రసాదసమాసాదిత సరసకవితావిలాస, వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక, ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నా కరసుధాకర, జగద్విఖ్యాతకవిరాజకంఠీరవబిరుదాంక, వేంకటాచలపతి ప్రణీతంబైన చంపూరామాయణం బనుమహాప్రబంధంబునందు షష్ఠాశ్వాసము.

# ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల.

నిడదవోలు, కృష్ణాజిల్లా.

## ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

నిడదవోలు, కృష్ణాజిల్లా.

ఇందు రెండుమాసముల కొకనవలచొప్పున వెలువడుచుండును. డెమ్మిసైజున నూఱుపేజీల కారణాలచొప్పన పోస్టేజిమేమేభరించి చందాదారులకును, పోస్టేజిగాక యితరులకు 0-8-0లు చొప్పున నిచ్చెదము. ఎన్నివందల పేజీలనవలలైన ఒకరూపాయికి మించియుండదు. ప్రవేశరుసుముగా 0-2-0లు ఈయవలయును. అన్నియు క్యాలికోబయిండుగల చక్కనినవలలు.

### వెలువడిన నవలలు.

| | చందాదారులకు. | | ఇతరులకు | |
|---|---|---|---|---|
| * దురేశనందని | 0 | 12 | 1 | 0 |
| * వసుమతీవసంతము | | | 1 | 8 |
| లలితచంద్రహాసము | 0 | 10 | 0 | 14 |
| * మృణ్మయి | 1 | 0 | 1 | |
| * సీతారామ | 1 | 0 | 1 | |
| * మార్జహోను | 1 | 0 | 1 | |
| రాజసింహ | 1 | 0 | 1 | 8 |
| | 1 | 0 | 1 | 5 |
| మృణాలిని | | | 1 | 5 |
| మనోరమ | | 0 | | 5 |
| మరదృష్టవంతులు | 1 | 0 | | 8 |
| విషవృక్షము | 1 | 0 | | 5 |
| భ్రమదావనము | 1 | 0 | | 5 |
| వంగవిజేత | 1 | 0 | | |
| నాకాభంగము | 1 | 0 | | 8 |
| నవాబునందిని | 1 | | | 8 |
| దృఢప్రతిజ్ఞ | 1 | | | 8 |

* ఈగ్రంథములైదును. హైస్కూళ్లలోని 4, 5, 6, ఫారములకు పఠనగ్రంథములు (Text Books)గా, టెక్స్టుబుక్కు కమిటీవారిచే నామోదింపఁబడినవి.

**N. B.** వసుమతీవసంతము 1916 సంవత్సరము పరీక్షకు ఇంటరుమీడియేటు క్లాసునకు టెక్స్టుబుక్కుగా యూనివర్సిటీవారిచే నిర్ణయింపఁబడినది.

## అనుబంధ గ్రంథమాల.

అతిమనోహరంబులును, రసవంతములును, నీతిదాయకములును నగుచిన్నిచిన్నినవలలను ముద్రించి మా యాంధ్రప్రచారిణీ గ్రంథమాలికకనుబంధములుగాఁ బ్రకటించుచున్నాము. ఈ నవలలన్నిటిని జనసామాన్యమునకందఱకు నందుబాటుగానుండునట్లు స్వల్పమూల్యమునకుఁ బంపుచున్నాము. ఇందును మాచందాదారుల కితరులకిచ్చువెలకంటె తగ్గించి యిచ్చుచున్నాము.

| | | చందాదారులకు. | | ఇతరులకు. | |
|---|---|---|---|---|---|
| | | రూ. | అ. | రూ. | అ. |
| రాధారాణి | ... | 4 | 0 | | 0 |
| యుగళాంగుళీయకము | ... | 3 | 0 | | 0 |
| రాజభక్తి | ... | 2 | 0 | | 0 |
| లీల | ... | 3 | 0 | 4 | 0 |
| సాధన | ... | 5 | 0 | 7 | 0 |
| ఇందిర | ... | 3 | | 4 | 0 |
| హారావళి | ... | 3 | | 4 | 0 |
| ప్రభావతి | ... | 2 | 0 | 3 | 0 |
| మాలతి | ... | 1 | 6 | 2 | 0 |
| కమలాకాంతుఁడు | ... | 1 | 6 | 2 | 0 |
| పరిమళ | ... | | 0 | 8 | 0 |
| రజని | ... | | 0 | 8 | 0 |
| నీరద | ... | 5 | 0 | 7 | 0 |
| సీతావనవాసము | ... | 5 | 0 | 7 | 0 |
| ఉన్మాదిని | ... | 3 | 0 | 4 | 0 |
| సంతాపకుఁడు | ... | 4 | 0 | 5 | 0 |
| ఆరణ్యిక | .. | 6 | 0 | 8 | 0 |
| విరహాగ్ని | .. | | 0 | 4 | 0 |
| కృష్ణకాంతునిమరణశాసనము. | | 6 | 0 | 8 | 0 |
| అమృతపులినము | | 6 | 0 | 8 | 0 |
| వ్యాఘ్రాచార్య బృహల్లాంగూలము. | | 2 | 0 | 2 | 0 |
| ఉన్మత్త | . | 2 | 0 | 2 | 6 |
| చంద్రసేనుఁడు | . | 3 | 0 | 4 | 0 |

# ఆంధ్ర సాహిత్యపరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు :—

శ్రీపీఠాపురమురాజాగారగు శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్-వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, జి. సి. ఐ. ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి :—

గా॥ పానుగంటి రామారాయణంగారు, ఎం.ఏ.

కార్యనిర్వాహక సభాధ్యక్షుఁడు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, బి.ఏ., బి.ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం.ఏ., బి.ఎల్.

„ ఆచంట లక్ష్మీపతిగారు, బి.ఏ., ఎం.బి., సి.ఎమ్.

„ నెమలి పట్టాభిరామారావు పంతులుగారు, బి.ఏ.

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.

రావుబహదూర్ పిట్టి త్యాగరాయ సెట్టిగారు, బి.ఏ.

కార్యస్థానము.

12 అరుణాచలనాయఁక వీథి, చింతాద్రిపేట.

చందానిర్ణయము.

పరిషదుద్దేశము :—ఆంధ్రశబ్దములకు సలక్ష్యవ్యుత్పత్తికముగ విపులనిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁగల సంబంధమును దెలుపుచు భాషాతత్త్వమును నిరూపించు శాస్త్రమును రచించుట. ఆంధ్రదేశపూర్వవృత్తాంతమును బ్రమాణపూర్వకముగా నిరూపించుట, లక్షణశాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకు సాహాయ్య మొనర్చుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్త్రిక నొకదానిని బ్రకటించుట, సమగ్ర మగువుస్తకభాండాగారము నేర్పఱచుట, ఇత్యాది విధముల నాంధ్రవాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తుయొక్క యుద్దేశము.

| | | |
|---|---|---|
| 1. | ఉద్ధారకులకు | రు. 5000. |
| 2. | పోషకులకు | „ 1000. |
| 3. | యావజ్జీవసభ్యులకు | „ 100. |
| 4. | సాధారణసభ్యులకు సంవత్సరమునకు | „ 6. |

పరిషత్సభ్యులు పత్త్రికకు వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు.

సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల పేరవ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 12 అరుణాచల నాయఁక వీథి, చింతాద్రిపేట, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యస్థానమునఁ బ్రచురింపఁబడియెను.

చందా సం॥ కు రూ. ౩—౦—౦.　　　　విడిసంచిక రూ. ౦—౮—౦

సంపుటము ౫. | నళనామసంవత్సరము. శ్రావణమాసము. | సంచిక. ౩.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

ప్రతిమాసమునఁ గడపటివారములో ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి.

# విషయసూచిక

చెము భేదించినను మొత్తముపై సర్వమండలములందును నొకేరీతిగ నుండును. ఈ రీతిగా ననేకమండలముల భాషల కొకనియమమును స్థిరత్వమును గ్రాంథికభాషయందుఁ గలుగుచున్నది. కాని గ్రాంథికభాషయు నొకటే యని చెప్పుటకు వీలు లేదు. దీనియందును నాయాగ్రంథముల విషయములఁ బట్టి యంతరువు లేర్పడుచున్నవి. గద్యప్రబంధముల భాష వేఱు; పద్యప్రబంధముల భాష వేఱు. పద్యప్రబంధములలోఁ బదపూరణములును యతిప్రాసనియమముల ననుసరించినపదవికారములునుఁ గాక, గద్యములలో మనము వాడినచో భేషజముగా నుండు మాటలును నుండును. ఆపదములు పద్యములలోఁ దమయప్రాకృతస్వభావమును గలిగి యుండవు. ఇంతియ కాక పద్యభాష గద్యభాషకంటెఁ గొంత పురాతనవాసనఁ గలిగి యుండును.

పదములకుఁ జావుపుట్టుకలు కలవు. అందుచే శబ్దజాలము పెరుఁగుచుఁ దఱుఁగుచు నుండును. ప్రతిమనుష్యుని పదసముదాయమునందు నెట్టిమార్పులు కలుగుచున్నవో మనము చూచితిమి. మనుష్యునియం దెట్టిమార్పులు కలుగునో జాతియందు నట్టిమార్పులు కలుగుట సహజమే. భాష యెన్నటికి స్థిరభావము నొందదు. క్రొత్తపదములు కల్పిత మగుచున్నవి. సజీవపదములు విరివి యగుచున్నవి, కుద్దింపఁ బడుచున్నవి, జాతినిఁ బొందుచున్నవి, పోఁగొట్టుకొనుచున్నవి, మానసిక, నైతికార్థీయభావములఁ బొందుచున్నవి. ప్రాఁతమాటలు కొన్ని చిరకాలమునుండి యున్నను గొన్నిసమయముల ననుపయోగము లై నశించి పోవుచున్నవి. సజీవభాషతో మనకిపుడు ప్రసక్తి గాన మాట లెట్లు నశించునో యను విషయముతోఁ బని లేదు. సజీవభాషలోఁ గూడఁ బదముల యర్థపరిణామములఁ జెప్పుస్థితిలో మనము లేము. అది చేయుట ప్రతిగ్రంథమునకును, ప్రతిశాసనమునకును, ఇంత యేల, తొలుతనుండియు మనకు గోచరము లగుపదములను గాలానుసరణము లగుపద పట్టికలును నాయాకాలములయం దాయాపదముల కే యర్థముండెనో, యవి యర్థమునందును రూపమునందును నేటివఱ కెట్టిమార్పులఁ జెందుచు వచ్చెనో వివరముగఁ గనుఁగొను నంతవఱకును సాధ్యము కాదు. అయినను గొన్నికొన్నిమాటల యర్థ మేమార్గమున మాఱుచు వచ్చెనో కొంత వఱకు మనము నిశ్చయింపఁ గలము. ఉదాహరణముగ 'చూపుగుఱ్ఱము' అను పదమును దీసికొందము. 'చూపుగుఱ్ఱము' అనఁగాఁ జూచి సంతోషించుటకుఁ దప్ప సవారిచేయుటకుఁ గాని మఱియెందుకుఁ గాని పనికి రానిగుఱ్ఱ మని మొదటి

యర్థము. దానికిఁ గొంతకాలమునకుఁ 'బనికుపయోగముకాని వాఁడు' అనున ర్థము సంభవించినది. "సుకవాసి పనిపంద చూపుగుజ్జంబు" అని గౌరన రచించిన హారిశ్చంద్రోపాఖ్యానము. 'పింగాణి' శబ్దము తొలియర్థమును మొదటికే పోఁగొట్టుకొనినది. ఈ మహారాష్ట్రపదమున కర్థము 'సీతాకోకచిలుక' యని. 'పింగాణి' విదేశవస్తువు. ఈ పింగాణిపాత్రములపై నాపురుగులఁ జిత్రించుచుండెడివారు గాన నాపాత్రలకు దేశభాషలయందు సరియగుపదము లేక 'పింగాణి' యనియే వాడుక పడినది. ఈరీతిగ మఱికొన్నిపదముల యర్థపరిణామముల నాలోచింతము.

1. వరుస: పరంపర, క్రమము, వంతు, సామ్యము, విధము, సైనికుల వరుస, బంధుత్వము.
2. జతనము: ప్రయత్నము, పదిలము (జతనము బహుచోటికిఁ బోయి వత్తమే.)
3. వాయి: నోరు, ముఖము, ఖడ్గధార.
4. తట్టు: చఱచు, కలుగు, (వెగటుతట్టని నిందుమనంబువాఁడు.) తోఁచు, దరి, పార్శ్వము.
5. వదరు: అడరు (వదరుచీఁకట్లు, ఉ॥ హారి); చేతిసార యనుచెట్టు; సారకాయ (వరదుఁ జైనయిూశువరమున నిది యెుకట వదరు పుట్టె నెట్టి వరమొ యనుచు, భార.); ఉపయోగము లేనిమాటలు; ఊఱక మాటలాఁడు; ప్రేలు.
6. కంపు: మంచివాసన, భార; చెడువాసన.

నన్నయభట్టు తెనుఁగులోనికిఁ జాలసంస్కృతపదములఁ జొప్పించెను; కాని యవి నిత్యవ్యవహారములోనికిఁ జొచ్చినవి కావు. ఇట్లే సంస్కృతగ్రంథములఁ దెనుఁగులోనికిఁ దెచ్చినకవీశ్వరు లందఱు సంస్కృతశబ్దపూర్ణముగఁ దెనుఁగు నొనరించిరి గాని యవి తొలుత నెట్లుండెనో యిపుడు నట్లే నిలిచి యుండి యాంధ్రస్వరధర్మముల నెనయక నిలిచియున్నవి. నిజముగఁ దెనుఁగునఁ జొచ్చిన సంస్కృతప్రాకృతపదములసంఖ్య చాల కొంచెమే యని నిఘంటువుల బట్టి తెలిసికొనవచ్చును. ఇది యిట్లుండఁ దెనుఁగుపదములసంఖ్య యెంతయును వృద్ధిఁ జెందుచునే యున్నది. నన్నయభట్టుమొదలు పిల్లలమఱ్ఱిపినవీరభద్రునివఱకు గ్రంథస్థ మయినభాష ప్రాఁదెనుఁ గనియు, నచటినుండి చేమకూర వేంకటకవివఱకుఁ

గలది మధ్యకాలపుఁ దెనుఁ గనియు, నప్పటినుండి నేఁటివఱకుఁ గలది నవీనపుఁ దెనుఁ గనియుఁ, దెనుఁగునకు మూఁ డవస్థలఁ గల్పింతము. వలసినచో నింక నెన్ని యో యవస్థలఁ గల్పింపవచ్చును. కాని సౌలభ్యముకొఱకుఁ బై విభాగ మవసర మని తోఁచెడిని. ఇంకను సరిగ నాంధ్రభాషాపరిణామముం దెలిసికొనుట కీవ్యా సమున కనుబంధముగఁ జేర్చినపట్టిక కొంత తోడ్పడఁగల దని నమ్మెదను. నన్న యభట్టునాఁటికిఁ దెనుఁగుపదములసంఖ్య 4,000 కంటె నెక్కువ యుండదు. నేఁటిశబ్దరత్నాకరమునఁ గేవలదేశ్యపదములసంఖ్య 12,337. అనఁగా దేశ్యపద ములసంఖ్య మూఁడింతలు హెచ్చినది. అట్లే మొత్తముపై నన్నిపదములఁ గలిపిన చో నాఁటికిని నేఁటికిని పదసంఖ్య మూఁడింతలు పెరిఁగిన దని తెలియకపోదు. ఇందువలనఁ బ్రాఁ దెనుఁగు కాలమున వాడుకలో నున్నపదము లన్నియు గ్రంథ ములలోని కెక్కిన వని కాని, నేఁటివఱకు వాడుకలో నున్నపదము లన్నియు నేఁటినిఘంటువులలోఁ గనఁబడు నని కాని తలంప వీలు లేదు. కాని యించుమిం చుగ నాయాకాలములయందలి పదసంఖ్య ల ట్లుండవచ్చు నని మన మనుకొన వచ్చును.

పదసంఖ్య యి ట్లభివృద్ధిఁ బొందుటకుఁ గారణ మేమి ? రాజరాజనరేంద్రుఁ డు రాజమహేంద్రవరమున రాజ్యము నేలినకాలమునకును నేఁటికాలమునకునుఁ గలభేదమే దీనికిఁ గారణము. తెనుఁగువారియూహలు మాఱినవి; వారి మనో వికారములును, బూనికలు, నాదర్శములును గూడ మాఱిపోయినవి. ఈలోన నె న్నియో రాజ్యవిప్లవములు, న్యాయవిచారణము నందలి మార్పులు, మతము, సంఘము, నిత్యజీవనముల యవస్థాభేదములు నెన్నియో కలిగినవి. చిత్రకల్పనము, శాస్త్రములు, వాణిజ్యము వృద్ధిఁబొందినవి. రాజ్యతంత్రవిధానము మాఱిపోయి నది. విద్యావిజృంభణ మాదిగాఁ గలవి యొనర్చినమార్పులు చెప్ప నక్కఱయే లేదు. ఇవియుఁ గాక యితరము లగుమార్పులు నెన్నియో క్రొత్తమాటలనుఁ దె నుఁగులోనికిఁ దెచ్చినవి. అందుచేత నాంధ్రశబ్దజాల మింత యభివృద్ధిఁ జెందినది.

అయిన నీపదజాల మేరీతిగ వృద్ధిఁ జెందినది యని ప్రశ్నించి చూతము. భాష యనున దెట్లు కలిగెనో యని కాని, క్రొత్తధాతువు లెట్లు కలిగెనో యని కాని మన మాలోచింపఁ బని లేదు. క్రొత్తధాతువులు సాధారణముగఁ గల్పిం పఁబడుటయే దుర్లభము. క్రొత్తమాటలు పూర్వశబ్దభవములే యై సాధారణ ముగ నుండును.

తొలుత నొకద్రావిడభాష యుండెడి దనియు, దానినుండి చిరకాలము నానాదేశములయందు నిలిచి యుండుటచే వివిధభాషలు వేఱుపడిన వనియు నింతకుఁ బూర్వము చెప్పితిమి. అప్పుడు ద్రావిడభాష సిథియనుభాషలతోనో మఱి యేభాషలతోడనో సంబంధము కలిగి యుండెను. అంతకుఁ బూర్వపుటవస్థయందు ధాతుపూర్వకముగ నీభాష యుండి యుండును. ఈధాతువులు తమలోఁ దామ కుద్దింపఁబడియు, విరివి చేయఁబడియు, నితరధాతువులతో సమసించియు ననేక విధము లగుభాషాభాగములును, నితరపదములును నగుచువచ్చెను. ఈ విషయ మీక్రిందిపదపట్టికలఁ బరిశీలించినచో బోధపడఁగలదు. తొలి ద్రావిడధాతువు 'ఉగ్' ఇదికన్నడమున 'ఒగె' అయినది. తమిళులో 'ఉవట్టు' అయినది. ఈ ధాతువునుండి యితరద్రావిడభాషలలో నెన్నిపదములైనను బుట్టి యుండును. తెనుఁగున దానినుండి పుట్టినవి: ఓకలించు, ఓకరించు, ఒగరు, వగరు, వగరుచు, వగర్చు, పొడము, ఒడము, పొడుచు, ఒడుచు, పొడగు, పొడుగు, పొగు, పోటు, పుట్టు, ఉట్టు, పొగుపు, పోపు, పొడుపు, పొక్కు, పులుసు (గర్వము), బుగ్గ, బుంగ, బుగ్గి, మొదలగునవెన్నియో కలిగినవి. వీని యితరభాషాభాగరూపములఁ జూచినచో నెన్ని పదము లాయాభాషలయందుఁ బుట్టి యున్నవో బోధపడఁగలదు. ఇట్లే 'సొగసు, సొగసు, చొక్కము, జోక, సొంపు; వ్రేక, వ్రేగు, వేడుక, వేడ్క, బెడగు, బెడకు, బెడంగు, బెణగు, పొన్ను, పొన్ను, పొలుపు, పొలుసు, పొలుచు, పొలఁతి, ఒలయు. 'కొర్' ధాతువునుండి 'చొరు' కొరుకు, చొచ్చు, గొచ్చు, గుజ్జు, గుచ్చు, గ్రుచ్చు, కోరు, చొరవ, గొరక, గోకు, కఱకు; తోక, తూఁగు, తూంగు, తూఁకువ, తొంగొను, తొంగి (చూచు) మొ. కుద్దింపఁబడుటకు, వలవదు, వలాదు, వలదు, వల్దు, వద్దు, వొద్దు, ఒద్దు ; ఈరీతిగఁ బదపరిణామములఁ దెలియఁ జేయుటకు సాహసించితి మేని పైఁ జెప్పఁబడినవిషయము తేలఁగలదు. ఈరీతిగఁ గ్రొత్తపదములే గాక వానియితరభాషాభాగములను నొనర్చుటయందుఁ గొన్నిప్రత్యయములు చేరుచు వచ్చుచుండెను. ఈ ప్రత్యయములు నొకానొకప్పుడు ప్రత్యేకపదములుగ నుండెను. వీనిలోఁ జాలమట్టుకుఁ బూర్వమే పదములవికారములో తెలియకపోయినను నవి మఱికొన్ని సమాసములయందంతర్గతము లైననామము లై యంతకంతకు వికారములఁ బొంది నేఁటిస్థితిని బొంది యున్న వని చెప్పుట యసత్యము కాదు. ఈరీతిగ నేఁటికిని గ్రొత్తశబ్దములు కలుగుచునే యున్నవి. ఇట్లు కలుగుట కుపయోగించు ముఖ్యప్రత్యయముల నీక్రిందఁ బొందుపఱిచెదను.

### I. తద్ధితాంతములు.

తద్ధితము లనఁగా విశేష్యవిశేషణములనుండి విశేష్యవిశేషణములఁ గలిగించుటకుఁ జేర్పఁబడు ప్రత్యయములు. అట్టిప్రత్యయములఁ జేర్చుటవలన నేర్పడు విశేష్య విశేషణములు తద్ధితాంతము లనఁబడును. ఈప్రత్యయములు చేరునపుడు సాధారణముగ 'ము' ప్రత్యయము లోపించును.

(1) భావార్థకతద్ధితములు :—తనము,ఱికము, అవు, ఇమి.

(2) స్వార్థమునందు : క, ఉఁ, కాఁడు, కత్తె, కత్తియ, ఈఁడు.

(3) మతుబర్థకమున : కాఁడు, కత్తె, కత్తియ, ఈఁడు, అరి, ఈ, ఆఁడు, ఆఁడి.

(4) స్త్రీలింగద్యోతకమున : త.

(5) మానార్థమున : ఎఁడు, ఏసి, బంటి, అవ, కొలఁది.

(6) అభావమున మతుబర్థకము : ఇఁడి.

### II. కృదంతములు.

ధాతువులనుండి నామములు పుట్టుటకుఁ జేర్పఁబడుప్రత్యయములు కృత్తు లనఁబడును. కృత్ప్రత్యయము లంతమందుఁ గలపదములు కృదంతములు. వ్యంజనాదు లయిన కృత్తులు పర మయినపుడు ధాతువులతుదివర్ణము తఱుచుగ లోపించును. కృత్తులు : క, ఁత, కువ, ట, టు, పము, త, పు, బడి, గడ, వు, డు, అకము, ఇక, ఇకి, ఇమి, అ, ఉ, అనిపదునెనిమిది గలవు. ఇంక హెచ్చుగ నుండిన నుండవచ్చును.

### III. నామధాతువులు.

నామములనుండి తిరిగి ధాతువులు పుట్టుటయుఁ గలదు. అట్లొనరించుట కుపయోగించు ప్రత్యయములు సాధారణముగ, ఇంచు, ఇల్లు, ఉ, గు, లోనగునవి.

### IV. శబ్దపల్లవములు.

పదముల తుదను గొన్నిధాతువులను జేర్చుటవలన నేర్పడుధాతువులు శబ్దపల్లవములు. ఇట్టిధాతువులు, కొను, తెంచు, పడు, ఉండు, పోవు, చేయు, పట్టు, పెట్టు, ఆడు, కొట్టు, పాఱు, లోనగునవి.*

* పైఁ జెప్పినప్రత్యయవిధానము తెనుఁగువైయాకరణుల ననుసరించినది. కాని యాయాప్రత్యయము లన్ని యుండునా యనుసందేహము కలుగుచున్నది. వానిలోఁ జాలమట్టు కేకప్రత్యయము యొక్క రూపాంతరము లగుట తెలియకపోదు. ఆయాప్రత్యయము లేపదములవికారములో యనునంశము వే ఱొకవ్యాసములోఁ జర్చించెదను. చి. నా.

ఈరీతిగఁ దెనుఁగుభాషయందలిపదములు వృద్ధిపొందుమార్గము లనేకము లున్నను నన్నింటికంటె ముఖ్య మగునది పరభాషలనుండి పదముల నెరవు తెచ్చుకొని యున్న వున్నట్లు వాడుటయో, లేక కొన్నిమార్పులతో వాడుకొనుటయో యై యున్నది. రెండుజాతులవా రొకరితో నొకరు సంబంధము కలుగఁ జేసికొనుటచేఁ బదముల నెరవు తెచ్చుకొనుట సంభవించుచున్నది. మైత్రివలనఁ గాని శత్రుత్వమువలనఁ గాని యొకరిపదముల నొకరు వాడుకొందురు. ఏది లేకున్నను నాయాజాతులపేరు లైనను భాషయందుఁ జొఱఁబడకపోవు. వారికిఁ బరిచయము హెచ్చగు కొలఁదియు నాచారవ్యవహారములకు భంగము కాకుండునంతమట్టుకుఁ గ్రొత్తపదములు చేరుచుండును. ఆర్యుల సారస్వతము, మొదలగునవి ద్రావిడుల కింపుగ నుండుటచే వారినుండి చాలమట్టుకుఁ బదములు మనకు వచ్చినవి. ఇట్లే యితరజాతులతోడను వర్తకము, ప్రభుత్వము మొదలగు సంబంధములచేఁ గలసిన కొలఁదియుఁ బదజాల మెక్కుడగుచుండును. ఇట్లెరవు తెచ్చుకొనుట యందుఁ గొన్నిజాతులవా రెక్కుడు చులుకగను మఱికొందఱు చాల నయిష్టముగను నుందురు. ద్రావిడులు రెండవతెగలోఁ జేరియున్నారు. తమిళునందు సంస్కృతపదము లెంత తక్కువగ నున్నఁ గావ్య మంతయుత్తమ మయిన దని లాక్షణికుల యభిప్రాయము. కన్నడమునం దనుభవామృత మనుగ్రంథమున: "సులిద బాళెయహణ్ణి నందది, కళెద సిబరిన కబ్బినందది। యటెద ఉష్ణదహాలి నందది సులభవాగిదా॥ లళితవహా కన్నడద నుడి యవి, తిళిదు తన్నొళు తన్న మోక్షవ, ఘటిసికొండరె సాలదే సంస్కృతద లిన్నేనూ?" అనఁగా నొలిచిన యరఁటిపండువలెను, పైతొక్క తీసిన చెఱకువలెను, చల్లారిన పాలవలెను సులభముగ నున్న లలిత మగు కన్నడభాషను దెలిసి తనయందుఁ దానే మోక్షమును సంపాదించుకొన్నచోఁ జాలదే? సంస్కృతము వేఱ కావలెనా? యని కవీశ్వరుఁడు చెప్పి యున్నాఁడు. అచ్చతెనుఁగుప్రబంధములఁ జేసినవారిలో మొదటివాఁడగు పొన్నిగంటి తెలగన్న—

ఉ. అచ్చతెనుంగుపద్దె మొక టైనను గబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రది యెన్నుచుఁ బద్దలు పొత్తమెల్ల ని
ట్లచ్చతెనుంగున న్నొడువ నందులచంద మెఱుంగువారు ని
న్మెచ్చరొ యబ్బురం బనరొ,మే లనరో కొనియాడరో నినున్.

అని యచ్చతెనుంగు నెంతయో కొనియాడి యున్నాఁడు. మఱియొక కవి.

తే.గీ. దేవతలభాష కావునఁ దెనుఁగుకన్న
సంస్కృతమె పెద్ద యని యంధ్రుఁ సరియె తెలిసె
రసికుఁ డగువాఁడు తనకుజాజుసిగలోనఁ
దులసినే యిడుకొనునొ జాజులనె యిడునొ?"

యని తెనుంగుయొక్క పరిమళమును గొనియాడి యున్నాఁడు.

ఇట్లాయాభాషలయందలి కవులు స్వాభిమానముచే నెన్ని చెప్పినను బరభాషాపదములు తమమాటలతోఁ, గలియకపోవు. పై తెలగన్న పద్యములోనే యెనిమిది సంస్కృతపదములు మాఱువేషములతో దాఁగుడుపడి యున్నవి.

ఒకభాషనుండి మఱియొకభాషలోనికి వచ్చుపదములు చాలమట్టుకు నామపదములై యుండును. వర్తకవ్యాపారములవలనను నితరసంబంధములవలనను నాయావస్తువులపేళ్ళను మనము ముఖ్యముగ నెరవు తెచ్చుకొందుము. తరువాత వచ్చునవి క్రియలును విశేషణములును. ఎంతయో పరిచయమును మైత్రియుఁ గలిగినఁ గాని సర్వనామములు, సంఖ్యావాచకములు, అవ్యయములు, ప్రత్యయములును నెరవు తెచ్చుకోఁబడవు. ఇవి భాషకు మూలములు; అనాయాసముగ మనస్సు నాకర్షింపనే వీని నుపయోగింతుము. అదియుఁగాక వీనికి నామరూపమిుచుక యైన లేదు. వీనిలో నొకవేళ నెంతయో యవసర మైనపుడు సర్వనామములు నామరూపముఁ గొంతవఱకుఁ గలిగి యుండుటచే నెరవు తెచ్చుకొనఁబడును. ప్రత్యయములు మాత్రము మఱియొకభాషయందుఁ జొరఁబడుట యసంభవము కాకపోయినను నెంతయో పరిచయ ముండినఁ గాని జరుగుట దుర్లభము.

పై రీతిగ నాంధ్రశబ్దజాలమెట్లు పెరుఁగుచున్నదో యొకింత కనుఁగొంటిమి. పై విధములఁ గాక పదములు క్రొత్తగఁ గల్పింపఁబడుటయుఁ గలదు గాని యది యంతముఖ్య మయినది కాదు. పైఁ జెప్పఁబడిన రెండువిధములలోను శబ్దజాలమును వృద్ధిపఱుచుట కేమార్గము మంచిది యనువిచారము మనకుఁ గలుగకపోదు. కొందఱితరభాషాపదముల మనభాషలోనికిఁ జొప్పించి దానిని బాడుచేయుచున్నా మని తలంపవచ్చును. కావలసినయర్థమును సరిగఁ దెలిపినచో నొకపదముకంటె మఱియొకదానియాధిక్యత యెద్దియు లేదని మన మట్టివారికిఁ బ్రత్యుత్తర మియ్యవచ్చును. క్రొత్తపదము ప్రాఁతపదమువలె నందఱకు గ్రాహ్యము కాకపోయినచో నది తప్పక ననుపయోగమే. కాని పరభాషాపదము

మనభాషయందు నెలకొని యందఱకును బోధపడినచో స్వదేశపదము నదియును గూడ మంచివియే. స్వభాషాపదములనే సమాసముచేసి క్రొత్తమాట నేర్పఱిచినచో నది పరభాషాపదమువలె నందఱకును సుబోధము కాక పోయినపుడు స్వభాషాపద మనునాధిక్యత దానికిఁ గలుగనే కలుగదు. అందుచేత దేశ్యపదముల సమాసమును నితరభాషాపదమును గూడ జనులవాడుకను బట్టి గ్రాహ్యమో యగ్రాహ్యమో యనువిషయము తేలుచున్నది. ఇట్లు చెప్పుటచే నిచ్చకు వచ్చినరీతి నితరభాషాపదముల మనభాషలోనికిఁ జొప్పించు మని యభిప్రాయము కాదు; గాని యొక యన్యభాషాపదము మనభాషలోనికిఁ జొచ్చి యందఱచేతను నంగీకృత మైనప్పుడు దాని గ్రాహ్యతాగ్రాహ్యతలఁగూర్చి మఱి చర్చింప నవసరము లే దని దానిసూచన.

III.

నన్నయభట్టారకుని కాలమునాఁటికి మనభాషకు, ఆంధ్రముఁ దెలుఁగు తెనుఁగు ననునామములు కుదురుకొనియే యుండెను. ఈ రెండుపేరులును మన భాషకుఁ దొలుతనుండియు నుండినవి కాక మధ్యకాలమున సంభవించిన వని మనము నిశ్చయించుకొని యుంటిమి. కవులు గ్రంథముల నీభాషను వ్రాయునప్పటికీ భేదము రూపుమాసిపోయియే యుండెను. మన వైయాకరణులు తొలుత నుండియు దేశ్యాన్యపదవిభాగమును సరిగఁ జేయ నేరరైరి. కేతన 'ఎల్లవారికిఁ దెలిసెడి యాపలుకు లచ్చతెనుఁగు లని' 'తల, నెల, వేసవి, గుడి, నుడి, పులి, చలి' యను నుదాహరణములను, దేశితెనుఁగుల కుదాహరణముగ, ఎఱుకువ, నెత్తమ్మి, మఱుకువ, మచ్చిక, వెన్ను, వీఁచోపులు అనియుఁ జెప్పెను. ఈవిభాగ మంత సమంజసముగ లేదు. దేశితెనుఁగు లెల్లవారికిఁ దెలియునవే గాన నచ్చతెనుఁగులనుండి వీనిని వేఱుపఱుచుట యేలకో తెలియరాకున్నది. అప్పకవి విభాగ మింతకంటెఁ గొంతబాగుగ నున్నది.

తే. ఆంధ్రదేశపురస్థాయు లైనసకల, జనములకును మఱుంగు దేశంబు లేక
తేటతెల్లముగాఁ బల్కుమాట లెల్ల,నవని శుద్ధాంధ్రదేశ్యంబు లనఁగఁ బడును.

ఉ. పాలు, పెరుఁగు, నేయి, ఉట్టి, జోలు, బిడ్డ, జోలి, అమ్మ మొ.

క. కేశవ యాంధ్రులు నానా,దేశంబులయందు, నిలిచి తెలుఁగులె తత్త
ద్దేశోక్త లంటఁబలికిన, నాశబ్దము లన్యదేశ్యజాంధ్రము లయ్యెన్ ॥

ఉ. ఆలము చివ్వ, కయ్యము, పోరు, బవరము, దురము, దొమ్మి, కలను.

(మనవా రెన్నిరీతుల దెబ్బలాడుచుండిరో గమనింపుఁడు), ఒంటరి, నెల, వేసవి, పల్కులు, పీనులు, తునుక, నెమ్మి మొ॥ కేతన చెప్పినయచ్చతెనుఁగులు దేశితెనుఁగులుఁగూడ నప్పకవి చెప్పినయన్యదేశ్య జాంధ్రములలోఁ గనఁబడుచున్నవి. మొత్తముమీఁద నప్పకవివిభాగము కొంత బాగుగ నున్న దని తోఁపక పోదు. ఇది గాక యప్పకవి శుద్ధాంధ్రదేశ్యములకును నచ్చతెలుఁగులకును భేదము కల్పించి నటులు తోఁచుచున్నది. ఎట్లన 'ఆంధ్రదేశపురస్థాయు లైన' అను పద్యముతో నీక్రిందిదానిని సరి చూచుకోవచ్చును.

క. నెలకొను సంస్కృతతత్సమ, ములు దొరలక తజ్జదేశ్యముల మూఁటనుసం
ధిలి కేవలాంధ్రములునా,నలరుఁగృతులనచ్చ తెలుఁగులంధ్రు తెలుఁగునన్.

ఈరీతిగ నాంధ్రదేశ శబ్దములను, దెనుఁగుశబ్దములను, దొల్లింటిద్రావిడ శబ్దములను వేఱుపఱచుట బాగుగనే యుండును గాని, యనేక శతాబ్దములనుండియు ద్రావిడాంధ్రత్రైలింగులు కలసి మెలసి యైక్యముఁ బొందుటచే నెవ్వి యే పదములో నిర్ణయించుటకు వీలు లేకయున్నది. కావున నీ మూఁడువిధములుగఁ జేరినపదముల నన్నంటిని దేశ్యములుగఁ బరిగణించితిమి. శబ్దరత్నాకరముప్రకార మిట్టిపదములు 12,337 ఉన్నవి.

కావ్యములలో సంస్కృత మాదిగాఁ గలభాషలనుండి పదముల కుప్పలు కుప్పలుగ నుపయోగించుట కలదు గాని సాధారణసంభాషణలో నట్టిపదములు చాలఁ దక్కువగనే యుండును. పండితు లైనవారు మాటలాడునపుడుఁ గూడ నుపన్యాసములయందుఁ దప్పఁ దత్సమతద్భవములు సాధారణముగ దొరలనే దొరలవు. ఈవిషయముం గూర్చి పరిశీలించు బుద్ధి పుట్టి యిరువురు మహాపండితులు సంభాషించుకొనుచుండఁగ రాత్రి యెనిమిదిగంటలనుండి పండ్రెండుగంటలవఱకు వింటిని. ఈ నాలుగు గంటలకాలములో వా రుపయోగించినమాటలలో 42 తత్సమతద్భవములు, 6 ఇంగ్లీషుపదములును, 8 హిందూస్థానీపదములును దొరలినవి. తక్కిన వన్నియు దేశ్యపదములే. కోర్టువ్యవహారములఁ గూర్చి వారు మాటలాడుచుండుటచే నీయింగ్లీషు హిందుస్థానీపదములు వచ్చినవి గాని లేనిచో నవియు రాకయుండు నేమో—ఏది యెట్లున్నను దేశ్యపదములను సర్వసాధారణముగ వాడుకొనుటయుఁ దక్కినపదముల నంత సాధారణముగ వాడుకొనకపోవుటయు నిర్వివాదాంశము. గ్రంథస్థ మగుభాషయందుఁ గూడ దేశ్యపదములే చాల నెక్కుడుగ నుండు ననుటకు సందేహము లేదు. దీనికి నిదర్శనముగ మహాకవుల

నుండి కొన్ని పద్యముల నెత్తి వానియందలి దేశ్యాన్యదేశ్యపదముల లెక్కపెట్టి చూతము.

నన్నయభట్టు.

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ చూచుచుండ న్మదో
ద్ధురుఁడై ద్రౌపది నట్లు చేసినఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

భార॥ సభా. 2. [27 సంస్కృతము, 19 తెనుఁగు.

తిక్కన.

శా. ఏమీ! పార్థుఁడు నీవు దండిమగలై యీవచ్చుకౌరవ్య సం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పన్ బెద్ద మిట్టెక్కి మి
మ్మేమె మెల్లన్ వెఱఁ గంది చూచెదము గా కీసారికిం బోయి రా
భీష్ముం డిత్తతి రిత్తమాటలకుఁ గోపింపండు సూ పెంపఱన్.

ఉద్యో॥ ఆ. 3. [7 సం॥ 40 తె॥

ఎఱ్ఱాప్రెగడ.

మ. తనకావించిన సృష్టి తక్కొరులచేతంగాదు నా నేముఖం
బునఁ దాఁబల్కినపల్కు లాగమములై పొల్పొందు నావాణిన
త్తనునీతం డొకరుండు నాఁ జనుమహత్త్వాప్తిం గవిబ్రహ్మనా
వినుతింతుం గవితిక్కయజ్వనఖిలోర్వీదేవతాభ్యర్చితున్.

హరివంశము. [16 సం॥ 30 తె॥

మంత్రిభాస్కరుఁడు.

ఉ. ఈకొఱగాని కార్య మిటు లెవ్వఁడొకో యనుకూలశత్రుఁడై
నీకుఁ బ్రియంబుగాఁ బలికె నీవును నిత్తెఱఁ గాచరింపఁగా
రాక తలంచిచూడ నిదిరాక్షసవంశవినాశకాలమో
కా కటుగాన నీకొనునె కాదనకీదృశ మెవ్వఁడేనియున్.

రామాయణము. అర. ఆ. 2. [8 సం॥ 36 తె॥

మారన.

ఉ. ఎక్కడనుండివచ్చె నతఁ డీతుహినాద్రికి వేడ్కనూని యే
నక్కట యక్కుమారు రుచిరాకృతి యాదట నేల చూచితిన్

మకుటావ నేల నాదుమది మన్మథుఁ జేచఁదొడంగె నా కయో
దిక్కిఁక నెవ్వ రిచ్చట మదీయు లటంచు దురాశ యేటికిన్.

మార్కండేయపురాణము. ఆ. 5. [10 సం॥ 31 తె॥

నాచనసోముఁడు.

చ. తిరిసినకూడు తెచ్చి నలుదిక్కులబోడలు తిండిపెట్టఁగాఁ
బెరిఁగినపొట్టతోడ నొకపెంటపయిం దొరవోలె నెవ్వరిన్
సరకుగొనంచు పట్టుకొని చాఁగఱగొన్న బలే యెఱుంగుఁ డ
క్కరిబలు మోపు మోచు నయగారితనం బిరువుట్టి గట్టినన్

చ. పెఱిగితిగాక నీవు నొకప్రెగ్గడవే సభ లుండుభంగి ము
న్నెఱుఁగనివాఁడవై భ్రమసి యెవ్వరిముందఱ నేమిమాటలో
యఱచిరి వారిజంకెలకు నంతటద్రోవడి వచ్చితిచ్చటన్
గఱువఁగవచ్చునే బలిమి గాడిదకుం బులితోలు గప్పినన్.

హరివంశము. [సం॥ 5. తె॥ 68.

శ్రీనాథుఁడు.

ఉ. ఎట్టు పురాణము ల్పదియు నెన్మిదిఁ జెప్పితి వెట్టు వేదముల్
గట్టితి వేర్పఱించి నుడికారము సొంపెసలార భారతం
బెట్టు రచించి తీవు ఋషివె ట్టయి తొక్కదినంబుమాత్రలోఁ
బొట్టకు లేక తిట్టెదవు పుణ్యగుణంబులరాశిఁ గాశికన్.

కాశీఖండము. [12. సం॥ 25. తె॥

బమ్మెరపోతరాజు.

శా. ఏరా దక్ష యదక్షమానస వృథా యీదూషణం బేలరా
యోరీ పాపము లెల్లఁబోవిడువురా యుగ్రాత్ముఁ జేపట్టురా
వైరం బొప్పదురా శివుం దలఁపురా వర్ణింపురా రాజితోం
కారాత్ముం డగునీలకంఠుఁ దెగడంగారాదురా దుర్మతీ.

వీరభద్రవిజయము. ఆ. 1. [సం॥ 15. తె॥ 26.

పిల్లలమఱ్ఱి పినవీరన్న.

ఉ. కాఁక నెదిర్చి సంగరముఖమ్మున హెచ్చిన రాజవంశముల్
కాఁకటివేళ తోఁ బెఱికి గోత్రవధంబును జేసి నట్టి యా

ద్రేకపుఁగీఁడుగాక ప్రజనేఁచేఁదలంచిన గోరుచుట్టుపై
రోఁకటిపోటుచందముగ రోసి జను ల్ననుఁ జూచి తిట్టరే.

జైమినిభారతము. [సం॥ 8. తె॥ 31.

కృష్ణదేవరాయలు,

సీ. వాతెఱతొంటికై వడి మాటలాడదు కుటిలవృత్తి వహించెఁ గుంతలంబు
లక్షులు సిరులురా నరచూడ్కిఁ గనుఁగొనె నాడించె బొమగొని యాననంబు
ననుగొమల్నెగయవక్షము పేక్షఁ గడకొత్తెఁ బాణిపాదము లెట్టువాఱెఁదొడఁగె
సారెకుమధ్యంబు దారిద్ర్యములెచెప్పె అోవ్వోర్వకిటులోఁగఁ జొచ్చెమేను

గీ. వట్టిగాంభీర్య మెక్కుఁడు వెట్టుకొనియె, నాభినానాఁటికీగతినాఁటిపొందు
చవుకమైనట్టి యిచ్చట చనదునిలువ, ననుచుజాతినకరణి బాల్యంబుజాతె.

ఆముక్తమాల్యద ఆ. 5. [సం॥ 16. తె॥ 54.

అల్లసాని పెద్దన్న.

ఉ. ఎంతతపంబుచేసి జనియించినవా రొకొ మర్త్యభామినుల్
కాంతుఁడవజ్ఞచేసినను గాయముఁబాయుదు రే నమర్త్యనై
చింతలవంతలంజివికి సిగ్గరితిఁ మృతిలేని నాదుచె
ల్వింతయు శూన్యగేహమున నెత్తినదీపిక యయ్యె నక్కటా.

మనుచరిత్ర ఆ. 3. [సం॥ 14. తె॥ 27.

నంది తిమ్మన్న.

మ. జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తన
ర్చులతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చోవామపాదంబునన్
దొలఁగంద్రోచె లతాంగి యట్లయగునాథుల్నేరముల్సేయఁ జే
రలుకంజెందినయట్టికాంత లుచితవ్యాపారము ల్నేర్తురే.

పారిజాతాపహరణము. [సం॥ 17. తె॥ 26.

పింగళి సూరన్న.

మ. తమిఁబూఁదీఁగెల తూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుండూఁగు నా
కొమరుంబ్రాయపుగబ్బిగుబ్బెతల యంఘ్రుల్చకోరఁగాఁజాఁగి మిం
టిమొగంబై చనుదెంచు తీవఁగనుఁగొంటే దివ్యమౌనీంద్ర నా
కమృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్దాఁచులాగొప్పెడున్.

కళాపూర్ణోదయము. ఆ. 1. [సం॥ 7. తె॥ 34.

రామరాజభూషణుఁడు.

శా. రాజీవాక్షుల నేఁచుపాతకివి, చంద్రా, రాజవా నీవు ? నీ
రాజత్వంబునఁ జక్రముల్మనియెనో రంజిల్లి సత్సంతతుల్
తేజంబందెనొ ? డిందెనో యహిభయోద్రేకంబు, తాఁజెల్లరే !
రాజై పుట్టుట రశ్మిమాత్రఫలమే ? రాజౌటదోషార్థమే ?

వసుచరిత్ర. ఆ. 4. [సం॥ 21. తె॥ 22.

చేమకూర వేంకటకవి.

చ. శివుఁడిటు రమ్మటంచు దయచేసినచోఁ దలకెక్కి తుగ్రవై
భవమునఁ జూచుచో నడుగుఁబట్టితి వేమనవచ్చు నీగుణం
బవునవునందిన న్నిగయు నందక యున్నను గాళ్లుఁబట్టికొం
దువు హరిణాంక వేళకొలఁదు ల్గద నీనడకల్తలంపఁగన్.

విజయవిలాసము. ఆ. 3. [సం॥ 8 : తె॥ 36.

ముద్దుపళని.

గీ. తనదుమట్టెంత తానెంత తానె యింత, చేయఁజూచిన నేనెంత చేయరాదు
వేలువాఁచినతోలంత విరివియైన, తోలువాఁచిన నదియెంత మేలుగనునొ.

రాధికాసాంత్వనము. [దీనియందు సంస్కృతపదములు లేవు.

కంకంటి పాపరాజు.

మ. పలుతావుల్వేదచల్లు తెమ్మెరలు పై పైడాయ రేరాజువె
న్నెలగాయన్ మధుపాళిమ్రోయఁ గలకంఠీపాళికూయన్ మరు
ల్లలనగ్లానముచేయ నొంటి నిశివేళం దోఁటలో నైందవో
పలవేదిన్వసియించు పాంథుని స్మరాపస్మారముల్చేరవే.

ఉత్తరరామాయణము. ఆ. 4. [సం॥ 17 : తె॥ 27.

మండపాక పార్వతీశ్వరకవి.

ఉ. వ్రాయఁడు లెక్క లొకటిగ రంగడరంగమెఱుంగు పూఁతలన్
బూయఁడు భిత్తిభాగముల ముఖ్యవిధానములందు మందతం
బాయఁడు బాంధవాదులగువారికిఁ జేయఁగలట్టి సత్కృతుల్
చేయఁడు వేఱె మీకిపుడు చెప్పఁగనేటికి మీరెఱుంగరే.

రాధాకృష్ణసంవాదము : ఆ. 2. [సం॥ 8 : తె॥ 38.

పై యుదాహరణములవలనఁ జాలమట్టుకు దేశ్యపదము లన్యదేశ్యముల కంటె నెక్కుడుగ నున్న వని తెలియఁగలదు. ఆయాపద్యములు కవీశ్వరుల రచనకు ముఖ్యోదాహరణములుగ నెంచవచ్చు నని తలంచెదను. ప్రతిగ్రంథమును దీసికొని లెక్కించినను బై విషయము స్థిరపడు నని నానిశ్చయాభిప్రాయము. ఈ లెక్కించుటలోఁ బదములే కాక ప్రత్యయములును లెక్కలోనికి రావలసినదే గాక యాయాప్రత్యయములును బదములును నెన్నిసా ర్లుపయోగించిన నన్నిసారులు లెక్కింపవలయును. ఇతరభాషాపదములును నట్టులే లెక్కింపఁబడినచోఁ దప్పక దేశ్యపదసంఖ్య చాల హెచ్చుగ నుండు ననుటకు సందేహము లేదు. ఇది గాక రసపుష్టి గలకావ్యములం దెల్ల దేశ్యపదము లెక్కుడుగ నుండును. పదాడంబరము కొఱకును, బాండిత్యప్రకర్షకొఱకును నన్యదేశ్యపదపూర్ణములుగఁ గావ్యముల నొనరించినచో రసమును, అర్థగాంభీర్యమును గొంత చెడకపోదు. నిత్యమును మనజిహ్వాగ్రమున నుండుమాటలు మనకు సుబోధములుగా నుండు ననుట వేఱ చెప్ప నేల ?

IV.

తొల్లిఁటిద్రావిడభాష యనేకభాషలుగా విడఁబడుటయు నం దొకశాఖ నేఁటి తెనుఁగుభాష యగుటయు నింతకు ముందు చెప్పి యుంటిమి. అట్లు చెప్పుట వలన నాయాభాషల మాటలాడువారు కలియక వేఱ్వేఱ యుండి రనుకొనఁ గూడదు. కన్నడము మాటలాడువారును తెనుంగువారును వారి దేశములోనికి వీరును వీరి దేశములోనికి వారును రాకపోకలు జరుపుచునే యుండిరి. ఆంధ్రదేశము నుండి కన్నడదేశమునకు వెళ్లి యాభాషయం దసమానకవీశ్వరు లైనవారిలోఁ బూజ్యపాద (470), దండి (7 వ శతాబ్దము), నాగార్జున (8 వ శతాబ్దము), ఆదిపంప (941), పొన్న (950), నాగవర్మ (990), రన్న (993), రాజాదిత్య (1120), మైదునరామయ్య (1160), మోళిగయ్య (1160), మరుళదేవ (1160), మల్లికార్జున పండితారాధ్య (1160), హరీశ్వర, రాఘవ, కెరెయ, పద్మరస (1165), చక్రపాణి రంగనాథ (1195), పోలాళ్వదండనాథ (1223), భీమకవి (1369), అను వారు ముఖ్యులు. నన్నయభట్ట నారాయణభట్టులు కన్నడదేశపువా రనువాడుక యుండనే యున్నది గదా. ఓరుగల్లురాజులు తెనుఁగుకన్నడకవులఁ గూడ నాదరించుచుండెడివారు. మారనయుఁ బాల్కురికి సోమనాథుఁడును హరీశ్వర రాఘవ కెరెయ పద్మరసుల కాలములో నోరుగల్లునం దుండిరి. శ్రీనాథునికాల

మునఁ దెలుఁగురాజులను గర్ణాటరాజు లనియే పిలుచు చుండిరి. ఈకవి తెలుంగు భాషను గర్ణాటభాషయే యని చెప్పియున్నాఁడు. కృష్ణరాయలకాలమునఁ దెనుంగు కన్నడకవులు కూడియే యుండిరి. తరువాతఁగూడ నెందఱో కన్నడదేశముననో యాదేశప్రాంతములనో యుండి రని దీనికనుబంధముగఁ జేర్చిన పట్టిక వలనఁ దెలియఁ గలదు. అందుచేఁ దొల్లింటి ద్రావిడపదములనే గాక కన్నడము నుండి తెనుఁగు చాలఁ గ్రొత్తమాటల నెరవు తెచ్చుకొనినది. ఇట్లు క్రొత్తిగఁ దెచ్చుకొనినవాని కుదాహరణములు: అంకకాఁడు, అడసట్టా, అరసు, కెలసము, గండపెండేరము, వళవు, ఒళవు, హుళక్కి, హెగ్గడి, హెగ్గాళ, హొన్ను, హణిగెలు మొదలగునవి. *

పై రీతిగానే తెనుఁగుతమిళులకును సంబంధము కలుగుచు వచ్చెను. కాని యిది యంత దగ్గఱసంబంధము కాదు. తెనుఁగుతమిళులకంటెఁ దెనుఁగుకన్నడులకుఁ బరస్పరమైత్రి హెచ్చుగ నాఁడే కాక నేఁటికిని గుదిరి యున్నది. తెనుఁగువారు దేశపర్యటనముఁ జేయుసాహసము క్రీస్తుశకారంభముననే యంతరించినది. అంతకుఁ బూర్వము స్వదేశాభిమానము గలిగి దానిని వదలిపెట్ట నిచ్చ లేనితమిళు లిటు దరువాత తమసాహసము విజృంభింప నానాదేశములయందును జొరుచున్నారు. పాండ్యదేశపురాజులక్రిందఁ దెనుఁగువారు కొంతమట్టుకు దక్షిణదేశమునకుఁ బోయి యున్నట్లు తెలియవచ్చుచున్నది. తంజావూరు; మధుర మొదలగు దక్షిణసంస్థానములందలిరాజులు మనకవీశ్వరుల మిక్కిలి యాదరించుచువచ్చిరి. నెల్లూరును దానికి దక్షిణదేశమును దమిళులదేశ మని మనము నిశ్చయించినచో నాదేశమునఁ దెనుఁగుకవీశ్వరు లనేకు లుండియే యున్నారు. అట్టివారిలో ముఖ్యులు తిక్కన, కేతన, ఎఱ్ఱాప్రెగడ, నాచనసోముఁడు, అనంతామాత్యుఁడు, దూబగుంటనారా

---

* నాగులే ద్రావిడు లనియు వీరు నానాదిశలకు వ్యాపించి యప్పు డుండినభాషలను దమ భాషతో వారు కలుపుకొని రనియు మ॥రా॥రా॥ చిలుకూరి వీరభద్రరావుగారు చెప్పుట సరి యగునేమొ కాని, తొల్లిటియాంధ్రులు కూడ నాగులే యనువ్రాఁత కంగీకరింపలేము. కర్ణాటమునకు కొండలోయలలోనిభాష యని చెప్పి కర్ణాటభాషయందు ఆదిమనివాసులభాషయు, ద్రావిడభాషయు నితరభాషలును జేరి యున్న వని యీగ్రంథకర్తగారు వచించి యున్నారు; ఇది గాక సంస్కృతమును కర్ణాటభాష కొసంగినవారిని కర్ణాటార్యు లని పిలుచుచున్నారు. (ఆం॥ చ॥) 'కర్ నాడు' అనగా నల్లమట్టినేల యనియు నాదేశపువారిభాష కర్ణాట మనియు కాల్డ్వెల్ దొరగారును నితరపాశ్చాత్యపండితులను జెప్పియున్నారు గాని యీవిషయము కొంత సందేహింపవలసినదిగా నున్నవి. చి॥ నా॥

యణకవి, పిడుపర్తి సోమనాథబసవకవులు, చేమకూర వేంకటకవి, శేషము వేంకటపతి, ముద్దుపళని, కంకంటి పాపరాజు, పుష్పగిరి తిమ్మన్న, చిత్రకవి సింగరార్యుండు మొదలగువారు. తమిళు లగువారిలోఁ దెనుఁగున గ్రంథముల రచించినవారిలోఁ ద్యాగరాజ మొదలి ముఖ్యుఁడు. ఈకారణమువలనఁ దొల్లింటిద్రావిడపదము లే గాక తమిళునుండి క్రొత్తగఁ బదములు తెనుఁగునఁ జొచ్చినవి. అట్టిపదములు అచ్చారము, అడిమె, అడుసు, అడియర్, అమంజు, ఆపము, ఇరుగు (పొరుగు), కంగాణము, కప్పలి, కేపుమారి, కొళ్లు, గోణము, జియ్యరు, తిరు, పితలాటము, మరకాలు, అళాకు, వెళ్ళాయి మొదలగునవి. *

## V.

### సంస్కృత ప్రాకృతములు.

సంస్కృతాంధ్రములకు మాతాశిశుసంబంధము లే దని యింతకుఁ బూర్వము నిశ్చయించి యున్నాము. పదసముదాయమునఁ దెనుఁగున సంస్కృత శబ్దము లెక్కుడుగ నున్నను, వానిలో ముప్పాతిక భాగము తెనుఁగు నంటక పైపైన సరిహద్దులలోనే యున్నవి. శబ్దరత్నాకరమందలి 35055 పదములలోను 14814 పదములు సంస్కృతసమములుగా నున్నవి. సంస్కృతసమము లనఁగాఁ దెనుఁగుభాషయందలి స్వరధర్మముల ననుసరించి మార్పులఁ జెందక ప్రత్యయములఁ గూడి వాడఁబడు సంస్కృతపదములు. ఇట్టివి తెనుఁగుభాషయందలివే యని చెప్పుటకు వీలులేదు. వీనిలోఁ జాలమట్టుకు శాస్త్రసంబంధములుగనే యున్నవి. నిజముగఁ దెనుఁగువారివ్యవహారమునకుఁ గావలసినసంస్కృతపదములును జాలమట్టు కున్నవి. అట్టివానిసంఖ్య - అనఁగాఁ దద్భవములు, ముఖ్యముగ సంస్కృతభవము లైనపదములు 2,000 కలవు. వీనిలోఁ గూడఁ జాలమట్టుకు సాధారణవ్యవహారమున ననవసర మైనవే. నిజముగ మనకుఁ గావలసిన—నిత్యవ్యవహారమునఁ గావలసినపదములు 500 కంటె నెక్కు డున్నట్లు కనఁబడదు. వాని

---

* మంగోలియనజాతివా రగుయక్షులు హిమాలయపర్వతములను దాటి వచ్చి చాలకాలము గంగానదీతీరమున తామ్రలిప్తి యనుపట్టణమున నుండి రనియు, పాలీభాషలో నీనగరమునకు 'తమిలిట్టీను' అనుపేరుండె ననియు, అచటనుండి దక్షిణదేశమునకు వచ్చినవారే తమిళులనియు వారిభాష తమిళిక మనియుఁ బిలువఁబడుచు వచ్చె ననియుఁ గొందఱు వక్కాణించుచున్నారు. వీరివాదము ప్రకారము నేఁటితమిళుభాషయందు 'తమిళము, ద్రావిడము' నితరభాషలనుఁగలిపి యుండవలెను ; కాని కాల్డ్వెల్ దొరగారు 'తమిల్' శబ్దము 'ద్రవిడ' శబ్దభవ మని స్వరధర్మముల వ్యక్తపఱచి చెప్పి యున్నారు. ఈరెండువాదములలో రెండవదియే బాగుగ నున్న దని తోఁచుచున్నది. చి॥ నా॥

లో నామపదములసంఖ్య హెచ్చుగను క్రియాపదములసంఖ్య చాలఁదక్కువగను నుండును.

అప్పకవి ప్రకారము తెనుఁగునకు సంస్కృతము ప్రాకృతముఁగూడఁ బ్రకృతులు. తెలుఁగునకుఁ బ్రాకృతభాషయు దానికి సంస్కృతమును బ్రకృతు లగుటచే సంస్కృత మాద్యప్రకృతి, ప్రాకృతము ద్వితీయప్రకృతి యనియుఁ జెప్పఁబడినది. ప్రాకృతసంస్కృతములనుండి వేర్వేఱుగ వికృతు లై రెండేసి రూపములు తెనుఁగునఁ గలసి యున్నవి. దీని కుదాహరణముగ 'చంద్ర' శబ్దమునుండి 'చంద్రుఁడు' 'చందురుఁడు' నను రూపము లెట్లు సిద్ధించెనో చూతము. తద్భవప్రాకృతము లందు చజలు దంత్యములే గాని తాలవ్యములు కావు. ప్రాకృతవ్యాకరణము ప్రకారము పరుషసరళములకును, మ, ఃక, ఃప, శషస, లకును లోప మగును. కాని యిచటఁ 'ద్ర'యనున దున్నది గాన లోపము లేదు. జడ్డలు గలయక్షరములక్రింద నున్న 'ర,వ' లకు లోప మౌను. ఇచట 'ర' లోపము కాఁగా 'చంద' అయినది. తరువాత 'హ్,ర' లకుఁ దప్ప మిగిలినవానికి ముందుది కానట్టియు, లోపింపఁగా మిగిలినదియు, నాదేశ మైనదియు, నచ్చుకంటెఁ బరమైనదియు నగుదానికి జడ్డ యగును గనుక ప్రాకృతమున 'చంద'యని నిలిచినది; దానికిఁ దత్సమము చేయఁగా 'చందుఁడు' అయినది. కనుక నిది శుద్ధసంస్కృతభవము కాదు. కొన్ని తెలుఁగులు సంస్కృతమునుండియే పుట్టును. ఉ॥ సముద్రము > సంద్రము. ప్రాకృతభవ మైనచోఁ బై సూత్రముల ననుసరించి 'సముద్ద' యని కావలయును. ఇట్లే 'లక్ష్మి' శబ్దము 'లచ్చి' యైనది; సంస్కృతభవ మైనచో 'లక్కుమి' కావలయును. కాని యీక్రిందివిధముగ నదిప్రాకృతభవ మైనది. తొలిశబ్దము 'లక్ష్మి' కదా. ద్వితీయాక్షరములక్రింద నున్న 'మ,న,య' లకు లోపమగునుగావున 'లక్షి' యనినిలిచినది. 'క్ష' కు 'చ' యగు నను సూత్రముచేత 'లఛి' యైనది. తెలుఁగున స్పర్శవర్గ తృతీయాక్షరములు లేవు గాన 'లచ్చి' యైనది. అది సంస్కృతభవమే యైనచో 'క్ష' 'మి' తొలుతనే వేఱుపడి 'లక్షిమి' యగును. తెనుఁగున 'ష' వర్ణము లేదుగాన దానిస్థానమున 'క' నిలుచును. అందుచే నది 'లక్కిమి'యు, వికల్పమున జడ్డలోపము కాఁగా 'లకిమి' యనియుఁ గావలసి యుండును. కాని యీరూపములు తెనుఁగునఁ గానరావు. అందుచేత 'లచ్చి' శబ్దము ప్రాకృతభవమే కాని సంస్కృతభవము కాదు.

ప్రాకృతభాష లనేకములు కలవు. అందు ముఖ్యములు శౌరసేని, పైశాచి, చూళిక, అపభ్రంశము, మాగధి యనునవి. అప్పకవి యొకొక్క భాషనుండి యా యాభాషల సంప్రదాయముల ప్రకారము సంస్కృతపదము లెట్లు మార్పులఁ జెంది తెలుఁగునఁ బ్రవేశించెనో తెలుపుట కొక్కొక్క యుదాహరణము నిచ్చి యున్నాఁడు.

శౌరసేని; 'ద్యూత' శబ్దము 'జూదము' అగుటకు; ద్య. ర్య, లకు జకారాదేశ మగును గనుక 'జూతము' అయినది. శౌరసేనియందు ముందటి యక్షర మైనట్టియు, నచ్చుకంటెఁ బరమైనట్టియు సంయుక్తముకాని 'త' కారము నకు 'ద' యగును గాన 'జూదము' అయ్యెను.

పైశాచి: 'శాణ' శబ్దము 'సాన' యగుటకు: 'శష' లకు నిత్యముగ 'స' యగును: 'సాణ': 'ణ,న' లకుఁ బైశాచియందు 'న' యగును: 'సాన.'

చూళిక: 'రాజకులము' 'రాచకొలము' అగుటకు: స్పర్శవర్గముల తృతీయవర్ణములకు వరుసగఁ బ్రథమద్వితీయాక్షరము లగును: 'రాచకొలము.'

అపభ్రంశము: 'మూక' శబ్దము 'మూఁగ' యగుటకు: అచ్చుకంటెఁ బరము లైయసంయుక్తములై, మొదటివి కాని 'క,త,ప' వర్గముల ప్రథమద్వితీయాక్షరములకుఁ దృతీయచతుర్థము లగును; 'మూఁగ.'

మాగధి: 'యక్ష'శబ్దము 'జక్కులు' అగుటకు: శబ్దాదియకారమునకు జకార మగును; 'జక్షః' 'క్ష'కు జిహ్వామూలీయ మగును: 'జఃక' ఇచటజకారము దంత్యము. తెనుఁగులో విసర్గము లేదు గాన దానికి మాఱుగ కకారము వచ్చినది: 'జక్క' బహువచనము 'జక్కులు.'

ఈరీతిగాఁ జూచినచో సంస్కృతశబ్దములే కాక సంస్కృతభవములగు ప్రాకృతపదములు గూడ నాయాభాషల స్వరపరిణామముల ప్రకారము వికృతులయి తెనుఁగునఁ బ్రవేశించుచున్నవి. ఆంధ్రశబ్దచింతామణియందలి 12 వ సూత్రము "ఆద్యప్రకృతిః ప్రకృతిశ్చాద్యే ఏషా తయో ర్భవే ద్వికృతిః కేవలతయానుసర్ప త్యభేచ యేయంయథాతథాభాషా" యనుదాని కప్పకవి పైరీతిగ వ్యాఖ్యానముఁ జేయఁగా సహోబలపండితుఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

అన్నిభాషలకును మూల మైన దగుటచేత సంస్కృతమాంధ్రభాషకుఁ గూడ నాద్యప్రకృతియుఁ బ్రాకృతము, శౌరసేని, మాగధి, రెండువిధములగు పైశాచి, చూళిక, యనునాఱు ప్రాకృతభాషలును నాంధ్రమునకుఁ బ్రకృతు లగుచున్నవి. మహారాష్ట్రదేశమందు వాడఁబడుభాష ప్రాకృతము. శూరసేనమందలి భాష శౌరసేని. మగధదేశమందలిది మాగధి. పిశాచదేశమం దయినది రెండువిధము లగుపైశాచి. ఆభీరాదిదేశములందుఁ బుట్టినది యపభ్రంశము. శౌరసేని, గౌడి, లాటి, మఱియు నిట్టి మఱియొకటియుఁ బ్రాకృత మనువ్యవహారముఁ బొందుచున్న వనియుఁ, గావ్యములందు గొల్లలు మొదలగువారి మాటలును గాని, శాస్త్రములందలి సంస్కృతముకంటె నన్యభాషాపదములుగాని యపభ్రంశము లనియు దండిచెప్పి యున్నాఁడు. ఇది గాక యేయేసందర్భములయం దేయే ప్రాకృతభాష నుపయోగింపవలసినవో, యాయాప్రాకృతభాష లేయే దేశములందు వాడఁబడుచున్నవో గూడ దండి వచించి యున్నాఁడు. ఈరీతిగ వివరింపఁబడిన ప్రాకృతభాషలనుండియు సంస్కృతమునుండియు వికృతియయి యాంధ్రభాష ప్రత్యేకముగ వ్యవహరింపఁబడుచున్నది. 'చంద్రుఁడు, వనము, ధనము, ముఖము,' ఇత్యాదులు సంస్కృతసమములు; చందురుఁడు, సంద్రము మొదలగునవి సంస్కృతభవములు. మేర, మట్టి, రాణి ఇత్యాదులు ప్రాకృతసమములు; 'కంబము, అలది, నాణెము, విన్నాణము, చిన్నె, బోనము' మొదలగునవి ప్రాకృతభవములు. ఈశబ్దములకుఁ బ్రాకృతరూపములు 'ఖంబో, హాళ, ణాణం, విణ్ణాణం, చిణ్ణం, బోణం' అనునవి.

ఇంతవఱకు నప్పకవ్యహోబలపండితు లొకటిగా నున్నను గొన్ని స్వల్ప విషయములయందు వా రిరువురకును విరోధము కలదు. ఈ విరోధము కొన్ని శబ్దముల వ్యుత్పత్తినిగూర్చియే గాని మఱి యొకటి కాదు. శేషాదేశస్య యను సూత్రముప్రకారము 'అచ్చుకంటెఁబర మగుదానికి జడ్డ యగు' నని ప్రాకృత సూత్ర మున్నది గాని యనుస్వారముకంటెఁ బర మగుదానికిఁ గా దనియు, ననుస్వార మచ్చునుటకు వీలు లేదు సరియే కదా, ప్రాకృతమునందు నావ్యవహారము లే దనియు, నందుచేతఁ జంద్రాదిశబ్దముల కప్పకవి ద్విత్వము చెప్పుట భ్రాంతిమూల మనియు నహోబలపండితుని యభిప్రాయము.

ఇది గాక 'లచ్చి' యనుచో 'మనయాం' అనుసూత్రముచే 'మ'కారమునకు లోపము చేయఁగా 'క్షః' అనుసూత్రముచేత మిగిలినదానికి 'చ్ఛ'కారా

దేశ మని యప్పకవి చెప్పెను. 'ఛ' కారాదేశమును ప్రాకృత వ్యాకరణము విధించుచున్నది గాని ఛకారద్వయమును విధింపలేదు. 'లచ్చి' శబ్దము కలుగుట కథర్వణాచార్యుఁడు చెప్పినట్లు సమస్తతద్భవ పదములందును వర్ణలోపాగమాదు లనేకములు కలుగుచున్న వనియు, సంయుక్తవర్ణమునకు వేఱగుట లోపాదేశాగమములు సంస్కృతతద్భవమందుఁ గలుగు ననియుఁ, దక్కినచోట్ల నాదేశాదులును నక్షరవ్యత్యయములును నొకానొకచోటఁ గవిసమ్మతివలనఁ గలుగుచున్న వనియుఁ జెప్పి సాధింపవలయును. ఇట్లే 'జక్కులు' అనుపదము ప్రాకృతతద్భవ మని కొందఱు తలంచిరి కాని యది వర్ణవ్యత్యయమువలనఁ గలిగిన సంస్కృతభవమే.

ఇట్లీయిరువురు పండితులుఁ గొన్నివిషయముల భిన్నాభిప్రాయు లయ్యు ముఖ్యవిషయమున ననఁగా నాంధ్రశబ్దములు సంస్కృత ప్రాకృతభవము లనువిషయమున నేకీభవించి యున్నారు. అందుచేత నహోబలపండితుఁ డీరీతిగా నప్పకవి యిచ్చిన తద్భవపదములకుఁ బ్రకృతుల నొసంగి యున్నాఁడు.

| ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి | ప్రకృతి | వికృతి | ఋక్ష | రిక్క |
|---|---|---|---|---|---|---|---|
| కుర్కుర | కుక్క | సూక్తి | సుద్ది | స్వర్ణ | సొన్న | స్థూల | తోరము |
| గోళ | గోలెము | లంజా | లయ్య | ప్రజ్ఞా | పగ్గ | యత్న | జతనము |
| ఆళి | ఓలి | లంఘా | లాగు | పేటీ | పెట్టె | కూర్పాస | కుప్పసము |
| క్రూర | కూళ | ప్రౌఢ | ప్రోడ | యాత్రా | జాతర | హిమ | ఇవము. |
| కుండ | గుండము | పుస్తక | పొత్తము | ఇష్టకా | ఇటిక | | |
| గ్రంథి | కంతి | పూగ | పోక | సైత | గస | | |
| కుబ్జ | గుజ్జు | పృథివి | పుడమి | రక్షస్ | రక్కసి | | |
| కరండ | కరాటము | భగ్న | బన్నము | పీఠ | పీట | | |
| ఖర్జూ | గజ్జి | భూతి | బూది | మృత్తికా | మట్టి | | |
| కాష్ఠ | కట్టె | వీర | బీరము | మౌక్తిక | ముత్తియము | | |
| శిఖా | సిక | భిక్షా | బికిరము | స్నిగ్ధ | నిద్దము | | |
| చేష్టా | చేఁత | పిష్ట | పిట్టు | దీర్ఘికా | దిగ్గియ | | |
| శిక్య | చిక్కము | స్ఫుట | పుటము | రమ్యా | రసణము | | |
| చిహ్న | చిన్నె | విధూని | విదినె | దైత్య | దయ్యము | | |
| సింహ | సింగము | విష్ణు | వెన్నుఁడు | భక్త | బత్తి | | |
| శయ్యా | సెజ్జ | వక్ర | వంక | ధాత్రి | దాది. | | |
| లాక్షా | లక్క | వటు | వడుగు | ప్రకృతి | వికృతి | | |
| లాంఛన | లచన | వీటి | విడెము. | ప్రేమా | పెరిమె | | |

ఇట్లప్పకవీయమునందును నహోబలపండితీయమునందును జెప్పఁబడిన పదములే కాక యనేకపదములు వైకృతములుగా నాంధ్రమునఁ జొచ్చినవి. అట్లు చొచ్చుటయందుఁ దాముప్రత్యేకముగా నుండుటయే గాక యాంధ్రపదములతోఁ గలసి వర్తిల్లుటయుఁ గొన్ని సమయముల నాంధ్రపదములఁబోలు రూపములఁ బొందియుఁ దమతొలియర్థమునే నిలువఁబెట్టుకొనుటయును గలదు. శబ్దరత్నాకరమునందలి 35055 పదములలో నుభయము లనఁగాఁ గొన్నియర్థములయందచ్చ తెలుఁగులును, గొన్నియర్థములందు సంస్కృతములు నైనపదములు 302 ఉన్నవి; ద్వయములు (అనఁగా వైకృతమును దేశ్యమును మిశ్రము లైనపదములు) 3227 ఉన్నవి; ప్రాకృతమున 'ఇంగలము' అనుమాట యొకటియే యీఁబడెను గాని పరిశీలించి చూచినచోఁ జాలపదములు దొరకకపోవు; మిశ్రములు, (సంస్కృతాంధ్రములు కలసినశబ్దములు) 170 ఉన్నవి; యుగళములు (కొన్ని యర్థములందు దేశ్యములుఁ గొన్నియర్థముల వైకృతములు నైనపదములు 252 కలవు; వైకృతములు 3891 ఉన్నవి. సంస్కృతసమములు 14814 అని యీ వఱకే చెప్పి యుంటిమి. ఈ నిఘంటువునందు దేశ్యాన్యదేశ్య పదవిభాగము చేయఁబడలేదు. అన్యదేశశబ్దములు దేశ్యములక్రిందనో వైకృతములక్రిందనో చేర్పఁబడుటచేఁ గేవలసంస్కృత ప్రాకృతములనుండి వికృతిఁ బొందినపదములసంఖ్య కొంచెము తక్కువగా నుండవచ్చును.

తెనుఁగువైయాకరణు లందఱును నన్నయభట్టారకాథర్వణాచార్యులవలె సంస్కృతవ్యాకరణమర్యాదనే యవలంబించిరి. వారిప్రకారము 'వికృతి' యను పదమునకు విచిత్రార్థ మొం దుండెను. యూరోపునందు మధ్యయుగములోని వారికిఁ దెలిసినభాష లన్నియుఁ దుదకు హీబ్రూభాషాభవము లని తలంపఁబడునటులయే, హిందూశాస్త్రములప్రకార మన్నిభాషలును దుదకు సంస్కృతజన్యములుగనే పరిగణింపఁ బడుచుండెను. వారిప్రకారము పదముయొక్కరూపమే ముఖ్యము; అర్థ మంత ముఖ్యము కాదు. దుర్గాచార్యులవారు యాస్కుని నిరుక్తమునకు వ్యాఖ్యవ్రాయుచు "ఏకేషు దేశేషు ప్రకృత్య ఏవధాతుశబ్దానామ్ భాష్యంతే వికృత్య ఏకేషు ధాతో రాఖ్యాతపదభావేన యః ప్రయోగః సప్రకృతిః। సమిభూతస్య తస్యైవ యఃప్రయోగః సా వికృతిః॥" యని పదముల రూపమునే ముఖ్యముగఁ బరిగ్రహించి యున్నారు. ఈరీతిగఁ బరభాషాపదములకు సంస్కృతద్వారా వ్యుత్పత్తిఁ జెప్పుట సులభ మై యుండెను. మీమాంసికులు

మాత్ర మీవాదమును ఖండించి రూపముకంటె నర్థమే ప్రధాన మని వాదించు చుండిరి. అందుచేత సంస్కృతవైయాకరణు లొనంగిన పరభాషాపదములవ్యుత్పత్తిం దలంచునపు డీవాదముల మనమునం దుంచుకొనవలయును.

సంస్కృతపదములు తెనుఁగునఁ జొచ్చు టార్యులు దక్షిణహిందూస్థానమునఁ జొచ్చినతరువాతనే సంభవించెను. ఆర్యు లీప్రాంతములకు వచ్చు టెన్నఁడో యేరికినిఁ దెలియదు గాని, ద్రావిడు లీదేశమున స్థిరపడిన తరువాతనే యనుట నిశ్చయము. మొదట నీదేశమునకు వచ్చి తమిళభాష నుద్ధరించిన మహానీయుఁ డగస్త్యుఁ డనియును, నాంధ్రభాషకు వ్యాకరణము నిచ్చినవాఁడు కణ్వుఁడును ననిచెప్పుకొనుటయే కాని వా రేకాలపువారో యించుకయుఁ దెలియదు. వీరు కేవల కల్పితపురుషులు కాకపోరు. ఎట్లయిన నార్యు లీప్రాంతములకు వచ్చుట ద్రావిడులు వచ్చుటకుఁ జాల నీవలనే యై యుండవలయును.

సంస్కృతపదములతోఁబాటు ప్రాకృతపదములును గ్రమక్రమముగ మన భాషయందుఁ జొరుచువచ్చినవి. ఈపదములు తొల్లింటి యాంధ్రరాజులకాలములో, ముఖ్యముగ హాలశాతవాహనుని కాలములో (క్రీ. శ. 52—79), నాంధ్రమునఁ గలియుచువచ్చెను. ప్రతాపవంతుఁ డగునీరాజు మహావిద్వాంసుఁడై కవులను బండితులను నాదరించుచు, దేశభాషలయందుఁ బరిశ్రమ సేసి, వానియందు గ్రంథముల రచించియు, రచింపఁజేసియు దేశభాషాభివృద్ధిఁ గావించినటులు గాన్పించుచున్నది. ఈతఁడు ప్రాచీనమహారాష్ట్రీభాషయందు సప్తశతిని రచించెను. ఈతనిమంత్రి యగుగుణాఢ్యుఁడు పైశాచీభాషయందు బృహత్కథను గాతంత్రవ్యాకరణమును గూడ రచించెను. "అప్పటి రాజకీయభాష ప్రాకృతము. వ్యావహారికభాష మాగధము. ప్రాచీన మహారాష్ట్రీము, పైశాచీ, యపభ్రంశము మొదలగుప్రాకృతభేదములు దేశభాషలుగ నుండినవి. ఆకాలమున వాడఁబడుచుండిన లిపి మౌర్య్యలిపిగ నుండెను. శాసనములన్నియుఁ బాలిభాషలో నుండె." ప్రాచీనద్రావిడభాషయె పైశాచి యనఁబడుచుండె నఁట; అయినను గావచ్చును.

ప్రాకృతభాషలు బౌద్ధజైనమతావలంబులవలన నాంధ్రమునఁ గలసినవి. బౌద్ధమతమాంధ్రదేశమునఁ జాల వఱకు స్థిరపడి యాంధ్రరాజులకు మిగుల నభిమానపాత్ర మయ్యెను. బౌద్ధమతముతోఁ బాటు బ్రాహ్మణమతమును జైనమతమును గూడ నాంధ్రదేశస్థు లభిమానించుచుండిరి.

## IV.

## ఇతరభాషాపదములు.

### హిందూస్థానీ.

బ్రౌనుదొర నిఘంటువుప్రకారము 968 హిందూస్థానీపదములు తెనుఁగు భాషయందు జొరఁబడినవి. వీనిలో హిందీపదములుఁగూడఁ జేరి యున్నవి. మహమ్మదీయుల యేలుబడి హెచ్చుగా నుండిన తెనుఁగుప్రదేశములలో నిట్టి పదములసంఖ్య హెచ్చుగను నితరప్రదేశములందుఁ దక్కువగను నుండును. ఎట్లయిన నన్నిప్రదేశములకును సామాన్యముగ నుండుపదములు 500 కంటె నెక్కుడుగ నుండు ననుటకు సందేహము లేదు. మహమ్మదీయ ప్రభుత్వము పోయి బ్రిటిషు ప్రభుత్వము స్థిరముగ నేఁటివఱకు నెలకొని యున్నను హిందూస్థానిపదములే యింగ్లీషుపదములకంటె నెక్కుడుగ నున్నవి. దీనికిఁ గారణ మాయాభాషలసంబంధమే. ఇంగ్లీషునకును దెనుఁగునకును బ్రభుత్వవర్తకసంబంధములు తప్ప నితరసంబంధ మంతగ లేకపోవుటయే గాక భాషలస్వభావములుఁ గూడ జాలమట్టుకు వేఱుగా నున్నవి. మహమ్మదీయులకును, దెనుఁగువారికి నంతకంటె దగ్గఱసంబంధమున్నది. ఒక్కమతవిషయమునఁ దప్ప నిరువురకు నన్నివిషయములందును నన్యోన్యభావము కుదిరి యుండెను. అందుచేతనే కాక హిందూస్థానీభాషయందలి మాధుర్యము తెనుఁగువారిచెవుల కెక్కువయింపుగ నుండి యున్నది. కావుననే సంస్కృతప్రాకృతభాషలపిదప నీభాషలనుండి యెక్కుడుపదములు తెనుఁగునఁ గలసి యున్నవి.

వర్తకమువలనను బరిచయమువలనను, దెనుఁగునఁ జేరినపదములు :— అంగరకా, అంగీ, అరఖు, అవుతుఖానా, అసలు, కంకర, కబురు, కలము, కాగితము, గంజాయి, గజము, మొదలయినవి.

ప్రభుత్వసంబంధమగుపదములు :—అమీను, అమలు, అర్జీ, దరఖాస్తు, ఇనాము, ఇరసాలు, ఖాయిదా, ఖైదు, చావిడి, జమీను మొదలైనవి.

మతసంబంధమగుపదములు :—అల్లా, కొరాను, గోరీ, తావీజు, ఫకీరు, పీరు, మసీదు మొదలగునవి.

### ఇంగ్లీషు.

హిందూస్థానీపదములతరువాత నింగ్లీషుపదములు తెనుఁగున నెక్కుడుగఁ జేరి యున్నవి. క్రొత్తగా "నింటర్మీడియేట్ కాంపొజిషన్ కమిటీవారు" నంగిన

'రిపోర్టు' లో నిట్టిపదములు 320 చేర్పఁబడినవి. కాని యంతకంటె నెన్నియో హెచ్చుపదములు మనభాషయందుఁ జేరి యుండవలెను. ఒకభాషయందలి పదము మనభాషయందుఁ జేరిన దని చెప్పుటకు నిదర్శనము మనపల్లెటూళ్లయందలిస్త్రీలు వాడుటకంటె వేఱె యవసరములేదు. ఇట్లు క్రమముగఁ దెనుఁగునఁ జొచ్చిన యింగ్లీషుపదములసంఖ్య యించుమించుగ నాలుగువంద లుండు ననియు నాపదములతో నవీన బోధనాపద్ధతులప్రకార మింగ్లీషును మనబాలురకు బోధించుటకాపదములఁ దొలిపాఠముల నుపయోగింపవచ్చు ననియు మ-రా-రా-శ్రీ, గిడుగు రామమూర్తిపంతులుగారు చెప్పుచున్నారు. ఇది నిజ మైనను గావచ్చును. ఇంగ్లీషుదొరతన మించుమిం చొకశతాబ్దమునుండియు నీదేశమున నెలకొని యుండ నీపాటిపదములు మనభాషయందుఁ జేరిన వనుట యొకగొప్పసంగతి కాదు.

వర్తకము మొదలగుసంబంధముచే వచ్చినవి :—అణా, ఆసుపత్రి, ఇన్స్పెట్టు, ఏజెంటు, కుంపిని, కాఫీ, కోటు, కెరసెనాయిలు, మొదలగునవి.

ఆచారప్రభుత్వసంబంధ మైనవి :—ఇంజనీరు, ఎకరా, కలక్టరు, గౌను, గెజిటు, చేరుమేను, జడ్జిమొదలయినవి.

మతసంబంధ మయినవి :—ఏసుక్రీస్తు, చర్చి, బైబిలు.

శాస్త్రాదులసంబంధ మైనవి :—గ్రామఫోను, టెల్లిగ్రాఫు, ఫోటోగ్రాఫు, మొదలగునవి.

## ఇతరభాషాపదములు.

పై భాషలనుండియే గాక యితరభాషలనుండియు వర్తకవ్యాపారముల మూలమునను నితరసంబంధములవలనను బైదేశములపదములు తెనుఁగునఁ జేరి యున్నవి. ఈదేశమునకు వచ్చినమేలిజాతిగుఱ్ఱము లరేబియా అఫ్ఘనిస్థాన దేశములనుండి వచ్చినవి. అరేబియాలోని 'యామెను' ప్రదేశపుగుఱ్ఱమునకు 'జమ్మని' యనిపేరు వచ్చినది. 'పఠాణి' గుఱ్ఱము లాఫ్ఘనిస్థానమునుండి వచ్చినవి. అరబ్బీభాషలోనుండి 'వేలము' (యాలము, ఏలము) అనుపదము వచ్చినది. 'మిరాసీ' పద మరబ్బీ పెర్షియను భాషలలోనిది. మలయాద్వీపకల్పమునుండి 'గిడ్డంగి' 'సరంబీ' కాకాతువ్వ (ఒకరీతిచిలుక) పదములును, నాదేశపు పదమే యింగ్లీషుద్వారా 'సగ్గుబియ్యము' అనియు వచ్చినవి. 'అగతా' అనున దోఢ్రపదము, 'జముఖానము' దఖ్ఖనీపదము. బంగాళీ భాషనుండి 'గ్రాది'

'బంగాళము' 'నవటాకు' మొదలగు పదములు వచ్చినవి. 'బత్తాయి' బటేవియాదేశపుది. 'తుత్తినాగము' చీనాభాషలోనిది. ఇంగ్లీషుద్వారా తెనుఁగునఁ జొచ్చిన చీనాపదము 'తే' (నీళ్లు, ఆకు). టుర్కీభాషనుండి 'ఏడు' అనునదియు, తురేనియను భాషనుండి 'తురుతు' (తొందర) అనియుఁ, దార్తారభాషనుండి 'హుజుబిక్కామరుఁడు' అనియు వచ్చినవి. 'బొప్పాయి' అనున దేభాషలోనిదో తెలియదు. దేశ్యపదము మాత్రము కాదు. మహారాష్ట్రభాషనుండి యనేకపదములు మనభాషలోఁ గలసి యున్నవి. అఖతివాసి, ఆరెము (ఆరెకాపులు, ఆరెలిపి, ఆరెలెక్కలు, ఆరెభాష) ఉఠాణి, కఠాయించు, ఠాకురు, టోకోజి, ధాణుకపాలు, ధాణుధోడ, నివాడా, పటేలు, పింగాణి, పిండారీ, మెంఠము, లకోటా, సాహూ, సురీ, హోలి (ళి) (లిక), హుమా, హుమాయి, పురోణి మొదలగునవి.

పైఁజెప్పిన వన్నియు నాసియాఖండములోని దేశములకుఁ జెందినవి. ఐరోపాఖండమునందలి భాషలలో నింగ్లీషునుండి కాక యితరభాషలనుండియు ననేకపదములు తెనుఁగునఁ జేరి యున్నవి. ఫ్రెంచిభాషనుండి 'కుశిని' 'పరంగి' 'పరాసు' 'పాదిరి' 'ఫిరంగి' 'ఫిరంగీచెక్క' 'కమాను అనునవి' ఇందులో 'కమాను' అనుపదము చాలఁ దఱుచుగ వాడఁబడియు నర్థమున మిగుల మార్పు చెందుచు వచ్చె. ఫ్రెంచిభాషయందు సాధారణముగఁ దదిద్దంత్యములు వినఁబడవు. అందుచేత ఫ్రెంచివారు 'కమాండ్' అనుదానిని 'కమాఁ' అని యుచ్చరింతురు. 'కమాఁ' అనఁగా ఫ్రెంచిభాషలో సైనికులప్రయాణ మని యర్థము. ఫ్రెంచి సైన్యములు మనదేశమునుండి పోయినతరువాత సాధారణముగ నైరోపియనులు చేయుప్రయాణమున కీపద ముపయోగింపఁబడుచు నేఁడు దేశీయోద్యోగస్థుల ప్రయాణమునకును రానురాను సాధారణమనుష్యుల ప్రయాణమునకుఁ గూడ వాడఁబడుచున్నది. లాటిను భాషనుండి 'ఆన' 'దీనారి' 'దీనారము' అనునవి వచ్చినవి. పోర్తుగీసుభాషనుండి 'అమారు' అమారుతాడు, గమేళా' అనునావికపదములు వచ్చినవి. పూర్వము 'తాళము' నకు 'చెవి' కలసి యుండ లేదు. ఈ 'చెవి' యిటాలియను, పోర్తుగీసుభాషలలోని 'షియావి' అనుపదము యొక్క వికారము. 'క్రైస్తు, క్రైస్తవుఁడు,' అనునవి గ్రీకుభాషనుండి వచ్చినవి. 'బైబిలు' అనుగ్రీకుపదము ఇంగ్లీషుద్వారా వచ్చినది. మెక్సికో దేశమునందలి 'గొయ్యా'పండు స్పానిషుభాషద్వారా తెనుఁగునఁ జొచ్చినది.

మాండలికపదములఁ గావ్యములయం దుపయోగింపవచ్చునా లేదా యనువిషయ మామధ్య పత్రికలలోని కెక్కినది. ఆంధ్రభాషా సంరక్షణీసమాజము వారు కొన్ని మాండలికపదములఁ బ్రచురించిరి గాని వానిలోఁ జాలమట్టుకు మహాకవులు వాడియే యున్నారు. నాకు గోచరమైన కొన్నిపదముల నీక్రిందఁ బొందుపఱిచెదను.

బెజవాడ—సాలీగెంటువాడు ?

గుంటూరు—పీకె = ఊఁదుగొట్టము.

తెనాలి—పాకాలు-పాకలు = గుడెసెలు ; విసురు = వేగము.

ఒంగోలు—బేస్తవారము = బుధవారము

కణసించుట = ఆలోచించుట (కన్నడము : కణచు = స్వప్నము.)

బొంకుపోవుట = మోసపోవుట

గుజ్జారివాఁడు ?

జువ్వాకోరు = జూదరి.

రూఢి తగిలినది = జబ్బువచ్చినది.

నవ్వడి = సందడి (మఱికొన్ని స్థలములలో = జాడ)

పూఁటపడుట = జామీను ఉండుట.

నెల్లూరు—కర = కంచె.

పంగాలకొయ్యలు = పలవకొయ్యలు ; పందిలికి వేయుకట్టెలు.

తూకుతీయుట = ఉరితీయుట (తూకు = త్రాసు)

ref. p. 12

కంచరము = బండి (బండికిపూన్చు గాడిద కావున కంచరగాడిద)

బళ్లారి—సంకటముచెందుట = విచారపడుట.

కుంబారుకుంట (= గుంట) = చిన్న చెఱువు.

కర్నూలు—సూదిముకుర రాయి = సూదంటురాయి.

బుధవారము = గురువారము

బాగా మంగళహారతి యైనది = ఉద్దేశము కొనసాగినది కాదు.

గుండు = చిన్నచెఱువు (గంజాములో గుండము) [గుండిగ = పాత్ర, దీనితో సంబంధించినది]

అనంతపురము—కొట్టిడి = గది (గంజాము, కొట్టు)

దుడ్డు = సొమ్ము

బొట్టుకు (గోదావరిలో 'డబ్బుకు,' గంజాములో కాణీకి)
చిట్టెడు (గంజాములో 'చిప్పెడు')
దేవరా (బాబూ)-ఈమాట పెరుగు నమ్ము గొల్లది యనినది.
గంజాము—సార్లాయగు (బాగుపడు), సరిగాజరుగు.)
విశాఖపట్టణము—ఈరకాఁడు = వియ్యంకుఁడు.

మాండలిక పదములను స్వేచ్ఛగ నుపయోగించినచో సారస్వతమును మాండలిక మయి దేశమం దంతట నొకేరీతి కావ్యములు బయల్పడక కొంత కాల మరాజకము సంభవించు ననుటకు సంశయము లేదు. కొంతకాల మట్లు జరగినచో రానురాను దూరమండలములవా రొకరిపదముల నొకరు బోధపఱచు కొని యన్యోన్యభావము గలిగియుందు రనుటకును సందేహము లేదు. అట్టి పదములయం దెక్కుడు పటుత్వము వేని కుండునో యాపదములు తుదకు నిలిచి తక్కినవి జాఱిపోవును. చాలకాలముక్రిందటనే స్థిరత్వము నొందినభాషను దిరిగి గందరగోళములోనికిఁ దెచ్చుట యనవరసమును, గోరకూడనిదియునైనను గొన్ని సమయములలో గ్రంథకర్తకుఁ దనదేశపు పదములతో రసమూరఁజేయ నీ పదములు మిక్కిలి తోడ్పడుననుటకు సందేహములేదు. అందుచే నీపదములఁగూడఁ దెనుఁగుశబ్దజాలములోఁ జేర్పవలసినదే.

పైభాషలనుండి తెనుఁగున ననేకపదములు కలయుచు వచ్చినను, మన భాషనుండి యితరభాషలును బదముల నెరవు తీసికొనినవి. ద్రావిడభాషలనుండి సంస్కృతమునఁ జొచ్చినపదములను గుండర్టు దొరగారును, కిట్టెలు దొరగారు నేర్పఱించి యున్నారు. అట్టివి నేఁటికిఁ దెలిసినంతవఱకు 420 ఉన్నవి.

సం॥ నిలింప—ద్రా. నిల్ (నిలుచు) + ఇమె = కనుఱెప్ప.
సం॥ కాక—ద్రా. కాగె, కాకి
సం॥ కీర—ద్రా. గిళి, కిళి, చిలుక
సం॥ కోకిల—ద్రా. కూగు = అఱచు, కూయు
సం॥ ఘూక—ద్రా. గూగె, గూబ
సం॥ బిడాల—ద్రా. బెక్కు, పిల్లి
సం॥ మర్కట—ద్రా. మంగ, మంకు
సం॥ మీన—ద్రా. మీన్
సం॥ ముక్త—ద్రా. ముత్తు
సం॥ ఏల—ద్రా. ఏల (అక్కి), ఏలకులు.

ఇట్లే తామరస, తాళ, నారంగ, పనస మొదలగు వృక్షవిశేషములును, తామ్ర, పిండ, క్షీర, ననులోహ విశేషములును, అటవి, ఉల్క, కూల, కుండ, కేదార, తటిత్ప్రదములును కర్, కషాయ, కాల, కృష్ణ, చోక్ష, నీల, ఫల్గు, శోణ మొదలగు వర్ణవిశేషములను, ఓడ్ర, కళింగ, కొంకణ, పిశాచ, పండిత, పుత్ర, పుళిందాది శబ్దములను, అంగణ, కటక, కూట, కుటీర, కుటుంబ, పట్టణ, మందిర, మొదలగునవియు, అంబర, కక్ష, కచ్ఛ, కంబల, కర్పట, నీవీత్యాదులును, కంకణ, కటక, కుఠారాదులును, ఓదన, కల్యాది భోజనపదార్థములును ద్రావిడ భాషలనుండి సంస్కృతమునఁ జొచ్చిన వని భాషాతత్త్వజ్ఞులు తలంచుచున్నారు. వీనిలో నన్నియు నట్టివే కాక పోవచ్చును; కాని యార్యులు ద్రావిడులతో సంబంధము కలుగఁజేసికొనిన కొలఁదియుఁ గొన్ని పదముల గ్రహించి యుండి రనుట యసత్యము కాదు.

పైవిధముగ నాంధ్రశబ్దజాలమును సూక్ష్మదృష్టితోఁ బరిశీలించి చూచి నచో నెన్నియో విచిత్రములు కనఁబడు ననుటకు సందేహము లేదు. నేను జూపినవిషయములు కొంతవఱకుఁ దప్పయి యుండవచ్చును; కొన్నిచోట్ల సందేహాస్పదములు కావచ్చును. కాని నాయోపినకొలఁది నీవ్యాసమును వ్రాసి భాషాభిమానుల సూక్ష్మవిమర్శనమునకై యర్పించుచున్నాను.

## LIST OF BOOKS CONSULTED


1. శబ్దరత్నాకరము.
2. బ్రౌణ్యనిఘంటువు.
3. కిట్టెలుదొరగారి కన్నడనిఘంటువు.
4. డాక్టరు గుండర్టుదొరగారి మళయాళనిఘంటువు.
5. డాక్టరు పోపుగారి తమిళనిఘంటువు.
6. డాక్టరు ఎ. మానరుగారి తుళునిఘంటువు.
7. డాక్టరు కాల్డ్వెల్ గారి 'కంపేరెటివ్ గ్రామర్ అఫ్ ది డ్రవిడియన్ లాంగ్వేజిస్.
8. డాక్టరు బర్నెలుగారి 'సౌత్ ఇండియన్ పాలియోగ్రఫీ'
9. ఆర్. నరసింహాచారిగారి 'కర్ణాటక కవిచరితె'
10. ఆంధ్రులచరిత్రము : చిలుకూరి వీరభద్రరావుగారు.
11. గ్రీయర్సన్ గారి : లింగ్విస్టిక్ సర్వేఆఫ్ ఇండియా' Vol IV.
12. ఇమెర్సన్ గారి: 'హిస్టరీ ఆఫ్ ది ఇంగ్లిష్ లాంగ్వేజ్'
13. వీరేశలింగముగారి; 'ఆంధ్రకవుల చరిత్రము'
14. విన్సెంటు స్మిత్ 'గారి : 'ఎర్లీహిస్టరీఆఫ్ ఇండియా'


చిలుకూరి నారాయణరావు

గుభాషాపరిణామముఁ దెల్పు కాలనిర్ణయపట్టిక.

| | తీరకవులు. | విజ గరకవులు. | దక్షిణ పుఁగవులు. |
|---|---|---|---|
| 1022 | నన్నయ భట్టు. | | |
| | పావులూరి మల్లన్న. | | |
| 1200 | భాస్కరుఁడు, రంగనాథుఁడు. | | |
| | | మారన. | తిక్కన, కేః |
| 300 | మంచన, చిమ్మకోటపెద్దన్న, మడికి సింగన్న. | పాల్కురికి సోమనాథుఁడు. | |
| | వేములవాడ భీమకవి. | | ప్రెగడ. |
| | | శ్రీనాథుఁడు, బమ్మెరపోతరాజు | నాచన సోమ ఁడు. |
| | | | అనంతామాత్యుఁడు. |
| | | ల్లలమఱ్ఱి పినవీరన్న. | జక్కయ. |
| | లకంటి సూరన్న. | నందిమల్లయ్య ఘంట య్యా. | |
| | | | బై |
| | | కృష్ణదేవరాయలు, అష్టదిగ్గజములు. | కవి. |
| | చరిగొండ ధర్మన్న. గౌరన, శంకరకవి | అయ్యలరాజు రామభద్రుఁడు, కుమ్మరమొల్ల, కుమార ధూర్జటి, పింగళిసూరన్న, పొన్నిగంటి తెలగన్న, రామరాజ భూషణుఁడు. | |
| | మల్లారెడ్డి. | | దా వేంక తి, చిత్రకవిపెద్దన్న. |
| | యాదవామాత్యుఁడు, తెనాలిరామకృష్ణుఁడు. | సారంగు తమ్మయ్య, తురగారామకవి. | |
| | ఎలకూచి బాలసరస్వతి. | కంసాలిరుద్రయ్య | చిత్ర |
| 650 | ముద్దరాజురామన్న, సింహాద్రి వేంకటాచార్యు | | |

## తెనుఁగుభాషాపరిణామములఁ దెల్పు కాలనిర్ణయపట్టిక. (తరువాయి)

| కాలము. | గోదావరీతీరకవులు. | విజయనగరకవులు. | దక్షిణదేశపుంగవులు. |
|---|---|---|---|
| 1650 | కాకునూరి అప్పకవి. | | |
| | నూతనకవి సూరన్న. | కాకమాని మూర్తి. | కామేశ్వరకవి |
| 1700 | | | సముఖ వేంకటకృష్ణప్ప నాయఁకుఁడు. |
| | కూచిమంచి తిమ్మకవి, జగ్గకవి, నక్కలంక వీరభద్రకవి, అడిదము సూరకవి, | పైడిమఱ్ఱి వేంకటపతి, కోసూరు వేంకటాచలకవి. | వెలగపూడి కృష్ణయ్య, శేషము వేంకటపతి, నెల్లూరు వీరరాఘవకవి. |
| | కనుపర్తి అబ్బయామాత్యుఁడు. | నంది రాజు, కాణాదపెద్దన సోమయాజి. | కంకుర్తి వేంకటాచలపతి, ముద్దుపళని, కంకటి పాపరాజు, పుష్పగిరితిమ్మన్న, అలూరికుప్పన, వెలిదండ్ల వేంకటపతి, అప్పమూరి కిష్టయ్య, చిత్రకవి సింగరార్యుఁడు, ఘట్టుప్రభువు. |
| 1800 | పాలవేకరి కదిరీపతి. | మారాయ. | |
| 1 | కొటికెలపూడి వేంకటకృష్ణకవి, | | |
| | కాకరపర్తి కృష్ణకవి, పిండిప్రోలు లక్ష్మణకవి. | ఏలగొండ వెంకయ్య. | |
| | కాకరపర్తి బుచ్చిపాత్రకవి, శిష్టు కృష్ణమూర్తి. | | |
| | మండపాక పార్వతీశ్వరకవి | గురురాజకవి | కరాలపాటి రంగయకవి, త్యాగరాజమొదలి. |
| 1900 | తిరుపతి వేంకటేశ్వరులు, రామకృష్ణకవులు. | | దాసు శ్రీరాములుగారు, సుబ్బారావు పంతులుగారు. |
| | వీరేశలింగముగారు. | | వేదము వేంకటరాయ శాస్త్రిగారు. |

చిలుకూరి నారాయణరావు.

# నన్నయభట్టీయము — బాలసరస్వతీయభాష్యము.

ఆంధ్రభాషావ్యాకరణ మైనయాంధ్రశబ్దచింతామణి నెఱుఁగని యాంధ్ర భాషాపరిజ్ఞాత లుండరు. ఇది తొలుత 1860 లో ముద్రింపఁబడినది. దానిం బట్టియే యిప్పటివఱకును గ్రమముగా ముద్రింపఁబడుటఁ గనుచున్నారము. సంస్కృతమున నార్యావృత్తములతో నున్నదీని కొక తెలుఁగుటీక ముద్రితప్రతులలోఁ గానవచ్చుచున్నది గదా! అది యెలకూచి బాలసరస్వతి రచియించిన దని లోక ప్రతీతి గలదు. కాని, పూర్వముద్రణములోఁ గాని, యర్వాచీనముద్రణములోఁ గాని, బాలసరస్వతి రచియించినటీక యని యెందును గానరాదు. పోనీ మఱి యెవ్వరైన రచియించిన దేమో యని తలంత మన్న, వ్యాఖ్యాతపేరే కనఁబడదు. ముద్రించినవారే తెలుఁగున నర్థము వ్రాయించి ముద్రించి రని యూహింత మన్న, "కా. అనంతనారాయణశాస్త్రులవారు పరిష్కరించి" నట్లు మాత్రము మొదటి ముద్రణములోఁ గానవచ్చుచున్నది కాని, యిప్పటి ముద్రణములోఁ బరిష్కర్త పేరును గానరాదు. దీనింబట్టి దీని కెవఁడో యొకవ్యాఖ్యాత ప్రాచీనుఁడే కలఁడనియు, నతఁడు బాలసరస్వతియే యనియు, లోకప్రతీతినే విశ్వసింపవలసి యున్నది. ఈలోకప్రతీతికిఁ బ్రమాణ మే మని యాలోచించినచో, బాలసరస్వతియే తన రాఘవయాదవపాండవీయము నవతారికలో,

సీ. "ఆంధ్రచింతామణివ్యాఖ్యాన భాషావివరణాది బహుతంత్రకరణచణుఁడ,"

అని చెప్పుకొనుటయే యని తెలియుచున్నది. దీని కుపోద్బలకముగా,

క. "ఆలోకనుతుఁడు మున్నటి, కీలకసమ నామతంగగిరికడ నొసఁగెన్
బాలసరస్వతులకు నతఁ, డోలిఁ దెనుఁగుటీక దాని కొప్పఁగఁ జేసెన్."

అని పెద్దమనుష్యుఁ డప్పకవి సాక్ష్య మిచ్చియున్నాఁడు. కాన దీనికి వ్యాఖ్యానము వ్రాసినయతఁడు బాలసరస్వతి యనెడిప్రతీతి వట్టిదిగాక గట్టిదియే యని స్పష్టము. కాని, "యిట్టిగట్టిప్రమాణములు రెండు గనఁబడుచుండఁగా, ముద్రిత గ్రంథములలో బాలసరస్వతిపేరు గనఁబడ దేమి? అందలివ్యాఖ్య యితఁడు రచించినదిగాదా యేమి? అతనిదే యయినచో నతనిపేరు ముద్రణములోఁ జేర

కుండుటకు హేతు వేమి? మొదటిముద్రణమున కాధార మైనవ్రాఁతప్రతిలోనే యతనిపేరు లేదా యేమి? అట్లు లేమికిఁ గారణ మేమి?" యనుసంశయము లింతవఱకును మనకుఁ గలిగియుండలే దని నొక్కి-వక్కా-ణించుట సాహసము గాదు. ఇందులకుఁ గారణము పైని జూపిన రెండుప్రమాణములను బట్టి మనకుఁ గల్గినవిశ్వాసమే కాక వే ఱొం డే మున్నది? "అ ట్లయినచో ముద్రితప్రతులలో నుండుటీక యతని దగునా, కాదా?" యనుప్రశ్న మిప్పుడు రాకమానదు. కాన దానింగూర్చి కొంచె మిందుఁ జర్చింపవలసి యున్నది.

మే మీనడుమఁ బ్రాచీనాముద్రిత గ్రంథము లేవయిన లభించునేమో యనెడి యాసతో, అనంతపురమండలములోని యొకపల్లె యగు బూదేడుకృష్ణాపుర మనునగ్రహారమునకుఁ బోయి యుంటిమి. అచట శ్రీవైష్ణవు లగు వీరరాఘవాచార్యులుగారియింట రెండుమూఁడు తాటాకుగ్రంథములు లభించినవి. వానిలో సటీకాంధ్రశబ్ద చింతామణి యొకటి. దానిని విప్పి చూఁడఁగా, మొదలఁ బద్యగద్యములతో నొకయవతారిక గనఁబడినది. చదివితిమి. ఆపద్యములు మే మెన్నఁడును విన్నవి గావు. తరువాత మొదటిసూత్రమగు "విశ్వశ్రేయఃకావ్యం" అనుసూత్రమునకు భాష్యము చదివితిమి. అది మేమిదివఱకుఁ జదివిన టీకయే కాదు. సూత్రమున కర్థము మఱొకవిధముగా వ్రాయుటకు వలనుపడమిచే, ముఖ్యార్థవిషయమున రెండును సరిపడుచున్నవి గాని, వ్యాఖ్యాన సరణియుఁ, బూర్వపక్షసిద్ధాంతములును, సూత్రతాత్పర్య వివరణము మున్నగునవి ముద్రిత ప్రతులలో మున్నెన్నఁడుఁ గన్నవి గావు సరి గదా, విన్నవియుఁ గూడఁ గా వని తెలిసికొంటిమి. మఱియు, బాలసరస్వతులవ్యాఖ్య యింతదనుక నాంధ్రలోకమున నేవిధమునను వ్యాపింపలే దనియు నితని యీవ్యాఖ్యనో యహోబాల పండితాదుల వ్యాఖ్యలనో పఠించినపూర్వుఁ డెవఁడో యందలి ముఖ్యార్థము నెత్తి సంగ్రహించి యొకప్రతి వ్రాసికొని యుండఁగా నదియే లోకమున విస్తరించి తుదకుఁ దొలిముద్రణమున కాధార మైన దనియుఁ, గావుననే యం దేవ్యాఖ్యాత పేరును జేరుట కవకాశము లేకపోయిన దనియు, నీయంశము గూడ ముద్రితప్రతులలోని టీక బాలసరస్వతిది గా దనుట కొకనిదర్శనము గాఁ దగి యున్న దనియుఁ దెలిసికొంటిమి.

కాని, మాకు దొరికిన ప్రతిలోఁ గూడ బద్యములు నుదాహరణములు మాత్రము వ్యాకరణయుక్తముగ నున్నవి గాని, మిగిలిన వచనము పురాణశైలిని

గొంచెము గ్రామ్యపదభూయిష్ఠముగనే యున్నది. అందందుఁ బూర్వోత్తరవాక్య సందర్భమును గొంత పోయినది. ఆంధ్రభాషాపరిజ్ఞానము లేనివారు వ్రాసికొని నట్లు సూచనలు గలవు. కాన, బాలసరస్వతి ప్రత్యక్షవాక్య- యిది యన వలను పడదు. ఆనోటినుండి యీనోటికి వచ్చినది. కొంచెము మార్పులు సెందినది. వ్యాఖ్యానసరణిమాత్ర మపూర్వమై యిది యతనిదే యని తెలుపుచున్నది. అతఁడు వ్రాసినది, లేక వ్రాయించినది, మనకు దొరకునా! ఏమైన నేమి? ఇది బాలసరస్వతిభాష్య మగును.

ఆహా! చూచితిరా కాలమహిమ!! ఎప్పటి నన్నయభట్టు? ఎన్నఁటి బాలసరస్వతి? ఎక్కడి యిరువదవశతాబ్దము? ఏదుర్ముహూర్తమున నాంధ్రశబ్ద చింతామణి జనించినదో కాని, దానిజీవన మంతయుఁ గష్టములపాలే యైనది గదా? ఏనాఁడు పుట్టినదో? భూమిమీఁదఁ బడినట్లు లోకమునకుఁ దెలియక మున్నే పుట్టినది పుట్టినట్లు నామరూపములు లేక కొన్నివందలసంవత్సరములవఱకు నేమహాత్ముల కడుపులోనో తలఁదాఁచికొని దాఁచికొని, పడియుండి పడియుండి, యేగ్రహమో కొంచెము వక్రింపఁగా, నెట్లో బాలసరస్వతికంటఁ బడి, తనతండ్రి పేరు వినియున్నవాఁడు గావున, నాతని యాదరణము నొంది, యతని పుత్రికతోఁ జెలిమిచేసి వేషభాషల నిపుణురాలై, కొంచెము లోకజ్ఞానము సంపాదించి యామెతో నున్నట్లే యుండి దేశాటనము సల్పి నలువురనోళ్లలోను బడి నాలుగు తెన్నులఁ బోయినది. దానితోఁ జెలిమిచేసిన దోషంబున బాలసరస్వతికృతి మరల నజ్ఞాతవాసము పాలై కొన్నివందలసంవత్సరములనుండి యట్లే మఱుగునఁ బడియుండి, యిప్పు డనంతపురమండలమునఁ దలసూపినది. ఎట్లయిన నేమి? ప్రాణముతో నున్నది. అందులకే మనము సంతసింపవలయును.

ఆహా! మూఁడువందలసంవత్సరములనుండి—అందును దేశము నాగరకతఁ గాంచుచున్న యఱువది డెబ్బదియేండ్లనుండి—బాలసరస్వతి యాంధ్ర వ్యాకరణభాష్య మిట్లు ప్రజలమొగ మెఱుఁగక యెందో మూల నణఁగియుండ, నన్నయభట్టు రచించిన మూలము బాలసరస్వతికి దొరకువఱకు సుమా రైదువందలసంవత్సరము లాకాలములో నణఁగి యున్నదన్న నాశ్చర్య మేమి? కొందఱు పూర్వజన్మపుణ్యమున ననాయాసముగ యశస్సు గాంతురు; మఱికొందఱు శ్రమ పడియుఁ గాంచలేరు; ఇఁకఁ గొంద ఱేదో యొకయుపాయమునఁ బ్రసిద్ధు లగుదురు. ఇంత యేల? ఒకతల్లికడుపునఁ బుట్టినవారిలోనే యొకఁడు తలయెత్తికొ

నును. ఒకఁ డణఁగియుండును. కాన, "వీథికి వచ్చినవానివలె నిదిగూడ నెందు లకు రా లేదు ? కాన నిది నన్నయభట్టారకునిది గాదు. బాలసరస్వతియే రచించి యాతనిపేరు వెట్టె." నని నిర్ణయింపరాదు. అట్లయినచో నీబాలసరస్వతీయ మైన యాంధ్రవ్యాకరణభాష్యమును, మాకుఁ బుస్తకమిచ్చిన శ్రీ వీరరాఘవా చార్యులో లేక మేమో రచియించి బాలసరస్వతిపేరు వెట్టియుందు మనియుఁ జెప్పఁ దగినదియే కదా ? ఇప్పు డిది యెట్టిదో యాకాలమున నదియు నట్టిద. ఇట్టివాద ములు విశ్వాసపాత్రము లగునా ? సమకాలికు లగుప్రాజ్ఞుల కన్నుమాయ శక్య మా ? అట్లయిన నతనికివచ్చు గొప్ప యేమి ? తాను జేసినది యెవరిపేరున నయిన నన్నెకెక్కుటయే యంగురా ? అట్లయిన నీచిన్నిపొత్తమున కేల ? తన గొప్పగ్రంథములకే యట్లు పేరువెట్టి, యాపొందఁగోరు గొప్ప సెందరాదా ? వ్యాకరణమునకు శబ్దానుశాసనునిపేరు వెట్టినప్రతిభాశాలి రాఘవయాదవపాండ వీయమునకు భీమకవిపేరు వెట్టియుండఁడా ?

సరియే కా నిండు. దీని నిట్లుంచి బాలసరస్వతి యవతారికం గూర్చి యిం చుక ముందు తెలిసికొందము.

వ. "అని యిష్టదేవతాప్రార్థనంబు సేసి మున్నొకనాఁడు విద్యానగరిలో నచిం త్యకారణోపాగమ స్నేహసాహచర్యం డగు శివయోగివర్యుచే దేవచోదితం బై ప్రాప్తంబైన యాంధ్రశబ్దచింతామణి లోకోపకారంబుగఁ డీక గావింపం గోరి నెమ్మనంబున."

ఉ. ఏమి మహాద్భుతం బది ! హరిహరి ! యెక్కడియాంధ్రశబ్దచిం
తామణిఫక్కి ? యెక్కడి మతంగనగంబు ? యుగాదిసంభవుం
డై మని చన్ననన్ననమహాకవియెవ్వఁడు ? సిద్ధుఁ డెవ్వఁ డా
హా ! మదగణ్యపుణ్యసముదగ్రతఁ జేకుఱెఁ గాదె యిన్నియున్.

మ. ఇలఁ బ్రజ్ఞాధికు లొకవుల్ మునుపు లేరే ? వారు వ్యాఖ్యానక
ర్తలు గానోపరె ? పెక్కువత్సరము లంతర్భూతమై యున్న యీ
తెలుఁగువ్యాకరణంబు నాకొసఁగెఁ బ్రీతిం డీక గావింపుమం
చలసిద్ధుండు మదిష్టదేవత నిరూపాత్ముండు నిక్కంబుగన్.

వ. అని గణుతించి లోకోపకారసుకృతి కీర్తిలాభవితర్కంబునఁ బ్రహర్షించి యాం ధ్రవ్యాకరణభాష్యనిబంధనోత్సుకుండ నై యం దాది నన్మచ్చరిత్ర మభివర్ణిం చెద :—

సీ. స్థిరకీర్తి యెలకూచి తిప్పనార్యుఁడు గాంచె శుచిశీలు వల్లభసోమయాజి
నతనికిఁ దిప్పన్న యజ్ఞన్నయు ననంగ సుచరిత్రు లిద్దఱు సుతులు పుట్టి
రాతిప్పనకు భైరవన్న నన్నయనాఁగ నలఘు లిద్దఱు తనూజులు జనించి
రాభైరవునకు నొయ్యన తిర్మలయ్య రామనయుఁ జిట్టపయు సూరనయుఁ గల్గి
గీ. రాతిరుమలేంద్రుఁ డళియరామావనీశ, దత్త యెడవిల్లిముఖ్యసద్గ్రామహేమ
చామరచ్ఛత్రపల్యంకికామణీవి,భూషుఁడై వైదుషీస్ఫూర్తిఁ బొలుపుమించె.

* *   * *   * *   * *

గీ. ప్రకటరాఘవయాదవపాండవీయ, నామకశ్లేషకవితాప్రణామకుండ
ననఘకౌండిన్యగోత్రుండనఖిలసుకవి, తాస్వతంత్రుండ,బహుకథాధరుఁడనేను.
వ. ఆంధ్రశబ్దచింతామణిఁ దెనిఁగించెద నిది తొల్లి సకలకవితాప్రవర్తకుం డగుశబ్ద
శాసనుండు సకలకపిహితంబుగా యథోచిత సూత్రగర్భితంబు లగునార్యా
వృత్తంబులఁ బంచపరిచ్ఛేదకంబుగా సమకట్టె. నేను నానేర్పుకొలఁదిఁ దత్సూ
త్రవిభాగంబును, దత్ప్రమేయవివరణంబును, దదుదాహరణ స్వరూపంబులును
సంధ్రమయగద్యపద్యంబుల నేర్పరించి నాయాత్మదేవత యగు నంబాదేవి
కర్పించువాఁడ.

అని యవతారిక గలదు.

విద్యానగరచిహ్నములు గలతావున విరూపాక్షస్వామి యాలయమున కెదురుగా నరక్రోసుదూరములో నొకచిన్నపర్వతము గలదు. దాని నందలివారు మతంగపర్వత మని వ్యవహరింతురు. దానికి మూఁడువైపులఁ బాడయిపోయిన యిండ్లవరుసలతోఁ బురవీథులు గానవచ్చును. ఆపర్వతముపై నొకగొప్పదేవాలయము గలదు. అది యిప్పటికిని శిథిలముగాక యున్నది. విరూపాక్షస్వామిని దర్శించుటకును, విజయనగరచిహ్నములను జూచుటకును, బోవువా రందఱు నా మతంగగిరి నెక్కియ వచ్చుచుందురు. విద్యానగరసాహచర్యంబున బాలసరస్వతి పేర్కొనిన మతంగగిరి యిదియ కాని కొంద ఱూహించినట్లు నెల్లూరు మండలములోనిది కా దనుట నిక్కము.

పైయవతారికను బట్టి యప్పటి కతిప్రాచీనకాలంబున నన్నయ యనెడి మహాకవిచే రచియింపఁబడి చాలకాలము లోక మెఱుఁగక యంతర్హితమై పడియున్న యాంధ్రశబ్దచింతామణి యనెడు నాంధ్రవ్యాకరణమును విద్యానగరికిఁ జేరియున్న మతంగగిరిపై యోగనిష్ఠ సలుపుచున్న శివయోగి యనెడు

సిద్ధుఁడు విద్యానగరమునకు విరూపాక్షుని గొల్వ వచ్చియున్న బాలసరస్వతి
యెడ ననుగ్రహించి టీక గావింపు మని యతని కొసఁగినట్లు తెలియుచున్నది.
శివయోగి యనునతఁడు తీర్థయాత్రలు సలుపుచు నందందుఁ దిరిగి మతంగగిరికి
రావచ్చును; అతని కెందయిన లభించిన యాగ్రంథమును బాలసరస్వతి కీయ
వచ్చును. ఇందసంభావ్యము నతిమానుషము నయినయద్భుతచర్య యేమియు
లేదు గదా!

నిజమయిన పుస్తకలాభవృత్తాంతము నితఁ డిట్లు చెప్పికొని యుండఁగా,
ఆంధ్రశబ్దచింతామణియం దతిగౌరవము లోకమునకుఁ గలిగించుటకో యనఁ
బుస్తకప్రాప్తినిగూర్చి బాలసరస్వతి యవతారికలో వ్రాసినదానిం గనియో కన
కయో, నన్నయకును బాలసరస్వతికిని నడుమ నున్నమహాంతర మంతరంగమున
నునిచికొని యంత యతిదీర్ఘకాల మీగ్రంథ మిట్లడఁగి యుండుటకు నిపుడు
బయలుపడుటకు నేదో యొక యపూర్వమైన హేతు వుండనోపు నని తలంచి
కాఁబోలు భీమనకు నన్నయకును వివాద మున్నట్లును, దానంజేసి యీగ్రంథము
గోదావరిపా లయినట్లును, నటుపిదపఁ దండ్రిచేఁ జంప నంపఁబడిన సారంగధరుఁడు
మత్స్యేంద్రుని దయచే, సిద్ధుఁ డయినట్లును, ఆసిద్ధుఁడే తాను జిన్నతనములోఁ
జదివినజ్ఞప్తినిబట్టి మరల వ్రాసికొనిన ప్రతియో లేక తనకు నన్నయ వ్రాసి
యిచ్చిన వేఱుప్రతియో చచ్చుటకుఁ బోయినపుడు గూడఁ గూడఁ దీసికొనిపోయె
నో యనునట్లుగా నేదో యొకప్రతి బాలసరస్వతికి మతంగగిరిదగ్గఱ నొసఁగి
నట్లును నొకకథ యపూర్వ మనూహ్య మత్యద్భుత మతిమానుష మయినది
యాతనియెడ దానియెడను గూడఁ గల్పించుచు, భగవంతుఁడు దనకు స్వప్న
ములోఁ గనఁబడినట్లును, మతంగాచలవిప్రునివలనఁ దనకును నట్లే సంభ
వించినట్లును దనయెడఁ గూడఁ నొకకథ కల్పించికొని తనకాకృతి నూతన
ముగా లభించినట్లును బాలసరస్వతి టీకను జూడనట్లును సూచించి, కాకునూరి
యప్పకవి యీమూలగ్రంథముమాత్ర మాంధ్రభారతకర్త యగునన్నయభట్టార
కుఁడే నిర్మించినట్లు వ్రాసెను. ఇతనివ్రాఁత నాధారముగఁ జేసికొని బాలసరస్వతి
కాకృతి లభించుటలోఁ బూర్వోక్తకల్పితకథనె దృఢీకరించుచుఁ బిదప నహో
బలపండితుఁడు వ్రాసెను. అప్పకవి కల్పించిన పైకథయందు విశ్వాసము లేక
పోయినను, నాంధ్రశబ్దచింతామణి భారతకర్తయగు నన్నయభట్టారకుండు వ్రాయ
లే దనుటకు నీయతిమానుషకథను గూడ నొకహేతువుగాఁ గైకొని యప్పకవి

కల్పితకథయందే దృష్టినిలిపి యిది వింతగా నున్నదని తలంచి యీకృతి నన్నయ భట్టు వ్రాయలే దనియు, గ్రంథప్రాశస్త్యమునకై బాలసరస్వతియే మూలము గూడ వ్రాసి యాతనిపేరు పెట్టె ననియు, నాంధ్రకవులచరిత్ర చెప్పుచున్నది.

ఇందులకుఁ గారణము రావుబహదరు వీరేశలింగము పంతులుగారికి బాల సరస్వతి రచియించిన భాష్యము లభింపకపోవుట యె కాక వేఱు గాదు. బాల సరస్వతి యవతారికఁ జిత్తగించితిరి గదా! అందే మయిన యద్భుతచర్య గనఁ బడుచున్నదా? అప్పకవి కల్పించిన కథకందే మయిన నవకాశ మున్నదా? సారంగధరుని మాట యయిన వచ్చినదా? భీమన గొడవ యున్నదా? మత్స్యేం ద్రునిప్రసంగ మున్నదా? చూడుఁడు! అసత్యము లెట్లు సత్యము లగునో, సత్యము లెట్లసత్యము లగునో? తనకు శివయోగి యిచ్చె నని బాలసర్వతి చెప్పెను. ఇందుఁ దప్పేమి? శివయోగి యుండఁగూడదా? అతఁడు దేశాటన సమయమున నెందయిన దాని నార్జింపఁ గూడదా? దానిని యోగ్యుఁడు గాఁ గనఁబడిన బాలసరస్వతి కీయఁగూడదా? దాని కర్త యతిప్రాచీనుఁ డనుటకు "యుగాదిసంభవుండై" యను విశేషణము వైచెను; కర్త నన్నయ యను మహాకవి యని వక్కాణించెను; ఇందు వైచిత్ర్య మేమి గలదు?

పోనిండు. "పైకథ యెట్లయిన నసత్యమే. గ్రంథప్రాశస్త్యమునకై బాల సరస్వతియే మూలముఁ గూడ రచించి నన్నయపేరుపెట్టి యుండు." ననుటలో మీయాక్షేపణ మేమి? అను శంక రావచ్చును. అట్లయినచోఁ దనవంశమును వర్ణించుకొనుచుఁ బైయవతారికలోనే తన పితామహునకుఁ గనిష్ఠపితా మహుఁడు నన్నయ యొక్కఁ డుండె నని వర్ణించికొనెను గదా? తనవంశములోని వాఁడును దనకుఁ గొంచె మించుమించుగా నూఱు నూటయిరువదేండ్ల వెనుకటి వాఁడు నగు నతఁడే మూలకర్త యని యేల చెప్పికొనరాదు? "యుగాదిసంభ వుండై మని చన్న నన్నయమహాకవి యెవ్వఁడు?" అని యాగ్రంథకర్త యెవఁడో తన కేవిధమునను దెలియని వాఁ డయిన ట్లేలచెప్పికొనును? అట్లు చెప్పికొనినచో గ్రంథకర్తృత్వయశస్సు తనకు లేకపోయినఁ దనతాతతాత కయినను వచ్చునే? తనవంశమునకే యుంచికొనక యెవనికో మఱియొక నన్నయకుఁ గట్టిపెట్టనేల? దానఁ దాను గాంచిన లాభ మేమి? ఇట్టియవివేక మెందయిన నుండునా? లోకములో నెవరో ప్రాచీనులు రచియించిన గ్రంథములు మూలమూలలఁ బడి యుండ వాని సేకరించి వాని రచించినవారి తలలుతీసి తమతలలు పెట్టికొనుట

యందంను వినుచున్నారము, కాని తమపేరు కర్తెరించికొని యందన్యులపేరు లతికించు వెంగలు లెందయిన నుందురా? ఉన్నవి లేనివి బిరుదావళులు తగిలించికొని, చచ్చినతాత ముత్తాతలు నిరక్షరకుక్షులు నసమర్థులు నయినను వారిని మంత్రివర్యులు కవివర్యులు పండితవర్యులు సకలభాషాధురంధరులు నని తమ్మును, దమవారిని బొగడికొనుట కవులలోఁ గానిపించుచున్నది గాని, తన గౌరవమును గౌరవహేతువును గొనిపోయి యితరుల కర్పించిన స్వార్థత్యాగు లెందయినఁ గలరా? బాలసరస్వతి వెఱ్ఱివాఁడా? తనకు సర్వవిద్యలు వచ్చుననియుఁ దాను సర్వజ్ఞుఁడ ననియుఁ చేతవాతఁ జూపుచుఁ జెప్పుచు నెనుబదిరెండాార్యావృత్తములయెడఁ దనకు యశస్సు రాదేమో యని భయపడి వాని కర్తృత్వముఁ బూర్తిగా నన్నయకు దారవోయునా? మిగిలిన పదిపదియేను గ్రంథములకంటె నిదియే యుత్తమ మని యతఁ డెఱింగినచోఁ దప్పక యశస్సు వచ్చుదానినే యితరుల కిచ్చి తక్కిన పనికిమాలిన గ్రంథమువలనఁ దాను యశస్సుఁ జెందఁగోరెనా? తక్కినవాని కన్న దీని గొప్ప యేమి? కాన నీవాదమెంతయు నసంగతము హాస్యాస్పదము గాని సరసముగాదు.

"నన్నయభట్టారకుఁడే రచియించినచో నంతకాల మడుగంటి యుండునా? భారతమువలె నప్పుడే బయటికి రాదా? తిక్కనాదు లెవ్వరైన నెఱుఁగరా? కేతనాదులు దీనిఁ జేరుకొనలేదె?" యని సంశయము గలుగవచ్చును. సత్యమే! ఆతని యింద్రవిజయ మేమయినది? శ్రీనాథుని మరుత్తరాట్చరిత్ర యేమయినది? పెద్దన హరికథాసార మే మయినది? పోనిండు వానిమాట లేల? చెదలువాడ మల్లయకవి యెప్పటివాఁడు? ఆతఁడు విప్రనారాయణచరిత్రము రచియించినట్లు సంవత్సరముక్రిందటి వఱకు నొక్కఁ డయిన నెఱుఁగునా? నన్నెచోడుఁడు కుమారసంభవము రచించినట్లు మొన్నమొన్నటిదాఁక నెన్నఁడయిన వింటిమా? శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్య మేఁడాది క్రిందటివఱకు నేల యణఁగి యుండెనో మన మెఱఁగితిమా? మనపూర్వు లెఱఁగిరా? అదంత యేల? ఈ బాలసరస్వతిభాష్య మిన్నూఁడువందల సంవత్సరములనుండి మూలఁబడి యుండ లేదా! ఇట్లే దానికర్మ మట్లున్నది. దాని కెవ్వఁ డేమిచెప్పఁగలఁడు? మొదలంటఁ బోక బాలసరస్వతి కైనను లభించెఁ గదా యని యానందింపక కర్తృత్వమును గూడ నన్నయకుఁ దీసివేయు టుచితమా?

ఇంక, "మూలము బాలసరస్వతి రచియింపలేదు. నన్నయభట్టే రచియించెను. ఆనన్నయ భారతకర్త యైనట్లు మీకు దొరకిన భాష్యమునఁ బ్రమాణమేమి గలదు?" అని యొక సంశయము మరలఁ గలుగవచ్చును. నిజమే! బాలసరస్వతి పైని జూపిన తనయవతారికలో:—

"యుగాదిసంభవుం డై మని చన్న నన్నయ మహాకవి."

"పెక్కువత్సరము లంతర్భూతమై యున్న యీతెలుఁగువ్యాకరణంబు."

"ఇది తొల్లి సకలకవితాప్రవర్తకుం డగు శబ్దశాసనుండు ... సమకట్టె."

అనువాక్యములు గానవచ్చుచున్నవి గదా? 'యుగాదిసంభవుం' డనుటచే దీనికవి యతిప్రాచీనుఁ డనుట స్పష్టము. "పెక్కువత్సరము లంతర్భూతమై" యనుటయు నీగ్రంథ మతనికి నూతనముగా దొరకిన దనియే కాక గ్రంథమతిప్రాచీన మనియుఁ దెలుపుచున్నది. ఇంక సకలకవితాప్రవర్తకుం డను విశేషణమును, బరిచ్ఛేదాంతములయందలి గద్యములలో నున్నసకలభాషావాగనుశాసనవిశేషణమును, మహాకవిత్వ మహాలాక్షణికత్వములను దెల్పుచుఁ బెక్కండ్ర యంగీకృతి ననుసరించి భారతకర్త యైన నన్నయభట్టునకే చెల్లుచున్నవి. మఱియు, శబ్దశాసనుం డనువిశేషణమునే విశేష్యముగా నుపయోగించి పైని జెప్పిన నన్నయభట్టునే యీపదముచేఁ బేర్కొనుటచేతను భారతములో నన్నయభట్టు తనకాపద ముపయోగించికొనుట చేతను, దానిని నన్నయభట్టునకుఁ దరువాతి కవులు గూడ విశేషణముగా నుపయోగించుట చేతను, పై విశేషణముల గణింపఁ దగినవాఁడు భారతకర్త యగునన్నయభట్టారకుఁడే కాక మఱియొకఁడు గాఁ డని స్పష్ట మగుచున్నది.

"సకలభాషావాగనుశాసనుం డనుబిరుదమే యతని కున్నయెడల నన్నిభాషలకును వ్యాకరణము చేసి యుండెనని చెప్పవలసి వచ్చును గదా! అట్లు చేసియుండక పోవుట స్పష్టము." అని యొకయాక్షేపణము కలదు. ఈపదప్రయోగమే యీపుస్తకము నన్నయభట్టవిరచితము గాక తదన్యకల్పిత మనుటకు నిదర్శన మంట! శబ్దశాసనబిరుదము వ్యాకరణరచనచేతఁగాక ప్రౌఢకవిత్వరచనచేతనే వచ్చిన దంట! ఆహా!! ఈయుక్తులఁ జూడుఁడు. నన్నయభట్టు రచియించిన యన్నివ్యాకరణములు గనఁబడుటలేదు కావున, నిది యన్యులు రచించినదే కాని, యతఁడు రచించినది కాదని కదా వాదము? సరియే! ఆయన్యుఁ డెవఁడో? అతఁడు మాత్రము సర్వభాషలలో వ్యాకరణము రచించినట్లు ప్రమాణము గలదా?

"అట్లు కాదు. ఎవఁడో రచియించి సకలభాషావాగనుశాసనబిరుద ముతో దానికర్తృత్వము నన్నయ కొసఁగెను గావునను, అతఁడు రచియించిన యెల్లవ్యాకరణములు లేవు గావునను దీనికర్త నన్నయ గాఁ" డని వాద మందురా ? సరియే ! బాలసరస్వతి, యవతారికలో నన్నయవిశేషణముగా సకల కవితాప్రవర్తకుం డను నొకవిశేషణ ముపయోగించెను. ఇతఁ డాక్షేపకులు సెప్పెడి యన్యులలో నగ్రగణ్యుఁడే. దానింబట్టి నన్నయభట్టు సర్వభాషలలోను గవిత్వము సెప్పినట్లు గానరాదు గావున భారతపర్వత్రయము నన్నయ తెనిఁగించినది గా దని చెప్పవలసివచ్చుఁ గదా ? మఱియు, సకలభాషావాగనుశాసనపదములోని సకల శబ్దమునకు "సర్వవిధ" యని యర్థముచెప్పినచో భారతములో నాశ్వాసాంత గద్యములలోఁ గానవచ్చు సకలసుకవిజనవినుతేత్యాది సమాసములోని సకలపదమునకు నట్లే యర్థము చెప్పవలసివచ్చును. అపుడు సర్వవిధభాషాకవులు నీతని స్తుతియించి నట్లెందును గానరాదు గావున నీగద్య మీతని కన్వయింపదు. ఈ కారణమున భారతమును నన్నయభట్టు తెలిఁగింపలే దని చెప్పవలసినదే గదా ! ఆహా ! ఏమి యాక్షేపసరణి ?

అట్లయిన సకలభాషాపదమున కర్థమే మని యందురా ? తెలియుచునే యున్నది. సకలపదము విశేషణము ; దీనికి సర్వము, సంపూర్ణము, అంతయు, అన్ని, అందఱు, అని మొదలుగా బహ్వర్థములు గలవు. అంతియ కాని, "యన్నివిధము లైన" యని యొకయర్థమే లేదు. 'సకలభాష' యనునపు, డంత భాషయందును, లేక భాష కంతకును నని యర్థము చెప్పికొనినచో నతనియాంధ్రభాషావాగనుశాసనత్వమును నిలిపినవార మగుదుము గదా ! అతనిసకలసుకవిజనవినుతత్వము నాంధ్రలోకమున సార్థక మగును గద ! బాలసరస్వతి చెప్పిన సకలకవితాప్రవర్తకత్వము గూడ నన్వర్థక మగును గదా ! భారతములోని విపుల శబ్దశాసన విశేషణము వన్నె కెక్కును గద ! ఆవిపులశబ్దమే యర్థసామ్యమున సకలశబ్దమై యర్థపుష్టినిఁ జెంద భాషాపదమును జేర్చికొన్నది. 'శబ్ద' శబ్దము 'వాక్' శబ్దముగా మాఱి 'శాసన' శబ్దమును జేరినది. కావున నన్నయ సకల భాషావాగనుశాసనబిరుదమునకు నతని విపులశబ్దశాసనబిరుదమే ప్రమాణము.

(ఇది యిప్పటి కొందఱవలె నతఁడే పెట్టుకొనెనో, యీబిరుద మెవరైన నిచ్చిరో తెలిసికొను నుపాయము లేదు.)

ఇట్లు చెప్పిన వచ్చెడిహాని యేమో తెలియరాదు. పోనిండు. ఒక్కమాట! బాలసరస్వతి దీనిని రచియింపకపోవుట నిక్కువ మని యిదివఱకే పలుతెఱంగుల విదిత మయ్యె. ఎవఁడో నన్నయ రచియించె ననుటకును, బూర్వోక్తవాదమే ప్రమాణము. ఆనన్నయ బాలసరస్వతి తాతతాత గాఁ డనియుఁ జదివియుంటిమి. ఇఁక, భారతకర్తయైన నన్నయభట్టును గాఁ డని కొందఱ వాదము గదా! సరి! ఈనన్నయకును, బాలసరస్వతికిని, మధ్యకాలములో నాంధ్రశబ్దచింతామణి రచి యించునంతటి మహాకవి, లాక్షణికుండు నైన యింకొకనన్నయ కనఁబడెనేని యీనన్నయ కాఁ డనుట మాకు నిష్టాపత్తియే! అంతవఱకు భారతకర్త యగు నన్నయభట్టారకుఁడే దీని కర్త యని విశ్వసింతము!

ఇఁక, "సుమ్మోతోహల్యధర్వణాచార్యమతాత్" అనుసూత్రము నప్ప కవి, శబ్దానుశాసనమూలసూత్రముగా నప్పకవీయమునఁ జూపె ననియు, నీ సూత్రము నన్నయభట్టీయములోనిదే యైనయెడల నన్నయభట్టారకునికంటె నధర్వ ణాచార్యుఁడే పూర్వుఁడు గావలసివచ్చు ననియు, నందుచే నీగ్రంథము భారతకర్త నన్నయ రచించినది గా దనియు, నిటీవలివా రెవరో యీవిప్రతిపత్తిఁ దొలఁగించు టకై మూలములోనుండి యీసూత్రమును దొలఁగించి రనియు నొకవాద మున్నది. దీనిం జిత్తగింపుఁడు.

మాకు దొరకిన సభాష్యాంధ్రశబ్దచింతామణిలో "హల్యధర్వణాచార్య మతాత్" అనువాక్యమే కానరాదు. ఈయప్పకవి పాఠము సమంజసముగ లే దని యహోబలపండితుఁడే నిరసించెను. ప్రాచీనముద్రిత ప్రతులలోఁగూడ నిది కానరాదు. పోనీ, అధర్వణుఁడు హల్లుపర మగునపుడు వచ్చు నని చెప్పెనేమో యనిచూతమన్న నధర్వణకారికలలో,

> "నరశేపరుషే చైవ సమాసే నుముతో భవేత్
> అద్రుతా త్సరళా దందు పట్టి కూర్చివిభక్తిషు
> తనేచ కుత్రచిదతో వికారా చ్చాపి కేచన
> అమిశ్ర స్త్రీసమాత్ కేచిత్ ప్రయోగశ్శరణంకవేః."

అని విషయవిభాగముఁ జేసి నుమాగమము విధించెను గాని, హల్మాత్రము పరమగునపుడు నుమాగమము వచ్చు నని చెప్పియుండలేదు. నిజముగ నధర్వణుఁ డట్లు చెప్పియుండినచో, "నీసూత్రము నిజముగ నన్నయభట్టీయములోనిదే,

యిటీవల నెవరో తొలఁగించియుందు" రని యూహింపవచ్చును గాని, యతని మతమే యిది గాదే! ఎందు లేకపోయిన నేమి యప్పకవి మాటయే ప్రమాణ మని యెట్లు చెప్పనగును ?

కానీ! అప్పకవి యిట్లు చెప్పుటకుఁ గత మేమో విచారింతము. అథర్వ ణుని పైసూత్రమునుబట్టి, పరుషసరళములు, అంద్వాది విభక్తులు, తనవర్ణకము మొదలగునవి, పరమగుచుండఁగా సుమాగమము వచ్చుటం గనిపెట్టి, పైగా, "ప్రయోగ శ్శరణం కవేః" అని యిచ్చిన యూఁతను జేపట్టి, తా నిచ్చిన యు దాహరణ మగు "అనుఁగున్వేలఁది" వంటిప్రయోగములను రాఁబట్ట, స్థిరవర్ణ ములు పరమగునపుడు గూడ సుమాగమము వచ్చుట తేసకిష్ట మగుటం బట్టి, యిదే యద నని యీపాఠము నథర్వణుని నెత్తిని బెట్టి, "హల్యథర్వణాచార్య మతాత్" అని తనగ్రంథమున నప్పకవి యొకసూత్రమును గల్పించికొని యుం డఁగా, నిటీవలి వా రెవరో తెలియక దాని మొదల "మూ. సూ." అని చేర్చి శబ్దానుశాసన మూలసూత్ర మని భ్రమింపఁజేసిరి గాని యిది నిజముగ నాంధ్ర శబ్దచింతామణి లోనిది గాదు. అందులకే యహోబలపండితుఁ డీసందర్భమున "అప్పకవి పుస్తకపాఠస్తు" అని చెప్పెను. ఇదియే పైపాఠ మొక్క-యప్పకవి పుస్తకమునఁ దక్క నింకెందును లే దని ప్రబలసాక్ష్య మిచ్చుచున్నది గదా! ఇంకను నీవిషయమునఁ జర్చ యేల ?

ఇం కొకఘట్ట మున్నది. దీనిం జూడుఁడు. ఆంధ్రశబ్దచింతామణిలో :—

1. అద్యః క్రియాసు భూతార్థద్యోతిన మాద్యగం వినా సర్వః.
2. సర్వత్రాజ్వతాఽర్యం జ్ఞేయం యస్య ద్రుతప్రకృతికేభ్యః.
3. నిత్య మను త్తమపురుషక్రియా స్వితః.

అనుసూత్రములు భారతప్రయోగములకు విరుద్ధములుగ నున్నవి గావున నీ గ్రం థము భారతకర్త నన్నయ రచించినది కాదు. అని యొక వాదము. అనఁగా— బదాదిని యకార మున్నట్లు పైరెంసుసూత్రములు చెప్పుచున్న వనియు, మూఁడ వది ప్రథమపురుష క్రియలయందలి యికారమునకుఁ గూడ నిత్యసంధి చెప్పుచున్న దనియు, నిట్టిప్రయోగములు నన్నయభారతములో లేవు గావున నీగ్రంథ మతనిది కా దనియును గదా యాక్షేపకుల యభిప్రాయము ? సరియ కాని యొక విన్న పము! ఇట్టిప్రయోగములు నన్నయకవిత్వమున లే వని యీగ్రంథ మతనిది గా

దంటిరి గదా? ఇట్టిప్రయోగములు బాలసరస్వతి కృతులలో మాత్రము కనఁబడిన వా యేమి దీని కర్తృత్వ మతని కారోపించుటకు? ఏదీ! పదాది యకారము గల ప్రయోగము బాలసరస్వతి కృతులలో నొకటి చూపుఁడు! సంతోషించి యూరకుందుము! ఎవనిపేరో పెట్టినవుడు తనకు నింద రా దని యిట్టిసూత్రములు సూత్రించె నని చెప్పుదురా! మంచిది. అతని కిట్టిప్రయోగముల నుపయోగించు నలవాటైన నుండవలదా యిట్టి యపార్థసూత్రములు కల్పించుటకు? ఏవో మఱుఁగుననున్న కృతులలో నున్న వనిన నెవ్వరు నమ్మరు గాని లోకవ్యాప్తినిఁ గాంచిన వానిలోఁ జిన్నదైన మల్లభూపాలీయములో నైనఁ దుద కొకప్రయోగము దొరకునా? ప్రతివాదమున కుపయోగింపదు కాని, మాకుఁ గనఁబడినంతలోఁ బ్రకృత మొకటి యున్నది. అది యుదాహరించెదము చూడుఁడు. బాలసరస్వతి యీభాష్యావతారికలోఁ దొలుతఁ జూపినపద్యములలో "అళియరామావనీశదత్త యెడవిల్లి ముఖ్యసద్గ్రామ." యని ప్రయోగించెను. ఇది యెర్రగుంట, యెర్రంపాలెము, యూనాం, యెల్లయ్య మొదలయినవానివలె సంజ్ఞావాచకము. కావున నిది యందుల కుదాహరణము గాఁజాలదు. వ్యవహారములో నున్నట్లే యవి ప్రయోగార్హములు. ఇంతకంటె నాకెందును యకారాదిపద ప్రయోగములు గానరాలేదు. అట్టియెడ నేపాపము నెఱుంగని బాలసరస్వతి, భైరవాన్వయమునఁ బుట్టి భైరవుఁ డైనందులకు, "పాపాలకెల్ల భైరవుఁ" డన్నట్లు దుష్టసూత్రము లున్న వని భ్రాంతిపడి, యిట్టిసూత్రములఁ జెప్పువాఁ డతఁడే యని, యీకర్తృత్వపాప మాతని నెత్తిపై దొర్లించుట న్యాయమా? పోనిండు! అతనిదనుక నెందులకు? దినమున కొకగ్రంథము వ్రాసి లోకమున కిచ్చుచున్న మహాకవులలో నొకఁడైనఁ బదాదియకారమును బ్రయోగించుచుండెనేమో చూడుఁడు! కాన సూత్రములు ప్రామాణిక ప్రయోగవిరుద్ధములుగ నున్న వనెడి భ్రాంతితో, వానికర్తృత్వమును నన్నయకుఁ దీసివేయుటయు, నక్కారణముననే బాలసరస్వతి కారోపించుటయుఁ దగదు.

కాని, "సరియే బాలసరస్వతి మూలకర్త గాఁడు; భారతకర్త నన్నయయే; మఱి యీసూత్రములకు సమన్వయ మెట్లు?" అని యడుగుదు రేని వినుండు! మధ్యవర్తులను మునుముందు విచారింతము!

ఈసూత్రములలో మొదటిదాని కర్థము వ్రాయుచు నహోబలపండితుఁడు తొలుతఁ బదాదిని యకారభ్రాంతి గలిగించునట్లు కనఁబడి, తుదకు "అత్రేయం

చింతా?" అని యెత్తి "వాఁడెవ్వఁ" డిత్యాదులయం దచ్చుయొక్కయంశము తోనే సంధి వినఁబడుటవలనను, డెనుఁగుశబ్దములమొదట నున్న యకార మితర శబ్ద సంబంధమువలన శ్రీకవిమతముచే నచ్చుమాత్రము మిగిలినది యగునని చెప్పుటవలనను, "ఎవ్వనివాకిట నిభమదపంకంబు" ఇత్యాదులయందు ఏకార ముతోనే, ఇకారమునకు వళి వైధ మగుటచేతను, బదాదియందు యకారాం శము విడువఁదగినదియే యని యాద్యయకారఖండన మొనరించుచు, శబ్దశాసను నకుఁ (నన్నయభట్టునకు) గూడ యకారాంశత్యాగ మిష్టమైన ట్లీక్రిందివిధముగఁ జెప్పెను:—

(అందఱకుఁ దెలియుటకై సంస్కృతవ్యాఖ్యను దెలిఁగించి పూర్వోత్తర సందర్భముల వివరించి యిందు వ్రాసితిమి.)

"శబ్దశాసనునకుఁ గూడ హలంశత్యాగ మనఁగా యకారాంశము విడు చుట యభిమతమే! ఏమనఁగా! 'లు గ్వా ద్రుతప్రకృతికాత్, అలుకిచ' అను సూత్రములచే యకారము పరమగునపుడు నకారమునకు లోపసంశ్లేషములు వచ్చుచుండఁగా, 'సర్వత్రాజ్వత్కార్యం' అనుసూత్రముచే యకారమున కచ్చ్వ మతిదేశించి, 'లు క్సంశ్లేషౌ నాచి' యనుసూత్రముచే నచ్చు పరమగునపుడు ద్రుతమునకు లోపసంశ్లేషములు లే వని నిర్వచించెను. ఈకార్యము యకార మునకుఁ గూడఁ దెచ్చిపెట్టుటచేతను యకారాంశము పోకుండ నది సిద్ధింప కుండుటచేతను యకారాంశము తప్పక పోఁదగినదియే. ఇందులకు వారలకెగ్గు చేసినఁ జెఱునిహాముంబరంబు "అనునది మొదలుగ శబ్దశాసనప్రయోగములే ప్రమాణము."

మఱియు వికృతివివేకకారుఁ డగు నథర్వణాచార్యునకుఁ గూడఁ బదాది యకార మిష్టము గాదని యీమతముఁ గ్రోడీకరించుచుఁ గడపటి "ఎవ్వఁడు" ఇత్యాదులయందు యకారాదిత్వము పండితహృదయంగమము గాదని సిద్ధాం తీకరించెను.

అప్పకవి యీసూత్రసారమును జక్కఁగఁ దెలిసికొని పూర్వపక్షసిద్ధాంత ములు లేకయే "ఆంధ్రోక్తి మొదల నాద్యంతస్థముండదు; ప్రాణమై యది కనుపట్టుఁ గాని." యని విస్పష్టముగఁ జెప్పె.

మాకు దొరకినప్రతి యపండితుఁడు వ్రాయుటచే నందందుఁ గొన్నిసంద ర్భోచితము లైనమాటలు గూడఁ బోయినట్లు కనఁబడుచున్నది గాని యున్న

దానిని బట్టి చూచిన నింకను బాలసరస్వతియే "అద్యః క్రియాను" అనుసూత్రము నొద్దఁ బదాదిని యకార ముండ దని విస్పష్టముగఁ జెప్పక, కలదని యుదాహరణము నీయక, "సర్వత్రాజ్వత్కార్యం" అను సూత్రమునొద్ద, "కలిగెనెమ్మె" నని యుదాహరించి కొంత పూర్వపక్ష మెత్తి "ఓయీ! యత్వము రాఁ జెప్ప నేల? అజ్వత్కార్యము వచ్చునన నేల? ఆదియందు యకారము లేదనినఁ జాలదా! యనినఁ జాలదు, ప్రయోజనాంతరము లేకున్న నుచ్చారణవిరోధ మగు చున్నది గనుక యకార మెకారము కానేరదు." అని చెప్పె, ఇందుఁ బూర్వపక్ష సిద్ధాంతములు సంగ్రహింపఁబడి వ్రాయఁబడినట్లు తోఁచుచున్నది గాని యున్న దానిని బట్టి చూచినను "ఒకప్పు డచ్చుకంటెఁ బరమైనపుడు గల్గినయకార మట్లే యుండునని భ్రాంతికల్గు నని దానిని నిరసించుటకో, లేక, యందట్టి యత్వవిధాయకసూత్రము గనఁబడదు గాని హల్లుకంటెఁ బర మయినపుడు గూడ నాహల్లున కచ్చుతో సంబంధమే కాని, సంధి వేఱుగా లేకపోవుటచే సంధిలేనియెడ యత్వము వచ్చు ననెడిభ్రాంతి గల్గునని దానిని నిరసించుటకో, మొత్తముమీఁద నెట్లయిన సాధ్యమయిన యత్వమును నిరాకరించుటకే యిట్లు సమన్వయించినట్లు కనఁబడుచున్నది. ఏమయిన నీవ్యాఖ్యానక్లేశము గూడఁ శబ్దాదిని యత్వ ముండ దని యెఱింగి యట్లు పదాదియకారపదములు ప్రయోగింపకయున్న యితఁడు తానే యిట్టి సూత్రములు రచించి యిట్లు వ్యాఖ్యానముఁ జేసికొనుటకు శ్రమపడి యుండఁ డని మాత్రము తెలుపకపోదు.

నన్నయమాత్ర మెఱుఁగఁడా? ఇట్టి సందిగ్ధసూత్రములు రచియించునా? యని తలంపవచ్చును, కాని యాతని బహుభావగర్భితములైన యీసూత్రముల కర్థము వ్రాయుటలో వ్యాఖ్యాతలు పడిన యాయాసమే కాక, యతని మతమునఁ బదాదియందు యకారము గలదనెడి సంశయమే యెంతమాత్రము గలుగ వలసిన పనిలేదు. పై సూత్రములకు సంధివశమున వచ్చెడి యకారమే యర్థ మయినట్లు పూర్వోక్తవ్యాఖ్యాతలే సాక్షులు.

కావునఁ బూర్వోక్తవ్యాఖ్యాతల నిర్ణయమును బట్టియు, విశేషించి శబ్దశాసనమతముం దెల్పిన యహోబలపండితుని సాక్ష్యముం బట్టియు, వివాదగ్రస్తుఁడయిన బాలసరస్వతి వాఖ్యానమునుం బట్టియు, లోకమున నెక్కడ నట్టి సుకవిప్రయోగములు లేకుండుటంబట్టియుఁ గూడఁ బదాదిని యకార ముండ దనుట విస్పష్టము.

ఇఁక, "నిత్య మనుత్తమపురుషక్రియా స్వితః" అనుసూత్రములోని యనుత్తమపురుషేత్యాది పదమునకుఁ దిజ్మధ్యమపురుషక్రియ యర్థ మని పూర్వులే నిర్ణయించిరి. ప్రథమపురుషక్రియలకు భారతమునందును బాలసరస్వతి గ్రంథములయందును వైకల్పిక ప్రయోగములు కానంబడుచునే యున్నవి. కావున వారిరువురిలో నొక్కఁడు నిట్టిప్రయోగముల కిష్టపడువాఁడు గాఁ డని తెలియుచుండుటచేఁ బూర్వోక్తసూత్రార్థనిర్ణయమున సంశయమె యక్కఱ లేదు.

ఇఁక నీసూత్రము లాధారముగ బయలువెడలిన యాంధ్రశబ్దచింతామణి కర్తృత్వవివాద మెట్లునిలుచునో చూడుఁడు. ఈ వివాదము నన్నయవ్యాకరణకర్త కాఁ డనుటకుఁ జాలదు. మిగిలినయవి యిదివఱకే నిరస్తము లయినవి. కావున నాక్షేపకుల యాక్షేపములు పరిహారించుటతో నిప్పటి కాంధ్రశబ్దచింతామణి కర్తృత్వము బాలసరస్వతికిఁ గాని యన్యునికిఁ గాని కాక భారతకర్తయగు నన్నయభట్టారకునకే చెల్లు నని యానందింతముగాక ! ఆ నన్నయవ్యాకరణమునకు బాలసరస్వతి భాష్యము వ్రాసియున్నాఁ డనియు నది ముద్రితము కా లే దనియు, ముద్రితమైనది యతనిది కా దనియు, నతనిది మా కిపుడు నూతనముగా దొరకినదే యనియు, నూతనానందముఁ జెందుదము గాక ! ఇంకను మూలమూలలఁ బడియున్న యుత్తమకవికృతులు తల లెత్తుఁగాక యని జగదీశ్వరునిఁ బ్రార్థింతముగాక!

ఈ బాలసరస్వతీయభాష్య మిపుడైన వ్యాప్తిని జెందుఁగాక, సత్యము జయ మొందుఁగాక!

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.
రాళ్ళపల్లి గోపాలకృష్ణశర్మ.

## గ్రంథవిమర్శనము.

# ఆంధ్రీకృతలఘుకౌముది.

---

### ప్రథమభాగము.

ఉభయభాషాకోవిదులును, విద్వత్కవులు నగు (యశఃకాయు లైన) శొంఠి భద్రాద్రిరామశాస్త్రిుల వారిచే రచింపఁబడిన యీగ్రంథము వారికుమారుఁడు గంగాధరరామమూర్తిగారిచేఁ బ్రకటింపఁబడినది. ఇందు సంజ్ఞాప్రకరణము, సంధిప్రకరణము, శబ్దాధికారప్రకరణము, తిజంతప్రకరణము నను విషయములు గలవు. తక్కిన ప్రకరణములుగూడ ద్వితీయభాగముగఁ బ్రకటింపఁబడునఁట. ప్రతిసూత్రమునకుఁ బదచ్ఛేదసహితముగా నర్థము, తాత్పర్యము, అన్వయక్రమము మొదలగునవి స్పష్టముగాఁ దెలియునటులు తేటతెనుఁగుమాటలతో వివరింపఁబడినవి. వలసినచోట్ల నుదాహరణములుకూడఁ జూపఁబడినవి. కొంతవఱకు సంస్కృతభాషాజ్ఞానముకూడఁ గలిగినఁగాని తెలుఁగున నిర్దుష్టముగా గ్రంథరచన చేయ నలవికాదు. గురుకులవాసము చేసి సమగ్రముగాఁ బాండిత్యము సంపాదించుట కందఱకు నవకాశము కలుగదు. ఒకపాటిసాహిత్య ముండి గురువులేకయే సంస్కృతభాషాపాండిత్యము స్థూలరూపముగాఁ దెలిసికొనఁ గోరువా రనేకు లుందురు. అట్టివారి కీగ్రంథము మిక్కిలి యుపయోగించు ననుటకు సందేహము లేదు. గ్రంథము కృష్ణామండలములోని నిడదవోలులో నున్న శొంఠి గంగాధర రామమూర్తిగారియొద్ద దొరకును. వెల రు. ౧-౦-౦

పత్రికాధిపతి.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితగ్రంథములు.

## (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడియాళ్వారుచరిత్రము. కవిత్రయము లోని యెఱ్ఱాప్రెగడ "చిన్నిమనుమఁ" డగు చెదలవాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వ గ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁ దగినది. వైజయంతివిలాసముకన్న మిన్న. ౯ అశ్వాసములు ౭౮ పుటలు. సవిమర్శమైన ౧౮ పుటల పీఠిక. వెల రు ౦ - ౮ - ౦

## (2) ఆంధ్రవచనజైమినిభారతము.

రెండునంవలసంవత్సరముల క్రిందట మధురాపురీశ్వరుం డగు విజయరంగచొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుఁడు నయిన సముఖము వేంకటకృష్ణప్పనాయఁకునిచే రచియింపఁబడినది. భాష సలక్షణము, శైలి మనోహరము, ధారయనర్గళము. ఆంధ్రభాషాపరిచయు లందఱు ముఖ్యముగాఁ జదువవలసినది. 328 పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను పీఠికలు గలవు. వెల రు ౦ - ౧౨ - ౦

పరిషత్సభ్యుల కీగ్రంథములు సగము వెలకే యీఁబడును.

తపాలావ్యయములు కొనువారే భరింపవలయును.

## (3) కవిజనాశ్రయము.

కొలఁది దినములలో సిద్ధమగును.

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, 12 అరుణాచల నాయక వీథి, చింతాద్రిపేట, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

# ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల.

## నిడదవోలు, కృష్ణాజిల్లా.

### ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

నిడదవోలు, కృష్ణాజిల్లా

ఇందు రెండుమాసముల కొకనవలచొప్పున వెలువడుచుండును. డెమ్మిసైజున నూఱుపేజీల కారణాలచొప్పున పోస్టేజిమేమేభరించి చందాదారులకును, పోస్టేజిగాక యితరులకు 0-8 0లు చొప్పున నిచ్చెదము. ఎన్నివందల పేజీలనవలయైన ఒకరూపాయికి మించియుండదు. ప్రవేశరుసుముగా 0 2-0లు ఈయవలయును అన్నియు క్యాలికోబయిండుగల చక్కనినవలలు

### వెలువడిన నవలలు

| | చందాదారులకు. | | ఇతరులకు | |
|---|---|---|---|---|
| * దుర్గేశనందని | 0 | 12 | 1 | 0 |
| * వసుమతీవసంతము | 1 | 0 | 1 | |
| లలితచంద్రహాసము | 0 | 10 | 0 | 14 |
| * మృణ్మయి | 1 | 0 | 1 | |
| * సీతారామ | 1 | 0 | 1 | |
| * నూర్జహాను | 1 | 0 | 1 | |
| రాజసింహ | 1 | 0 | 1 | |
| మాధవీలత | 1 | 0 | 1 | |
| మృణాలిని | 1 | 0 | 1 | |
| మనోరమ | 1 | 0 | 1 | |
| దురదృష్టవంతులు | 1 | 0 | 1 | |
| విషవృక్షము | 1 | 0 | 1 | |
| ప్రమదావనము | 1 | 0 | 1 | |
| వంగవిజేత | 1 | 0 | 1 | |
| నౌకాభంగము | 1 | 0 | 1 | |
| నవాబునందిని | 1 | 0 | 1 | |
| దృఢప్రతిజ్ఞ | | 0 | 1 | |

* ఈగ్రంథములైదును, హైస్కూల్లలోని 4, 5, 6, ఫారములకు పఠనగ్రంథములు (Text Books)గా, టెక్స్టుబుక్కు కమిటీవారిచే నామోదింపబడినవి

**N. B.** వసుమతీవసంతము 1916 సంవత్సరము పరీక్షకుఇంటరుమీడియేటు క్లాసునకు టెక్స్టుబుక్కుగా యూనివర్సిటీవారిచే నిర్ణయింపబడినది.

### అనుబంధ గ్రంథమాల.

అతిమనోహరంబులును, రసవంతములును, నీతిదాయకములును నగుచిన్ని చిన్నినవలలను ముద్రించి మా యాంధ్రప్రచారిణీ గ్రంథమాలిక కనుబంధములుగాఁ బ్రకటించుచున్నాము. ఈ నవలలన్నిటిని జనసామాన్యమునకంతకు నందుబాటుగానుండునట్లు స్వల్పమూల్యమునకుఁ బంపుచున్నాము. ఇందును మాచందాదారుల కితరులకిచ్చువెలకంటె తగ్గించి యిచ్చుచున్నాము.

| | | చందాదారులకు. | | ఇతరులకు, | |
|---|---|---|---|---|---|
| | | అ. | ప. | అ. | ప. |
| రాధారాణి | ... | 4 | 0 | 4 | 0 |
| యుగళాంగుళీయకము | ... | 3 | 0 | 3 | 0 |
| రాజభక్తి | ... | 2 | 0 | 3 | 0 |
| లీల | ... | 3 | 0 | 4 | 0 |
| సాధవ | ... | 5 | 0 | 7 | 0 |
| ఇందిర | ... | 3 | 0 | 4 | 0 |
| హారావళి | ... | 3 | 0 | 4 | 0 |
| ప్రభావతి | ... | 2 | 0 | 3 | 0 |
| మాలతి | ... | 1 | | 2 | 0 |
| కమలాకాంతుఁడు | ... | 1 | | 2 | 0 |
| పరిమళ | ... | 6 | 0 | 8 | 0 |
| రజని | ... | 6 | 0 | 8 | 0 |
| నీరద | ... | 5 | 0 | 7 | 0 |
| సీతావనవాసము | ... | 5 | 0 | 7 | 0 |
| ఉన్మాదిని | ... | 3 | 0 | 4 | 0 |
| సంతాపకుఁడు | ... | 4 | 0 | 5 | 0 |
| ఆరణ్యిక | ... | 6 | 0 | 8 | 0 |
| వియోగిని | ... | 3 | 0 | 4 | 0 |
| కృష్ణకాంతునిమరణ శాసనము. | | 6 | 0 | 8 | 0 |
| అమృతపులినము | ... | 6 | 0 | 8 | 0 |
| వ్యాఘ్రాచార్య బృహల్లాంగూలము. | | | 0 | 2 | 0 |
| ఉన్మత్త | . | | 0 | 2 | 6 |
| చంద్రసేనుఁడు | . | | 0 | 4 | 0 |

# ఆంధ్రసాహిత్యపరిషత్తు, చెన్నపురి.

ప్రతిష్ఠాపకులు :—

శ్రీపీఠాపురసంస్థానాధీశ్వరులగు శ్రీరాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు.

శ్రీవేంకటగిరిరాజాగారగు మహారాజా సర్ - వెలుగోటి శ్రీరాజగోపాల కృష్ణయాచేంద్రబహద్దరుగారు, జి. సి. ఐ. ఇ., పంచహజారీమన్సబ్దార్.

అగ్రాసనాధిపతి :—

రా॥ పానుగంటి రామారాయణింగారు, ఎం.ఏ.

కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

మ-రా-రా-శ్రీ జయంతి రామయ్యపంతులుగారు, బి.ఏ., బి.ఎల్.

కార్యదర్శులు.

మ-రా-రా-శ్రీ పురాణం నాగభూషణంపంతులుగారు, ఎం.ఏ., బి.ఎల్.
„ ఆచంట లక్ష్మీపతిగారు, బి.ఏ., ఎం.బి., సి.ఎమ్.
„ నెమలి పట్టాభిరామారావు పంతులుగారు, బి.ఏ.

కోశాధ్యక్షులు (ట్రస్టీలు)

దివాన్ బహదూర్ కంచి కృష్ణస్వామిరావుగారు, సి. ఐ. ఇ.
రావుబహదూర్ పిట్టి త్యాగరాయ సెట్టిగారు, బి.ఏ.

కార్యస్థానము.

12 అరుణాచలనాయక వీధి, చింతాద్రిపేట.

పరిషదుద్దేశము :—ఆంధ్రభాషయందలి సంస్కృతపదములకు నిఘంటువు రచించుట, తెలుఁగుభాష కితరభాషలతోఁగల సంబంధమును దెలుపు భాషాశాస్త్రమును రచించుట. ఆంధ్రదేశపూర్వచరిత్రమును ప్రమాణపూర్వకముగా నిర్ణయించుట, ఆధునిక శాస్త్రపారిభాషికపదముల నిర్ణయించుట, నూతనగ్రంథరచనకై సాహాయ్యము చేయుట, భాషావిషయములఁ జర్చించుటకుఁ బత్రిక నొకదానిని ప్రకటించుట, సమగ్రమగు నాంధ్రకోశమును రచించుట, ఇత్యాది విధముల నాంధ్రవాఙ్మయాభివృద్ధికై యత్నించుట, పరిషత్తున కుద్దేశములు.

చందానిర్ణయము.

| | | |
|---|---|---|
| 1. | ఉద్ధారకులకు | రు. 5000. |
| 2. | పోషకులకు | „ 1000. |
| 3. | యావజ్జీవసభ్యులకు | „ 100. |
| 4. | సాధారణసభ్యులకు సంవత్సరమునకు | „ 6. |

పరిషత్సభ్యులు పత్రికను వేఱుగాఁ జందా నియ్యనక్కఱలేదు
సభ్యులు కాఁగోరువారు కార్యదర్శుల కుత్తరము వ్రాసి పరిషన్నిబంధనలఁ దెప్పించుకొనవచ్చును.

శ్రీనివాస వరదాచారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి చెన్నపురి 12 అరుణాచల
నాయకవీధి, చింతాద్రిపేట, ఆంధ్రసాహిత్యపరిషత్తు [illegible]

చందా సం॥ కు రూ. 3—0—0.　　　　విడిసంచిక రూ. 0—5—0

సంపుటము 5.　　నళనామసంవత్సరము. భాద్రపదము, ఆశ్వయుజము.　　సంచిక. 6, 7.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రిక.

ప్రతిమాసమున గడపటివారములోఁ ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి.

# విషయసూచిక.

గీ. అని మఱియు జాతవిశ్వాస యైనసీత, కనిలజుఁడు వాలివధముసూర్యజుని చెలిమి
నొసఁగి వాల్మీకిమునిసూక్తి వస్తుని గలిత, రామనామాంక మగునుంగరం బొసంగె.

క. మరుదాత్మజసీతశ్రీ, కరరఘురామాంగుళీయకలితోత్సవవా
సరశతతమాంశమునకు, న్సరియే సీతావివాహసంభ్రమదినముల్. 60

క. క్షిత్యాత్మజాత యంతట, నత్యంతప్రమద యగుచు నసురేంద్రునకుం
బ్రత్యాసన్నం బయ్యెను, మృత్యువు హనుమంత! యని మఱియు ని ట్లనియెన్.

చ. అనల యనంగఁ బేరు గనినట్టి విభీషణపుత్రి తల్లిపం
పునఁ జనుదెంచి రావణుఁడు పోనొనరించియ కాని యూరకే
యినకులసార్వభౌమునకు నీయఁడు నిన్నని పల్కె నేనునుం
దనువును మాసమాత్రమును దాల్చెదఁ బ్రాణముల న్విరాళి నై. 62

క. నావుడు మారుతి యి ట్లను, దేవీ! వెఱవకుము నిన్ను ధృతిఁ దోడ్కొని నే
నీవార్ధిఁ గడచి దక్షతఁ, బోవుదు రఘుపతిసమీపమునకు న్వేగన్. 63

గీ. అని మహామేదినీధరంబునకు సాటి, యైన దేహాభివృద్ధిచే నతిశయిల్లు
నపుడు గాంభీర్యవిస్తారహారి యైన, జలధి యెలదోఁటకాలువచంద మొందె. 64

ఉ. అంతట సంతసం బొదవ నాహనుమంతునిఁ జూచి రామసీ
మంతిని పల్కె లంఘితమహాంబుధి వై తగునీకు దుష్కరం
బింతయు లేదు పెంపున వహించి ననుం జనువేళ నంబర
ప్రాంతరయానలీల ననపాయిని నీకు నుపాయపారగా. 65

వ. మఱియును. 66

శా. పాతివ్రత్యము వాసిచే దశముఖున్ భస్మంబు గావించినన్
ఖ్యాతైక్ష్వాకుశరాళికి న్సముచితగ్రాసంబు సంధిల్లఁబో
దే తత్కీర్తినిశాకరుండును విభాహీనుం డగుం గావునన్
దైతేయు న్రఘునేత గూల్చినతఱి న్నా రాక యుక్తం బగున్. 67

వ. అని సమాఖ్యాతవినయవచనజాత యగుసీతం గనుంగొని శ్రీరామదూత
యి ట్లనియె. 68

ఉ. ఓమిథిలాపురాధిపకులోదధిచంద్రకళా! వనోర్వి మా
యామృగవంచితాత్మకత నాశరగేహమునందు నీవు శా
ఖామృగనీత వై యిపుడు కన్పడిన న్దివసేశ్వరాన్వయ
గ్రామణికార్ముకంబులకుఁ గల్గునె కీర్తి యొకింతయు న్భువిన్. 69

సీ. అది యటులుండని మ్మవనికన్యామణి రఘువీరగృహిణి కర్హ్మంబు లీదృ
శాచారమునకును సదృశంబు పంక్తిముఖాపరాధతక్రియ కనుగుణంబు
కులకాంతయీాలువునకును ననుకూలంబు క్షత్రియాణ్యుక్తికి సముచితంబు
నగు నట్లు పలికితి వనుచుఁ బ్రశంసించి యంజనానందనుం డనియె మఱియు
గీ. రామలక్ష్మణు లీదైత్యరాజధానిఁ, జేరినా రని యెంచుమీా చిత్తమునను
రాఘవజ్ఞాతపూర్వకశ్లాఘనీయ, మగు నభిజ్ఞాన మిచ్చి న న్ననుపు మిపుడు. 70

— * హనుమంతునితో సీత ప్రత్యభిజ్ఞానంబు దెల్పుట. * —

వ. అనుటయు నజ్జనకరాజనందన నిట్టూర్పు నిగిడించి యి ట్లనియె నోయసాధా
రణమేధానిధానా! సావధానంబుగా నాకర్ణింపుము. మున్ను సమున్నతానేక
మాణిక్యచాకచక్య ప్రకటతటనిరాఘాటం బగుచిత్రకూటనికటంబున సముల్ల
సత్పల్లవాంతరసంఫుల్లకుసుమసందోహస్యందమాన మకరందధారాస్వాదనిర్భ
రానందతుందిలమిలిందబృంద ఝుంకారహుంకారితసంక్రందనోద్యానవైభవం
బగువనంబున, రఘునందనోపధానీకృతోత్సంగ యగు నాసముత్తుంగపయో
ధరపరిసరంబు ప్రఖరనఖరముఖవిదారితం బొనరించిన ధారాధరనామకాకంబు
నైత్వాకుం డాలోకించి. 71

చ. సమధికరోషయుక్తవిలసత్కుశరూపకుశేశయాననా
స్త్రము వడి నేసె దుర్మదపురందరనందనవాయసంబు పై
దమితమదంబు నై యదియుఁ దత్కృపచేత హృతాక్షిమాత్ర మై
క్షమఁ జిరజీవి నాఁదనరుసంజ్ఞ వహించె యథార్థ మై తగన్. 72

క. అని పూర్వకథాస్మరణం,బున ద్విగుణితదుర్దశానమున్నతి యై యి
త్తు నభిజ్ఞానాంతర మను,చును హనుమంతున కొసంగెఁ జూడామణియున్. 73

మ. మతి నెంతేఁ బ్రమదంబు సంధిల మణిం బౌలస్త్యసంత్రాసపుం
జితయాగాగ్నిదళం గృశాంగి యగు రాజీవాక్షి యీాయం బ్రణ
మ్రతచేఁ గైకొని యంజనాతనయుఁడు న్మాణిక్యగర్భానవాం
చితభోగిప్రతిమానబాహుఁ డగుచుం జెందెం బ్రయాణత్వరన్. 74

క. కృతకృత్యుం డయ్యె విని, ర్గతుఁ డై తనరాక దశముఖజ్ఞాతము గా
మతిఁ దలఁచి పావని గుణా,ద్భుతుం డశోకవనభంగముం గావించెన్. 75

సీ. తనదుకృత్యములచేఁదగు భూరిశాఖల కవనతిసంధాత యగుటవలన
మఱిసుమనఃకదంబకముల కెల్లను ముఖభంగ మొనరించి పోలుచువలన

శ్రుతిమధురోక్తిసంగతసద్ద్విజాలికి నతిభీతినిర్ఘాత యగుటకతన
చారణమార్గసంచారక్రియాధురంధరత నుద్దాముఁ డై తగుటవలన
గీ. నముచిదానవరిపుదూతనందనుం డు,దారలంకాపురాంతరోద్యానమునను
బూనిపసౌఖ్యసారాధిపానుజన్ము, పటుతరాటోపలీలను బరిభవించె. 76

— * హనుమంతుఁ డశోకవనభంగ మొనర్చుట. * —

సీ. అంత సత్వరముగా నారక్షకమహోగ్ర రక్షోనివేదితప్రమదవనవి
భంజనజాతకోపవశారుణాలోకభీకరదశముఖప్రేషితులును
గాలకింకరభయంకరులు ప్రహస్తకుమారవిశ్రుతజంబుమాలిసహితు
లై యరుదెంచిన యాతుధానులఁ ద్రుంచి చైత్యతోరణసదేశంబునొందె
గీ. మారుతాత్మజుఁ డామాట మఱియు విని ని,శాచరానీకమారణశ్రవణకుపిత
పంక్తిముఖుఁ డావలీముఖుఁ బట్టి తెండ,టంచు వడిఁబంచెఁ బంచసేనాగ్రగులను.
క. వీరులను సప్తమంత్రికు,మారులనుం బనుప సమరమత్తాశయుఁ డై
తోరణపరిఘముచేత స,మీరణనందనుఁడు వారి నెల్లం గెడపెన్. 78
క. వెండియుఁ బవనతనూజుఁ డ,తం డురువడి కోసలేంద్రదాసుఁడ ననుచుం
జండత నని ఘోషింపఁగ, భండనమున కక్షుఁ బనిచెఁ బౌలస్త్యుండున్. 79
శా. వక్షశ్చూర్ణితహేమభిత్తి భృశదీవ్యచ్చైత్రధూళిం బగ
ల్నక్షత్రాధ్వను నెట్టిసేయుచు నఖేలద్వీరలక్ష్మీకుఁ డై
రక్షశ్శారములన్ క్షమాఫలకనిర్వర్ణంబులం జల్పఁగా
నక్షక్రీడ యొనర్చె వాయుజుఁడు లంకాళిందభాగంబునన్. 80
చ. అమరవిరోధియోధుల మహాకుపితాత్మకుల న్నిమేషమా
త్రమున వధించి పంక్తిరథరాజతనూజునిదూత గీతవి
క్రముఁ డలచైత్యసౌధమునకంబముఁ జేకొని తద్భవాగ్ని హ
ర్మ్యమును దహించి తోరణసమాశ్రయుఁ డయ్యె యథాపురోద్ధతిన్. 81
క. ఏవంవిధవృత్తాంతము, దా విని కుపితాత్ముఁ డైన దశకంధరుఁ డెం
తే వింశతివీక్షణముల, దేవాధిపజేతఁ జూచి ధీరతఁ బలికెన్. 82
క. భువినిం దివినిఁ బురందర, భవనంబున నైన సమరపరు నిను వీక్షిం
ప వలంతి యెవ్వఁ డిచటికిఁ, బ్లవగంబును దెమ్మటంచుఁ బనిచె న్నుతునిన్. 83
ఉ. సౌరవిరోధిసేనకును సంహృతి, బెట్టగురోదనంబు ర
క్షోరమణీగణంబునకు, శోకము రాక్షసనేత, కర్కజ

ఘోరసఖాన వాప్య యగులంకకు నగ్నివిశుద్ధి, సేయఁగాఁ
బోరణమందు వాయుజునితో రణ మయ్యె సురేంద్రజేతకున్. 84

శా. ధారాపాతశరాభిఘాతనిరవద్యస్ఫూర్తికం బౌమహో
దారాస్కందనదుర్దినాంతరమున స్పర్ధించెఁ దన్మేఘనా
దారంభంబున గంధవాహతనయుం డత్యంతము న్మేఘనా
దారంభంబున నుల్లసిల్లెడు భుజంగాహారిచాదంబునన్. 85

శా. హుంకారోద్ధతుఁ డై నిజాస్త్రచయమై యర్థ్యంబు సంధించు ని
శ్శంకాతంకజయేందిరాసఖుని రక్షశ్శిక్షకు న్మారుతిన్
లంకాధీశ్వరనందనుండు విజయాలంకార ధౌరేయుఁ డై
పంకేజోద్భవసాయకోత్తమమునన్ బంధించె నాలంబునన్. 86

గీ. అమ్మహాగ్రచతుర్వదనాస్త్రమునను, బరవశశరీరుఁ డై యున్న ప్లవగవరుని
గట్టిశణవల్కలంబులఁ గట్టివైచి, రేచి యామవతీచరనీచు లకట. 87

ఉ. ఆసమయంబున న్సమదయామవతీచరపాశకౢప్త మా
వాసవదూతసూనుదృఢబంధము బంధవిమోక్షహేతు వై
భాసిలె ము న్బలస్త్యకులపాంసనుఁ డుద్ధతచిత్తవృత్తిఁ గా
రాసదనంబుఁ దార్చిన సురప్రమదాజనకోటి కెంతయున్. 88

క. చతురాననాస్త్రబంధ,చ్యుతుఁ డయ్యును నితరబంధయుతుఁ డగు నమ్మా
రుతిమహిమఁ దెలిసి రావణి, ద్రుతముగ నిజజనకుసభకుఁ దోడ్కొనిపోయెన్.

వ. అయ్యెడ. 90

మ. కనియె న్మారుతసూతి పంక్తిముఖునిం గాలారిలీలాద్రితో
లనఖేలాపటుతాపరీక్షితబలాలంకారబాహుం దపో
ఘను బందీకృతనిర్జరేంద్రనగరీగాణిక్యహస్తారవిం
దనటచ్చామరమారుతాంకురచలన్మంజూత్తరీయాంశుకున్. 91

మ. పురుహూతాదిభయంకరాజికలనప్రోత్సాహ నిర్భగ్నస
త్వరమగ్నామరదంతిదంతకృతముద్రాడంబరక్రోడభీ
కరు ఛాయాత్మకవిభ్రమప్రతితరంగభ్రాజమానక్షపా
కరబింబౌఘనసాధశైవలినికాకాంతోపమానాకృతిన్. 92

మ. ఘననిశ్శ్రేయసమార్గరోధన మొగిం గావింప మూర్తీభవిం
చినలోకత్రయపాపరాశికరణిం జెన్నొందుగర్వాంధునిన్

దిననాథేందుకృశానుతేజములను న్నిర్జించి యంచత్తపం
బున సాక్షాదభిషిక్త మైనతిమిరంబుం బోలు దుశ్శీలునిన్. 93

మ. తరుణాపాటలపల్లవాధరపుటాంతస్ఫారదంష్ట్రామహా
గరిమవ్యాపనశాతఘోరతరజాగ్రద్విగ్రహాభు న్మనో
హరసంధ్యాసమయాంబుదాంతరితమధ్యాబ్జాతరేఖాధురం
ధరసంక్రందననీలశైలము గతిన్ రాజిల్లులంకేశ్వరున్. 94

ఉ. అంత దశాననుండును మహాబలనందనుఁ జూచి విస్మయా
క్రాంతహృదంతరుం డగుచు రాజతభూమిధరప్రకంపనా
సంతతమంతు వేగమున శౌప మొసంగినయట్టినంది ని
శ్చింతత నిట్టిరూపమునఁ జెంతకు వచ్చె నటంచు నెంచుచున్. 95

క. తనసమ్ముఖమున నిలిచిన, యనుయోగవిధిప్రశస్తుఁ డైనప్రహస్తుం
గనుఁగొని యి ట్లనియె ఘనా, ఘనరసితవిజృంభమాణగంభీరోక్తిన్. 96

ఉ. ఎక్కడనుండి వచ్చె నిపు డిక్కపి యెవ్వఁడు పంచినాఁడు తా
నిక్కడ కేగుదెంచుటకు నెయ్యది కార్య మభిఖ్య యెద్ది యో
నిక్కముగాఁగఁ దెల్పు మని నీ వనుయోగ మొనర్పు మన్న నా
రక్కసిఁ జూచి యి ట్లనియె రాఘవదూత యభీతచిత్తుఁ డై. 97

—— * హనుమంతుఁడు రావణునితోఁ బ్రసంగించుట * ——

వ. లంకాపురాధిపా ! యనహంకారుఁడ వై మదాగమనకారణం బాకర్ణింపుము, త్రిలోకదీపకుం డగుశోకబాంధవునియన్వయం బనుమహాపాదన్వంతంబునకుఁ బార్వికశర్వరీకరుండును సాతత్యసత్యసంధానుబంధబంధురుండును, బితృనియోగసముపనతవనవాసలీలానిరతశీలుండును, బ్రచండశూర్పకారాతిబాధితశూర్పణఖాప్రాప్తవైరూప్యకుపృత్తరప్రముఖనిశిచరబలపలాలజాలకల్పాంతానలకల్పశిలీముఖుండును, గపటహరిణహననసమయపరిముషితదారాన్వేషణసంజాతసమగ్రసుగ్రీవసఖ్యుండును సముత్ఖాతవాలికంటకుండును దుర్వృత్తశత్రువంశవనపవనసారథియు నగుదాశరథిదూతను, సీతాన్వేషణంబునకుం బ్రతిదిశంబును దపనతనయప్రేషితు లగువానరులయం దేనొకండ, గంభీరలవణాంభోరాశిలంఘనజంఘాలుండ నై భవదీయనగరప్రమదవనసీమంబున రామస్వామిధర్మదారావలోకనంబుఁ గావించి నమస్కరించి కృతకృత్యుండ నై పునః ప్రయాణావసరంబున భవద్దర్శనకుతూహలి నై నారాక నీకుఁ దెల్పుటకుఁ బ్రమ

థితాశోకవనికా నోకహనివహుండను, సమనుభూతనైరృతలూతాతంతుసహ
నుండను నై దురాపం బగునీసమీపంబునకు వచ్చితి నని మఱియును. 98

చ. ఒఱపగులోకవంద్య గుణయూథము రామనృపావరోధముం
జిర మిచట న్నిరోధమును జేసి విరోధము గొంటి వోరి చే
టెఱుఁగనికూన! నీతిగుణహీన! వితానవితర్దిజాత మా
కరువలినెచ్చెలిం బటినిఁ గట్టఁగ యత్నముచేసి తక్కటా. 99

చ. అని మొన లక్ష్మణాస్త్రహతనై పసు నీమెయిపైఁ బలాశ డా
సినఖగమండలిన్ గొఱుగు సేయకు మింక భవన్నిమిత్తమై
యనఘుపులస్త్యవంశలయ మయ్యెడునప్పుడు త్వత్పురంధ్రిదృ
గ్వనజగళన్నవాపము నివాపజలం బొనరింపఁబోకుమీ. 100

మ. పరదారైకపరిగ్రహాదరమతిం బాటించు నీవాఃభా
కరవంశోత్తముభార్యఁ దెచ్చుటయె దుష్కార్యం బనార్యాశయా!
మరుదాహారి నటంచుఁ గుండలి గరుత్మత్తుండనిశ్వాసని
ర్భరవాయుస్స్పృహయాలుతాలుయుగధుర్యం బైనచందంబునన్. 101

క. వైళమ భుజచందనధా, రాశ్లేషధికోటరాంతరచ్యుతరామా
భీభాశుగజిహ్మగ మింక, వాలాయము నీదుప్రాణవాయువుఁ గ్రోలున్. 102

చ. సరభసశాంబరీమృగము సంగరనాటకసూత్రధారత
న్నెరపఁగ శాఖికామృగము నీ కరయం బ్రతికూలవాతమై
పరఁగఁగ వీక్షితోద్యమత భాసిలురాముజగాలకోరికిన్
సరయగతిప్రణామకవచంబు వినా కవచంబు గల్గునే. 103

చ. అని తను జీరికింగొనక యాడినవాయుజుఁ జంపుఁ డంచుఁ గో
పనుఁ డయి యానతిచ్చె భటపంక్తికిఁ బంక్తిముఖుండు నప్పు డా
జననవిశుద్ధుఁ డైనమతిశాలి విభీషణుఁ డగ్రజన్మునిం
గనుఁగొని దూతమారణ మకార్య మటంచును మాన్చె నంతటన్. 104

సీ. శర్వరీచరలోకసార్వభౌముఁడు దురూహ మొనర్చి కపిసమూహమున కెల్ల
నంగకంబులయందు లాంగూల మెంతయు ముఖ్యంబు గావున మున్ను దానిఁ
గార్పాసవాసోనికాయవేష్టితముఁ గావించి పావకశిఖాసంచయప్ర
దీపితం బొనరించి యీపురంబునవీథి వీథులందును దోషవితతి నుగ్గ

గీ. డింపుచును సంప్రహారపారంపరీక, ముగను ద్రిప్పుడు మీరని మూర్ఖయాతు
ధానులకు సెల విచ్చిన నాన్యశంస, చరితులును నట్ల చేసిరి సరభసముగ. 105

గీ. నిర్ణయాగోచరంబును గర్ణికార, వర్ణరుచిరంబు నైనతద్వాలకీలి
నిర్ణిమేషులభాగ్య మున్మేషశాలి, యగుటఁ బూర్ణశిఖోదీర్ణ మయ్యె నవుడు. 106

— * లంకాపుర దహనము. * —

క. అగచరుకుర్దశ కావలి, మగువలు వినిపింప దూయమానాత్మిక యై
జగతీసుత ప్రార్థించెం, దగఁ శీతో భవ హనూమత" యటంచు శిఖిన్. 107

శా. వాలిప్రాణహరప్రియాఘనతపోవహ్నీంధనత్వంబు నే
వాలాయంబుగఁ బొందఁజాల ననుచున్ వైశ్వానరుం డత్తరిన్
వేలాతీతసుజాతశీతలగుణావిర్భాతి వాతాత్మభూ
వాలాగ్రంబున రత్నదీపముగతిన్ వర్తిల్లెఁ జిత్రంబుగన్. 108

ఉ. రాతిరి యీదశాస్యునగరంబు ప్రకాశము గాఁగఁ జూడలే
దీతఁడె నగ్నిసాక్షిగ రహిం గనుఁగొందు నటంచు దైత్యసం
ఘాతములెల్లఁ దోరణలగత్పరిఘంబున సంహరించి సీ
తాతరుణీమనోహరునిదాసుఁడు దుస్సహదోర్విలాసుఁ డై. 109

ఉ. భూవనితాసు తేందిరను బూషకులేంద్రుని కీఁదలంచి లం
కావనధిం బరిక్షుభితగాఢబలోర్మిభయంకరంబు నెం
తే వనజోద్భవుండు మథియించెను రజ్జుభుజంగరాజభో
గావృతగంధవాహతనయాహ్వయమందరభూధరంబుచేన్. 110

మ. దనుజస్త్రైణముఖారవిందరజనిన్ ధాత్రీమయూరీఘనా
ఘనవేలానదృశి న్దశాననయశఃకాదంబకాదంబినిన్
ఘనవైధవ్యదశార్హవేషవిధిలంకాస్త్రీజట న్నామమో
హనకుం దత్త్రిజటానమం బఱపె ధూమ్యం గీశుఁ డారా దివిన్. 111

ఉ. ఇట్టులు పావమాని మెఱయించినశౌర్యముఁ జూచి కన్నులం
దొట్టెడుహర్షబాష్పములతోన బుధుల్ దనుజేంద్రభీతి ను
ద్ఘట్టితులౌట మాటుకొన దానినెపంబయి పర్వె ధూమ్య యి
ప్పట్టున హా దివంబునకు భానుజ జాల్కొనె నంచు నెంచఁగన్. 112

చ. గురుజఘనంబునం దసితకోమలశాటి కటీతటంబున
న్మరకతబద్ధనీవి కుచమండలిఁ గస్తురి గ్రీవ నుత్పలో

తత్తరసరము న్గనుంగవను గాటుక యయ్యె దిశాంగనాళికిన్
ధరణిధరారివై రిపురదాహసముద్భవధూమ్య యత్తరిన్. 113

మ. అతివేగంబున లంక కాలెడునెడన్ హాతాత హామాత హా
సుత హాబాంధవ హామనోదయిత హాసుస్నిగ్ధ మీరెందుఁ బో
యితిరో నేను హతుండనైతి నని భూయిష్ఠంబుగాఁ బౌరసం
తతినానాపరిదేవనోక్తులఁ బరీతం బయ్యె నల్దిక్కులున్. 114

చ. వఱలు సురీముఖాళికి నివాళి యనీరద మైననింగికిన్
మెఱపులభంగి యంబుధికి మిక్కిలి బాడబ మయ్యె నెద్ది యా
గురుతరవాలకీలి మిణుఁగుర్లు గనుంగొన నద్భుతంబులై
హరహర వర్తిలె న్దిశిచతురాహము లాఱక ఘోరకాంతులన్. 115

ఉ. ఆరయ దీప్యమానపవనాత్మజవాలమునంగతిన్ స్మహాం
గారసమూహశేష మగుకర్బురరాజపురంబుఁ జూచి బృం
దారకవైరు లంబరపథంబుననుండి సృజించి రశ్రువుల్
జోరన నాత్మగేహములఁ జొప్పడ నార్చు తెఱంగు దోఁపఁగన్. 116

చ. శతమఖవైరియాజ్ఞ నని సల్పినకృత్యము దైత్యరాణ్ణియో
జితులయి యుండియుం గడఁగి చేయ నిశాటు లశక్తులైరి య
ద్భుత మిది మారుతిప్రథితభూరికృశానుఁడు లంకఁ గాల్చె నే
గతి మఱి యిట్లు తత్పితృసఖత్వము నొందియుఁ గాల్ప లేఁడుగా. 117

శా. ఆహనుమన్మహారణిభవానలునందుఁ బ్రణీతశుద్ధి యై
యాహవరంగవిక్రమవిహారకుతూహలిదైత్యుఁ డుల్లస
ద్బాహుబలంబునం దొడరి పట్టిన నిర్జరరాజలక్ష్మి స
స్నేహతచే నిజాధిపునిఁ జేరుటకుం దగ నిచ్చయింపఁగన్. 118

క. ఏల యిఁక వేయుమాట, ల్వేల న్స్వభుజాగ్రగుప్త లంకాపురము
న్వాలిరిపుదూత చేరెను, గాలునిదూతయు సుఖంబుగాఁ జేరుటకున్. 119

చ. మలినదశాస్యపాతకిసమాగమసంభ్రమజాయమాన మా
కలుషము నెల్ల శోధితము గా నొనరింపఁ దలంచి యామహా
బలసుతయజ్వ యక్షజయపండితుఁడై నిజవాలవహ్నిలో
నలఘుగతిం బలాశసమిదావళి హోమము సేసి భాసిలెన్. 120



# స్త్రీవాచకము- ఇతరేతరయోగద్వంద్వము.

2-8-1916 తేదిని "దేశమాత" లో ముద్రిత మైనయితరేతరయోగ ద్వంద్వవిషయక మైనట్టియు, స్త్రీవాచకవిషయక మైనట్టియు, ద్వితీయప్రత్యభియోగ మనుశీర్షిక గలవ్యాసమును బాఠకులు చూచియుందురు. ఆవ్యాసము 2-2-1916 తేదిని "దేశమాత" లో ముద్రిత మగుస్త్రీవాచకవిషయకవ్యాసమునకు శేష మని వ్రాయఁబడి యుండుటచే నీరెంటికిని నేకకర్తృత్వము సిద్ధించుచున్నది.

భాషావాఙ్మయవిషయక విమర్శనములు భాషావాఙ్మయ పరిపోషకములనుట నిర్వివాదాంశమే. కాని వ్యర్థముగా నం దాగ్రహముఁ దెచ్చికొని యతిప్రసంగము చేయుట యుభయపక్షములవారికిని దగనికృత్యము. ఈవిషయమునె, నేను నావెనుకటివ్యాసమున విన్నవించుకొని యుంటిని గాని ప్రతిపక్షు లేమాత్రమును విచారింపక యెప్పటియాగ్రహావేశముతోడనే యారెండవవ్యాసమును నయితము వ్రాయ సాహసించిరి. ప్రతిపక్షులు పలుమాఱును నన్ను సంస్కృత వ్యాకరణగ్రంథ మాఘ్రాణింపలే దనియు, నొక్కతెలుంగుననె ములింగితి ననియు నిరసించుచున్నారు. తెనుఁగువిషయమునకుఁ గల నాయోగ్యత వీరి హృదయమున నాటినట్లు సంస్కృతవిషయమునందును నాటించుటకుఁ గాను నప్రకృతమగుసంస్కృతవిషయము నెక్కింపఁజాలను గదా. ఇంతకును, వా రేమనుకొన్న నేమి? ఉభయులవ్యాసములను నిష్పక్షపాతబుద్ధితోఁ దిలకించిన సహృదయు లుభయులవిషయమున నిట్టియంశములను నిర్ణయింపఁగలరు.

"దృశ్యాదృశ్యజ్ఞానులు నిజంబుగా గ్రంథకర్త ద్వంద్వార్థంబు దెలియంజాలకయే పొరపడియుండవచ్చు నని శాస్త్రులవారిమనోరథమున కనుకూలముగ సంశయించుచున్నందున" అని ప్రతిపక్షులు వ్రాసిరి. వీనినిబట్టి చూడఁగా వీరి వాదము నచ్చుటఁ గొందఱు నిష్పక్షపాతులు మన్నింపకున్నట్లు తేలుచున్నది.

ఈరీతిని మార్దవముమీఱి ప్రసంగించువారి ప్రసంగముల కుత్తర మిచ్చుట సరికాదు గాని వారు స్త్రీవాచక విషయమున వ్రాసినయంశములకు సమాధా

నము వ్రాయకున్నచో స్థూలదృష్టిని జూచువారికిఁ బ్రతిపక్షులప్రమాదమును, నావాదమందలి న్యాయమును స్ఫురింపకపోవు నేమో యని వానికి ముందుగ సమాధాన మీయఁ దలఁచితిని. వీరియితరేతరయోగద్వంద్వవిషయకవ్యాసమును జూచినవా రెల్ల దానికి సమాధాన మిచ్చుట యావశ్యక మని తలంప రని నానమ్మకము. అయినను నెట్లును వ్రాయుచునే యుంటిని గదా యని దానియందలివిషయములకును నుత్తర మిచ్చుచున్నాను.

— * స్త్రీవాచకము. * —

స్త్రీలింగ మనుపదమునకు స్త్రీవాచక మని పర్యాయపదముగా వ్యాఖ్యానము వ్రాయుట ప్రామాదిక మనియు నాంధ్రవైయాకరణు లెల్లఁ బారిభాషికస్త్రీత్వవిశిష్టపదార్థవాచకములవిషయమున స్త్రీలింగపదమును, మహతీవాచకముల విషయమున స్త్రీవాచకపదమును నియమముగా వాడుటయేగాక స్త్రీవాచకపదము పారిభాషికస్త్రీత్వవిశిష్టపదార్థవాచకము కాదని స్పష్టముగా నహోబలపతి చెప్పె ననియు సోదాహరణముగా నేను వ్రాసియుంటిని.

స్త్రీవాచకపదమునకు రెండర్థములును గల వనియు, దానిని యథోపయోగముగా నం దేయర్థమునం దైన వాడవచ్చు ననియు, నది నియమముగా స్త్రీవ్యక్తివాచకముగనే వాడవలయు ననునియమము లే దనియు, వ్రాయుచు స్త్రీవాచకపదమును స్త్రీలింగపదమునకుఁ బర్యాయముగా నహోబలపతి వాడియున్నాఁ డని కొన్నియుదాహరణములను జూపిరి. ప్రతిపక్షు లుదాహరించిన స్థలద్వయమును నేనీవఱకుఁ జూచియుండకపోలేదు. లేనిపోని యపసిద్ధాంతము లెదుటివారు చేయుదు రనియుఁ, బ్రతిపక్షులు తమకు బాధించుపంక్తుల నుదాహరింపక దాఁచివేయుదు రనియుఁ దలంచుచు నూరక లేనిపోని పూర్వపక్షములను మాప్రతిపక్షులవలెనే పెంచి వ్రాసి చదువరులను బీడింపనేల యనియు, నొకవేళ ప్రతిపక్షు లట్లపమార్గమునఁ బడినపుడు సవినయముగ మరలించుట యుచిత మనియుఁ, దలఁచి వానిని నావెనుకటి స్త్రీవాచకవ్యాసమున నుదాహరించి చర్చింపనైతిని. పోనిండు. ఈమూలమున నైన మాప్రతిపక్షులు కొంతకాల మానందించిరి.

“ అమహతా మితి సామాన్యనిర్దేశేఽపి నస్త్రీవాచకా దమహన్నామ్నో ఽయం ప్రత్యయః, ... ... ” (అహో. పే. 279) ఇత్యాదులందు స్త్రీవాచకశబ్దము స్త్రీలింగపర్యాయము గాక మహతీవాచకమే యర్థమయ్యె నేని

'కాంత' ఇత్యాదులందే సులోపము గలిగి 'గంగ, విద్య' ఇత్యాదులందు సులోపంబు రాక ముపర్ణకాపత్తి వచ్చును." అని ప్రతిపక్షులు చర్చించియున్నారు.

పైస్థలమునందును స్త్రీవాచకశబ్దము మహతీవాచకపరముగానే వాడఁబడినది. మహతీవాచకములను గూర్చి చెప్పుటయే యచ్చట ప్రసక్తమై యున్నది. పైయహోబలపతివాక్యము "స్యాదమహతాం విభక్తౌ సోశ్చము" అనునాంధ్రశబ్దచింతామణి సూత్రవ్యాఖ్యానములోనిదై యున్నది. అమహత్తులకు ముపర్ణకమును విధించుచున్న యీసూత్రమున నమహత్తులకుఁ గ్రమముగా నుదాహరణముల నిచ్చుట యుచితము గదా. అమహత్తులలో స్త్రీవాచకమే మొట్టమొదట నుపస్థిత మగు నని విశదపడుటకై యిచ్చట నమహల్లక్షణము నుదాహరించుచున్నాఁడను.

"స్త్రీ పశు జడా స్త్వినాఽన్యే మహదాఖ్యాః" (అహో. పే. 243) అను సూత్రమున స్త్రీపశుజడేతరములకు మహత్త్వముఁ జెప్పఁబడినది. కాఁగా స్త్రీపశుజడముల కమహత్త్వము సిద్ధించుచున్నది. వృషభవృక్షాది శబ్దవిషయమున నావశ్యకము లగుపశుజడ శబ్దములచేతనే మహతీతర స్త్రీలింగము లగునజావిద్యాదిశబ్దములు సంగ్రహింపఁబడుటచేఁ బరిశిష్టము లగుమహతీవాచకములే "స్త్రీపశుజడాః" అనుద్వంద్వములోని "స్త్రీ" అనుదానిచే గ్రహింపవలసియున్నది. కావుననే "స్త్రీపశుజడాః" అనుదానికి "స్త్రీపశుజడవాచకా యే శబ్దాః తాః" అని యహోబలపతి వ్యాఖ్యానము చేసియున్నాఁడు. అట్లే దాని తరువాతి సూత్రము వ్యాఖ్యయందును "స్త్రీపశుజడవాచకానాం శబ్దానాం" అని నియమముగా స్త్రీవాచకశబ్దమునందే తాత్పర్యమును జూపియున్నాఁడు. కాఁగా స్త్రీవాచకములును (మహతీవాచకములు) పశువాచకములును జడవాచకములును నమహత్తు లని పైసూత్రమువలన విశదమైనది.

కావున నమహత్తులకు విధించిన ముపర్ణకమున కుదాహరించుటలో స్త్రీవాచకములు ప్రథమోపస్థితము లగును. కాఁబట్టియే యట్టి స్త్రీవాచకములనే మొట్టమొదట నుద్దేశించి వానికి ముపర్ణకము వచ్చునా? రాదా? యని శంకించికొని ముపర్ణకము వానికి రా దని చెప్పెను. అమహల్లక్షణములో నున్నపశుజడవాచకములకు వృషభవృక్షాద్యుదాహరణాంతరము లుండుటచే గంగావిద్యాదిశబ్దముల నిచ్చుట నెత్తుకొనుట కంతయావశ్యకత లేదు. స్త్రీలింగప్రథమైకవచనలోపమునకుఁ బ్రత్యేకముగా "అనుతాం స్త్రియాం సమానాం సర్వస్య స్త్రీ

సమస్యచ సులోపః” అనుసూత్ర ముండుటచే వాని నిచ్చట వ్యాఖ్యాత యెత్త నంతమాత్రమున వాని సులోపమునకు భంగము రానేరదు. మఱియు నీసందర్భ మున నహోబలపతి వ్రాసిన “అనుతాం స్త్రియాం సమానా మితిసూత్రేణ సోఽల్లోపే తత్ స్థానిక మువర్ణకసంబంధవిశిష్టస్య మో ర్దూరాపాస్తత్వాత్ తతోఽ యం తద్వ్యతిరిక్తేభ్య ఏవ నామభ్య ఇతినిర్ణయః” అను వాక్యముచే “అను తాం” అనుసూత్రమున ననుదంతము లగు స్త్రీలింగములకెల్ల సులోపము గలిగి ముప్రత్యయము గల్గ దని విశద మగుచుండఁగా విద్యాది స్త్రీలింగములకు మా త్రము మువర్ణకప్రాప్తి గల్గునని యెట్లు స్ఫురించునో తెలియకున్నది.

స్త్రీవాచకశబ్దమునకుఁ బారిభాషిక స్త్రీలింగ మనియు మహతీవాచక మనియు రెండర్థములును గలవనియు, యథోపయోగముగా నట్టియర్థద్వయము నందును వాడుకొనవచ్చు ననియు, నహోబలపతికి సమ్మతమైనప్పుడు “స్త్రీవాచ కత్వేఽపి స్త్రీలింగత్వాభావాత్ దారాదిభ్యో మువర్ణకఏవ” (అహో. 346) అని యిట్లు దారశబ్దము స్త్రీవాచక మయినను స్త్రీలింగము గా దని యాయహో బల పండితుఁ డెట్లు చెప్పఁగలిగియుండును. ఇట్లే “అస్త్రియా మి త్యథర్వణ వచనే స్త్రీవాచకవ్యతిరిక్తానా ముదంతానా మితి వ్యాఖ్యానా న్నతన్వాదిభ్యో వువర్ణక వికల్పో విరుద్ధః” అని యిట్లు తన్వాది స్త్రీలింగశబ్దములు స్త్రీవాచకములు కావని యెట్లు చెప్పఁగల్గియుండును. మనకు సమన్వయించుకొను నేర్పులేక గ్రంథ కర్తకుఁ బరస్పరవైరుధ్యమును గల్పించుట యుచితమా ?

“వికృతౌచ స్త్రీలింగాః స్త్రీలింగకసర్వనామధేయాస్స్యుః” అనుసూత్ర మునకు “వికృతౌచ యే స్త్రీవాచకాశ్శబ్దాః తే సర్వే స్త్రీలింగకవిశేషణ విశే ష్యాభిధాయినస్స్యుః” అని యనుపపత్త్యంతరమున స్త్రీలింగశబ్దమునకు స్త్రీ వాచకపరముగా వివరణము వ్రాయఁబడె నని గ్రహింపఁజాలక యది పర్యాయ పద మని యభిప్రాయపడుట వింతగొలుపుచున్నది. అట్టి వివరణవాక్యమున కవ్యవహితోత్తరవాక్య మగు “అత్రేయంచింతా” అను మొదలగు ననుపపత్తి ప్రతిపాదకవాక్యమునైనఁ జూడకుండుట కేమికారణమో తెలియరాకున్నది.

పైసూత్రములో నున్న స్త్రీలింగశబ్దములు రెండిటిలోను మొదటిదానికి యథాశ్రుతముగ వచ్చుపారిభాషికలింగపర మైనయర్థము చెప్పిన, సూత్రమునకు వైయర్థ్యము సంభవించును. కావున నట్టియనుపపత్తిని వారించుకొనుటకై దా నికి మాత్రము మహతీవాచకపర్యాయ మగు స్త్రీవాచకపదముతో వివరణము

చేయఁబడెను. ఈవిషయము నచ్చటనే యహోబాలపతి స్పష్టముగ నుద్ఘోషించియున్నాఁడు. అయ్యది మాప్రతిపక్షు లడఁచివేసిరి. ఈసందర్భమున నాంధ్రశబ్దచింతామణియందు మూఁడుసూత్రములు గలవు. వానికి యథాశ్రుతముగ వచ్చునర్థమును మొదటఁ జూపి యందలియనుపపత్తిని విశదపఱుచుచున్నాఁడను.

1. "వికృతౌచ స్త్రీలింగాః స్త్రీలింగక సర్వనామధేయాస్స్యుః" (టీక) స్త్రీలింగవిశేషణములు స్త్రీలింగములు గలవే యగును. ఉ. సీత భక్తవత్సల.

2. "ఉభయవిధమమహతీనాం" (టీక) మహతీతర స్త్రీలింగవిశేషణములు స్త్రీలింగవిశేషణములు గలవియు నస్త్రీలింగవిశేషణములు గలవియును నగును. చంద్రిక మనోహర, మనోహరము.

3. "నియతస్త్రీప్రత్యయస్తు సర్వాసాం" (టీక) సమస్తములయిన సాంస్కృత స్త్రీలింగశబ్దములకును "టాప్" "ఙీప్" మొదలగు స్త్రీప్రత్యయములు నియతముగా వచ్చును. ఉ. సీత భక్తవత్సల.

పైవానిలో మొదటిసూత్రమునకును మూఁడవసూత్రమునకును భేద మేమియు లేనందున మొదటిసూత్రము వ్యర్థ మగుచున్నది. అట్టి వైయర్థ్యమును మాన్పుకొనుటకయి యహోబాలపతి పైసూత్రమునందలి మొదటి స్త్రీలింగపదమునకు సంప్రదాయసిద్ధ మగుపారిభాషికలింగార్థమును విడుచుకొని యాశబ్దమునకు మహతీవాచకపర్యాయ మగు స్త్రీవాచకపదమని వివరణమును జేసెను. అప్పుడు పౌనరుక్త్యము తప్పిపోయి "పంటచెలిపట్టి లోకైకభద్రచరిత" అను మొదలగు కవిప్రయోగములు మాత్రము సంగ్రహింపఁబడు నని యభిప్రాయపడెను. ఈవిషయము చదువరులకు విశదపడుటకయి యాసూత్రమును దానికహోబాలపతి చేసిన వ్యాఖ్యానమును నిచ్చట వ్రాయుచున్నాఁడను.

"వికృతౌ చ స్త్రీలింగాః స్త్రీలింగకసర్వనామధేయాస్స్యుః" వ్యా "వికృతౌచ యే స్త్రీవాచకా శ్శబ్దాః తేసర్వే స్త్రీలింగకవిశేషణవిశేష్యాభిధాయినస్స్యుః అత్రేయం చింతా సూత్రస్యాస్య "సీతభక్తవత్సల" ఇత్యాదౌ నతాత్పర్యం నియతస్త్రీప్రత్యయస్తు సర్వాసా మి త్యనుశాసనాత్ స్త్రీప్రత్యయాంతస్యైవ ప్రాప్తేః, ఏకదేశవికృత మనన్యవ ద్భవతీతి న్యాయేన స్త్రీచవాచకత్వ (ఇచ్చట స్త్రీ 'వాచకత్వమ్మ'నినచో 'మహతీవాచకత్వం' అని యర్థము వచ్చుననుభీతి చేతనే గదా గ్రంథకర్త 'స్త్రీ' వాచకత్వం అని ప్రయోగించినాఁడు, ఇచ్చట

పారిభాషిక స్త్రీలింగత్వం' అని చెప్పవలసియున్న దనుట నిర్వివాదాంశము గదా. నిష్పక్షపాతబుద్ధితోఁ బరికించినచో నిది యొకటియే చాలును స్త్రీవాచకశబ్దమునకుఁ బారిభాషిక స్త్రీత్వ మనునర్థము లేదనియు మహతీవాచకత్వమే రూఢమనియును విశదపఱచుటకు) మవ్యాహతమే వేతి తద్విధానస్యా నావశ్యకత్వాత్ కింతు పంటచెలిపట్టి లోకైకభద్రచరిత" ఇత్యాదా తాత్పర్య మవధార్య తే" (అహో 317 పే).

పైసూత్రమునందలి మొదటి స్త్రీలింగశబ్దమునకు సంప్రదాయసిద్ధముగ వచ్చుపారిభాషికలింగార్థమును జేసినచో "సీత భక్తవత్సల" అనునది యుదాహరణ మగును. కాని యది "నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసాం" అనుసూత్రము చేతనే సిద్ధించును. కావున నీసూత్రమునకు "సీత భక్తవత్సల" అనుదాని నుదాహరణముగఁ గొనుట సరికాదు. కాఁబట్టి యీసూత్రములోని మొదటి స్త్రీలింగశబ్దమునకు మహతీవాచకములందుఁ దాత్పర్య మని గ్రహించినచోఁ బౌనరుక్త్యము తప్పిపోవును. "పంటచెలిపట్టి లోకైకభద్రచరిత" అనుమొదలగు కవిప్రయోగము లుదాహరణము లగును? అనుతాత్పర్యముతో సామాన్యార్థబోధక మగు స్త్రీలింగపదమునకు విశేషార్థపరత్వమును స్పష్టపఱచుటకయి మహతీవాచకపర్యాయ మగు స్త్రీవాచకపదముతో వివరణము వ్రాయఁబడెను" అని పయివ్యాఖ్యానమునకుఁ దాత్పర్య మయి యున్నది.

అట్టిస్థితిలో నీసూత్రమును స్వపక్షసాధకముగాఁ బ్రతిపక్షు లుదాహరించుట పరిహాసనీయము.

ఇఁక గుప్తార్థప్రకాశికాకారులును బాలవ్యాకరణములోని స్త్రీలింగ సూత్రమునందలి స్త్రీలింగపదమునకుఁ బయిరీతినే స్త్రీవాచకపదముతో వివరణము చేసి రనరాదా యని యందురేమో ? అట్లనుట కెంతమాత్రమును నవకాశము లేదు. స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు (బాల. తత్స. 57 సూ) అను వివాదస్థసూత్రములోని స్త్రీలింగపదమునకు విశేషార్థపరముగా వివరణము చేయుట కాంధ్రశబ్దచింతామణి సూత్రమునందలి వైయర్థ్యాపత్తివంటి బీజ మేమియు లేదు. ఫలమును లేదు. మఱియు విద్యాదిశబ్దములకుఁ బ్రథమైకవచన లోపము రానియనర్థమును సంభవించును.

"నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసాం" "వ్యా" "సర్వేషాం స్త్రీలింగ శబ్దానాం సంస్కృతభాషానుశాసనే య ష్టాబాదిప్రత్యయః సోఽత్రాపి నియత

స్యాత్ ” (అహో 320 వే) సంస్కృత స్త్రీలింగములకును (పారిభాషిక స్త్రీలింగ ములకును) వానివిశేషణములకును స్త్రీప్రత్యయములు సంస్కృతభాషయందే సిద్ధించు ననియు నవియె తెలుఁగున గ్రహింపఁబడు ననియుఁ బయిసూత్రమునకుఁ దాత్పర్యము. కావున “సీత భక్తవత్సల” అనుస్థలమందలి విశేషణవిశేష్య ములు రెండింటికిని “శరచ్చంద్రిక మనోహర” అనుస్థలమునందలి విశేషణ విశేష్యములు రెండింటికిని స్త్రీలింగరూపములు “నియత స్త్రీప్రత్యయస్తు సర్వా సాం” అనుపయిసూత్రమున సిద్ధించుచున్నవి. వానిలో “శరచ్చంద్రిక” అను దానికి విశేషణ మగు“మనోహర” శబ్దమునకు, నస్త్రీలింగరూపమునైతము కవి ప్రయోగసిద్ధమయి యుండుటచే నట్టిరూపము సూత్రమె “ఉభయవిధమమహ తీనాం” అనుసూత్రముచే సిద్ధించుచున్న దని తాత్పర్యము. ఈసూత్రపు వాఖ్యానమున నీయభిప్రాయమే “స్త్రీలింగవిశేషణస్య ప్రాప్తత్వా దస్త్రీలింగ విశేషవిధానమేవ తాత్పర్యమ్” అని యహోబలపతి స్పష్టపఱచియున్నాఁడు.

పయివాక్యములోని “ప్రాప్తత్వాత్” అనుభూతార్థకక్తాంతంబును బట్టి కావలయును బ్రతిపక్షులు, దీనికిఁ బూర్వసూత్ర మగు “వికృతౌచ స్త్రీలింగాః” అనుసూత్రమున నీవఱలోనే ప్రాప్తించిన దనియపార్థమును జేసిరి. అచట, నుత్తరసూత్ర మగు “నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్” అనుసూత్రముచేతనే ప్రాప్తించిన దని యర్థము చెప్పవలసియున్నది. వ్యాఖ్యానకాలమునకు మూల సూత్రము లన్నియు సిద్ధములె గనుక మూలములోని యుత్తరసూత్రముచే సిద్ధిం చిన దనునర్థము నిచ్చు వ్యాఖ్యానపంక్తిలో భూతార్థప్రయోగము విరోధింపదు. “సీత భక్తవత్సల” అనుస్థలమునందలి పారిభాషిక స్త్రీలింగ విశేషణరూపము “వికృతౌచ స్త్రీలింగాః” అనుదానికుదాహరణము కాదనియు, నది, “నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్” అనుదానికి లక్ష్య మనియు, “సూత్రస్యాస్య సీత భక్తవత్సల ఇత్యాదౌ న తాత్పర్యం. నియత స్త్రీప్రత్యయస్తు సర్వాసామ్ ఇత్యనుశాసనాత్.” అనుమొదలగు పంక్తులతో నహోబలపతి స్పష్టపఱచి యుండఁగా దత్సమానస్థల మగు “శరచ్చంద్రిక మనోహర” అనుచో నున్న పారిభాషిక స్త్రీలింగవిశేషణరూపము మాత్రము “వికృతౌ చ స్త్రీలింగాః అను దాని కుదాహరణ మని యహోబలపతి వాక్యమున కర్థముచెప్పుటకు మాప్రతిపక్షు లెట్లుసాహసించిరో తెలియకున్నది. ఇంచుకంతైన బూర్వోత్తర సందర్భమును జూచుకొన నక్కఱ లేదా ?

పైకారణములచే “60 సూ. ‘ఉభయవిధమమహతీనాం” అనువ్యాఖ్య యందు ‘స్త్రీలింగవిశేషణస్య ప్రాప్తత్వాత్, అస్త్రీలింగవిశేషణసవిధాన ఏవ తాత్పర్యం” (అహోబా-తీయము) అర్థము. అప్రాణివాచకములయి స్త్రీలింగము లయిన యమహత్తులకును స్త్రీలింగవిశేషణము, (ఈవఱలోనే) ప్రాప్తించు చున్నందున స్త్రీలింగముగాని విశేషణమును విధించుటయం దీసూత్రము చెల్లు ననిన తాత్పర్యమును నహోబాబలపండితులు వివరించిరి.” “59 సూత్రమున స్త్రీలింగశబ్దమునకు స్త్రీవాచకము లని వివరించుటంజేసి యప్రాణివాచకము లగు నీ స్త్రీలింగామహత్తులు ప్రతివాదులమతమందు స్త్రీవాచకములు కానందున “విక్రుతౌచ” అనుపూర్వసూత్రంబున నిట స్త్రీలింగవిశేషణము వారిమతమునఁ బ్రాప్తింపనేరదు గదా? ప్రతివాదులమతంబున అక్క, అమ్మ, ఇత్యాదులే స్త్రీ వాచకంబు లగుంగాన నట్టివానికే పూర్వసూత్రమున స్త్రీత్వము విధింపఁబడఁగాఁ బ్రకృతంబైన యమహతీవిశేషణంబులకు నట్టివిధి చెల్లనందున (60) సూత్ర వ్యాఖ్యానమున స్త్రీలింగవిశేషణ మేసూత్రమునఁ బ్రాప్తించు నని వ్యాఖ్యాత యారీతిని వ్రాసెనో చెప్పవలసినభారము ప్రతివాదులశిరంబుననే యొరగుచున్న యది” అను మొదలగు ప్రతివాదుల యాక్షేపణము లసంగతము లని విశద మగు చున్నది గదా.

ఇట్లె యీసందర్భమున వేఱొకచోటఁ గూడ మాప్రతిపక్షులు గాభరా పడి యథార్థమును గ్రహింపలేకపోయిరి. చిత్తగింపుఁడు (61) “నియత స్త్రీ ప్రత్యయస్తు సర్వాసామ్” అనుసూత్రపువ్యాఖ్యయందు “సరస్వత్యాతు, మిన్నేఱు శివజటావాసిని? ఇత్యుదాహృతమ్” తత్ర నకేవలం స్త్రీసమత్వం కింతు స్త్రీవాచకత్వమ ప్యవ్యాహత మేవేతి తద్రూప మపి సాధ్వేవ. “ధరాపరాగపటలా క్రాంతంబు మిన్నేఱు ఇతి రూపం తూభయేతి సూత్రేణ సమంజస మితి జ్ఞేయం” అని వ్రాయఁబడినది. అనఁగా మిన్నేఱు శబ్దము (౫౦౫) స్త్రీసమమే కాక యవ్యా హతముగ స్త్రీవాచకమును గాన (59) సూత్రముననే మిన్నేఱు అన్న దీనివి శేషణంబు స్త్రీలింగం బయ్యెననియు, “ధరాపరాగపటలాక్రాంతబు అన్న మి న్నేటివిశేషణము (60) సూత్రమున నస్త్రీలింగ మయ్యె ననియు దుందుభిధ్వాన ముతో నమహతి యైనగంగశబ్దము స్త్రీవాచక మనియహోబాబలపండితులే యుద్ఘోషించుచుండిరి.” అని మాప్రతిపక్షులు మిక్కిలి యజాగ్రత్తతో, సమన్వ యము చేసికొని యానందించుచున్నారు. అమహతి యైనగంగాపదము స్త్రీవా

చక మని యహోబలపతి యెచ్చటను వ్రాసియుండలేదు. "మిన్నేఱు" శబ్దమును మాత్ర మొకస్థలమున స్త్రీవాచక మనిరి. "మిన్నేఱు శివజటావాసిని, తత్రన కేవలం స్త్రీసమత్వం. కింతు స్త్రీవాచకత్వమ ప్యవ్యాహత మేవ" అని వ్రాసిరి. ఇచ్చట "ఈశ్వరుని శిరముననున్న" అనువిశేషణపుమహిమచే 'మిన్నేఱు' అనుదాని కర్థము ప్రవాహరూప మగుసామాన్య మైన మిన్నేఱు కాదనియు శివజటావాసిని యగు గంగాదేవి యనియు స్పష్టపడుచున్నది. ఆమె మహాతులలోనికెల్ల మహతి. అమహతి యనుట యజ్ఞానవిలసితము. కావుననే పై వాక్యములోని మిన్నే అనుమహతీవాచకమునకు స్త్రీవాచకపదము నహోబలపండితు లుపయోగించిరి. అయ్యది పారిభాషిక స్త్రీలింగము గాక స్త్రీసమ మైన స్త్రీవాచక మగుట చేతనే దానికి "వికృతౌ చ స్త్రీలింగాః" అనుసూత్రముచే సాధుత్వము నంగీకరించిరి. ఇఁక "ధరాపరాగపటలాక్రాంతంబు మిన్నేఱు" అని రాఘవపాండవీయమున వాడఁబడిన మిన్నేఱుపద మచ్చటివిశేషణపుమహిమను ప్రవాహరూపమం దాకినీపర మని విశద మగుచున్నది. కావున నది మహతీతరస్త్రీసమము. స్త్రీలింగకార్యములు స్త్రీసమములకు వచ్చుట సహజము గాన నిచ్చటిమిన్నే అను మహతీతరస్త్రీసమపు విశేషణమునకు నస్త్రీలింగవిశేషణరూపము "ఉభయవిధ మనుమహతీనామ్" అనుదానిచే సిద్ధించు నని యహోబలపండితులు తలంచిరి. ఈ సందర్భమున రెంఁడుస్థలములందును "మిన్నేఱు" శబ్దము స్త్రీసమము గాని స్త్రీలింగ (పారిభాషిక)ము గాదు. కావుననే "తత్ర న కేవలం స్త్రీసమత్వం కింతు స్త్రీవాచకత్వ మప్యవ్యాహత మేవ" అని యహోబలపతి యుద్ఘోషించెను. పై రెంఁడుస్థలములందలి మిన్నేఱుశబ్దములలో "మిన్నేఱు శివజటావాసిని" యనుచోనున్నది స్త్రీవాచక మగుస్త్రీసమ మనియు, "ధరాపరాగపటలాక్రాంతంబు మిన్నేఱు" అనుచో నున్నది స్త్రీవాచకేతరస్త్రీసమ మనియు, "మిన్నేఱు శివజటావాసిని, తత్రన కేవలం స్త్రీసమత్వం కింతు స్త్రీవాచకత్వ మప్యవ్యాహతమేవ" "ధరాపరాగ పటలాక్రాంతంబు మిన్నేఱు; ఇతి రూపం తూభయేతి సూత్రేణ సమంజస మితి జ్ఞేయం" అనునహోబలపండితుల వాక్యములు స్పష్టముగా వెల్లడించుచున్నవి. ఈ మాత్రమునైన మాప్రతిపక్షులు గ్రహింపలేకునికి శోచనీయము. పై రీతిని మిన్నేఱుశబ్దము స్త్రీసమ మని యహోబలపతి స్పష్టముగా వ్రాసియుండఁగాఁ బారిభాషికస్త్రీలింగ మగుగంగాశబ్దమునకుఁ బర్యాయము గాన మిన్నేఱుశబ్దమును బారిభాషికస్త్రీలింగమే యని ప్రతిపక్షులు భ్రమించు

టయుఁ గేవలము ప్రమాదమే. పర్యాయపదము లేకలింగకములు కావలె నను కొనుట పరిహాసనీయము. మిన్నేఱుపదము (పారిభాషిక) స్త్రీలింగ మని యహోబలపతి యెచ్చటను వ్రాసియుండలేదు గాన వీరికి వినఁబడిన దుందుభిధ్వానము లెల్ల స్వప్నాత్మకములో భ్రమమాత్మకములో యని యూహింపవలసి యున్నది.

పై సందర్భమునుబట్టి మాప్రతిపక్షులు వ్రాసిన "కాఁబట్టి ప్రతివాదులు సంస్కృతవ్యాకరణ సంప్రదాయభూయిష్ఠము లైన యహోబలపండితీయాది గ్రంథముల పంక్తుల యర్థమును దెలిసికొనంజాలక, పుస్తకస్వరూపమును జూచినంతమాత్రముననే యిఁకఁ బరాక్షేపమునకుఁ దగినపాండిత్యము కుదిరిన దనుకొని" అను మొదలగు వాక్యము లెవ్వరిపక్షమునఁ జరితార్థములో వాఙ్మయాభిమాను లగుపండితులే నిర్ణయింతురు గాక.

— * ఇతరేతరయోగద్వంద్వము. * —

"అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు" (బాల. తత్స. 39) అను బాలవ్యాకరణసూత్రమునకు "హ్రస్వాకార మంతమందుఁ గల యమహత్తు లైన నపుంసకలింగములకు మువర్ణకంబు వచ్చును." అని గుప్తార్థప్రకాశికాకారులు వ్యాఖ్యానము చేసిరి. "అట్లయినచోఁ బుంలింగ మగువృక్షశబ్దమునకు మూలములో నుదాహరింపఁబడిన 'వృక్షము' అనురూప మెట్లు సిద్ధించును? మఱియు దైవతము, వృషభము, మొదలగు ననేకరూపములగతి యేమగునో తెలియకున్నది" అని నాయాక్షేపణము. ఈసూత్రమున కదంతములగు నమహత్తులకును నపుంసక లింగములకును మువర్ణక మగు నని యర్థము చెప్పవలయు నని నావాదము.

"అమహత్తులకును నపుంసకలింగములకును" అని నేను జేసినయర్థము సముచ్చయార్థక మనియు సముచ్చయార్థమున ద్వంద్వసమాసము వైయాకరణ సమ్మతము గా దనియు, నాయర్థమును బ్రతిపక్షులు నిరసించిరి.

ఇతరేతరయోగద్వంద్వఘటితపదార్థములకుఁ గ్రియాన్వయమున సాపేక్ష యుండవలయును గాని ప్రతిపక్షులు కోరుచున్నరీతిని "రామలక్ష్మణులు వనమున కేగిరి." ఈ ద్వంద్వమున రాముఁడును లక్ష్మణుండును నొండొరుల విడనాడక యే వనమున కేగినట్లు తోఁచును." అను నీ విధముగల పరస్పరసాపేక్ష యుండ నవసరము లేదు. కావునఁ బ్రకృతమునం దమహన్నపుంసకత్వములకు మువర్ణకప్రాప్తి విషయమునఁ బరస్పరసాపేక్ష లేకుండుట యొకకొఱంత కానేరదు.

“శైశవేఽభ్యస్తవిద్యానాం, రఘూణాం” అనువాక్యమునుండి రఘువంశ జులైన రాజులు కొడుకులుఁ దండ్రులును దాతలును ముత్తాతలును గలసి యేక కాలమున బాల్యమునందు విద్యల నభ్యసించి రనునర్థము వచ్చునా? వచ్చు నం దురేమో? వారి కేకకాలమున శైశవ మెట్లు సంభవించును. ఇట్లే “డుమువు లవః ప్రథమాస్యాత్” అనువాక్యమునుండి “డుమువులు” అను నాల్గింటికిఁ గలి పియే ప్రథమావిభక్తిత్వము గాని యొక్కొకటికి లేదనుట యుచితమా? ఆహా యేమి యితరేతరయోగద్వంద్వము! ఇట్టి విపరీతార్థములు వ్యాకరణసూత్రము లకుఁ జెప్పుట వ్యాకరణకర్తల పరువు తీయుట గదా!

అయినను నేనీవిషయమున నంతగా వ్రాయవలసిన ప్రసక్తి యగపడదు. ఉపన్యాసకోలముల సంఖ్యాబాహుళ్యమును జూపి కూడఁ బ్రజకుఁ గనులు గప్పు టకై యట్లు లేనిపోనిశంకలు చేసికొనుచుఁ దన్నివృత్తి చేసికొనుచు వచ్చిరి గాని తుట్టతుద కీ ద్వంద్వ మశాస్త్రీయము కా దనియే మాప్రతిపక్షు లంగీకరించిరి “ముపర్ణకమును బొందుటలో నమహాదర్థముల యపేక్ష నపుంసకార్థములకును నపుంసకార్థముల యపేక్షయమహాదర్థములకును లేనందున నేకార్థీభావరూప సామర్థ్యము లేమింజేసి ప్రకృతసూత్రమున ద్వంద్వము దుర్లభంబు” అని యుప క్రమించి చర్చించి చర్చించి తుదకుఁ బాణినిసూత్రములందే యట్టి ద్వంద్వములు కనఁబడుటచే “ద్వంద్వపక్షాంగీకారమున సౌలభ్యము కానరాదు. కాన నయ్యది యపార్థ మగు” నని యెట్టెట్టో ముగించిరి.

“అమహన్నపుంసకసూత్రమున ద్వంద్వ మంగీకరించినచో—

1. లక్ష్యము కుదురనిచిక్కున నేకార్థీభావరూపసామర్థ్యమునకు బాధ.

2. ఏకవాక్యసాధ్యార్థమును వాక్యద్వయముచే సాధించుటంజేసి వాక్యద్వ యాపత్తిరూపగౌరవము.

3. ఇపుడు సాహచర్యపరిభాష కనిత్యత్వ మంగీకరించి సాదృశ్యత్యాగము.

4. “నపుంసకగ్రహణవైయర్థ్యమునంజేసి ప్రకృతార్థజ్ఞాపనంబును, సంభ వించు” అని నాలుగుదూషణములను జూపి ద్వంద్వసమాస మిచట నగ్రాహ్య మనియుఁ గర్మధారయార్థమే గ్రాహ్య మనియుఁ జర్చించిరి. ఏకార్థీభావము లేక సమాసమే యుండదు. ద్వంద్వసమాసము నంగీకరించియు నేకార్థీభావము లే దనుట వింతలలోనికెల్ల వింత!

పైరీతి నథమపక్షములోని దని చెప్పుచున్న యమహన్నపుంసకస్థలమందలి ద్వంద్వమువంటి ద్వంద్వములు పాణినిసూత్రములందును, షడ్దర్శనీస్వతంత్రు లని మాప్రతిపక్షులు కొనియాడుచున్న శిష్టు కృష్ణమూర్తి శాస్త్రులవారి హరికారికావళి యందును, విశేషించి బాలవ్యాకరణమందును, లెక్కకు మీఱియున్నవి. వాని నెల్ల నుదాహరించిన గ్రంథవిస్తర మగు నని భీతిల్లి దిఙ్మాత్రముగ నిచ్చట నుదాహరించుచున్నాఁడను.

— * పాణినిసూత్రములందు. * —

"ప్లుతప్రగృహ్యా అచి నిత్యం (6—1—125)
అస్థిదధిసక్థ్యక్ష్ణామన ఙుదాత్తః. (7—1—75)
గోపయసో ర్యత్ (4—3—160)
ఇన్హన్ పూషార్యమ్ణాం శౌ (6—4—12)
శ్వయువమఘోనామతద్ధితే (6—4—133)

ఇంద్రవరుణభవశర్వరుద్రమృడహిమారణ్య యవయవనమాతులాచార్యాణామానుక్." (4—1—49)

— * హరికారికావళియందు. * —

"సమాస ఇ చ్చేతతోడవలనానాం సతాం మతం; షష్టి యొక్క కయీ న్వినా; స్త్రీతిర్యగ్జడభిన్నా స్తద్భేదకా మహదాహ్వయాః; రైగ్లావ్యుగ్యంత నామభ్యః; విధాతృధాతృసవితృనేతృదాతృమహత్సువా; రై గ్లా వోః."

— * బాలవ్యాకరణమందు. * —

"కయిషష్ఠియొక్కలకు; చేతతోడవలనలకు; స్త్రీతిర్యగ్జడభిన్నంబులు; ఇగ్లౌరాయుగంతంబుల; విధాతృధాతృదాతృసవితృనేతృశబ్దములకు; రైగ్లాశబ్దంబులకు."

సూత్రకర్త లగువైయాకరణులు ప్రయోగించిన యీద్వంద్వము లెల్ల నథమపక్షములోనివేనా. అట్టి ద్వంద్వమథమపక్షములోని దైనప్పు డెచ్చట నైనఁ గావ్చిత్కముగా నగతికస్థలమునఁ బ్రయోగించినఁ బ్రయోగింతురు గాని సూత్రకర్త లగువైయాకరణులెల్ల లెక్కకు మీఱి నన్నిటిని బ్రయోగించి యుందురా? అనేకస్థలములందుఁ బ్రయోగించిన సూరిగారి కీసూత్రమునఁ బ్రయోగింపలే దని చెప్పినంతమాత్రమున నేమి గౌరవము వచ్చును. వ్యాకరణకర్తలు సయుతము వ్యాకరణగ్రంథము సాఘ్రిణింపలే దనియు నందురా?

మఱియు నట్టిద్వంద్వములు వ్యాకరణములలో నధికముగాఁ బ్రయోగింపఁ బడి యున్న వన నేల? సామాన్యముగా నిట్టిస్థలములం దెల్ల ద్వంద్వసమాసము చేయుటయే సంప్రదాయముగా నగపడుచున్నది. అట్లే ద్వంద్వభ్రమను గల్గించు స్థలములందెల్లఁ దఱచుగా సిద్ధకర్మధారయము నుపయోగింపక దానిని విడఁగొట్టి సూత్రరచన చేయుటయే సంప్రదాయము. ఒకటిరెండుస్థలములం దక్క బాల వ్యాకరణమునం దెల్లెడల నిట్లే ద్వంద్వభ్రమాస్పదస్థలములందు సిద్ధకర్మధార యము విడఁగొట్టఁబడినది. ఇదియే సూత్రరచనమునందు సూత్రకర్తలకుఁ గల కర్మధారయమునందలి యభిరుచిని వెల్లడించుచున్నది. మాప్రతి పక్షులవాద మన్ననో యిందుకు విపరీతము. ఈ విషయము చదువరుల హృదయములందు నెల కొల్పుటకై యిచ్చట నొకటిరెం డుదాహరణముల నిచ్చుచున్నాఁడను.

"పుంలింగంబై మహద్వాచకంబైన నామంబుతుది యత్వంబున కుత్వం బగు" (బాల. తత్స. 21 సూ) ఇచట నుత్వప్రాప్తికిఁ బుంలింగత్వ మహద్వాచ కత్వములు రెండును మాప్రతిపక్షులు గోరుచున్న యితరేతరయోగముతోఁ గా వలసియున్నందున నట్టియర్థమును స్పష్టముగా బోధించుటకై "మహత్పుంలింగ ములకు" అని ద్వంద్వభ్రమనుగూర్చు సిద్ధకర్మధారయమును జేయక విడఁదీసి సూత్రమును రచించెను. ఇట్లే దీని తరువాతి సూత్రమునందును "పుంలింగ మగు మహద్వాచకమునకు డుజ్జగు" అని యిట్లు కర్మధారయముచేయక వ్యస్తము గానే ప్రయోగించెను. ప్రకృతవివాదస్థసూత్రమునం దన్ననో ముపర్ణకప్రాప్తి కమహన్నపుంసకముల కట్టిసాపేక్ష యక్కఱలేకుండుటచేతనే ద్వంద్వసమాసము చేయఁబడినది. ఈ యమహన్నపుంసకసూత్రమునందే "అదంతత్వమునకు" మా ప్రతిపక్షులు గోరుచున్న సాపేక్ష యావశ్యక మగుటచే నది వ్యస్తవిశేషణముగాఁ బ్రయోగింపఁబడెను. ఇంకను నిట్టివి పెక్కులు గలవు.

"కళలగు క్రియాపదముల మీఁద" "ఉదంతంబు లగు స్త్రీసమంబులకు" "ఉదంతములగు తద్ధర్మవిశేషణములకు" "క్లీబంబులు మిత్రాదులు" "అగ మాన్యచకారముల కద్విరుక్తంబులకు"

"అమహత్తులకును నపుంసకలింగములకును" అనుసముచ్చయార్థము కా వలసియేగదా షడ్దర్శనీస్వతంత్రు లగుహరికారికావళీకర్తగారు దుష్ట మగు ద్వంద్వసమాసముచేయక వ్యస్తపదములను బ్రయోగించిరి. అని మాప్రతిపక్షులు "అదంతానా మమహతాం, క్లీబానాంచ ముపర్ణకః" అనుహరికారిక నుదా

హారించిరి. అట్లయిన వెనుక నే నుదాహరించిన హరికారికలలోని ద్వంద్వముల కేమిగతి? అప్పు డాయన షడ్దర్శనీస్వతంత్రులు కారా? పాణినిసూత్రములలో లెక్కకు మీఱియున్న యిట్టి ద్వంద్వములగతి యేమి? ఇంతకును సూరిగారి బాలవ్యాకరణములో నున్నయీరీతి ద్వంద్వములగతి యేమి? మఱియొకచిత్రము! పై హరికారికకే వివాదస్థ మగునమహన్నపుంసకసూత్ర మాంధ్రీకరణ మనిగదా వీరిసిద్ధాంతము. అట్టియెడ హరికారికావళిలోని యర్థమేగదా చిన్నయసూరి గారు చెప్పియుండవలెను. ఇంక నమహన్నపుంసక సూత్రమునఁ గర్మధారయా ర్థమే గ్రంథకర్త్రభిప్రేత మనియు ద్వంద్వార్థ మపార్థ మనియుఁ జెప్పుటకు మా ప్రతిపక్షు లెట్లు ప్రతిఘటింతురో తెలియకున్నది.

“ప్రసిద్ధముగా, వనం, ధనం, దారు, ఇత్యాదులే నపుంసకలింగము లగుఁ గాన నిట్టిజడములు నమహత్తులలో నంతర్భూతములయినందున నమహన్నపుం సకశబ్దములు సామాన్యవిశేషవాచకము లయినందున ద్వంద్వము గగనకుసుమా యమాన మగును” అనియు, “శబ్దరత్నమునందును, ... ... భా వ్యమునందును, ద్వంద్వఘటిత పదార్థములు సదృశములే లోకప్రసిద్ధము లని చాటఁబడినది. కాన, అమహన్నపుంసకసూత్రస్థ నపుంసకగ్రహణమున నమహత్తు లతో సాదృశ్యము లేమింజేసి మహన్నపుంసకము లర్థము కానేరవు.” అనియు ని ట్లుపన్యసించిరి. ఈవిషయమును నద్భుతముగనే యున్నది. అమహత్తులకంటె నితరములగు దైవతశరణపాత్రప్రధాన మిత్రాపత్యలోకప్రభృతి మహన్నపుం సకశబ్దము లుండుటంజేసియు, నపుంసకేతరము లగువృషభవృక్ష శైలాద్రిమేఘా ర్ణవసింహ వ్యాఘ్రఘటపటాదు లగునమహత్పుంలింగశబ్దము లుండుటంజేసియు నమహత్తులకును నపుంసకలింగములకును, సామాన్యవిశేషభావమును దలంచుట కైన నవకాశము లేదు. అమహన్నపుంసకముల కట్టిసామాన్యవిశేషభావమే లే నందునఁ దన్మూలకము లగు 3, 4 నెంబరుల దూషణములకు నణుమాత్రమును నవకాశము లేదు. మఱియు బాలవ్యాకరణమునందుఁ బైరీతిగల ద్వంద్వసమా సములు పెక్కు గలవు. వాని కేమి గతి?

“స్త్రీవాచకతత్సమసంబోధనాంతములకు సంధి లేదు.’ (బాల. సంధి. 4 సూ) రమ, సీత, వనిత, మొదలగు తత్సమపదములు స్త్రీవాచకము లగుచు న్నవి. అవియును, రామ, కృష్ణ మొదలగు తత్సమశబ్దములును సంబోధనాం తము లగుచున్నవి. కావునఁ బై నుదాహరించిన బాలవ్యాకరణములోని షే

యీనోకస్థలమునం దున్నద్వంద్వమును సైతము మాప్రతిపక్షులు దూషింపవలసియు న్నది. ఇంకను నిట్టి వనేకములు గలవు. గ్రంథవిస్తరభీతి నుదాహరింపలేదు. పై వానికి గుప్తార్థ ప్రకాశికాకారులు ద్వంద్వసమాసపరముగానే వ్యాఖ్యానము చేసి యున్నారు. కాని కర్మధారయార్థము చేయలేదు. అట్లు పెక్కుస్థలములందుం గల యీగగనకుసుమాయమాన దూషణములను వివాదస్థ మగునమహన్నపుం సక సూత్రమునందు మాత్రము వారించుటకై సూత్రరచనాస్వారస్యమును, (మూలభూత) హరికారికావళీతాత్పర్యమును, విశేషించి సూరిగారి యభిప్రాయ మును నుల్లంఘించి లక్ష్యసాధన విషయమునం గేవల మసమర్థ మగునీవిపరీతార్థ మును దీయుట సహజమా ?

ఇంక మాప్రతిపక్షులు చెప్పచున్న కర్మధారయార్థపు వైఖరిని లక్ష్యసా ధనవిషయమున దానియసామర్థ్యమును జూపుచున్నాఁడను. హ్రస్వాకార మం తమంకుఁ గల యమహత్తులయిన నపుంసకలింగములకు మువర్ణకంబు వచ్చును'' అని ప్రతిపక్షులవ్యాఖ్యానము. ఈవ్యాఖ్యానముచే నమహత్తులును నపుంసక లింగములును నగు ధనవనాదిశబ్దములకే మువర్ణకము సిద్ధించును గాని వృషభ వృషాదులగు ననేకశబ్దము లమహత్తులయ్యు నపుంసకలింగములు కామిం జేసియు, దైవతశరణపాత్ర ప్రధానమిత్రాపత్యతోక కారణా ద్యనేకశబ్దములు నపుంస కము లయ్యు నమహత్తులు కామిం జేసియు నీ ద్వివిధమగు శబ్దజాలమునకును మువర్ణకము రానేరదు. కావుననే యట్టివానిలో నమహత్పుంలింగములకు రూప సిద్ధి కుదురుటకై, సంస్కృతభాషలోని దుర్బోధ మగుపారిభాషిక లింగముతోఁ బ్రసక్తి లేదనియు, సంస్కృతమునఁ బుంలింగములయ్యు నమహద్వాచకము లెల్ల నాంధ్రమున నపుంసకములె యగు ననియుఁ జెప్పచు సకలాంధ్రవ్యాకరణ విరుద్ధ మగు నొకయపసిద్ధాంతమును గల్పించిరి. ఇఁక మహన్నపుంసకములకు రూపసిద్ధి కుదురుట కేమియు గతిలేనందున నట్టివాని కీయమహన్నపుంసక సూత్రమే యుప లక్షణ మగు నని చెప్పిరి. గ్రంథకర్తచే ననుక్తములైన యనన్యగతికశబ్దముల కుపలక్షణ మను గతికల్పించుట కలదు గాని యెల్లరూపములను సమర్థించు నట్టి యర్థ ముండఁగా దానిని విడుచుకొని పట్టుదలతో నాడినమాటను నిలఁబెట్టుకొ నుటకై కల్పించిన విపరీతార్థమున సాధ్యము కానివాని కుపలక్షణము నంగీకరిం చుట యుచితమా ? లక్షణచే నర్థాంతరమును గ్రహించునపు డుపలక్షణ మం దురు. ముఖ్యార్థమున కనుపపత్తి లేక లక్షణకుఁ బ్రసక్తియే లేదు. అట్టిస్థితిలో

ద్వంద్వసమాసమున ముఖ్యార్థముచే సకలలక్ష్యసిద్ధిఁ గల్గుచుండఁగా దానిని విడుచు కొని జఘన్య మగునిర్బీజలక్షణ నంగీకరించుట పరిహసనీయము.

"ఇట వృషభాదులకును నట్లె సంస్కృతజన్మములోఁ బుంలింగకీర్తి నొందినను, (అన్వయము లేదు.) నపుంసకము లయిన ధనవనాదులతో సమానముగా నమహన్నామముఁ దెలుంగున ధరించి నపుంసకమువర్ణ చిహ్నమున కుద్దేశింపఁబడుతఱిని బూర్వదశలోని పురుషోత్తమకీర్తి యెట్లు రానేరుచు ? స్త్రీల మహత్తులలో సర్వసాధారణముగా గణింపఁబడినను ప్రత్యేకముగా మహతీసంజ్ఞ యుంచుటం జేసియు (57) సూత్రమునం జేసియు, నపుంసకత్వకార్యము సంభవింపదు, తిర్యక్కులకు 'నమహత్తు' అనిన తెలుంగువ్యాక్రియసంజ్ఞచేతనే జడంబులకుంబోలె నపుంసకత్వము సిద్ధం బయ్యె, మేము సూత్రమున ద్వంద్వము చెప్పి సంస్కృతలింగముం గనుంగొని మువర్ణక ముంతు మని ప్రతివాదు లనం గూడదు. సంస్కృతపాండిత్యమున నాఱితేరిన సర్వోత్కృష్టు లగువారికే లింగములు దెలిసికొనుటలో భంగము గలుగుచుండఁగా నొక్క తెలుంగుననే మునింగినవారికి సంస్కృతలింగప్రభావము మిక్కిలి యయోమయముగాఁ గనంబడు నని (ఎంత యయోమయముగాఁ నగపడకున్న నీరీతి విపరీతకల్పనములు చేయఁబడును ?) వేఱ చెప్ప నేల ?.........తెలుంగునం దిర్యగ్జడంబులు నపుంసకలింగము లగు ననుకొన్నచో సులభంబు. సంస్కృతమునఁ దిర్యక్కులైనవృషభాదులు తెలుంగున నంతలో నపుంసకలింగము లెట్లగు నని వింతపడవలదు. సంస్కృతమునఁ బుంలింగము లయినదూతాదులకుఁ దెలుంగున స్త్రీత్వము దొరయుచున్నయది. విశ్వకర్మాదులవంటివారికి స్త్రీత్వము (75 సూ) స్థిరపడుచున్నది. సంస్కృతంబునఁ జతుర్ముఖుం డయినయాబ్రహ్మయ్యసహితము (76) విధివశంబున బ్రహ్మక్క యయ్యె ? అని యిట్లించుకేని యనుమానింపక పరిహాసాస్పద మగుశైలితో మాప్రతిపక్షులు దాఁటుచున్నారు. యుక్తి కుదురనపుడు నవ్వుటాలతో దాఁటివేయుద మని తలంచినవీరితలంపు శ్లాఘనీయ మై యున్నది. కాని సభ్యముగాఁ బ్రసంగించునపుడు, విశ్వకర్మాదిశబ్దములకు వైయాకరణులు స్త్రీత్వ మతిదేశించుటం జేసి వానికి స్త్రీలింగకార్యములు వచ్చినంతమాత్రమున విధానము లేకయే తిర్యగ్జడములకు నపుంసకత్వము వచ్చు నని చెప్పుట న్యాయ్యము కాదు.

మఱియొకచిత్రము, అమహత్తు లెల్ల నపుంసకలింగములంట. స్త్రీలింగామహత్తులుమాత్రము నపుంసకములు కావంట! అమహత్పుంలింగములు నపుంసక

లింగము లగునంట! ఈసిద్ధాంతము కేవల మసంగతము. సకలాంధ్ర వ్యాకరణ విరుద్ధము. యుక్తిశూన్యము. ఇది సంస్కృతవ్యాకరణ ప్రసిద్ధ పారిభాషికలింగమూ కాదు. లౌకికలింగమూ కాదు. ఆంధ్రవ్యాకరణప్రసిద్ధ మగుమహదాదిలింగమూ కాదు. ఇ ట్లిచ్చటను బ్రసిద్ధము కానట్టియు, యుక్తిశూన్య మగునట్టియు నీ నూతనలింగకల్పనము మాప్రతిపక్షు లంగీకరించు టెల్లఁ దా మేమేమో పొరపడి చేసిన యపార్థములను దిద్దుకొనుట కేనా? అదియునుం బొసఁగ కున్నదే. తుదకు బాలవ్యాకరణసూత్ర సమన్వయమున కై యంగీకరించిన యీనూతనలింగము బాలవ్యాకరణసంప్రదాయముల కైన నవిరుద్ధముగా నుండ నక్కఱ లేదా? సూరిగారి కిట్టిసిద్ధాంతము (తిర్యగ్జడములు నపుంసకలింగములు) సమ్మతమే యైనయెడల "బియ్యము, నెయ్యము" మొదలగు వానికి వేఱుగఁ గ్లీబత్వము (బాల. ఆచ్ఛి. 2 సూ) నేల యతిదేశింతురు? క్లీబంబులకుఁ గ్లీబసమత్వము నెవ్వఁడైనఁ గల్పించునా? అట్లే యమహన్నపుంసకసూత్రమున వ్యర్థముగ నమహచ్ఛబ్దము నేల ప్రయోగించి యుందురు? అమహన్నపుంసకశబ్దములు పర్యాయము లని తలఁచినపుడు ప్రవృత్తి నిమిత్తభేదము లేనిపదముల నభేదాన్వయ తాత్పర్యమున సమాసముగఁ గాని వాక్యముగాఁ గాని యనున్మత్తుఁ డెవ్వఁడును బ్రయోగింపఁడు గదా.

విచక్షణులారా! సావధానుల రై చిత్తగింపుఁడు. "అమహత్తులకును నపుంసక లింగములకును ముపర్ణక మగు" నను సకలరూపసాధనసమర్థ మగు ద్వంద్వార్థమును విడుచుకొని, యమహత్త్వ నపుంసకత్వము లను రెండుధర్మములును గలవానికి మాత్రమే ముపర్ణకము వచ్చు ననునర్థము నిచ్చు కర్మధారయార్థమును గ్రహించి, రూపసిద్ధి కుదురనందున నారెండుధర్మములకుఁ గల సకల వ్యాకరణప్రసిద్ధ మగు భేదమును గ్రొత్తగా నిరసించి, యనఁగా "నమహన్నపుంసకత్వము లనురెండును నొక్కయమహద్గ్రహణముననే వచ్చునర్థము నిచ్చునట్లుగఁ" గ్రొత్త యపసిద్ధాంతమును గల్పించి, యట్టియెడఁ గర్మధారయార్థమునఁ బ్రవృత్తి నిమిత్తభేదము లేనిపదముల నభేదాన్వయతాత్పర్యమునఁ బ్రయోగించుట యనుప్రబలదోషమును గణింపకుండుటయే గాక, నపుంసకగ్రహణమును విఫలముఁ జేసికొన్న కారణమునఁ దప్పిపోయినరూపముల కీసూత్ర ముపలక్షణ మని గ్రహించుటకన్న నసంగత మున్నదా?

ఇఁక ద్వంద్వార్థమే, గ్రంథకర్త్రభిప్రేత మని చదువరులకు విశదపడుట కై యాసూత్రసందర్భమున గ్రంథకర్త వ్రాసినవివరణము నిచ్చట వ్రాయుచున్నాఁడను,

"అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగును" (బాల. తత్స. 39 సూ) వృక్షము, ఋక్షము, దైవతము, కళత్రము, అపత్యము ; "క్లీబంబులు మిత్రాదు"లను సూత్రంబునఁ బాక్షికంబుగం బుంలింగత్వం బతిదేశించుటంజేసి మిత్రాదిశబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది. ఉ. మిత్రుఁడు, మిత్రము. శరణుఁడు,శరణము." అని యిట్లు సూరిగారు స్పష్టముగా నుదాహరించియున్నారు.

ఇచ్చట గ్రంథకర్త ద్వంద్వార్థమును వివక్షించియె యమహత్పుంలింగమునకును (వృక్షము) నమహన్నపుంసకమునకును (ఋక్షము=నక్షత్రము) మహన్నపుంసకమునకును (దైవతము) మహతీనపుంసకమునకును (కళత్రము) వరుసగా నొక్కొక్కయుదాహరణము నిచ్చి, పిమ్మటఁ బ్రయోగసందర్భమున నిర్ణయింపఁదగినమహత్త్వామహత్త్వములు గలనపుంసక మగునపత్యశబ్దము నుదాహరించెను. పిదపఁ దాను, మిత్రాదు లగుమహన్నపుంసకములకు విభాషను బుంస్త్వ మతిదేశించుటంజేసి వానికిఁ గలుగుద్వైరూప్యము నుదాహరించెను. కర్మధారయార్థమే సూత్రకర్తకభిప్రేత మని చెప్పినయెడలఁ బై నుదాహరించిన వానిలో నెల్ల నొకటి "ఋక్ష" శబ్దము మాత్రమే యుదాహరణము కావలసియున్నది. మఱియు నమహన్నపుంసకగ్రహణమునఁ బరస్పర వివిక్తోదాహరణము నీయఁదలఁచి నపుంసకములు కానియమహత్తులకు 'వృక్షము, ఋక్షము" (ఎలుఁగుగొడ్డు) అనువానిని, నమహత్తులు కాని నపుంసకములకు "దైవతము, కళత్రము, అపత్యము," అనువానిని గ్రంథకర్త యుదాహరించె నని గ్రహించినపుడమహత్తగునపుంసక మాయుదాహరణములలో నొకటియుఁ గానందునఁ బ్రతిపక్షులు తీసిన కర్మధారయార్థమునకు సూత్రకర్త యుదాహరించిన యుదాహరణ మొకటియు లేదనియే చెప్పవలసివచ్చును. అట్టిస్థితిలో నున్నత్తునివలె సూత్రకర్త లక్షణప్రసక్తి లేని యీలక్ష్యముల నెల్ల నేల యుదాహరించె నని ప్రశ్నింపవలసియున్నది. విశేషించి మిత్రాదులపుంలింగతాతిదేశము నుద్ఘాటించిన గ్రంథకర్త వానిమువర్ణకరూప ముపలక్షణ సాధ్య మని యైన వ్రాయకుండునా ? పై విషయములు మాప్రతిపక్షులు నిరాగ్రహ మగు నెమ్మనమునఁ బరికించినచోఁ దమకర్మధారయార్థము గ్రంథకర్త్రభిప్రేతము కా దనియు నపార్థమే యనియు నంగీకరింతు రని నమ్ముచున్నాఁడను.

"బృందారకా దైవతాని పుంసి వా దేవతా స్త్రియాం" అనునమరనిఘంటువునంజేసి యదంతమహద్వాచక పుంలింగము గాన (39 సూ) మువర్ణక

యనియు నందు శాస్త్రవిరోధ మేమియును లే దనియు, నదియే లక్ష్యసాధనక్షమ మనియు గ్రంథకర్త కదియే యభిప్రేత మనియు విశదము కాక మానదు గదా! మఱియును నచటఁ గర్మధారయమును గ్రహింపవలె ననినచో నది లక్ష్యసాధకము కా దనియు గ్రంథకర్త కనభిప్రేత మనియుఁ దత్పక్షమున లక్ష్యసాధనము నకుఁ జూపఁబడినయంశములు శాస్త్రసమ్మతములు కాకపోవుటయే గాక శాస్త్రవిరుద్ధములు నై యున్న వనియు నట్టియంశములు గ్రంథకర్త కభిప్రేతము లని యంగీకరించునెడల నాతఁ డవ్యుత్పన్నుఁ డని యంగీకరింపవలసివచ్చు ననియు, వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు గదా!

పార్థమూర్తిగారు సయితము పైసందర్భమును బాగుగఁ దెలిసికొనినచో వారికిని నీవిషయమున సందేహనివృత్తి కాక పోదు. పార్థమూర్తిగారివ్యాసములు రాజమహేంద్రవరమున నున్న దేశమాతలోఁ బ్రచురితము లై యుండుట నరయఁగా వీరు రాజమహేంద్రవాసులు గాని తత్ప్రాంతవాసులు గాని యై యుందు రని తలంచుచున్నాఁడను. రాజమహేంద్రవాసులును గుప్తార్థప్రకాశికాకారులును నగు బ్ర॥ శ్రీ॥ కల్లూరి వేంకటరామశాస్త్రిులవారు మంచివైయాకరణు లని నే నీవఱకు వినుచున్నాఁడను. కావున నింకను బార్థమూర్తిగారికి సందేహము లున్న యెడల సన్నిహితు లగు, వారిని దెలిసికొనిన నట్టిసందేహములు దీఱు నని నమ్ముచున్నాఁడను. పార్థమూర్తిగా రొకప్పు డాప్రాంతమువారు కానప్పుడు వా రుండు ప్రాంతములలో నున్నవైయాకరణులవలనఁ దమసందేహములనుదీర్చికొందురుగాక.

‘ అమహన్నపుంసక ” సూత్రమున ద్వంద్వమా? కర్మధారయమా? యనువాదభేదములచేఁ జదువరు లెవ్వరికైన సూత్రార్థవిషయమున నట్టిసందేహము గలుగునప్పుడు దాని నివారించుటకు మాత్రమే నాయీయుపన్యాసము వ్రాయఁబడినది గాని వేఱుతలంపున వ్రాయఁబడలేదు. శాస్త్రీయాంశములను బురస్కరించుకొని పార్థమూర్తిగారివాదమునకు విరుద్ధముగా వ్రాయవలసి వచ్చినందులకు వారు నన్ను క్షమింతురు గాక. గుణగ్రహణపారీణు లగుపండితులు నాయీవ్యాసమునందలి గుణదోషములను విమర్శించి నన్ను మన్నింతురుగాక.

తాతా సుబ్బారాయశాస్త్రి.

## స్వాభిప్రాయము.

“ అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు” ననుబాలవ్యాకరణసూత్రమున కర్థము చేయుటలో గుప్తార్థప్రకాశికాకారులకును బ్రహ్మశ్రీ వఝ్ఝల

చినసీతారామస్వామి శాస్త్రిగారికిని గలిగిన మతభేదమునుగూర్చి వెలువడినవ్యాసములలో నిది చివరిది. ఈచర్చకు మూల మైన చినసీతారామస్వామిశాస్త్రిగారి ప్రథమవ్యాస మీపత్త్రికయందుఁ బ్రకటింపఁబడినది. పిదప మఱికొన్ని యుత్తర ప్రత్యుత్తరములు బయలుదేఱె సీతారామస్వామిశాస్త్రిగారివ్యాసము లీపత్త్రికయందును దత్ఖండనములు దేశమాతయందును బ్రకటితము లయినవి. వాదప్రతివాదములు రెండు నొకపత్త్రిక యందే కనఁబడియుండిన బాగుగా నుండి యుండును. కాని యట్లు జరుగలేదు. ప్రకటనము నిమిత్తమయి సీతారామస్వామి శాస్త్రిగారివ్యాసము లిక్కడకుఁ బంపఁబడినవి. కాని వానికిఁ బ్రత్యుత్తరము లయినవ్యాసములు పంపఁబడి యుండలేదు. వచ్చియుండినచో నవి గూడఁ దప్పక ప్రకటించియుందుము. పాఠకలోకమునకుఁ గావలసినది తత్త్వనిర్ణయము గాని, వాదిప్రతివాదుల జయాపజయములు కావుగదా!

పూర్వోదాహృతసూత్రములో "అమహన్నపుంసకముల" కన్నచో ద్వంద్వసమాసమా! కర్మధారయసమాసమా! యనునది వివాదవిషయము. ద్వంద్వసమాసము (అమహత్తులకును, నపుంసకములకును) అని సీతారామస్వామి శాస్త్రిగారివాదము. కర్మధారయము (అమహత్తులయిననపుంసకములకు) అని గుప్తార్థప్రకాశికాకారులమతము. ద్వంద్వసమాసమే యిచ్చట నన్నివిధముల నమరియున్న దని మాయభిప్రాయము.

పత్త్రికాధిపతి.

సీ. బహుపుణ్యుఁ డగువానిబ్రదు కది మంచిది మనసు గెల్చినవానిమహిమ మేలు
జ్ఞానంబు గలవానిజన్మంబు సఫలంబు తప్పుఁజెప్పనివానితగవు లెస్స
సమబుద్ధి గలవాని చరితంబు సమ్మతి యుపమరి యగువానియునికి బాగు
వావి గల్గినవానివర్తన శుభ మిచ్చు మే లెఱింగినవానిమెచ్చు మెచ్చు
భువికి నిటువంటిమనుజుండు భూషణంబు, గలుగు నీకృప నీరీతి ఘనుల కెపుడు.

సీ. చాడికాఁ డగువాఁడు *సట లెల్ల బోధించు నందున కొరులపై నలుగ వలదు
పాతకుం డగువాఁడు పరులను దూషించు వెఱ్ఱి యై తా నవి వినఁగ వలదు
వెడదొంగ యగువాఁడు విత్తంబు లీ వచ్చు భ్రమసి యాసల నవి పట్టఁ దగదు
మాయావి యగువాఁడు మందు మంత్రము నేర్పు మఱచి తప్పియు నవి మరగ [వలదు
కర్తయగువాఁడు కపటులగతులు దెలిసి, యేమఱక రాజ్యమెప్పుడు నేలవలయు.

సీ. మోపరి యెంతైన మోవ వేసారఁడు సారిది నాదాయమే చూచుఁ గాని
మహి గృహస్థుం డలమటలకు నోడఁడు సాలవ కేపని కైనఁ జొచ్చుఁ గాని
కాలరినరుఁడు సుఖంబులఁ గోరఁడు పరువుచే మే నలవఱచుఁ గాని
యటమటీఁ డెప్పుడు నప్పులఁ దెగితీయు సుసరాన దిద్దక జుణుఁగుఁగాని
కడఁగి వీరల కీయోజఁ గర్మవశము, కర్మములు నిన్నుఁ గొలిచినఁగాని తెగవు.

సీ. ఒకఁడు దాఁచినయర్థ మొక్కండు భుజియించు నొకసతిమగఁడు వేఱొక తెకగును
గాయంబు నిలువదు కడుబ్రహ్మకైనను జాయ గొన్నాళ్లది జవ్వనంబు
చదివినచదువులు సరి శరీరముతోనె తలఁపులు మఱచినందనుక నుండుఁ
గులముదారిద్ర్యంబుఁ గొంచెంబుఁగాఁజేయు వలపు వేసట యైన వదలివిఱుగు
నేలబ్రమయుంగ నెవ్వరికేది నిజము, చెలఁగి మిముఁ గొల్చువారిది చెడనిపదవి.

సీ. శత్రులమాటలు సత మని నమ్మక కాంతలకును గుట్టుఁ గాననీక
సమయమ్ముగాండ్రకుఁ జనవు చెల్లింపక తోడుఁబోతుల నిల్లు ద్రొక్కనీక
ఘనతరద్రోహిఁ గొల్వునకు రానీయక మొదలువంచకునకు మొగముగాక
పిఱికిఁ బోట్లాటకుఁ బెనపెట్టి కొనితేక దొరయనిహీనునితోడ నగక
వదల కెచ్చరి యుండెడువాఁడు రాజు, జగతి వర్ధిలు నట్టి విచారపరుఁడు. 49

సీ. మానంబెయెక్కుడుమఱియుఁ బ్రాణముకంటెఁ దనకీర్తియెక్కుడు ధనముకంటె
సాహసం బెక్కుడు సాముసేయుటకంటెఁ బంత మెక్కుడు ప్రతాపంబుకంటె

* సట = మోసము - కపటము.

నిలలో నుదారత్వ మెక్కుడు సిరికంటె బీర మెక్కుడు తనబిరుదు కంటె
సమరంబె యెక్కుడు సంధిమాటలకంటె ధైర్య మెక్కుడు దొరతనముకంటె
వెలయనిటువంటిగుణములవీరవరుఁడు, కలఁడు వేయింటికొకఁ డుకడమ లేఁడు.

సి. నయకోవిదులు తప్పు నడచి రేనియు వారివరుసగా దది కర్మవశముగాని
ధనికులు భోగింపఁ దలఁపఁ జాలమి వారిబాగు గా దది జన్మఫలముగాని
పుణ్యులు పాపంబుపొంతఁ బోయిన వారిగతులు గా వవి దైవికములుగాని
సుజనులు లోకనిష్ఠురు లైన నది వారిజాడ గా దుత్పాతసరణిగాని
యెఱిఁగి నడువంగ వారలయిచ్చగాదు, ధర్మదేవత మెలఁగుచందంబుగాని. 51

సీ. చెలులసంగడి నున్నఁ జిత్తంబు చలియించుఁ గనకంబుఁ బొడఁగన్నఁ గడఁగునాన
సురియ చేపట్టిన శూరత్వములు రేఁగు నీచవర్తనుపొందు నిందకొలుపు
నేలికతో మేల మెప్పుడు విషమించుఁ బడుచుతో నవ్విన భంగపఱచు
సభలోనఁ జొచ్చిన సడియెల్లఁ బైకొను విటులఁ గూడినను వివేక మెడయు
నెఱిఁగియన్నియువర్జించి యేకతమున, నిన్నుఁ దలపోయునాతండు నిపుణుఁ డండ్రు.

సీ. కొన్నిభూముల నెండ కొన్నిభూములఁ జలి యొక్కనిమేలు వేఱొకనికీడు
వెలయుఁ జుక్కలు రేయి వేగుఁ బ్రొద్దున మాయుఁ గొంతకాలము కల్మికొంతలేమి
కప్పు మేఘము మింటఁ గడపటబయలౌను జవ్వనంబగు మేను జదిసి ముదియుఁ
గాయ లై యున్నవే కడపటఁ బండ్లౌను గడుహీను లధికు లై కానిపింతు
రెంచిచూచిన వెనుకముం దెటులునుండుఁ, గలఁగవలవదు సహజంబు కాలగతులు.

సీ. భుజియించి నప్పుడే పోవు నాహారము ల్పూసినగంధంబు పొల్లురాలుఁ
గట్టినప్పుడె మాయు ఘనవస్త్రచయములు ముడిచినప్పుడె వాడు ముడిఁగివిరులు
కలసినప్పుడె విడుఁ గాంతలతోఁ దమి తొడిగినఁ బ్రేఁగు లై తోఁచు సొమ్ము
లెక్కినఁ గడు నలయించు వాహనములు వసము గానిధనంబు వడ్డి తోడును
కలుగ నేర్చునె నిత్యసౌఖ్యంబులిందు, నిన్నుఁ గొలిచిన సుఖములు నిలుచుఁ గాక.

సీ. తన కాపు లగువారి దండ నుంపఁగఁ దగు నధికశూరులదండ లంపదగును
మఱి ధనాఢ్యులకును *మణివంబు లీఁదగు హితుల వాకిలి గావ నిడఁగఁ దగును
ఘనకార్యపరుల దుర్గములఁ బెట్టఁగఁ దగు నిపుణుల నుడిగల నిలుపఁ దగును
సముచితజ్ఞుల వ్రాయసము వ్రాయుఁ డనఁదగు మాయావులఁ దలార్లఁ జేయఁదగును
మఱచియల్పులఁ దానమ్మి మనుపవలదు, గరిమ ధరనెల్ల నేలెడుఘనున కెపుడు.

* అధికారము.

సీ. ఏనుఁగులా వెంత యిల మావటీఁడెంత తిమిరంబుబల మెంత దీప మెంత
ఘనసముద్రం బెంత కర్ణధారకుఁ డెంత బహుకాననం బెంత పరశు వెంత
పాతకునీ రెంత పర్వతం బది యెంత హరుఁడెంత మృదులపుష్పాస్త్ర మెంత
భీకరఫణి యెంత వాక్కట్టువే రెంత బహురాజ్య మెంత భూపాలుఁ డెంత
యెవ్వరికి దొడ్డుకొంచెంబు లెంచరాదు, నడచు నిటువంటి వెల్ల నీనాటకములు.

సీ. సరసులు పంతము ల్సభలోన నాడరు వీఁగరు రణమున వీరవరులు
కలఁగ రేపట్టున ఘనవివేకులు మదిఁ దప్పరు నీతి యుత్తములు పనుల
దలఁపరు పాపము ల్ధన్యులు గలనైన నలయ రాచారంబునందు బుధులు
నిందింప రొరులను నిపుణులు వాక్రుచ్చి తలఁపరు పరులకాంతల సుజనులు
వదల రెప్పుడుఁ దమయిలువరుస గుణము, వసుధ వీరలు నీప్రభావంబుకతన. 57

సీ. పే లెన్ని పుట్టినఁ బెద్దగా బ్రదుకవు చీమలు పొడమి నశించిపోవుఁ
జెదలు పుట్టలు పెట్టి శీఘ్రమె యడఁగును మిడుతలు వైళమె మించి మడియు
నీఁగలు వడి మూఁగు నీడేల వెంతైన నల్లులు జనియించి నలిసిపోవు
దోమ లుద్భవ మంది తోడనే పొలియును గణుఁదుర్లు తుట్టెలుగట్టి సమయుఁ
బరఁగ నీరీతి దుర్జనుల్ ప్రబలు లైనఁ, బరులఁ బీడించి చెడుదురు పాపములను.

సీ. మలసి యేఁటేఁటఁ బల్మఱును గూసలఁ బెట్టుఁ గంటిమాధరఁ బిల్లికదుపు నొకటేఁ
బాముగ్రుడ్లను బెట్టుఁ బదియునిర్వదియును బ్రదికెనా భూమిపైఁ బాఁజులగుచుఁ
బులులుపిల్లల నీనుఁ బోనఁగనాల్గును నైదు నున్నవా మందలై యుర్వియందు
మకరంబు లెన్నైన మడుగులలోఁ బుట్టు నెగడెనా గుంపులై నేలమీఁదఁ
గ్రూరసంతతి వెలయునే కొంచెపడక, విరివిగా ధర్మసంతతి వెలసినట్లు. 59

సీ. పెంచంగఁ బెరిఁగెనా పృథివిపైఁ గొండలు విత్తిరా యడవుల వివిధగతుల
గాలువ ల్వెట్టిరా ఘనసముద్రములకు నేతంబు లెత్తిరా యేఱులకును
మేఁతలు వెట్టిరా మృగముల కెందైన మఱి యీఁత నేర్పిరా మత్స్యములకుఁ
బెండ్లిండ్లు నేసిరా బెరయుంగఁ బక్షులఁ బూసిరా వాసనఁ బుష్పములకు
నెవ్వ రెవ్వరిఁ బోషించి రెంచి చూడఁ, దలఁప నీదైన రక్షకత్వమునఁ గాక. 60

సీ. అధమునిమొఱ యైన నాలకించుట యొప్పు వినకున్న నానాజ్ఞ విఫల మగును
మెట్టి చూచుట యొప్పు మితి లేనిరాజ్యంబుఁ బోకున్న నలజడిఁ బొందుచుండుఁ
దనసొమ్ము పలుమాఱుఁ దలఁచి కన్గొను టొప్పుఁ గాకున్నఁ దెలియదు కలిమిలేమి

కలయు టొప్పును గులకాంతల వరుసతో మానినఁ బాపంబు తోన కలుగు
మత్తుఁడై యున్నఁ గార్యంబు మట్టుపడదు, వలసి యొల్లమి నేయఁగవలదుపతికి.

సీ. పతిసేయుకార్యంబు భటులచేఁ గూడదు భటులకృత్యంబు భూపతికిఁ దగదు
మగనిస్వతంత్రంబు మగువకుఁ జెల్లదు మెలఁతవిధంబు పెన్మిటికి వలదు
మంత్రియెన్నంబుసామాన్యుఁడుండఁగరాదు సామాన్యుగతి నుండఁజనదుమంత్రి
కరణంబుతోఁ బగ కాఁపువానికిఁ గాదు కాఁపుతోఁ బగ గాదు కరణమునకు
నధికకృత్యంబు లధమునకమరవెందు, నధమకృత్యంబు లధికున కమర వెందు.

సీ. పదుగు రాడినమాట పాటియై ధరఁ జెల్లు నొక్కఁ డాడినమాట యెక్కదెందు
నుఱక యుండినవాని కూ రెల్ల నోపదు నిజముముందఱఁ గల్ల నిలువ దెపుడు
చేసినచేత దాఁచినను బుట్టక పోదు దేవతలకు నైనఁ దీఱ దాస
రాజు చేసినది ధర్మంబై ప్రవర్తిల్లుఁ గపటాత్ముతోఁ బొంపు కడకుఁ గీడు
పుడమిలోకులు మెచ్చంగ నడవవలయుఁ, జలముసాధింపఁ జెల్లదు సభలలోన.

సీ. పరువంబు మీఱినబహుపుష్పజాతులు పదను దీసినయట్టి పరిమళంబు
నలువదియేండ్లపై నరసినవనితలు పొంతఁ జల్లాఱిన భోజనంబు
మిగులఁ బెక్కుదుకులమీఁదటివస్త్రంబు వెలయఁ దొంబదియేండ్ల వృద్ధగజము
ప్రాఁతపంచారమై పరఁగెడుగుఱ్ఱంబు వెసఁ గార మెడలినవీడెములును
ఘనున కివియెల్ల భోగయోగ్యములు గావు. ... ... 64

సీ. నిర్మలు నొకధూర్తు నిందించుఁ గాకేమి త్రోవలఁ గూయదే తొఱ్ఱబులుఁగు
అధముండు సత్క్రియ యుండ నుండిన నేమి దొరలదే విరులలోఁ దుంగపోఁచ
కడఁగి యల్పుఁడు ఘనుఁ గారించుఁ గాకేమి కఱవదే యొకదోమ గంధగజము
దొరతోడ నీచుండు దొడరఁ జూచిన నేమి ప్రాఁకదే బలుమేడ బల్లిపిల్ల
యీడు గాకున్నపను లవి యేల యెంచ, నందునకు నేమి తారతమ్యములు లేవె.

సీ. దుష్టు సూర్యునిదెస దుమ్మెత్తి చల్లినఁ దనపైనె పడుఁగాక దాని కేమి
కొండతోఁ దగరు డీకొని యెంతతాఁకినఁ దల వ్రక్కలగుఁ గాక దాని కేమి
మిడుతలు చిచ్చుపై వడి నెంతయెగసినఁ దామె పొక్కెడుఁ గాక దాని కేమి
వలఁ బడ్డమీ నెంతవడిదాఁక బొరలినఁ దనుఁ జుట్టుకొనుఁగాక దానికేమి
యెదిరిసత్త్వంబు తనసత్త్వ మెఱుఁగలేక, పోరువాఁడెందునవివేకబుద్ధి యంద్రు.

సీ. చెలఁగి యొక్కనిఁ జెఱిచినవాని బ్రతుకును గ్రూరుఁడై బలిమిఁ జేకొన్న పెండ్లి
కల్లలు పచరించి గడియించినధనంబు దూఱులఁ బడునట్టిదొరతనంబుఁ

గపటవృత్తికిఁ జొచ్చి కైకొన్నరాజ్యంబు దయ లేకయుండెడుతపసితపము
నాసతోఁ గైకొన్నయట్టిసన్న్యాసంబుఁ గపటాత్ముదేవాధికారవృత్తి
మనుప నెంతైన నేరదు మరలిమరలి, తొలఁగనీయక దుర్గతిఁ ద్రోచుఁగాని.

సీ. ఎలమిఁ బతివ్రత నెవ్వండు గోరినఁ జెద లంటునే నిప్పసీమలోన
ఘనజితేంద్రియుని నేకాంత డగ్గఱినను గలఁగునే జలరాశి కప్పచేత
ధర్మవర్తనుని బాతకు లేమఱించిన నేఱు నిద్రించునే యెందు నైన
ధీరాత్ము నితరుండు తెమలింపఁగడఁగిన గాలియొకఁడునిచేతఁ గట్టువడునె
యెందునను ధార్మికులకుఁ గీడేల కలుగు, నిజగుణంబులు బలిమిమై నిలుచుఁగాక

సీ. పుచ్చకాయలు దిన్నఁ బోయెడిమంత్రంబు లిచ్చునే ఫలము లెందేరి కైనఁ
గడప దాఁటఁగ లేనిబడు గైనగుఱ్ఱంబు లెక్కునే పౌఁజుపై నెందునైన
నాఁకలి యుడుపనియట్టియాహారంబు బలియించునే మేను పటువుగాను
దగ విరజానది దాఁటనిదేవర లొసఁగుదురే మోక్ష మూరకైన
ధరణి నన్నిటిసామర్థ్య మరసిచూచి, బలువుగల వెల్లఁ జేపట్టి వెలయవలయు.

సీ. జీలువు పెరిఁగిన మాలెకంబము గాదు గొడ్డుఁ బెంచినఁ బాఁడిగోవు గాదు
ధరఁ బంచితం బెంత ద్రచ్చిన నేయి గా దెండమావులును నీళ్లెపుడు గావు
పరఁగ నుల్కలు నూఱు బండిమోకిలఁ గాదు కూర యెంతైనను గూడుగాదు
ఎనుపోతు ఘనమైన నెద్దుతో సరి గాదు కడు నశుద్ధపువాఁగు గంగ గాదు
తొండంబు గలిగిన దోమ యేనుఁగు గాదు కోడి కోయిల గాదు కూత లిడినఁ
బ్రబలి చూపట్టినవి యెల్లఁ బనికిరావు, ధీరుఁడగు నాతఁడొక్కఁడే వీరుఁ డరయ.

సీ. గోడపై సున్నంబు గోఁకినఁ బనికి రా దొడలిపైవాసన యార్చ రాదు
చేతఁ బట్టినయట్టిజిడ్డు లెక్కకు రాదు కోకఁ బెట్టినగంజి కూర్ప రాదు
విసనకఱ్ఱలవన్నె విడిచిన నిల్వదు బచ్చెనగచ్చు చొప్పడదు తివియ
ముగ్గు వెట్టినపిండి మొనసి యట్లకు రాదు మీసలపైఁ దేనె మ్రింగ రాదు
చూడఁ జూపట్టు సిరులెల్లఁజూబులగుచు, గొలఁదివెట్టినఁ దొంటిబాగులకురావు.

సీ. కనకంబుపెం పొక్కగతి గానె భావించి కామంబు క్రోధంబు గట్టిపెట్టి
తిట్టినతిట్టులు దీవన ల్గా విని యలశత్రు మిత్రుఁ గా నాత్మఁ దలఁచి
యట భూమి హేమపర్యంకంబు గాఁ బండి భిక్షాన్నతృప్తిమైఁ బెంపు మిగిలి
కాషాయవస్త్రంబు కౌశేయముగఁ గట్టి నిరతబ్రహ్మధ్యాననిరతుఁ డగుచు
నేకతంబునమౌనియైయిలఁ జరించు, నతఁడు సన్న్యాసియనిమెంచనర్హుఁడగును.

సీ. బలుమూలవాడలో బాఁపనిల్లుండునే నిర్దయులో నేల నిలుచుఁ గరుణ
కప్పకా కొందును గల దని వింటిమే పిఱికివానికి నేల బిరుదు గలుగు
బొగ్గునం దెలంబు పుట్టంగ నేర్చునే యిలమీఁద మోడు సిగ్గేల తలఁచుఁ
గెరలింప రాతికి గిలిగింత గలుగునే కఠినచిత్తుం డేల కరఁగ నేర్చుఁ
గలరు మఱి యిట్టివారలు కష్టజనులు, సరవిఁ దప్పింపవచ్చునే జన్మఫలము.

సీ. గాడిద యెఱుఁగదు గందంబువాసన లేదూరఁబందికి లీల రోఁత
వాడకోడికి నాదివారంబు వలవదు గ్రోఁతికి మఱి తాళిగోణమేల
చిఱుతని కేటికి శీలవంతులయున్కి యెద్దడుకులచవి యెఱుఁగలేదు
వరుసతోఁ గుక్క దేవరబోన మెఱుఁగదు మొసలికిఁ బడిసెంబు మొదల లేదు
సహజమూఢులు నిటువంటిజాడవారె, వానిగుణములు దిద్దంగ వలవ దెపుడు.

సీ. పోలించి దయ్యంబు పుణ్యంబు లెంచునే భయపడ్డవారలఁ బట్టుఁగాక
పాఱునే జేతచేఁ బడి దంచనపుగుండు తనసూటిఁ దప్పక తాఁకుఁగాక
చిచ్చెంతఁ బోయిన సింగార మెంచునే తనగాలివైపున దాఁటుఁగాక
తోలుకరివానలు దొరతనం బెంచునే తగిలి బయట నున్నఁ దడుపుఁ గాక
నీవు నెఱపినమహిమ లేనిఖిలమెల్ల, నట్లు గావలె నప్పటి కట్ల యుండు. 75

సీ. మచ్చరించినవాఁడు మంచిమాటాడిన వెంగె మై తోఁచును వెగటు పోవ
దపనమ్మికైనవాఁ డటు దుడ్డువట్టిన మందుఁడందురుగాని మనసు గొల్ప
దోడఁబాటు గానివాఁ డూరక మ్రొక్కిన సందేహపడుఁ గాని సహజ మెంచఁ
డనుమాన మైనవాఁ డర్థంబు లిచ్చిన వళుకుఁ గా నెంచు విశ్వాసపడఁడు
ఏమి చేసినఁ గపటికి హితవు గాదు, మాఱు మలసినఁ బను లెల్ల మట్టుపడును.

సీ. అపవాది యగువాని నటు చంప వలవదు తా నాడుకల్లలే తన్నుఁ జెఱుచు
సర్వకంటకు నెందు సాధింప వలవదు వసుధవారలగోడు వానిఁ జెఱుచు
నతిమూర్ఖుఁ డగువాని నదలింప వలవదు తనలోనికోపమే తన్నుఁ జెఱుచుఁ
గడునహంకారిని గా దనవలవదు మేనిపై గర్వంబె మిగులఁ జెఱుచుఁ
జెప్పవలవదు బుద్ధి లీచెనఁటులకును, సత్యవిదులకు ధర్మమే జయము గాన.

సీ. కామినీరతుల లోకమువారు నమ్మరు పతితుల విడుతురు బంధుజనులు
గుణవిహీనుని వివేకులు మెచ్చ రింతైన వేఁడఁ బో రర్థులు విగతయశుల
హింసాపరులతోడ నెనయరు సాధువు ల్పరుషాధములపొంతఁ బోరు బుధులు

విద్యారహితులను విద్వాంసు లొరయరు నృపులు చేపట్టరు చపలమతుల
నుర్విమీఁదటనుత్తములొక్కరాశి, యధములొకరాశియాఁగా దెయరసిచూడ.

సీ. కోరి దవ్వుల జూడఁ గొండలు నున్నన చేరి డగ్గఱినను జెట్లు రాళ్ళు
బూరుగు ఫలవేళఁ బుట్టించు నాసల నెక్కి కోసినఁ బండ్ల నెగయు దూది
మిడుఁగుఱుఁబురువులు మెఱుఁగులై యుండును గరఁచిచూచినను బంగారుగాదు
కప్పచిప్పలు వెండికరణిఁ గాంతులు మించుఁ బుటము వెట్టించిన బూది చిక్కు
నెదుటివారలసంపద లెన్నియైన, నడుగఁ బోయిన ఫలియింప వధములకును.

సీ. అపవిత్ర మగునట్టియన్నంబు గొనుకంటె నడవిలోఁ దినుబలుసాకు లెస్స
హితశత్రువై యలయించుచుట్టముకంటెఁ గైవసం బగుశునకంబు లెస్స
బహుదుర్గతులఁ ద్రోచుపరధనంబులకంటె న్యాయార్జితము *తారమైన లెస్స
యపకీర్తిభాజనం బగుభోగములకంటెఁ జిత్తంబులో నాత్మచింత లెస్స
సజ్జనులు మెత్తు రిటువంటిసరవు లెల్లఁ, దక్కినవి యెల్ల రుచు లగుఁ దామసులకు.

సీ. భూమియే దేహంబు పోలించి చూచిన రాజుప్రాణంబు శౌర్యంబు శిరము
గడియించినధనంబు ఘనతరాయుష్యంబు మతి సత్ప్రధాని ధర్మంబు జోడు
కరచరణాదులు కరితురగంబులు ఘనవిచారమునీతి కరుణ దేవి
బలు పైనదుర్గము ల్పంచేంద్రియంబులు సరవిఁ జైతన్యంబు సర్వబలము
కాలపురుషుండవై నీవుఘటన మెఱసి, చేయుచుండుదు రాజ్యంబు చెలఁగిచెలఁగి.

సీ. ఇచ్చకం బాడిన హిత మాను విభునికి మఱి దినం తడఁచిన మనసు విఱుగు
నొదిఁగి వర్తించిన నోడఁబడి దయ పుట్టుఁ బంతంబు మెఱసినఁ బగలు రేఁగు
నోర్పుతోఁగొలిచిన నొసఁగఁజూచు ధనంబు లడుగఁగోరిన వేసటగును మిగులఁ
దలఁపుతో మెలఁగిన వెలయు సంతోషంబు లెరవెరవైయున్న నెడయు భక్తి
మంత్రియగువాఁడుకార్యక్రమమున నిట్లు, తెలిసినడచినశుభములు తేటపడును.

సీ. అడుసు చేతులఁ దివియఁగ వచ్చు నొకవేళ బలిసి యెండిన గడ్డపాఱ వలయు
నాఁకటివేళనే యన్నంబు రుచి యగుఁ దనిసిన నోకిలింతలు గడంగుఁ
దతితోడ విత్తినఁ దఱుచుగాఁ బండుఁ జే నెపుడైన విత్తిన నీచఁబోవు
బంటు నాయావేళఁ బనిగొనవలెఁ గాని యలవాటు దప్పిన నడిచిపడును
వేళవేళలఁ గార్యము ల్వేలయఁజేయ, వలయు నొకయింత దప్పిన వశము గావు.

---

* ఒక చిన్న నాణెము.

సీ. అడవిలోపలిరాజ్య మది యెల్ల మనరాదు బలువుఁడు పైకొన్న బాధసేయుఁ
గ్రూరవర్తనునైనఁ గూర్చియేలుట దగుఁ బగఱఁగూడినవాఁడుభయమొనర్చు
గడినున్నవానితోఁ దొడరుచుండుట యెప్పు నూరకుండిన నతండొత్తఁ జూచుఁ
బలుమాఱు బంటులఁ బొంకుఁ జూచుట మేలు గర్వింతు రిటువలెఁ గాకయున్న
నృపుల కేమఱి యుండుట నీతిగాదు, బహువిధంబుల నెచ్చరి బ్రతుకవలయు.

సీ. దానపాత్రుల కిచ్చుద్రవ్యంబు ఫలియించు విటుల కొసంగిన విఫల మగును
మంత్రపూతాగ్నిహోమము తన్ను రక్షించు బూడిదలో వేల్మి పున్నె మీదు
కాలోచితం బగుకర్మ మీడేర్చు వేళదప్పినసంధ్య విధికి వెలితి
యొరులకు నుపకార మొనరింప శుభ మిచ్చుఁ బరపీడ చేసిన నరక మొదవు
నెఱిఁగిచేసిన ధర్మంబు లెపుడు మనువు, నెఱుక మాలినకృత్యంబు లేమిబ్రాఁతి.

సీ. హితబుద్ధి నడుగుమహీశుండు గల్గినఁ దెలివి బోధించుమంత్రియును గలుగు
వెఱ పేమియును లేనివీరుండు గలిగినఁ దగుపరివారంబుఁ దానె కలుగుఁ
బొందు సేయఁగ నేర్పుపురుషుండు గలిగిన ఘనుఁడైన చెలికాఁడుఁ గలిగియుండు
ఘనరసస్థితి యెఱిఁగినవాఁడు గలిగినఁ గడు మెచ్చఁ జెప్పెడుకవియుఁ గలుగు
వేసరక మంచివారిని వేఁడవలయుఁ, దలఁచి చూచిన నివి యెల్ల దైవఘటన. 86

సీ. తొల్లి పెట్టనిమేలు తొరలి యిప్పుడు రాదు కావలసినపను ల్గాక పోవు
చేసినకర్మంబు చెందక మానదు రాఁగలయర్థంబు రాక పోదు
దైవసంకల్పంబు తప్ప దెంతైనను దనువికారంబులు తగులు నెపుడు
లోకధర్మమునకు లోను గా మనరాదు తగినభోగంబులు తామె కలుగు
వేగిరింపఁగ వలవదు విమలమతికి, సకలమున కోర్చి యుండిన సౌఖ్య మొదవు.

సీ. నిక్కంబువలె నుండు నిండుసంసారంబు మొలచినయట్లుండు మించి సిరులు
కాయంబు దక్కినగతి నుండుఁ దలపోయఁ దనది యైనట్లుండు నొనరి గృహము
సతము లైన ట్లుండు సరసాన్నపానము ల్పాయనియ ట్లుండు బాంధవంబు
లమరిన ట్లుండుదు రటఁ బుత్త్రపౌత్త్రులు చేఁ జిక్కినట్లుండుఁ జిత్త మెపుడు
నింద్రజాలంబొ స్వప్నంబొ యిదియు నొక్క, సిద్ధవిద్యయొ కంటె నీచేఁతలెల్ల.

సీ. ధరలోన నావులు తమదూడలకు నెల్లఁ బెట్టెనా వాములు ప్రియముతోడ
బొక్కలు త్రవ్విచ్చి పోయెనా నక్కలు తమపిల్లలకు నిరంతరము నుండఁ
దలఁచి దప్పికి నీళ్లు ద్రావఁ గూనలకును గట్టెనా చెఱువులు కప్ప లెల్లఁ

ప్రియముతో రతి సల్పి బిడ్డలఁ గనుమని చెప్పెనా సింహంబు శిశువులకును
వట్టిభ్రమతలఁ దమపుత్త్రివర్గమునకుఁ, దల్లిదండ్రులు దలఁతురు ధనము గూర్ప.

సీ. ముదిమి తీఁగెలువాఱి ముంచినకైవడిఁ గడు మేన నరములు గానిపించుఁ
దనమేనుఁ గనుఁగొని తానె నవ్వేడుక్రియ మీసలు గడ్డంబు మిగుల నరయుఁ
బంచేంద్రియములకుఁ బరఁగ నోడితి నని వెన్ను చూపినరీతి వీఁపు వంగు
నుప్పతిల్లినమద ముబ్బు దీసినరీతి నేర్పడు బుడుపు లై యెమ్ము లెల్ల
నిట్టిజరచేతఁజిక్కియు నెడ్డెనరుఁడు, మనసు దనియక భోగించు మనసువెట్టి. 90

సీ. కల్పవృక్షము నెంచి కలివెచె ట్టెంచుట తర మెఱుంగనివారితగవు గాక
కావేరినది నెంచి కాలువ లెంచుట పురుషుల యవివేకబుద్ధి గాక
కౌస్తుభమణి నెంచి కాచంబు నెంచుట జడుల యజ్ఞానంపు నరవిగాక
మందరాచల మెంచి మఱితిప్ప లెంచుట తప్పఁ దెల్పినవారితగవు గాక
ఘనుల నల్పుల నీరీతిఁ గలయఁ గూర్చి, పలుకు చుండెడివారల భ్రాంతిగాక. 91

సీ. సత్సంప్రదాయుఁడై శాస్త్రపారీణుఁడై యాగమజ్ఞుం డై నయతఁడు గురుఁడు
పరమదయాళుఁడై పాపనిర్ముక్తుఁడై యాచారవంతుఁ డౌనతఁడు గురుఁడు
భూరిసుజ్ఞాని యై బోధింప శక్తుఁడై యతిశాంతచిత్తుఁ డౌనతఁడు గురుఁడు
కడుఁ దపోనిష్ఠుఁడై ఘనమంత్రసిద్ధుఁడై యధ్యాత్మవేత్త యౌనతఁడు గురుఁడు
తెలిసి యిటువంటిగురుఁ జేరి వెలయవలయు, సుజనులగువార లీడేఱఁ జూచిరేని.

సీ. అర్థంబు దేహంబు నాచార్యుసొమ్మని యా నాజ్ఞ దప్పక యాస్థ కలిగి
తగినశుశ్రూషకుఁ దను వలవడఁజేసి మతి గల్గి యేప్రొద్దు మఱపు విడిచి
యుపదేశ మిచ్చిన ట్లూహాలం దలపోసి యాహారనిద్రల కాసపడక
వేసర కాత్మలో విశ్వాస మెడలక హరిభక్తి గురుభక్తి నధికుఁ డగుచు
నున్నయాతం డౌశిష్యుఁడిట్లుర్వి మీఁదఁ, బరఁగుశుభమూర్తియతిలోకపావనుండు.

సీ. దైవంబు గురుఁడును ధరఁ గల రని నమ్మి తలపోసి మనుట యుత్తమమతంబు
కలదు వేదము ముక్తి గలదు పుణ్యుల కని మఱి భక్తి సేయుట మంచిమతము
యజ్ఞాదికర్మంబు లఖిలప్రపంచంబు సత్యంబు లనుట నిశ్చలమతంబు
హరి మాయచేఁ జిక్కుఁ డాతఁడే సర్వజ్ఞుఁ డని భజియించుట యాదిమతము
చదివి తెలిసినపెద్దలసమ్ముఖమున, నెఱుఁగువారికి సఫల మా నీమతంబు. 94

సీ. ఉచితకార్యంబు రాజొకమఱి వినకున్న మఱియుఁ జెప్పఁగఁ దగు మాన్యునకును
దగ వెంచ కేలిక తన్నుఁగోపించిన నెగ్గు పట్టఁగరాదు హితున కెపుడు
తనవిభుం డొకకానిపని తప్పి చేసిన నమరఁజేయఁగవలె నాప్తునకును

మఱచిన యధిపతిమనసులోపను లెల్ల నెచ్చరింపఁగవలె నిష్టునకును
సచివునకుఁ బోదు పతి కెన్నిచందములను, హితవుఁగోరక నీతి ననేకగతుల.

సీ. ఆఁకలివహి మాని యై యుండనిచ్చునే పిండి యైనను దినిపించుఁ గాక
శీతోష్ణములు కడుసిగ్గుతో నిల్పునే ప్రేమఁ గంబళముఁగప్పించుఁగాక
సరసకామము బ్రహ్మచర్యంబు నిల్పునే పొంచి యొక్కతెఁ దగిలించుఁగాక
కోరి యాసలు మంచిగుణములునేర్పునే పాపచర్యకు నొడఁబఱుచుఁగాక
యెంతవారికిఁ బంతంబు లెట్లు జరగు, మీకు శరణని బ్రతుకుటే మిగుల నేర్పు.

సీ. కుశలుఁడై ప్రతిమఁ జేకొని తీర్పనగుఁ గాని తనరూపు చక్క దిద్దంగరాదు
మగువల వలపింప మందు గలదు గాని మాఱి దుర్గుణము మాన్ప మందు లేదు
క్రొత్తగా నొకజన్మ మెత్తఁగఁ దగుఁగాని మహిఁ బూర్వదేహంబు మగిడి రాదు
కొలుచులు కృషిసేసి కూర్పఁబన్పడుఁ గాని భుజియించినవి గాదెఁ బోయరాదు
దైవకృత్యంబు లివియేల తప్పనిచ్చు, నుఱకలోకులు భ్రాంతి సేయుదురు గాక.

సీ. సరకులు గొనవచ్చు సాధించి తేవచ్చుఁ గోరి సుజ్ఞానంబు గొనఁగరాదు
తపము సేయఁగవచ్చు ధనముఁ జేకొనవచ్చు భువి నగ్రజన్ముఁడై పుట్టరాదు
కాశికిఁ బోవచ్చుఁ గ్రమ్మఱి రావచ్చుఁ దెలిసి సుషుమ్న భేదింపరాదు
మాని గావచ్చు నేమములు చూపఁగవచ్చుఁ బాత్రమనసు నిల్పంగరాదు
నేర్పులేగతి నెవ్వరు నేర్చిరైన, సరవితో బ్రహ్మవేత్తల సరికి రారు. 98

సీ. కాంచనపాదము ల్గజ్జెలు నందియ ల్గను మించుమెలఁ జంద్రకావిదట్టి
పీతాంబరముమీఁదఁ బిల్లలమొలనూలు బిగియించి కట్టినపెనుకటారి
వరదానకరము నుజ్జ్వలకటిహస్తంబు పటుశంఖచక్రోరుబాహుయుగము
నొఱపైననాభియు నుదరబంధ మురంబు నలమేలుమంగతో హారములును
శిరసుమకుటంబు తిరుమణి చిత్రమకర, కుండలమ్ములుఁ గలమిమ్ముఁ గోరితలఁతు.

సీ. మాధవ గోవింద మధుసూద నాచ్యుత వామన ప్రద్యుమ్న వాసుదేవ
కృష్ణ దామోదర కేశవ శ్రీధర హరి విష్ణు పురుషోత్త మానిరుద్ధ
సంకర్ష ణాధోక్షజ త్రివిక్రమ పద్మనాభ జనార్దన నారసింహ
శౌరి హృషీకేశ నారాయ ణోపేంద్ర తాలాంకముఖనామ తాళ్లపాక
యన్నయాచార్యసుతతిమ్మయాహ్వయుండఁ
బ్రణుతిఁ జేసితిరహిఁగొమ్ము పద్యశతము
కలితలక్ష్మీశ సర్వజగన్నివేశ,
విమలరవికోటిసంకాశ వేంకటేశ ! 100

సంపూర్ణము.

శ్రీ

# గ్రంథస్వీకారము.

పరిషత్తునకు బందరు హిందూహాయిస్కూలు మేనేజరు నాదెళ్ల పురుషోత్తమ కవిగారిచే స్వరచితములు, స్వపరిష్కృతములును, నగు నీమొదటి 18 గ్రంథములు పంపఁబడినవి. వానినెల్ల నభినందనములతో గ్రహించి వానియందలి విషయములును, వానివెలలును బాఠకులకు విశదమగుటకై యీక్రిందఁ బొందుపఱుపఁబడినవి. (వీనిలోఁగావలసిన గ్రంథములు పై కవిగారికి వ్రాసినఁ బడయఁగలరు.)

1. అక్షరాభ్యాసము—ఇది చిన్నపిల్లల కక్షరాభ్యాసముచేసినదాదిగ వారికి సులభముగ వ్రాయుట, చదువుట, మొదలగు వానియందుఁ జాలనుపయోగించును. బాలురు చదువుట కలవడినచో వారే చదువఁగలవియు, లేనిచోనుపాధ్యాయులచే నావశ్యకములుగా బోధింపఁదగినవియు నగు నీతివాక్యము లనేకములు కలవు. దీనివెల. 0—1—6 లు.

2. అంకజ్యోత్స్న—ఇందు మొదటిభాగమున మొదటి తరగతి మొదలు 1, 2, 3 తరగతుల బాలుర కనుకూలములగు లెక్కలు గలవు. రెండవభాగమున మూఁడునాలుగు తరగతుల బాలురకుపయోగించు లెక్కలు గలవు. దీనియందు సామాన్యముగా గృహవ్యాపారమున కుపయోగించు లెక్కలున్నవి. వెల. 1 భాగము. 0—2—6. 2 భాగము. 0—4—0.

3. ప్రైమరీపరీక్షాభూగోళసంగ్రహము—దీనియందు మొదట ఇంగ్లండు మొదలగు దేశములును దరువాత నుత్తర హిందూస్థానమును దరువాత విపులముగాఁ జెన్నపురి రాజధానియు నావశ్యకములగు నంశము లన్నిటితోఁగూడ వ్రాయఁబడినవి. దీనివెల. 0—3—0.

4. పూర్వకర్మశతకము—ఇది మనుష్యుని కష్టసుఖములెల్లఁ బూర్వకర్మవశముననే ప్రవర్తించునని తెలుపు చక్కని పుస్తకము. ఇందుఁ జంపకమాల, ఉత్పలమాల, యనురెండు వృత్తములును సంకీర్ణముగా నున్నవి. దీనియందు సామాన్యముగాఁ బురాణపురుషులగు రామ, ధర్మరాజ, నల, హరిశ్చంద్రాదులనుభవించిన కష్టసుఖములు కొంచెకొంచెముగాఁ దెలుపఁబడినవి. వెల. 0—1—0.

5. అజ్ఞానధ్వంసిని—ఇది కుటుంబమందుండు జనుల యన్యోన్యానురాగ మును దెలుపుచు నొండొరుల కుండవలసిన ధర్మములను దెలుపును. మఱియు నిందుఁ బ్రభుభక్తి, దైవభక్తి మొదలగు వానిని బోధించువిషయములును గలవు. వెల. 0—3—0.

6. లక్ష్మీనారాయణ నక్షత్రమాలిక—ఇది "లక్ష్మీనారాయణ కానుపింపవు గదా చింతించి కీర్తించినన్" అను మకుటముతోనున్న యిరువదేడుపద్యముల చిన్నిపొత్తము. దీనియందుఁ గవిగారు చిన్ననాఁటనుండియు ననుభవించిన వ్యాధి బాధలు మొదలగునవి దయదోఁచునటులు వివరింపఁబడినవి. దీనికి వెల లేదు.

7. జార్జిపట్టాభిషేకము—ఇది రాజభక్తిని దెలుపు చిన్నిపొత్తము వెల. 0—1—0

8. భజనకీర్తన, హారతులు, లాలి, జోల, మేలుకొలుపులు—దీని పేరువల ననే దీనియందలి విషయములు స్పష్టములు. వెల. 0—1—0.

9. అద్భుతోత్తరరామాయణము—దీనికి సీతామాహాత్మ్యమను నామాం తరముగలదు. నాదెళ్ల పురుషోత్తమ కవిగారు రచించినది. 7 ఆశ్వాసములు గలది. కడపటి యాశ్వాసమున బంధములు మొదలగు కవిత్వచమత్కారములు గలవు. 210 పుటల పెద్దగ్రంథము. వెల రు. 1—8—0 లు. ఇందు మూఁడవ యాశ్వాసము 1911 లో బి.ఏ.,కుఁ బఠనీయమైనది.

10. హరిశ్చంద్రనాటకము—ఇదియును బురుషోత్తమ కవిగారిచే రచియింపఁ బడినదియే. వచననాటకము. 196 పుటలు గలది. వెల అ. ౧౦ లు.

11. సోమేశ్వరీయము—ఇదియును బైకవీశ్వరులు రచించినదియే. ఇది బహువిధములగు చమత్కారశయ్యలు గల యొకశతకము, పురుషనీతి స్త్రీనీతి యుఁగల విద్యామాలలు, నానావిధవృత్తములు, నారోహణావరోహణములుగాఁ బార్వతీసోమేశ్వరదేవతామాల మొదలగునవి కల చాటుకావ్యము. 44 పుటల పుస్తకము వెల రు. 0—4—0 లు.

12. రామదాసచరిత్రము—నాదెళ్ల పురుషోత్తమ కవి కృతమగు హిందూ స్థానీనాటకము. 74 పుటలు. భద్రాద్రిక్షేత్రమునందలి రామదాసుగారి చరిత్ర మిందు వ్రాయఁబడినది. వెల రు. 0—10—0 లు.

13. చంద్రహాసచరిత్రము, నాటకము—పురుషోత్తమ కవిగారిచే విరచితము. దీనిలో 90 పుటలలో 10 అంకములు గలవు. వెల రు. 0—12—0.

14. మాహేంద్రపురాణము. ఇందు వెదురుపొదలపుట్టుక, వానివలన చేటలు, బుట్టలు, తట్టలు, మొదలగువాని నల్లెడి మేదరుల చరిత్రమును వర్ణింపఁబడినది. 2 ఆశ్వాసములు. 38 పుటలు. చివర స్కాందపురాణములోని యుత్తరభాగ మందలి 150 వ అధ్యాయము (పై వృత్తాంతమును దెలుపునది) ను గలదు.

15. స్త్రీల మీఁటింగునాఁటి హరికథ, నాటకము—ఉపన్యాస హరికథా ప్రసంగాంచిత పూర్వోత్తర భాగసమన్వితము. 94 పుటలు. వెల రు. 0—4—0.

16. గురుభక్తిప్రభావము—నిర్వచన ప్రబంధము. 6 ఆశ్వాసములు కలది. పేరువలననే దీనిచరిత్రము విశదము. 123 పుటలు. వెల రు. 1—0—0.

17. వేమనసూక్తి రత్నాకరము—వేమనయోగిచే రచింపఁబడిన యనంత ములగు నీతిపద్యములెల్ల నకారాదిగా రాయవరపు పూర్ణయాచార్యులుగారిచే సమకూర్పఁబడి నాదెళ్ల పురుషోత్తమకవిగారిచేఁ బరిష్కరించి యచ్చొత్తింపఁబడిన గ్రంథము. దీన 4035 పద్యములు గలవు. అన్నిపద్యములలో మన కేపద్యము కావలసిన దానిని సులభముగాఁ దెలిసికొన గలుగునట్లు కూర్పఁబడినది. వెల రు. 2—0—0.

18. యాదవాద్రీశోపాఖ్యానము—కామిసెట్టి పేరమదొరగారిచే రచింపఁబడి సరసచతుర్విధకవితాసామ్రాజ్యధురంధరులును, హిందుస్థానాంధ్రభాషాకవి వరు లు నగు నాదెళ్ల పురుషోత్తమశాస్త్రులుగారిచేఁ బరిష్కరింపఁబడిన 42 పుటలు, 3 ఆశ్వాసములును గల పద్యకావ్యము. వెల రు. 0—6—0.

(1) నక్షత్రమాల—ముక్తావళీ గ్రంథమాలలోని మొదటిపుస్తకము. కన్నే పల్లి సాంబశివ రఘురామస్వామిగారిచే మైలాపురీ కపాలీశ్వరునకు సంబోధింపఁ బడి రచింపఁబడిన 27 పద్యముల పుస్తకము. వెల రు. 0—2—0. ఈగ్రంథము, కవిగారియొద్ద చెన్నపురి మైలాపూర్, అడ్మిరాల్టి హవుస్‌లో దొరకును.

(2) తిరుపతమ్మ—గ్రంథకర్తలు, మాకరాజు నారాయణరాజుగారు, కో లాహలం సీతారామరాజుగారును. శ్రీగంపలగూడెము కుమారరాజావారి యా స్థానకవులు, శతావధానులు, సోదరులునగు శేషాద్రి రమణకవులచే రచింపఁబడిన పీఠికయు, 54 పద్యములతోఁ గథయును గల యొక పతివ్రతాసహగమనవృత్తాం తము. దీనిపైని శ్రీగంపలగూడెము కుమారరాజాగారొసంగిన సదభిప్రాయము గూడ నిందుఁ గలదు. వెల రు. 0—1—6.

# 3. శ్రీకృష్ణకవీయము.

బాలకవి కాశీభట్ల కృష్ణరాయశాస్త్రిగారు రచించినది. చిన్నపద్యకావ్యము, శమంతకోపాఖ్యానమను నామాంతరము కలదు. (శ్యమంతకమా? శమంతకమా? యిత్యాదివాద మిప్పటికిని గలదు.) ఇందలి యితివృత్త మిదివఱకు భాగవతము మున్నగు ననేకగ్రంథములలోఁ గనఁబడుచున్నదియే. వర్ణనాచమత్కారమెట్లున్నను బాలకవిగారి భాషాభిలాషకు మాత్రము మెచ్చుకొనక తీరదు.

గ్రంథముల రచింపవలయునను నభిలాషయుండుట మంచిదియే. దానికిఁ దోడు భాషాజ్ఞానమును శుద్ధపఱుపఁగల గ్రంథములఁ జదువవలయు ననుతలంపు గూడ నున్నచో నెంతయు రాణించును. ఇదివఱ కనేకులచే రచింపఁబడిన యీ కథను వీరింత తొందరతో వ్రాయవలసిన యవసరము కనఁబడదు. బాలుఁడను గాన నాగ్రంథమునందలి తప్పుల సరకుగొన వలదని కోరియున్నారు. బాలుని గ్రంథము కావుననే తప్పులు దిద్దికొని నిర్దుష్టముగా వ్రాయవలయునని మెచ్చరించిన వారికిని లోకమునకుఁ గూడ మంచిది. ఇపుడీతప్పుల సవరింపకున్న నిఁక ముందు వ్రాయుగ్రంథములు నిర్దుష్టములుగా నుండునా?

కాళిదాసాదులకైనను గలవు దోషము లని తమగ్రంథము నందలి దోషముల మాటపఱుపఁజూచుటకు బాలకవి గారికిఁ బరిపూర్ణ పాండిత్యమున్నయెడఁ గొంత బాగుండును. మనము ప్రమాదముననో యభిప్రాయభేదముననో తప్పులనుచున్నవానిని గాళిదాసాదులు వాడిరిగాని మొదటనుండియు, యతులు, ప్రాసములు, గణములు, సంధులు, సంస్కృతపదములు, తెనుఁగుమాటలు మొదలగు వానియందుఁ బుటకు మూఁడుచొప్పునఁ దప్పులం జొన్పలేదు. కావున వారి తప్పులవలె వీరితప్పులు మన్నింపఁబడవు. బాలునిగ్రంథమంనుఁ దప్పులెన్నరాదని యెందురా? యితరుల యభిప్రాయము లడుగుటయే యనవసరము. బాలకవిగారికిఁ జేయు హితోపదేశ మేమనఁగా, "నిర్దుష్టభాషాజ్ఞానమును సంపాదించికొని దానికిఁ దోడుగా వ్యాకరణాది జ్ఞానము నలవఱచికొనియే గ్రంథరచనమున నుపక్రమించిన బాగుగనుండును, రచింపఁబడిన గ్రంథములను బెద్దలకుఁ జూపి సవరింపించుటబాగు, కుకవి నింద యుపుడు దీనిలో వ్రాయుటయంత మంచిది

కాదు. ఇందున్న "దిగచ్ఛాశుభ్రిసంభావ్య, చేతు, దర్భేదర్, వాగ్సిద్ధి, అమే యులు యాపురి వైశ్యసత్తముల్, ఘనులఁగొండల పాలుగాఁజేయువంటి, ఘనుల నొక్కొకవేళఁగారించు, బఱగ, వార్ధాటి, అవ్వలి పశ్చిమాచలపుద్వారము, దీర్ఘప్రమాణఛాయమై, ఆటపట్టుయగు, శత్రృవులు, అవతరించెఁ గృష్ణుండు యుత్సవరతుండు, దేవతులు, బంగారువికారమయము, ఉరగలు, చేసుకొని, తలిచె, మొదలగు తప్పులను సవరించికొనవలయు" నని. కవిగాఁ దలఁచినవాఁడు పదములందలి తప్పొప్పుల నైన బాగుగాఁ దెలిసికొనవలయును. తలఁతు నను టకుఁ ద(లు)తునని యతిస్థానమునఁ బెట్టరాదు. శ్రేష్ఠమో, శ్రేష్టమో తెలియ వలయును. శ(త్రృ)వులనియతిలో నతికించుటతప్పు. "కృష్ణుండు యుత్సవరతుండు" ఉకారసంధి నిత్యతవలన దిద్దిన గణముచెడును. బాలకవిగారు భారతాది గ్రంథ ములను జక్కఁగాఁ జదువవలయును. గుణము చూడవలయునుగాని గణమున కాశింపరాదు. భాషాభిమానులగు బాలురఁ బ్రోత్సాహము చేయవలయునని కోరిరిగాన వారిశ్రేయమునకే పయిరీతిని వ్రాసినారము.

ప. అ.

## ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటిత గ్రంథములు.

### (1) విప్రనారాయణచరిత్రము.

పన్నిద్దఱాళ్వారులలోఁ జేరిన తొండరడిప్పొడియాళ్వారుచరిత్రము. కవిత్రయములోని ఎఱ్ఱాప్రెగడ "చిన్నిమనుమఁ" డగు చెదలవాడ మల్లయకవిచే రచియింపఁబడిన యపూర్వగ్రంథము. సర్వవిధముల నుత్తమప్రబంధములలో గణింపఁ దగినది. వైజయంతివిలాసముకన్న మిన్న. ౫ ఆశ్వాసములు ౬౮ పుటలు. సవిమర్శమైన ౧౮ పుటల పీఠిక. వెల రు ౦—౮—౦

### (2) ఆంధ్రవచనజైమినిభారతము.

రెండువందలసంవత్సరముల క్రిందట మధురాపురీశ్వరుం డగు విజయరంగ చొక్కనాథుని యాస్థానకవియు, సామాజికుఁడు నయిన సముఖము వేంకట కృష్ణప్పనాయఁకునిచే రచియింపఁబడినది. భాష సలక్షణము, శైలి మనోహరము, ధారయనర్గళము. ఆంధ్రభాషాపరిచయు లందఱు ముఖ్యముగాఁ జదువవలసినది. 328 పుటలు. ఆంధ్రమునను, ఇంగ్లీషునను బీఠికలు గలవు. వెల రు ౦—౧—౨—౦

పరిషత్సభ్యుల కీ గ్రంథములు సగము వెలకే యీఁబడును.

తపాలావ్యయములు కొనువారే భరింపవలయును.

### (3) కవిజనాశ్రయము.

కొలఁది దినములలో సిద్ధమగును.

కావలసినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులకు, 12 అరుణాచల నాయఁక వీధి, చింతాద్రిపేఁట, చెన్నపురి, వ్రాసినఁ బడయఁగలరు.

# ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల.

నిడదవోలు,        జిల్లా.

## ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

నిడదవోలు. కృష్ణాజిల్లా

ఇందు రెండుమాసముల కొకనవలచొప్పున వెలువడుచుండును డెమ్మీసైజున నూఱుపేజీల కారణాలచొప్పున పోస్టేజిసహా భరించి చందాదారులకును, పోస్టేజిగాక యితరులకు 0-8 0లు చొప్పున నిచ్చెదము. ఎన్నివందల పేజీలనవల లైన ఒకరూపాయికి మించియుండదు. ప్రవేశ రుసుముగా 0 2-0లు ఈయవలయును అన్నియు క్యాలికోబయిండుగల చక్కని నవలలు.

## వెలువడిన నవలలు.

| | చందాదారులకు | | ఇతరులకు. | |
|---|---|---|---|---|
| * దుర్గేశనందని | 0 | 12 | 1 | 0 |
| * వసుమతీవసంతము | 1 | 0 | 1 | 8 |
| లలితచంద్రహాసము | 0 | 10 | 0 | 14 |
| * మృణ్మయి | | 0 | 1 | 5 |
| * సీతారామ | | 0 | 1 | 8 |
| * నూర్జహాను | | 0 | 1 | 8 |
| రాజసింహ | | 0 | 1 | |
| మాధవీలత | | 0 | 1 | |
| మృణాలిని | | 0 | 1 | |
| మనోరమ | | 0 | 1 | |
| దురదృష్టవంతులు | | 0 | 1 | |
| విషవృక్షము | | 0 | 1 | |
| ప్రమదావనము | | 0 | 1 | |
| వంగవిజేత | | 0 | 1 | |
| శోకాభంగము | | 0 | 1 | |
| నవాబునందిని | | 0 | 1 | |
| దృఢప్రతిజ్ఞ | | 0 | 1 | 8 |

* ఈగ్రంథములైదును, హైస్కూళ్లలోని 4, 5, 6, ఫారములకు పఠనగ్రంథములు (Text Books)గా, టెక్స్టుబుక్కు కమిటీవారిచే నామోదింపఁబడినవి

**N. B.** వసుమతీవసంతము 1916 సంవత్సరము పరీక్షకు ఇంటరుమీడియేటు క్లాసునకు టెక్స్టుబుక్కుగా యూనివర్సిటీవారిచే నిరయింపఁబడినది.

## అనుబంధ గ్రంథమాల.

అతిమనోహరంబులును, రసవంతములును, నీతిదాయకములును నగుచిన్ని చిన్నినవలలను ముద్రించి మా యాంధ్రప్రచారిణీ గ్రంథమాలిక కనుబంధములుగాఁ బ్రకటించుచున్నాము. ఈ నవలలన్నిటిని జనసామాన్యమునకంతకు నందుబాటుగానుండునట్లు స్వల్పమూల్యమునకుఁ బంపుచున్నాము. ఇందును మాచందాదారుల కితరులకిచ్చువెలకంటె తగ్గించి యిచ్చుచున్నాము.

| | చందాదారులకు. | | ఇతరులకు. | |
|---|---|---|---|---|
| | అ. | ప. | అ. | ప. |
| రాధారాణి ... | 4 | 0 | 4 | 0 |
| యుగళాంగుళీయకము... | 3 | 0 | 3 | 0 |
| రాజభక్తి ... | 2 | 0 | 3 | 0 |
| లీల ... | 3 | 0 | 4 | 0 |
| సాధన ... | 5 | 0 | 7 | 0 |
| ఇందిర ... | 3 | 0 | 4 | 0 |
| హారావళి ... | 3 | 0 | 4 | 0 |
| ప్రభావతి ... | 2 | 0 | 3 | 0 |
| మాలతి ... | 1 | 6 | 2 | 0 |
| కమలాకాంతుఁడు ... | 1 | 6 | 2 | 0 |
| పరిమళ ... | 6 | 0 | 8 | 0 |
| రజని ... | 6 | 0 | 8 | 0 |
| నీరద ... | 5 | 0 | 7 | 0 |
| సీతావనవాసము ... | 5 | 0 | 7 | 0 |
| ఉన్మాదిని ... | 3 | 0 | 4 | 0 |
| సంతాపకుఁడు ... | 4 | 0 | 5 | 0 |
| ఆరణ్యిక ... | 6 | 0 | 8 | 0 |
| వియోగిని ... | 3 | 0 | 4 | 0 |
| కృష్ణకాంతునిమరణశాసనము. | 6 | 0 | 8 | 0 |
| అమృతపులినము ... | 6 | 0 | 8 | 0 |
| వ్యాఘ్రాచార్యబృహల్లాంగూలము... | 2 | 0 | 2 | |
| ఉన్మత్త | 2 | 0 | 2 | |
| చంద్రసేనుఁడు | 3 | 0 | 4 | |

చందా సం॥ కు రూ. ౩—౦—౦.　　　　విడిసంచిక రూ. ౦—౫—౦

సంపుటము ౫.　　నళనామసంవత్సరము.
కార్తికము, మార్గశిరము.　　సంచిక. ౮, ౯.



# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక.

ప్రతిమాసమునఁ గడపటివారములోఁ బ్రకటింపఁబడును.

**(Journal of the Telugu Academy.)**

## ప్రధానవ్యాసములు.



చెన్నపురి.

# విషయసూచిక

ఓం నమశ్శివాయ.

# ఆముక్తమాల్యదయోగ్యత.

[ఈ వ్యాసము చెన్నపురి "పవెల్ అండు మూర్ హెడ్ వర్నాక్యులర్ ప్రైజు" నకుఁగా వ్రాయఁబడి తత్పరీక్షాధికారులచే బహుమానముం గొనినది.]

శ్రీకృష్ణదేవరాయలచే రచియింపఁబడిన 'ఆముక్తమాల్యద' యను గ్రంథరాజముయొక్క యోగ్యతవిషయమే యీవ్యాసముయొక్క ముఖ్యోద్దేశమగుటచేతఁ గృష్ణదేవరాయలచరిత్రముకాని యాగ్రంథముయొక్క చరిత్రముకాని యాగ్రంథకర్తృత్వచర్చకాని యిక్కడ నెంతమాత్ర మావశ్యకము కాదు. కనుక యాముక్తమాల్యదయొక్క యోగ్యతవిషయమే తర్కింపవలసి యున్నది. ఆయోగ్యతయు మూఁడుసంగతులఁబట్టి చర్చించి స్థాపింపవలసియున్నది. అవి యేవన—భాష, సాహిత్యము, కవిత్వము. ఈమూఁడువిషయములయందు నాధిక్యముం గుఱించి చర్చ చేయవలసి యున్నది. అందు మొదట సాహిత్యాలేక గ్రాంథిక యోగ్యత (Literary value) ను గుఱించిచర్చఁ జేసెదను.

సాహిత్యశాస్త్రము (Literature) నందు నాముక్తమాల్యద మిగుల ముఖ్యతఁ జెందినగ్రంథమై యున్నది. దీనికిఁ గారణములు రెండుగా నగపడుచున్నవి. మొదటికారణ మేమనఁగాఁ గృష్ణదేవరాయలకుఁ బూర్వము ప్రబంధరచన యన నెట్టిదో తెలియకయుండె. ప్రబంధరచన నూతనముగ నీమహాకవీశ్వరునితోఁ బ్రారంభమైనదనుమాట యెంతమాత్రము కల్లగాదు. కనుక యాముక్తమాల్యద ప్రబంధరచనకుఁబుట్టినిల్లై యాంధ్రవిద్యాశాస్త్రమహాపథములో నొక గొప్ప మైలుఱాతిని స్థాపించె ననుట యతిశయోక్తి కానేరదు. ఇఁక రెండవకారణ మే మనఁ గృష్ణదేవరాయలకుఁ బూర్వపుఁగవు లందఱు సంస్కృతగ్రంథములనుండి భాషాంతరీకరణములు చేయుచు వచ్చెడివారు. అట్టి భాషాంతరీకరణములు ముఖ్యముగఁ బురాణములు నితిహాసములునై యుండె ననియు వానియందుఁ గేతనకవిచేతఁ దెలిఁగింపఁబడిన దండి దశకుమారచరిత్రయు, శ్రీనాథునిచేఁ దెలిఁగింపఁబడిన శ్రీహర్షుని నైషధము మున్నగుగ్రంథములు ముఖ్యములైన వనియు మ-రా-రా-శ్రీ, కందుకూరి వీరేశలింగముపంతులుగారు తమచే

రచియింపఁబడిన 'ఆంధ్రకవులచరిత్ర' మందు స్పష్టముగ వ్రాసియున్నారు. ఇం తియకాక కృష్ణదేవరాయలతోనే స్వకపోలరచనలు ప్రారంభ మాయెను. అం తకు ముందు స్వకపోలరచితప్రబంధము లెక్కడను గానరావయ్యె. కనుక యాముక్త మాల్యద ముఖ్యముగ నీరెండుకారణములచేత నాంధ్రగ్రంథసముదాయమునందు స్వోన్నతస్థాన మేర్పఱుచుకొని వృద్ధి నొందెను. శ్రీకృష్ణదేవరాయలు 'మదాలస చరిత్ర, సత్యభామాప్రీణనము, సకలకథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి, రస మంజరి,' మున్నగు సంస్కృతగ్రంథముల రచియించె నని "విష్ణుచిత్తీయ" మను నామాంతరము గల యీయాముక్తమాల్యదఁబట్టి విశదముగఁ దెలియుచున్నది. పైఁ జెప్పినవిషయమును దృఢపఱుచునిమిత్తమై మ-రా-రా-శ్రీ, కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారు రచియించిన మహమ్మదీయమహాయుగమునుండి యీక్రిందివిషయముఁ దీయుచున్నాఁడ. "ఆముక్తమాల్యదకు విద్యాశాస్త్ర (Literature) మందుండుస్థానమును మనము బాగుగ మెచ్చవలసినచో నాకా లపుఁ గవిత్వముయొక్క సామాన్యలక్షణములఁ బరీక్షించి చూడవలెను. సం స్కృతభాషకు భోజవిక్రమప్రభుత్వములును, ల్యాటిన్ భాషకు 'అగస్టస్' చక్ర వర్తిపాలనయు, ఇంగ్లీషునకు 'ఎలిజబెత్' రాణియొక్క రాచఱికపు దినములు నెట్లు శుభప్రదములో తెలుఁగునకుఁ గృష్ణదేవరాయనికాల మట్టిదియే. అప్పుడు తెలుఁగులో స్వతంత్రప్రబంధరచన ప్రారంభింపఁబడెను. అంతకుఁ బూర్వపుఁ దెలుఁగు కవులు సంస్కృతగ్రంథములను దెలిఁగించుటయే తమపని యని తలఁచిరి. వారిలోఁ గొందఱు మృదుమధురశైలినిఁ దెలిఁగించినవారై యుండిరి. ఈ కా లపుఁ (రాయలకాలపు) గవులు సంస్కృతగ్రంథములలోనుండి కొంచెము కథ గ్ర హించి దానిపై స్వతంత్రకావ్యరచనఁ జేయసాగిరి. రసపోషణమే యీకాలపుఁ గావ్యముల ముఖ్యలక్షణము. ఈకాలపుఁ గవులలో నొకఁడగు మాదయగారి మల్లన, కావ్య ముండవలసినవిధము నిట్లు వర్ణించియున్నాఁడు.

క. "చెప్పఁ దగుఁ గవిత రసము, ల్చిప్పిల నప్పప్ప బళి! బళీ! యన లేదా
యెప్పుడుఁ జెప్పక యుండుట, యొప్పు సుమీ సుకవి యెంత యుచితజ్ఞుఁడో కో."

ఇఁక రెండవవిషయ మైనట్టి భాషావిషయము (Linguistic) నందు నా ముక్తమాల్యదకుఁ గల ముఖ్యతనుగుఱించి యాలోచింతము. విద్యాశాస్త్రవిష యమం దెటులో యటులే భాషావిషయమందుఁ గూడ నీగ్రంథ మెక్కువ మైన ప్రాముఖ్యముఁ గాంచెను. కృష్ణదేవరాయ లుభయభాషలయం దసాధారణ

పాండిత్యముఁ గలవాఁ డయ్యు నాముక్తమాల్యదయందు నాంధ్రవ్యాకరణ దోషములు కనఁబడుచున్న వనువిషయ మత్యంత మైనయాశ్చర్యమును విచారముఁ గూడఁ గలిగించుచున్నది. ఈవిషయము ప్రతిపాఠకునకుఁ దేటతెల్ల మగుచున్నది. ఆవ్యాకరణదోషము లేవియో పరీక్షింపకముందు వానితో సంబంధించిన యొకచిన్నవిషయమునుగూర్చి యించుక విచారింతము. ఆముక్తమాల్యద కృష్ణదేవరాయలచేత వ్రాయఁబడలే దనియు నాస్థానవిద్వాంసుఁ డైనయల్లసాని పెద్దన్నచే రచియింపఁబడి కృష్ణదేవరాయలపేరిటఁ బ్రచురింపఁబడె ననియు నొక వదంతి కలదు. అట్టివదంతికి నెంతమాత్రము వీలు లే దని పెద్దనగ్రంథ మైనస్వారోచిషమనుచరిత్రమును గృష్ణదేవరాయలగ్రంథ మైన యాముక్తమాల్యదను జదివి పోల్చి చూచిన యెడల విశద మగుచున్నది. ఏల యనఁగాఁ గృష్ణదేవరాయల గ్రంథములోఁ గన్పడు వ్యాకరణదోషము లేవియుఁ బెద్దనమనుచరిత్రమందుఁ గానరావు. ఇఁక నాముక్తమాల్యయందుఁ గానవచ్చు వ్యాకరణదోషములఁ బరీక్షించి యుదాహరించెదను. అట్టిదోషములలో నికారసంధులు, తత్సమశబ్దములం దకారసంధులు, క్త్వార్థకసంధులును ముఖ్యము లైనవి. క్రమమున వానిఁ బరీక్షించినచో నికారసంధు లీక్రిందిపద్యములందు స్పష్టముగఁ గనఁబడుచున్నవి.

"నింగిటు త్రిశంకు కతన మాతంగవాటి." ఆ. ౨.

ఇచ్చట 'నింగి + ఇటు = నింగిటు' అని ప్రయోగింపఁబడినది.

" నిట్టతాడువంటతివరమించె." ఆ. 5.

ఇందు 'నిట్టతాడువంటి + అతివ = నిట్టతాడువంటతివ' యని ప్రయోగింపఁబడినది.

ఇఁకఁ దత్సమములం దకారసంధు లీక్రిందిపద్యములందుఁ గానఁబడుచున్నవి.

"వడఁకుటెకాక చేష్టుడిగె వక్షము పక్షులు జానువుల్ చొరన్." ఆ. 4.

ఇందు "చేష్ట + ఉడిగె = చేష్టుడిగె' అని ప్రయోగింపఁబడినది.

"ప్రోల్చెడనికడంక దంచెనవుఁజేతుల గంగనుకాసె దూఱఁగా." ఆ. 2.

ఇక్కడ 'గంగ + అను = గంగను' అని ప్రయోగింపఁబడినది.

"ఈబ్రక్కందివ్విజుఁ జూడరయ్య సభవారీరంగభర్తంచు." ఆ. 6.

ఇచట 'రంగభర్త + అంచు' రంగభర్తంచు' అని ప్రయోగింపఁబడినది,

మూఁడవది యైనక్త్వార్థకసంధి యీక్రింద నుదాహరింపఁబడుపద్యము నందుఁ గానవచ్చుచున్నది.

సీ. కొంగవాల్ను జుంకులంగుళులఁ బట్టుకజబ్బలంటఁ గట్టిడవెజ్జునరయువారుఁ
దలఁబడ్డగుదియదెబ్బలఁ బొతమసియిడియుంబలి గంజిండ్లనడుగువారుఁ
దమనేగిఁ జెప్ప లో దయమీఱ విని చీరఁ జించిచ్చువారి దీవించువారు
నొలఁబడ్డనెపమునఁ గలలేని సిరిఁజెప్పి చుట్టలపై దాడి వెట్టువారు

గీ. నైనపాంథులచేతఁ గ్రిందైనయూళ్లు, జాడఁగానిటఁ దెచ్చియిన్నీడడించి
వారునీరానఁ బోవనవ్వారిమగిడి, వచ్చునాలోన నీరూపువచ్చెనాకు. ఆ. 6.

ఇందు చించి + ఇచ్చు = చించిచ్చు' అని క్త్వార్థకసంధి ప్రయోగింపఁబడినది. ఈ పద్యమునందే యితరదోషములు కూడ నున్నవి. మొదటిచరణమున 'పట్టుక' అనుశబ్దము పట్టుకొని యనుటకు బదులుగా నుపయోగింపఁబడినది. రెండవచరణమందు 'గంజి + ఇండ్లక్ = గంజిండ్లక్' అనియుఁ బ్రయోగింపఁబడినది. మఱియు,

పుట్టున్నీగెద దీనినానొదవియోపుణ్యాత్మ యెట్లుంటివే. ఆ. 6.

"పుట్టుక్ + ఈగెద = పుట్టున్నీగెద ' అని వ్యాకరణవిరుద్ధప్రయోగము చేయఁబడినది.

ఈ పైఁజెప్పినదోషములు కాక రేఫసంబంధదోషములు కూడఁ గానవచ్చుచున్నవి. అట్టిదోషము లీక్రిందిపద్యములం దుదాహరింపఁబడుచున్నవి.

"సదన మిఁ కొక్కమా టరసి చంచలలోచనఁ గానకున్న దూ
రెదు మఱి కానిబుద్ధి విపరీతతఁ బొందక చూడుమా."

ఈపద్యమందు 'దూఱు' అనుశబ్దమునకు 'దూరు' అని లఘురేఫముఁ బ్రయోగించినందుకుఁ దిమ్మకవి యాక్షేపించినాఁడు. ఈవ్యాకరణదోషము రేఫ ఱకారమైత్రి యని చెప్పఁబడుచున్నది. మఱియు,

చ. తరుణులకౌఁగిట న్మనుచుఁ దమ్మి వృథా విరు లెత్తు చేసి మో
సరులుగఁ జైత్రుఁ డంచుఁ దదభావమనోభవవహ్ని వేల్చి ని
ర్భరమధుపాళిధూమముఁ బరాగపునీరును దేనెకట్టె చా
దరుదుగఁ దాల్పఁగాఁ గొఱవు లై యెఱుఁగంబడెఁ గొన్నిభూజముల్.

'కొఱవి' శబ్దమునకు రెండర్థములు కలవు. ఒకయర్థము చల్లారినకఱ్ఱ. రెండవయర్థము కురవకవృక్షము. ఈపద్యమునందు రెండవయర్థముతో నాశబ్ద

ముపయోగింపఁబడినది. అటు లుపయోగించినపుడు గురురేఫం బుండఁగూడ దని యాక్షేపణ కలదు.

ఇట్టివ్యాకరణదోషము లందందుఁ గానఁబడుచున్నను, ముం దుదాహరింపఁ బడఁబోవు కన్నడభాషయం దుండు శబ్దము లందందుఁ గనఁబడుచున్నను, నాముక్తమాల్యదవిలువకుఁ గాని తత్కర్త యగుకృష్ణదేవరాయల సుప్రసిద్ధనామధేయమునకుఁ గాని యొకపెద్దకొఱఁత గలుగఁబోదు. పైఁగా గ్రంథకారుని కవితాస్వాతంత్ర్యము నీదోషములు వెలువడఁ జేయుచున్నవి. తక్కినగ్రంథకారుల వలె వ్యాకరణసౌష్ఠవమున కై కవిత్వసౌందర్యము నప్రధానముగఁ జేయక, కవిత్వసౌందర్యమునకే వ్యాకరణసౌష్ఠవమును లోనగునట్లు చేయుటచేత వైయాకరణ సూత్రజాలములను భేదించి తనస్వాతంత్ర్యమును నాంధ్రగ్రంథసముదాయము నందు నిలిపి కృష్ణదేవరాయలు తెలుఁగుభాషను బాగుగ వర్ధిల్లునటులు సేసెను. ప్రధానాంశములలో మూఁడవదియు మిక్కిలి విలువగల దైనకవిత్వాంశముఁ బరీక్షించెదను. ఆముక్తమాల్యదఁ జదివి చూచినవారి కెల్లరకు మొట్టమొదట విశద మగువిషయ మే మనఁగా గ్రంథకారునియొక్క యసాధారణ మైనయుభయ భాషాపాండిత్య మై యున్నది. సంస్కృతమునందును దెలుఁగునందు ననర్గళ మైన ధార కవి కున్నట్లు పద్యములఁ గొన్ని చదివిచూచినయెడలఁ దెల్ల మగుచున్నది. అందుచేతనే "సాహితీసమరాంగణసార్వభౌముఁ" డనుబిరుద మాతని కీయఁ బడెను. ఈక్రిందిపద్యములు కవియొక్క సంస్కృతపాండిత్యముఁ దెలియఁజేయు చున్నవి.

శా. తారుణ్యాతిగ చూతనూత్న ఫలయుక్తైలాభి ఘారస్వన
ద్ధారాధూపితశుష్యదంబు హృతమాత్స్యచ్ఛేదపాకోద్గతో
ద్గారంపుంగన రార్చుభోగులకు సంధ్యావేళలం గేళికాం
తారాభ్యంతరవాలుకాస్థితహిమాంతర్నారికేళాంబువుల్. ఆ. 2.

శా. నిత్యంబు న్బ్రతిహారివాద మగుట న్విజ్ఞప్తి లే కంపఁ దా
నత్యూర్జస్వలుఁ డౌట భూపతియు సభ్యవ్రాతము న్శంకమైఁ
బ్రత్యుత్థానముఁ జేసి మ్రొక్కఁగ సభాభాగంబు సొత్తెంచి యా
న్నత్యప్రోజ్జ్వలరాజదత్త వరరత్నస్వర్ణపీఠస్థుఁ డై. ఆ. 3.

శా. అర్థావాగ్విబుధ మ్మహావచనకవ్యాహార మాహావచ
స్సిద్ధ మ్మాఃకృతతాం గతః కలి రితి శ్రీసూక్తివిద్యాధర

మ్మిద్ధాద్ధత్య మగా ల్లయం హి కుధియా మిత్థం వదత్కిన్నర
మ్మద్ధీరాగ్రణిగెల్పుటుత్సనమునం దయ్యె న్నభమ్మంతయున్. ఆ. 4.

ఈవిధమునఁ బెక్కుపద్యములందు సంస్కృతపదము లెక్కువగ నగపడు చున్నవి. అందుచేత నీవిషయమందు నీతని నాంధ్రభారతమునందుఁ గొంతభాగ మును రచియించిన యెఱ్ఱాప్రెగడార్యునకుఁ బోల్పఁ దగును. ఎఱ్ఱాప్రెగడార్యు పద్యము నొకదానిఁ గూడ నుదాహరించినయెడలఁ బైనిజెప్పినవిషయము సు బోధ మగుచున్నది.

సీ. లాలితయావనోజ్జ్వలవిలాసములం దిలకింప సుందరా
భీలవిచేష్టితం బమరభీమమనోభవసింహరేఖ మై
వ్రాలవె యింక నీ వెలమి వామవిలోచన లంగజన్మలీ
లాలస లై విపత్తులు భయాలసు లై ధృతియేది చూడఁగన్.

సంస్కృతమునకంటెఁ దెలుఁగుబాసయందుఁ గవికిఁ బక్షపాత మున్న టులు పుస్తకమునం దెక్కువభాగమందలిపద్యములు విశదీకరించుచున్నవి 'దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స'యని కృష్ణదేవరాయలే చెప్పియుంటఁ బైవాక్యము దృఢీకరింపఁబడుచున్నది. ఈవిషయ మీక్రిందిపద్యములచేత నుదాహరింపఁబడు చున్నది.

చ. ఒదవెడుజవ్వనంబు వెలి కొత్తఁగఁ బయ్యెద సిగ్గుఁ గూడి బి
ట్టదుమఁగ లేఁతలౌట దిగ నాకకుమీఱును లేక వక్షపుం
జదువునఁ బ్రక్కల న్మెఱసి చప్పట లై మఱి లావుఁగూడఁ బైఁ
బొదలెననంగఁ బిక్కటిలెఁ బొల్తుకచన్నులు నాఁడునాఁటికిన్. ఆ. 5.

సీ. ఇడిసిన యిడుపులయెడలఁ బొట్రేటే నుత్తరేను గసెంద కోరిందపాదలఁ
గెడసిన గరిసెలక్రిందలాఁగలఁ గ్రుస్సి యదవకాఁపురముండు నాఖుతతుల
సగముదుమ్మునఁ బూడి చిగిరింత వామూయఁ బెరిఁగిననూతిపాఁతఱబొఱియలఁ
జీమలు ప్రాలీడ్వఁ జివికినవెలుగుపట్టునఁ బండి యెండి క్రుంగినగునుకులఁ
గీ. బెంటదొగ్గళ్ళలోఁ గడుపంటిశ్మశ్రుచలనములఁ గ్రుక్కుజీర్ణాతువులఁ బొలంబు
దుండు గలమళ్ళయారులఁ దూలిరాఁడు, చిక్కు నేతాలపాడరిసీమఁజూచు. ఆ. 6.

ఈవిధముగ ననేకము లైనపద్యములందు మిక్కిలి యచ్చతెలుఁగు పద ములు విలసిల్లుచున్నవి. ఈ విషయమునఁ గృష్ణదేవరాయని గూచిమంచితిమ్మ

కవికిఁ బోల్పవచ్చును. ఇందునిమిత్తమై తిమ్మకవిపద్య మొకదాని నిం దుదాహ
రించుచున్నాఁడు.

చ. జగములతల్లి యై పుడమిజవ్వనిగాదిలిపట్టి యైనయి
  మ్ముగుదలమిన్నఁ దెచ్చితివి మోస మెఱుంగక నీకుఁ
  దగ దిది యంచుఁ దెల్పఁ గలదంటలు గల్గమిఁ జేసి యిట్టికీ
  డగపడె నింక నైన విడనాడక రామునిప్రాపు చేరుమీ.

ఈపద్యము తిమ్మకవివిరచిత మగునచ్చతెలుంగు రామాయణంబునం
దున్నది.

ఇకఁ గవియొక్క శైలీవిషయ మై విచారింతము. ఆముక్తమాల్యదలో
నుండుపద్యము లన్నియు దాదాపుగా శ్రుతికటువు లై యందువలనఁ గష్టతరము
లై యున్న వనుమాట కెంతమాత్రము సందియము లేదు. సాధారణముగ గ్రంథ
మునం దేపద్యముఁ దీసి చూచిన నీశ్రుతికాఠిన్యము విశదము కాకపోదు. శైలి
యందు మృదుత్వ మనునంశ మాముక్తమాల్యదకు నూతనవిషయ మని చెప్ప
వచ్చును. ఆముక్తమాల్యద పెద్దనార్యకృతము కా దని చెప్పుటకు నీశైలీకాఠి
న్యము కూడ నొకదృఢసిద్ధాంత మై యున్నది.

మనుచరిత్రముయొక్క శైలీమృదుత్వముకాని యల్లికలుకాని సహస్రాంశ
మునఁ గూడ నాముక్తమాల్యదయందుఁ గానఁబడవయ్యె. మిగులఁ గటుపద
భూయిష్ఠ మగుటయే యాముక్తమాల్యదఁ బెక్కురు పఠింపకుండుటకు ముఖ్య
కారణములలో నొకటి యై యున్నది. గ్రంథ మించుకయైనఁ జదివినవారి కీవిషయ
ముదాహరింప ననావశ్యకము. అయిన నొకచిన్నపద్యముచే నుదాహరించెద.

చ. గగనము నీరుబుగ్గ కెన గా జడివట్టిన నాళ్ళు భార్యక
  న్బాగ సొరకుండ నారికెడపుంబొఱియ ల్దవిలించి వండ న
  య్యగపల ముంచి పెట్టఁ గలమాన్నము నొల్చిన ప్రప్పు నాలుగే
  న్బాగిపినకూరలు న్వడియము ల్వరుగు ల్పెరుగు న్ఘృతప్లుతిన్. ఆ. 1.

పై నుదాహరించిన ప్రకారము శైలి యెంత రచనాననుగుణముగాను
శ్రుతికఠినముగాను నున్నను గ్రంథమునందు విస్తరింపఁబడినకథకుఁ దగినటు లున్న
దని చెప్పక మానదు. మతవిషయక మైనయంశములను వర్ణించుటకుఁ గూడఁ
దగినటు లుపయోగింపఁబడినది. అందులకు దృష్టాంతముగా నీక్రిందిపద్యము
నుదాహరించుచున్నాఁడ.

సీ. జగదుద్గతికిని బీజము ప్రధాన మన సీక్షత్వాదివీశునశబ్దవాదిఁ
బొరి నీశుఁ డే నని భోగమాత్రేత్యాద్యుదాహృతిస్ఫూర్తి మాయావివాది
ఫలియించుఁ గ్రియ యనా ఫలమతయిత్యాదిసర్వేశుఁ గొననియపూర్వవాది
శాస్త్రయోనిత్వాదిసరణి నీశ్వరునిఁ దెల్పెడునునుమాన మస్పీలువాది

గీ. నిత్యులం దెల్ల నిత్యుఁ డన్స్మృత్యుయా క్తి, క్షణికసర్వజ్ఞ తేశ సౌగతవివాది
ననుపపత్తేర్న యనుసూత్ర మాదియైన, వాని నృపతీశుఁ బ్రత్యక్షవాది గెలిచె.

ఇందుఁ గవికిఁ గల మతశాస్త్రజ్ఞానము వెలువడుచున్నది. ఈ శ్రుతికాఠిన్య మునకుఁ గూడ రెండుకారణములు కలవు. కవి కన్నడదేశపురాజగుటఁ గన్నడ శబ్ద ప్రయోగములఁ జేయుటచే నాంధ్రభారతి బాగుగనుపయోగింప నశక్తుఁ డయ్యె. రెండవది సంస్కృతశబ్దప్రయోగ మై యున్నది. ఇది యీతనికే కాక రామరాజభూషణుఁడు పెద్దన యెఱ్ఱాప్రెగడ మున్నగు మహాకవీశ్వరులకుఁ గూడ లక్షణ మై యున్నది. ఈరెండుకారణములవలనఁ గల్గినశ్రుతికాఠిన్యమును మనము దిగఁద్రోయ లేకపోయినప్పటికి మొత్తముమీఁద శైలి మతవిషయక మైనగ్రంథ కథకుఁ దగినటులొప్పారుచున్న దని చెప్పుటకు నెంతమాత్రము సందేహములేదు.

ఇఁక రసవిషయమై విచారించినయెడల రసాధిక్య మేమియు నంతఁగఁ గానఁబడదు. అయిదవయాశ్వాసమునందు ఋతువర్ణనములయందు నుత్తరా యణ వర్ణనమునందును శృంగారరసము స్ఫురించుచున్నది. ఆఱవయాశ్వాసము నందు రాక్షసవైష్ణవసమాగమమునందు భయ, భయానక, వీర, భక్తిరసములు కూడ నక్కడక్కడ స్ఫురించుచున్నవి. ఈరసవిషయము నలంకారవిషయమును గూర్చి చర్చించినపిదప నుదాహరించెద.

అలంకారసమృద్ధివిషయమై విచారణచేసినచో నాముక్తమాల్యదయందుఁ బెక్కుప్రదేశముల నలంకారగర్భితము లైనపద్యంబులు కనఁబడుచున్నవి. ఈ పై వాక్యమును దృఢపఱచుటకు విష్ణుచిత్తీయమునందలి యీక్రింది పద్యము నుదాహరించుచున్నాను.

సీ. పలికి తుత్ప్రేక్షోపమల జాతి పెంపెక్క రసికు లౌ నన మదాలసచరిత్ర
భావధ్వనివ్యంగ్యసేవధి గాఁగఁ జెప్పితివి సత్యావధూప్రీణనంబు
శ్రుతిపురాణోపసంహిత లేర్చి కూర్చితి సకలకథాసార సంగ్రహంబు
శ్రోత్రఘచ్ఛటలు విచ్చుగ రచించితి సూ క్తినైపుణి జ్ఞానచింతామణికృతి

గీ. మఱియు రసమంజరీముఖ్యమధురకావ్య
రచన మెప్పించుకొంటి గీర్వాణభాష
నంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁగ.

ఈ పై పద్యమువలనఁ గృష్ణదేవరాయలకవిత్వము సాధారణముగ రసాలంకార విలసితమై రాజిల్లుచున్నది యని స్పష్టముగఁ దెలియుచున్నయది. మఱియుఁ గవిక్పృతము లగుగ్రంథములు నాతని యుభయభాషాపాండితియు నాముక్తమాల్యదరచనయందుఁ దనకుఁ గలిగిన బుధజనప్రోత్సాహము నీపద్యమువలన విశద మగుచున్నవి. కృష్ణదేవరాయ లసాధారణపాండిత్యము కలవాఁ డని తత్కృతగ్రంథరాజమందు నలరారునలంకారసమృద్ధియే తెలుపుచున్నది. ఉత్ప్రేక్ష, అర్థాంతరన్యాసము, హేత్వపహ్నుతి మున్నగు ననేకము లైనయలంకారములు గ్రంథమందుఁ గనఁబడుచున్నను గవిపక్షపాత ముత్ప్రేక్షాస్వభావోక్త్యలంకారములం దున్నటులు తదుభయాలంకారగర్భితములై గ్రంథమం దెల్లెడ విలసిల్లు పద్యరాజములే విశదీకరించుచున్నవి. ఆముక్తమాల్యదయందలి యలంకార సమృద్ధిఁ జూపుటకు నాల్గవయాశ్వాసమునందు రాజిల్లుదశావతారపద్యంబులే చాలు. అయినను రసాలంకారగుంఫితము లైన కొన్ని పద్యములను గ్రంథమునుండి తీసి యీవిషయము నుదాహరించెద.

మ. మునుపే చంద్రబలంబు గల్గి మలయంపుం గమ్మలేగాడ్పుఁదే
రున నేతెంచులతాంతబాణునకు సూర్యుండు న్సహింం గ్రొత్తగా
ననుకూలించెఁ గలంబున న్విరహిణీప్రాణాపహారంబు నే
యన యూహించు విధాతకృత్య మది యేలా మాను నెప్పట్టునన్. ఆ. 5.

ఈపద్యమునందు శృంగారరసము, అర్థాంతరన్యాసాలంకారమును గూడ స్ఫురించుచున్నవి.

ఉ. కుప్పసముల్వదల్చి రిఱిగుబ్బల నొత్తిలి హత్తి వేగుజా
మిప్ప లలర్చుగాడ్పుల కధీశుఁ గ్రమంబున ఘర్మశంకమై
నుప్పతిలంగ దోమతెర లుప్పర మెత్తిరి దక్కె రూప్మము
లెప్పర మైనలోహశకటీ ప్రకటీకరణంబుఁ గామినుల్.

ఇందు శృంగారరసము, స్వభావోక్త్యలంకారమును రాజిల్లుచున్నవి.

క. తనుమధ్య వళీభంగము,లను గూర్పఁగ, నవియుఁ దత్కులముల యగుటఁ గం
తునియిడినపత్త్రితే కనఁ, జనునొడ్డాణమున నడుము చామకునమరున్.

క. లేఁగౌఁదీఁగె నితంబముత్రేఁగునఁ, ద్రెవ్వటయుఁ గని విరించి బిగింపన్
లోఁగి ముడి యిడినయె వదలుగ, నాఁ గోక స్తనిగభీరనాభి చెలంగున్.

ఈరెండుపద్యములయందు శృంగారరసమును, వరుసగ రూపకోత్థాపితోత్ప్రేక్షయు నుపమోత్థాపితోత్ప్రేక్షయు నగపడుచున్నవి. మఱియు గ్రంథప్రారంభమునఁ జేయఁబడిన శ్రీవిలుబుత్తూరుపురవర్ణనమునందు స్వభావోక్త్యలంకార మమితముగ నుపయోగింపఁబడినది. ఇంతియ కాక మొదవయాశ్వాస మంతయు శృంగారరసపూరిత మై వివిధాలంకార గర్భితమై ప్రకాశించుచున్నది. పైని జెప్పఁబడిన పద్యములు కాక నాల్గవయాశ్వాసమునుండి దశావతార పద్యంబులఁ గొన్నింటి నిం దుదాహరించి యింతతో రసాలంకారప్రశంసను ముగించెద.

చ. ఎలమి యుగాంతవారి కెదురెకుఁటతఱి న్వడిఁ దాలుగహ్వరం
బులఁ జనునీటివెల్లిఁబడిఁ బోవునపక్షనగోరువాశ్చరం
బులు దనుఁ దాఁకఁ దగ్గతత ద్రోయునజాండమ దైత్యవేదపం
క్తులు గొని కూల్చినట్టిజయదుందుభిఁ జేసితి కా మురాంతకా.

ఇక్కడ నుభయతాద్రూప్యరూపకాలంకారము స్ఫురించుచున్నది.

ఇఁక వృత్తబాహుళ్యసౌష్ఠవముల గుఱించి యించుక యాలోచించినచో నాముక్తమాల్యదయందు మహాకావ్యములం దుపయోగింపఁబడు వృత్తము లన్నియు నుండుటయే కాక కొన్ని యపూర్వము లైనయతు లక్కడక్కడఁ గానవచ్చుచున్నవి. ఈవిషయము నుదాహరించుటకు నీక్రిందిపద్యము నిచ్చుచున్నాఁడ,

ఉ. అక్కట రాధ నీకుఁ దగవా? మగవారల నత్తమామలం
దక్కి ముకుందవేణుకలనాదపుటేలకు లేటిమొత్త మై
త్రెక్కొనుకాఁకచే నడికిరే లరుదెంచినగోపికావళి
న్బొక్కఁగఁజేసి తద్రుచిరభోగము గుత్తగ నీవ కైకొనన్.

ఈపద్యమందుఁ బ్రథమపాదమునందుఁ బ్రశ్నాకలితదీర్ఘయతి ప్రయోగింపఁబడినది.

పాత్రగుణవర్ణనము గుఱించి యాలోచింపకమున్ను మన మాంధ్రసాహిత్య శాస్త్రమందుఁ బాత్రవర్ణన మనునట్టి దెపు డైనఁ గలదా లేదా యని

విచారింపవలెను. కృష్ణదేవరాయల కాలమునకుఁ బూర్వ మట్టిపాత్ర గుణవర్ణన మెచ్చుటఁ గానరాదయ్యె. దీనిఁబట్టి మన మట్టిపాత్రవర్ణన మన నేదియో కృష్ణదేవ రాయలకుఁ బూర్వపుఁగవులకుఁ దెలియనే తెలియ దని చెప్పుట కెంతమాత్రము వీలు లేదు. అలంకారశాస్త్రములందు నాయికానాయకలక్షణములఁ దెల్పు సూత్రములే యీపాత్రగుణవర్ణనాభావమునకుఁ దోడ్పడినవి. అలంకారశాస్త్రములయందుఁ జెప్పఁబడిన గుణము లుండినయెడలనే నాయకులును నాయికలు నేర్పడెదరు కాని, యట్టిగుణములు లేనిచో నట్టిపాత్రములు నాయికానాయక లక్షణములఁ బొంద నేరవు. ఇందుచేత నాంధ్రకవు లందఱు సాధారణముగా లోకమందుఁ గనఁబడు జనులవలె సజీవము లై యున్నటు లగపడక లోకాతీత గుణోన్నతము లై విలసిల్లు పాత్రములనే యేఱి తమగ్రంథములందుఁ బ్రదర్శిం చెడివారు. ఈకారణమువలననే చదువరు లట్టిపాత్రములను మెచ్చకయున్నారు. పాత్రగుణవర్ణనస్థితి యిటులున్నను మహాభారతమందు నలరారు పాత్రములు మ ట్టుకు సజీవము లగుటచే నెంతయు రమణీయములుగ నున్నవి. కవిసత్తము లగు శ్రీనాథుఁడు, పెద్దనయుఁగూడ మహాభారతప్రదర్శిత పాత్రములవంటి పాత్రములఁ బ్రదర్శించియున్నారు. ఆయిరువురు కవులుఁగూడ నొకభక్తుని బాగుగ వర్ణించి యున్నారు. కృష్ణదేవరాయలు కూడఁ బైఁ జెప్పిన కవులవలెఁ జక్కని పాత్రము లను సృజియించినాఁడు. తాను మిగుల శైవభక్తి కలవాఁడు కానందున బాత్ర ములఁ గూడ విశిష్టాద్వైతమతము ననుసరించియే సృష్టించె. ఆముక్తమాల్యద యందుఁ గృష్ణదేవరాయలు వర్ణించిన పాత్రములలో నత్యంతరమణీయము లైనవి రెండు. అవి యేవనఁగా, విష్ణుచిత్తుఁడు నాముక్తమాల్యదయు. విష్ణుచిత్తుఁ డధిక దైవభక్తి గలబ్రాహ్మణుఁ డని యాతనిచర్యలు, మాటలును స్పష్టముగఁ దెలియఁ జేయుచున్నవి. ఆతనిహృదయ మతిసుకుమార మైనది. పతివ్రతాతిలక మగు తనభార్య యతిథులకుఁ దగినసన్మాన మొనర్చుటకుఁ బహుశ్రమఁ దానుఁగూడ ననుభవించి యందఱు వైష్ణవులకు స్వగృహమును విశ్రమస్థానముగఁ జేసె. పరోప కార నిరతియు నత్యంత దైవభక్తియు విష్ణుచిత్తుని మాహాత్మ్యమును సహస్ర ముఖముల నుద్ఘోషించుచున్నయవి. ఆముక్తమాల్యదగుణవర్ణనము విష్ణుచిత్తుని గుణముల వర్ణనమంతబాగుగఁ బ్రదర్శింపక పోయిన నామెకు విష్ణుచిత్తునిపైఁ గలప్రేమాతిశయ మతిరమ్యముగ వర్ణింపఁబడినది. తండ్రిమాట విన లే దనునం శము తప్ప నామెగుణబాహుల్య సౌష్ఠవములకు మఱి యెట్టికళంకమును లేదు.

ఈరెండుముఖ్యపాత్రములే కాక యప్రధానపాత్రములు కూడఁ జక్కఁగ వర్ణింపఁబడినవి. మొత్తము మీఁద నాంధ్రభాషయందు గ్రంథముల రచియించి పాత్రగుణప్రదర్శనము నతిరమణీయముగఁ జేసిన యిద్దఱు ముగ్గురు కవులలో నొకఁడై కృష్ణదేవరాయ లాంధ్రసాహిత్యశాస్త్రమునందు సజీవపాత్రవర్ణన మను నూతనాంశము నొకదానిఁ గల్పించి యెంతయు నాంధ్రభాషకు మహోపకార మొనర్చినాఁ డనుటకు సందేహ మేమియు లేదు. ఇట్టిమహాకార్య మొనర్చినందుకు నాంధ్రులందఱు నెల్లపుడుఁ గృతజ్ఞులై యుండ వలసియున్నది.

అన్నిటికంటె ముఖ్యాంశ మైనట్టి పాకవిషయముం గూర్చి యిఁకఁ బరీక్షించి విమర్శము చేయవలెను. పాక మనఁగా నేమి? అర్థగాంభీర్యమే పాక మని చెప్పఁబడుచున్నది. ఈ వాక్యమునకుఁ బ్రమాణముగ నలంకార శాస్త్రములందుఁ జెప్పఁబడిన శ్లోకముఁ బేర్కొనెదను. విద్యానాథకృత మైనట్టియు నలంకార శాస్త్రవిషయమై సంస్కృతభాషయందు రచియింపఁబడిన మహాగ్రంథములలో నొకటి యైనట్టియుఁ బ్రతాపరుద్రీయ మనుగ్రంథమునందు నీ క్రిందివిధముగ వ్రాయఁబడినది.

"అర్థగంభీరిమా పాక స్స ద్విధా హృదయంగమః ।
ద్రాక్షాపాకో నాళికేరపాక శ్చ ప్రస్ఫుటాంతరా" ॥

ఆపాకముకూడ రెండువిధము లని పైశ్లోకమునందు విశదముగఁ జెప్పఁబడినది. ఆముక్తమాల్యదయం దుండుపాకము నాళికేరపాక మని దృఢముగఁ జెప్పవచ్చును. ఆముక్తమాల్యద నొక్కసారి చదివినయెట్టిచదువరి కైన నీవిషయము గోచరము కాకమానదు. ఏపద్యముం జదివిన నాక్లిష్టపాకము స్పష్టముగ నగపడి పుస్తకమును వదలిపెట్టు నంతక్లేశముఁ గల్గించు ననుమాట గ్రంథ మొకసారి యైనఁ జదివి చూచిన వారి కనుభవవేద్య మై యుండకపోదు. దీనికి దృష్టాంతములు వేఱుగ నిచ్చుటఁ జూప నవసరము లేదు. గ్రంథమంతయు నీక్లిష్టపాకముతో సంపూర్ణ మై యున్నది. ఇట్టి కఠినపాకమునకుఁ దోడ్పడు కారణములు కొన్ని కలవు. ఆకారణములఁ బరీక్షించిన యెడలఁ బుస్తకమునం దుండు నర్థగాంభీర్య మెట్టిదో విశద మగును. ఆకారణము లేవి యనఁగా మొదటిది కఠినాపూర్వపదప్రయోగము. ఇందునకు ముఖ్యముగఁ దోడ్పడునంశము దేశీయపదప్రయోగము. రెండవకారణ మే మనఁగా నలంకార కాఠిన్యము. అలంకారములలో ముఖ్యము లైనవాని నుపయోగించుటయే కాక కొంతయపూర్వాలంకార సాంకర్యముఁ

గూడఁ గలదు. మూఁడవకారణ మేమనఁగాఁ గవి యుద్దేశములు దూరాలో చ్యము లై యున్నవి. సాధారణముగఁ బెద్దన మున్నగు మహాకవుల యుద్దేశ ముల వలెఁ గొలఁదిశ్రమముతో నర్థముకాక మిగుల దూరాలోచనఁ జేసినయె డలఁ గాని యెంతమాత్రమును బోధపడక యున్నవి. నాల్గవ దేమనఁగా వర్ణనా గాంభీర్యము. సాధారణముగఁ గవులందఱుఁ జేయువర్ణనములవలెఁ గాక యా ముక్తమాల్యదయందలి వర్ణనలు సులభముగ బోధపడనివై చదువరికి నెంత మాత్ర ముత్సాహముఁ గలుగఁజేయవు. పైనిఁ జెప్పిన నాల్గుకారణములే ముఖ్య ముగ నర్థగాంభీర్యమునకుఁ దోడ్పడుచున్న వనుటకు నించుకయు సందియము లేదు. ఒకకారణము తరువాత నొకకారణమును వరుసగాఁ బరీక్షించిన యెడల నవియన్నియు స్పష్ట మగుచున్నవి. ఒక్కొక్క దానికి దృష్టాంత మిచ్చుట యన వసర మై యున్నది. ఎందుచేత ననఁగా గ్రంథలక్షణమే యర్థగాంభీర్య మై యున్నది. అయినఁ గొంచెముగ నిం దుదాహరించెద. దేశీయపద ప్రయోగ మునకు దృష్టాంతముగ 'టింగణా' యనుపద ముపయోగింపఁబడినది. నాల్గవ యాశ్వాసమందలి 176 వ పద్యమందు 'కంకినరు' అనియు నైదవయాశ్వాస మందలి 93 వ పద్యమందు 'హిండితములుగవించి' యనియుఁ గన్నడశబ్దంబులు ప్రయోగింపఁబడినవి. గ్రంథమునం దిటు లనేకపద్యంబులు దేశీయపదగుంఫి తము లై విలసిల్లుచున్నవి. ఇఁక నలంకార కాఠిన్యము దశావతార పద్యంబుల యందు స్పష్టముగఁ గానవచ్చెడిని. కవియుద్దేశ్యములును గల్పనలును మిగుల దూరానీతము లైన వనువాక్యమునకు దృష్టాంతములు వేఱుగ నీయ నెంతమాత్ర మావశ్యకము కాదు. గ్రంథమందుఁ గవి చేసినవర్ణనములయందు నీవిషయము స్పష్టముగఁ గన్పడకపోదు. పుస్తకముఁ దెఱచి చూడఁగనే మొట్టమొదట నగపడు శ్రీవిలుబుత్తూరుపురవర్ణనమే మే లైనదృష్టాంత మగుచున్నది. ఈపైని జెప్పిన విషయము లన్నింటివలన గ్రంథ మందఱిచేఁ జదువఁబడకున్నది. గ్రంథకారుఁడుఁ గూడఁ దనగ్రంథ మెల్లరుఁ జదువవలె నను నుద్దేశముతో వ్రాయను లేదు. తనతో సమానపాండిత్యము గలవారు చదువవలె ననునూహతో వ్రాయఁబడినది కాన జనసముదాయమునకుఁ దగినపుస్తకము కా దని మన మాముక్తమాల్యదను విమ ర్శింపఁ బనిలేదు. ఇంతియ కాక కవి జీవించినకాలముఁ గూడ మనము పరీక్షించి చూడవలెను. అప్పటి కాలమునకు నిప్పటి కాలమునకును సహస్రాంతరము భేద మున్న దని వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. ఇపుడు కళాశాలలలో నాంధ్రభాష

నభ్యసించు విద్యార్థుల సంఖ్యయు శాలాధ్యక్షులాంధ్రభాషాభివృద్ధికి నిచ్చుప్రో త్సాహముయొక్క స్థితియుఁ బ్రస్తుతమున నాంధ్రభాషావస్థను వెల్లడిచేయుచు న్నవి. కృష్ణదేవరాయలకాలమం దుండెడి దేశభాషాభివృద్ధి యిపుడెంతమా త్రముఁ గానఁబడదయ్యె. కృష్ణదేవరాయలు తాను స్వయముగ గ్రంథముల రచి యించియుఁ గవిపండితసముదాయము నందులో ముఖ్యముగ స్వాస్థానకవీశ్వరు లై రాజిల్లిన యష్టదిగ్గజములను గ్రంథములఁ జేయునటులు ప్రోత్సాహపఱచియు నాంధ్రభాషాభివృద్ధికై పాటుపడి యాంధ్రభాషకు మహోపకారముఁ జేసినాఁ డనువిషయమును నిస్సందేహముగ నాంధ్రకవులచరిత్రమే సహస్రముఖముల నుద్ఘో షించుచున్నది. ఈ కారణమువలననే యీతనికి నాంధ్రభోజుఁ డనుబిరుదము కూడ వచ్చినది. కృష్ణదేవరాయలకాలమందుఁ గవులు రాజప్రోత్సాహము వలనఁ గవినిబంధనములకుఁ దగినట్లు గ్రంథములను రచియించెడివారు. మఱియు నాంధ్రసాహిత్యశాస్త్రమందుఁ దన పేరును స్థాపింపవలె ననునుద్దేశముతో నొక మహాగ్రంథముఁ జేయవలె నని ప్రతికవియుఁ బ్రయత్నింపక మానఁడు. కాని దైవకృప ప్రతిమానవునకు నొకవిధముగ నుండదు గనుక యాపుణ్యము ప్రపంచ మందుఁ గొందఱకే లభించుచున్నది. కొలఁదిగ నుండునట్టి పుణ్యులలోఁ గృష్ణ దేవరాయ లొకఁ డని యాతనిగ్రంథరాజముఁ జూచినఁ గాని, యాతని కుండు నాంధ్రదేశాభిమానముఁ జూచినఁ గాని, యింక నాతఁడు కవిపండిత సముదాయ మున కిచ్చిన ప్రోత్సాహముఁ జూచినఁ గాని మన మనములయందు దృఢముగ స్థా పింపఁబడక మానదు. ఆముక్తమాల్యద కృష్ణదేవరాయలకాలమం దుండెడి లక్షణప్రబంధరాజములను భక్తితో ననుసరించి వ్రాయఁబడినది. విద్యానాథుఁ డను సంస్కృత కవీశ్వరునిచే రచియింపఁబడిన ప్రతాపరుద్రీయ మను సంస్కృత లక్షణగ్రంథమునందు మహాకావ్యలక్షణ మీక్రిందివిధముగఁ జూపఁబడినది. అది యెట్లనఁగా:—

'నగరార్ణవశైలర్తు చంద్రార్కోదయవర్ణనమ్
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవాః
విప్రలంభో వివాహశ్చ కుమారోదయవర్ణనమ్
మంత్రద్యూతప్రయాణాజి నాయకాభ్యుదయా అపి
ఏతాని యత్ర వర్ణ్యన్తే త న్మహాకావ్య ముచ్యతే.'

మహాకావ్యమున కుండవలసిన లక్షణము లని పై నేవి చెప్పఁబడినవో యవి యన్నియు నాముక్త మాల్యదయొక్క పత్రముల నొకసారి తొందరగఁ ద్రిప్పి చూచినను స్పష్టముగ నగపడుచున్నవి. కృష్ణదేవరాయలకాల మట్టిమహాకావ్యములఁ జదివి యర్థము చేసికొనుప్రజ లుండుకాల మై యుండఁగా నిప్పటి కాలపు నాంధ్రదేశీయులకుఁ దెలుఁగు బాసయం దుంపు నల్పసాహిత్యమును మన మొకయెల్లఁగాఁ బెట్టికొని కృష్ణదేవరాయలు మున్నగు నాంధ్రమహాకవుల యుత్తమ కావ్యములఁ బరీక్షించుట మిగుల నన్యాయ మైనవిమర్శ మై యున్నది. రాయలగ్రంథముఁగూర్చి చర్చఁ జేసినపుడు రాయలకాలమునకుఁ దగినటు లున్నదా లేదా యని యాలోచింపవలెఁ గాని యిక్కాలపు విమర్శనపద్ధతులఁబట్టి మన మామహాకావ్యముఁ బరీక్షచేయుట యెంతయు శోచనీయ మైనపొరపా టై యున్నది. ఇటు లాలోచించినయెడల నాముక్తమాల్యద యాంధ్రసాహిత్య శాస్త్రమునం దుండు ముఖ్యమహాగ్రంథములలో నొకటి యై యున్న దని నొక్కి వక్కాణింప వలసియున్నది. ఆంధ్రభాషయం దుండు పంచకావ్యములలో నొక్కటిగ గణింపఁబడుచున్నది. పెద్దనార్యుని మనుచరిత్రము, రామరాజభూషణుని వసుచరిత్రము, శ్రీనాథుని శృంగారనైషధము మున్నగు నాంధ్రమహాకావ్యములలోఁ గృష్ణదేవరాయని యాముక్తమాల్యదకూడఁ జేర్పఁబడిన దనుసంగతి యెంతయు సంతోషనీయ మై యున్నది. సంస్కృత కవులలోఁ గృష్ణదేవ రాయలకుఁ బోల్పఁదగు కవి శ్రీహర్షుఁ డని నామనమునకు దృఢముగఁ దోఁచుచున్నది. అవర్ణనక్లిష్టత కేమి యాదూరానీతోద్దేశముల కేమి యాకటుపదబాహుళ్యమున కేమి యాయపూర్వపదప్రయోగముల కేమి యామహాక్లిష్టపాకమున కేమి యాపాకకాఠిన్యమువలనఁ గలుగు నర్థగాంభీర్యమున కేమి యిఁక మఱియ నేక విషయములయందు నిద్దఱును సరిసమాను లని యుభయకవికృత గ్రంథ రాజములఁ జదివిన నాకు నిస్సందేహముగఁ దోఁచుచున్నది. శ్రీహర్షుఁ డని పైని జెప్పినపుడు నైషధకారుఁ డై నశ్రీహర్షుఁ డని మనము నం దుంచుకొనఁ గోరెద. మొత్తముమీఁద నాంధ్రకవిసత్తములలో నొకఁ డని కృష్ణదేవరాయలను వర్ణింప వలెఁ గాక యింక మఱియేవిధముగఁ జెప్పఁ గూడదు. ప్రస్తుత కాలపు జనుల యభిరుచులకు ననుగుణముగ నున్నదా లేదా యని యాముక్తమాల్యదఁ గూర్చి యించుక విచారణ సేయఁ దగు. ఆముక్తమాల్యదయొక్క ముఖ్యలక్షణముల లో నొకటి యగు కల్పనాధిక్య మప్పటికాలమునకు ననుగుణముగ నున్నదియే

తప్ప నిక్కాలమున కెంతమాత్రముఁ దగి యుండ లేదు. గ్రంథమందెల్లెడ విలసిల్లు కల్పనలు నవీనాంధ్రులకు నెంతమాత్రమును మనోరంజకములు కావు, పైఁగాఁ జదువరులబుద్ధికి మిగులఁ గ్లేశముఁ గల్గించుచున్నవి. కొంతసేపు చదువునప్పటికి శీర్ష వేదనము బయలుదేఱు ననుసంగతి యాముక్తమాల్యదఁ జదివినయెల్లరకు ననుభవసిద్ధమే. ఈ గ్రంథకాఠిన్యమువలనఁ గల్గుక్లేశము క్రొత్తచదువరులకుఁ బ్రాఁతచదువరులకుఁ గూడ సమానమే యని చెప్పవచ్చును. ఇది యిటు లున్నను నేను మొదట విన్నవించినట్లు కాలభేదము గమనించి మన మేయాంధ్రగ్రంథము నైనను విమర్శింపవలెను. మనము పూర్వకాలపు గ్రంథములను విమర్శింపవలె ననుచో వానికిఁ బ్రమాణభూతము లైన యలంకారగ్రంథముల విమర్శింపవలెఁ గాక యట్టి మహాప్రమాణము లైన యలంకారగ్రంథముల ననుసరించి వ్రాయఁ బడిన యితర కావ్యములను విమర్శించిన నేమిఫలము? అప్పటి కాలమునకుఁ దగినటులు వ్రాయఁబడినదా లేదా యని విమర్శఁ గావింపవచ్చును. స్పష్టముగ నా కాలపు జనుల యభిరుచుల ననుసరించి యాముక్తమాల్యద వ్రాయఁబడిన దను టకు నెంతమాత్రము సందియము లేదు. కాలవైషమ్యజనితజనాననురాగ మును వదలి యాముక్తమాల్యదయొక్క నిజ మైనవిలువఁ గన్గొనఁ బ్రయత్నిం తము. నవీనవిమర్శపద్ధతులఁబట్టి చూడ గ్రంథమం దెక్కుడ నంత యద్భుతము లైనకల్పనలు కనఁబడకపోయినను గ్రంథకారుని కల్పనాశక్తి కడునచ్చెరువుఁ గలి గించుచున్నది. గ్రంథము కడు నూతనవర్ణనాంశముల (Original descriptions) చే శోభిల్లుచు నుద్గ్రంథ మనుపేరు వడసి యున్నది. ఏపద్యముఁ జూచినఁ గాని యీవిషయము గోచరము కాకమానదు. శ్రీవిలుబుత్తూరు పురవర్ణనమే దీని కంతకును మంచిదృష్టాంత మై యున్నది. గ్రంథమం దెచటఁ జూచినఁ గవి యొక్క యుభయభాషాపాండిత్యము వెల్లడి యగుచున్నది. సర్వజనప్రియముగ నీగ్రంథము గ్రంథకర్తచే నుద్దేశింపఁబడలేదు. ఇఁక నెపుడు నది సర్వజనానురా గముఁ బొందఁ జాలదు. అట్టి సకలజనానురాగముఁ బడయు నదృష్టము, పెద్దన, శ్రీనాథుఁడు, రామరాజభూషణుఁడు మున్నగు కవీశ్వరులచే సకలజనమనోరం జక మగునట్లెల్లిని వ్రాయఁబడిన కొలఁదిగ్రంథరాజములకే యాబ్రహ్మచే లిఖింపఁ బడినది. కాని సకల జనప్రీతి లేనంత మాత్రమున గ్రంథ మప్రయోజన మని చెప్పుట కేవలము వాగ్దోష మై యున్నది. ఇప్పటికిఁ గవిపండితప్రియతమ మై పంచకావ్యములం దొక్కటిగ నుతి కెక్కి పండితులలోఁ గొందఱచేఁ బంచ

కావ్యములందు నగ్రేసర మని స్తుతింపఁబడి యెంతయు నొప్పారుచున్నది. మొత్తముమీఁద నాముక్తమాల్యదయం దుండుపద్యము లెంతకటుపదభూయిష్ఠము లైన నెంత శ్రుతికఠినము లైన నెంతశిరోవేదనముఁ గల్గించినప్పటికిఁ గష్టపడి వానిపై పెచ్చుఁ బగులఁ గొట్టి లోపలికిఁ జనునాశయు దాని వలనఁ గల్గుశ్రమ నోర్చుటకుఁ దగినయోపికయుఁ గల చదువరికి నాపద్యముల యంతర్భాగమునందుఁ బడినశ్రమకు ననురూప మైనట్టియు శ్రేష్ఠ మైనట్టియు సంపూర్ణానందజనక మగునట్టిఫల ముండు ననియు నున్నదనియుఁ గూడ నిస్సందేహముగ నొక్కి వక్కాణింపవచ్చును. గ్రంథమును సాంతముగఁ జదివి పద్యబహిర్భూత మైన యాకఠిన మైనట్టియు భయంకర మైనట్టి కవచమును భేదించిన యెడల నంతర్గతార్థ గాంభీర్యజనితాపరిమితానందము బయల్పడక మానదు. ఇంతియ కాక గ్రంథరచనమునం దత్యంత ప్రౌఢిమయుఁ గవితాచమత్కృతియు విశదముగ విలసిల్లుచున్నవి. కవనవైపుణి మొదలైనట్టి పైని జెప్పిన సుగుణము లన్నిటి నీక్రింది పద్యపరంపరచే నుదాహరించుచున్నాఁడ.

మ. శయపూజాంబుజము ల్బుటిం దడఁబడం జన్దోయి లేఁగౌనుపై
దయఁదప్ప న్బసపాడి పాగడపుఁ బాదంబొప్పఁ జెంగల్వడి
గ్గియ నీ రచ్యుతమజ్జనార్థము కటిం గీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగన ల్నడుతు రుద్యానంబులో త్రోవలన్. ఆ. 1.

మ. తరుణుల్ తల్లియొఱ న్గుచంబు లునుపం దచ్చైత్యము ల్దీము లై
పెరరేపం జనుదెంచెఁ గాక రవి దీప్తిం గ్రుంకి పాతాళగ
హ్వరముం దూఱిన వాని నీయదుకుత్రాళ్లా తెచ్చు నాదీర్ఘత
చ్చిరకృష్టిం గనునట్టిశైత్యమలరించె న్నూతులం దత్తటిన్. ఆ. 2.

మ. విను కేశిధ్వజ ధాత్రివేఁడమికి నావేదించెద న్హైతు వ
జ్ఞునకుం గాక వివేకి కేల జనియించున్ లౌల్య మెందు న్రణం
బునఁ బాడి న్రిపు గెల్చువాఁడియుఁ బ్రజాపోషంబు ధర్మంబు రా
జున కౌ నైన నశక్తుఁ ద్వద్విజితరాజ్య న్న న్నఘుం బంటునే, ఆ. 3.

చ. ఒకచినుకు న్ననస్య యగునుర్వికి డిగ్గఁగనీవు మూఁగి చా
తకము లటంచు లోఁ గనలి దట్టముగా నలమేఘుఁ డాడుచుం
డక చన నూఁదఁగాఁ దొరఁగునాళవుటుండలువోలె రాలెఁ ద
క్కక పవువర్షధారలు మఖస్థము లై కరకానికాయముల్. ఆ. 4.

ఈపద్యము గ్రంథకారునికవనలక్షణ మైన స్వభావోక్తిచే నెంతయు రమణీయముగ నున్నయది.

సీ. వాతెఱ తొంటికై వడి మాటలాడదు కుటిలవృత్తి వహించెఁ గుంతలంబు
లక్షులు సిరులు రానరచూడిక్రఁ గనుఁగొనె నాడించె బొమ గొని యాననంబు
ననుగొమల్నెగయవక్షము పేక్షఁ గడకొత్తెఁ బాణిపాదము లెఱ్ఱవాఱఁదొడఁగె
సారెకు మధ్యంబు దారిద్ర్యములె చెప్పె ఱొచ్చోర్వ కిటు లొఁగఁ జొచ్చె మేను
గీ. వట్టిగాంభీర్య మొక్కఁడు వెట్టుకొనియె, నాభి నానాఁటి కీగతి నాఁటిపొందు
చవుక యైనట్టి యిచ్చటఁ జనదు నిలువ, ననుచు జాతినకరణి బాల్యంబు జాఱె.

ఈపద్యము మిక్కిలి చక్కనిశైలిని వ్రాయఁబడి మృదుమధురము లైనపదములచే గుంఫిత మయిన దై హృదయరంజక మగుశృంగారరసముచే సంపూరిత మయి గ్రంథమునందు విలసిల్లు పద్యరాజములలో నెల్ల నత్యంత రమణీయమయి యెంతయు మనోల్లాసముఁ గలుగఁజేయుచున్నది.

శా. కాంచె న్వైష్ణవుఁడర్థయోజన జటాఘూటోత్థశాఖోపశా
ఖాంచద్ఘ్రాటచరన్మరుత్రయదవీయఃప్రేషితోద్యచ్ఛదో
దంచత్కీటకృతవ్రణచ్ఛలనలివ్యాపాదితాధ్వన్యని
స్సంచారాత్తమహోఫలోపమఫలచ్ఛాయద్వటక్ష్మాజముౕ.

ఈపద్యము సంస్కృత పదపూరితమయి మిగుల గంభీరమయి కవియొక్క యసాధారణ మయినసంస్కృతభాషాపాండిత్యమును వెల్లడిచేయుచున్నది.

కృష్ణదేవరాయలు చేసినసంస్కృతగ్రంథము లెవ్వియుఁ బ్రస్తుతము కానరాకున్నను నాతఁడు సంస్కృతమున గ్రంథములను స్వయముగ రచియించుటయే కాక సంస్కృతకవులకుఁ గూడ మిక్కిలి ప్రోత్సాహము నిచ్చినటు లాముక్తమాల్యదయే కాక యితరకవికృతము లైనగ్రంథములుకూడ వేనోళ్ల నుద్ఘోషించుచున్నవి. ఇంతవఱకుఁ బైన వ్రాసినదంతయుఁ బరీక్షించి చూడ నాముక్తమాల్యద యాంధ్రమహాగ్రంథములలో నగ్రేసరము లైనవానిలో నొక్కటి యని ముమ్మాఱు దృఢముగఁ జెప్పవచ్చును. ఇంతియ కాక గ్రంథకారునికిఁ గలయపార మయిన యాంధ్రదేశభాషాభిమానమును నాముక్తమాల్యద స్పష్టముగఁ దెలియఁజేయుచున్నది. ఇందునకు దృష్టాంతముగఁ గృష్ణదేవరాయలు చెప్పిన పద్యమునే యిక్కడ నుదాహరించుచున్నాఁడ.

ఆ. తెలుఁ గ దేలయన్న దేశంబు తెలుఁగేను, దెలుఁగువల్లభుండఁ దెలుఁ గొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి, దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

ఈస్వదేశభాషాభిమానమునకుఁ దగినటులు స్వదేశాచారములఁ గూడ మిగుల సొంపుగఁ గవి పుస్తకమం దెల్లడను వర్ణించియున్నాఁడు. దక్షిణ హిందూదేశ నాగరకతను జక్కఁగా వర్ణించిన కవీశ్వరుఁ డీతఁడే. ఈవిషయమందు సంస్కృత కవీశ్వరులలో నీయనకుఁ బోల్పఁ దగు కవీశ్వరుఁడు బాణుఁడే. తన హర్షచరిత్రమునందు నట్టినాగరకతను బాణుఁడు మిగుల మనోహరముగ వర్ణించి యున్నవాఁడు. కృష్ణదేవరాయలకుఁ బూర్వ మేకవియుఁగూడ నిట్టిదేశాచారవర్ణన మును జేయలేదు. మొదటఁ గృష్ణదేవరాయలే యిట్టివర్ణనముఁ బ్రారంభించెను. కనుక నీయనతోఁ బ్రబంధరచనయే కాక దక్షిణహిందూదేశ నాగరకత యొకటియు నాదేశమందుండెడి యాచారభేదములయొక్కయు వర్ణన మంకురింపఁ దొడఁగినది. ఈవిషయము నుదాహరించుటకు వేఱుగ దృష్టాంతముల నీయ నవసరము లేదు. గ్రంథమునం దెల్లెడ నట్టివిషయము నుదాహరించు పద్యంబులు విలసిల్లుచున్నవి. కృష్ణదేవరాయలచే నాముక్తమాల్యదయందు నతిరమ్యముగ వర్ణింపఁబడిన రెడ్లయొక్కయాచారములు, రాజులచేష్టలు, బ్రాహ్మణసంతర్పణములు, వైష్ణవుల మంగళస్నానంబులు, వైష్ణవోత్తముల మడుఁగుబట్టలు, వైష్ణవస్వాములప్రపత్తులు, వివిధాగ్రహారములం దగపడు విచిత్రము లైనచర్యలు, 'ఎళనీరుకాయ' లను పేరిట నమ్మఁబడు లేఁతకొబ్బరికాయలు, వైష్ణవస్వాము లతి ప్రీతితో సేవించు నీరుమజ్జిగలు మున్నగు ననేకాంశము లతిమధురంబుగ నాకాలపు హిందూదేశజనుల నాగరకత నచ్చు వేసినయట్లు చూపుచున్నవి. ఇవియే కవి మాహాత్మ్యముఁ జూపుటకుఁ జాలిన వై యున్నవి. శ్రీకృష్ణదేవరాయల వంటి దేశాభిమానులును భాషాభిమానులను లేకపోవుటయే మనయాంధ్రభాష కిపు డిట్టిస్థితి యేర్పడుటకు ముఖ్యకారణ మై యున్నది. ఎల్లకాలము నిట్టిదురవస్థ ననుభవింపక కొలఁదికాలములోనె రాయలకాలమం దనుభవించిన యత్యున్నత దశకుఁ దెలుఁగు మరల వచ్చునటులు చేయ సమర్థు లగు రాయలవంటి దేశభాషా పోషకులను గవీశ్వరులను సృజియింపు మని యీశ్వరుఁ బ్రార్థించుచు నింతతో విరమించుచున్నాఁడను.

వి. కృష్ణమోహన్.

## 114. వైష్ణవపురాణము. గ్రం. సం. 1757.

ఇదియే విష్ణుపురాణము. దీనిగద్యము :—

ఇది శ్రీమద్వసుంధరాతనూభవ మనోహర రఘుశేఖర చరణకమల షట్పదాయమానమానస దాసదాసీజన పరంపరానుగణనావశిష్ట దాసప్రణీతంబైన శ్రీవైష్ణవపురాణము.

ఇంతకంటెఁ గవి వృత్తాంత మెచ్చటను దెలియవచ్చుటలేదు. ఆఱంశములు నిందు సంపూర్ణముగఁ గలవు. కవిత్వము చక్కనిది.

శా. శ్రీమత్పంకజబాంధవాన్వయ లసత్ క్షీరాబ్ధిరాకాసుధా
ధామున్ భవ్యగుణాభిరాముఁ ద్రిజగద్ధామున్ ధరిత్రీసుతా
కామున్ దానవభీము భీమసుమనః కంజాతనైరంతర
ప్రేమానుస్మరణమ్ము నామదిని వర్ణింతున్మనస్సిద్ధికై.

మ. తనదేహద్యుతు లంతట న్వెలయఁగాఁ దా సారసాసీనయై
వనజాతంబు ధరించి శ్రీరమణి తద్వారాశి సంజాతయై
ననుమానీంద్రవితాన మత్తటి మహానందంబు సంధిల్ల భ
క్తిని శ్రీసూక్తముచేనుతించిరి తగన్ గీతానుసారంబుగన్.

మ. చనుచున్నిల్చుచుఁ బవ్వళించుచును సుస్నానంబు దానంబు భో
జనముం జేయుచు నన్నికాలములఁ గృష్ణస్వామి పైఁ జిత్తముం
దనరంగాఁ దదభిఖ్యలన్నుడువుచుం దావైర మేమారకా
తనిచక్రంబుఁ దదీయరూపము నిజాత్మం జింతసేయున్బుధా.

ఈప్రతిని, ప్రమాదీచనామ సం॥ మార్గశిర బ ౧౦ లు, జమ్మిపాపయ్య కుమారుఁడు వేంకటరాముఁడు వ్రాసెను.

## 115. రసాభరణము. గ్రం. సంఖ్య. 1781.

గద్యము—ఇది శ్రీవాణీవరప్రసాదలబ్ధ వాగ్విభవ తిక్కనామాత్య సంభవ సుకవిజనవిధేయ అనంతనామధేయ ప్రణీతంబైన రసాభరణంబునందు ... అని కలదు. నాలుగాశ్వాసములు సంపూర్ణముగా నున్నవి. కృత్యాదినేమియుఁ గనఁబడదు. స్థాయిభావములు మొదటనే ప్రారంభింపఁబడినవి. అశ్వాసాంత్యముల నాదుల :—

క. నవనీత రసవిలోలుఁడు, భవనీరధి తరణకరణ పరిణతుఁడుసుధా
ర్ణవతల్పుఁ డనంతుఁడు మా, ధ్రువపురి మందిరుఁడు వ్రజవధూవరుఁడుర్విన్,

ఇట్లు ధ్రువపురీశునిపైఁ బద్యములు మాత్రము గలవు. ప్రథమాశ్వాసమున, నవరసస్థాయి భావంబులును, సజాతీయ విజాతీయంబులు, విభావానుభావ సాత్త్వికభావ సంచారికాభావంబులును రసజన్మ రసవిరోధాదులును ద్వితీయాశ్వాసమున, రతిగుణోత్కర్షంబును, సజాతీయ విజాతీయ నిర్దేశంబును, విభావానుభావ సంచారికాభావలక్షణంబులును, దృతీయాశ్వాసమున, ద్వాదశావస్థల విధంబును, బంచవిధశృంగారంబును, భావోదయాది చతుష్టయంబును, రససంకరంబుల తెఱంగును, జతుర్థాశ్వాసమున, సాధారణనాయకచతుష్టయంబు, చతుర్విధనాయికావిశేషంబు, తత్సఖిసఖీభేదంబులును గలవు.

శా. జానొందన్ శకవర్షముల్ బుతుశరజ్యావేందులై యొప్పన
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృష్ణైకాదశీభౌమయు
క్తానామామృతవేళ నీకృతియనంతార్యుండు సమ్యగ్రస
శ్రీనిండన్ ధ్రువపట్టనాధిపునకిచ్చెన్ భక్తిపూర్వంబుగాన్.

ఈతనివలె గ్రంథరచనాకాలమునుగూడఁ దెల్పినకవులు పూర్వులలో నరుదు.

## 116. విజయనందనవిలాసము. గ్రం. సం. 1964.

ఇందలిగద్యము :—ఇది శ్రీశైలభ్రమరీ మల్లికార్జున కరుణాకటాక్ష వీక్షాలబ్ధ సరససాహితీధారేయాత్రేయ సగోత్రపవిత్ర మంగళగిరి నరసయామాత్య పౌత్ర తిమ్మయామాత్యపుత్ర సుజనవిధేయ ఆనందనామధేయప్రణీతం బైనవిజయనందన విలాసము ... ... ఈయానందకవి యీపుస్తకమును దాట్లవేంకట కృష్ణక్షమానాయకున కంకిత మొనర్చెను. ఈవేంకట కృష్ణక్షమావిభుఁడు కోటకేతనప్రభుఁడు మూలపురుషుఁడుగాఁ గలదాట్లవంశమున జన్మించెను.

క. లోకమున దాంట్లనగర, శ్రీకలితుండగుచు వినుతిఁజెందినది మొదల్
నాకసువనవిభుఁడునులల, నాకంతుఁడు దాంట్లకసువనప్రభుఁ డనఁగన్.

అనుపద్యమున దాట్లవారను నింటిపేరు వీరికి దాట్లయను పురపరిపాలకు లగుటచేఁ గలిగినట్లు తెలియవచ్చుచున్నది.

మ. విపులామర్త్యకులేంద్ర భోగమహిమావిఖ్యాతియ వ్వేంకటా
ఖ్యపతిగ్రామణి కెప్పుడప్పయనప్రో లల్లాడభూజానిక
న్నపరుగ్రామము తిమ్మరాజమనుజేంద్రస్వామి కెన్నంగనె
ల్లపుడుం బందలపాక తావులయి మేలందున్ శుభశ్రీలతోన్.

ఈపద్యముంబట్టి యీదాట్లవారు గోదావరిమండలములోనివారని మెఱుఁగవచ్చును.

కృతిపతి కవింగూర్చి :—

చ. అనుపమబుద్ధిశాలులు మహాత్ము లశేష కళావిదుల్ పురా
తనకవులగ్రసూను లజుతన్వికి నాథునికుల్ కనిష్ఠు లా
టనెనరు పెద్దవారలయెడన్ మదినాయమకట్టివారిలో
నినుఁగడు గారవించు రమణీయకటాక్ష నిరీక్షణంబులన్.

క. కావున మృదుమధురోక్తి, శ్రీవిఖ్యాతము భవద్రచితమగుశశిరే
ఖావామాపరిణయకథ, నీవంకితముగ నొనర్పు నేర్పునమాకున్.

అనిన మాటలంబట్టి కథ విజయునకు సుభద్రకుం నందనుఁడగు నభిమన్యునకి శశిరేఖకు వివాహమని తెల్లమగుచున్నది. గ్రంథములో మొదటి పత్రము లేదు. చివరమూఁడవ యాశ్వాసాంతము కొంతలేదు.

శైలికై కొన్నిపద్యములు :—

మ. చని నిచ్చల్ తలిదండ్రు లగ్రజులు హర్షస్ఫూర్తి మన్నింప నం
దనుఁడుం దాను హృదిష్టభోజనపదార్థ స్వర్ణ భూషాంబరా
సనశయ్యాసుమమాల్య చందనముఖానంచద్వస్తు సౌఖ్యంబులన్
దినరాజిన్ ద్రుటికాల మట్లుగడపెన్ నిండారు మోదంబునన్.

మ. సరసీజేక్షణుఁ డిట్లు ధర్మసుతునాశ్వాసించి పర్ణాలయాం
తరసంవాసిని మైనద్రౌపదినిఁ గానంబోవ సంప్రీతి వే
గిర మయ్యింతి కుశాసనోపరి జగత్క్షేమంకరోద్య ద్వద్దయా
పరమూర్తిన్వసియింపఁజేసి కుశలప్రశ్నోక్తులం దేల్చినన్.

మ. ధరణీభృన్మకుటాగ్రరత్న కిరణోదంచ త్తులాకోటి సు
స్థిరదోర్దూరుదితప్రతాపవిజితశ్రీమేటి విద్విణ్మహీ
వరభూభృచ్ఛతకోటి యానృపతికెవ్వాఁ డుర్విపైసాటి భూ
వరకోటి న్గొరమి న్సదాత్మజున కీవచ్చున్మదిన్మెచ్చితిన్.

రక్తాక్షినామ సం॥ ఫాల్గున శు ౭ బుధవారము వఱకు అవసరాల తిరుమలరాయఁడుగారి ప్రతిలోనున్న ప్రకారము అల్లమరాజు రంగశాయి వ్రాసినప్రతి.

## 117. మూర్తిత్రయోపాఖ్యానము. గ్రం. సంఖ్య. 1960.

నామధేయశ్రవణ మాత్రముననే దీనిలోని కథ విదితమగును. దీనిగద్యము.

ఇది శ్రీమదనగోపాల ప్రసాదలబ్ధ కవిత్వ చాతుర్య దంతులూరి వంశవర్య ధనంజయగోత్ర పవిత్ర వేంకటరాజపుత్ర సకలసుకవిగణగేయ బాపక్ష్మానాథ నామధేయ ప్రణీతంబైన మూర్తిత్రయోపాఖ్యానము మహాప్రబంధంబునందు...

ఉ. మిత్రసమాన తేజుఁడయి మీఱినయచ్యుతరాజమౌళికిం
పౌత్రుఁడ వేంకటేంద్రునకు భవ్యగుణోన్నత కోనమాంబకుం
బుత్రుఁడ రుక్మిణీరమణభూరికృపాపరిపూర్ణదృష్టికిం
బాత్రమునైన దంతులురి బాపనృపాలక నామధేయుఁడన్.

ఇత్యాదులవలన దంతులూరి బాపక్ష్మానాథుఁడు రచించినట్లు సర్వవిధములఁ దెలియవచ్చుచున్నదిగాని కడపటి దగు నాశ్వాసాంతమునందు చివరనున్న :

సీ. శ్రీలీలమదనగోపాలమూర్తిఁ గృతీంద్రుఁగా దంతులురి బాఁపమేదినీశుఁ
గవిఁగానొనర్చి సత్కవిరాజు మృత్యుంజయాఖ్యుఁడు విరచించినట్టిదైన
మూర్తిత్రయచరిత్రముద మొప్ప శాలివాహనశకవర్షంబులజగుణాద్రి
చంద్రసంఖ్య నెసంగ జరగునీశ్వరశరత్స హితాదిమాస శుద్ధహరిదివస

గీ. భృగుదినంబున లిఖియించి పేర్మిమీఱ, దంతులురిపద్మరాజ భూకాంతమణికి
నొసఁగె నల్లమరాజవంశోద్భవుండు, రంగధాముఁడు ముదితాంతరంగుఁడగుచు.

అనుపద్యముంబట్టి క్రొత్తలంక మృత్యుంజయకవియే బాఁపభూపాలుని పేరున రచియించినట్లు కనఁబడుచున్నది. ఈ బాఁపరాజునకు మూలపురుషుఁడు హరిసీమ కృష్ణుఁడను నాతఁడు ధాన్యవాటీపుర ప్రభుఁడని యీక్రింది పద్యము నుడువుచున్నవి.

మ. కురియించె న్బహుధాన్యవర్ష మఖిలక్షోణీప్రదేశంబునన్
హరియించె న్విమతాంధకారములు బాహాగ్రాసిసూర్యప్రభన్
సిరిమించె న్నృపవర్యు లెంచఘనుఁడై శ్రీధాన్యవాటీపురీ
చిరసామ్రాజ్య రమాసమాశ్రయమహాసింహాసనాసీనుఁడై.

ఉ. ఆహరిసీమకృష్ణుని కులాబ్ధిఁ జనించెను భీమరాజు ...

ఈభీమరాజు కుమారుఁడు గన్నసరపతి.

సీ. ... ... ...
శ్రీనాథసుకవీంద్రుచే ధనంజయవిజయంబను సత్కావ్యమంది వెలసె
నృపతిమాత్రుండె నిజపాదనీరజాత, ఘటితకోటీరవైరిభూకాంతమాన
సాంతరభయాపహారి శ్రీదంతులూరి, గన్నభూపాల మౌళిదోర్గర్వశాలి.

అనుదానింబట్టి ధనంజయవిజయమను కావ్యమును శ్రీనాథునిచేఁ గృతిఁ బొందెననుసంగతి యెఱుకయగుచున్నది. శ్రీనాథుఁడు త్రొక్కిచూడని యాస్థానములు కనఁబడుటలేదు. ఈతఁడు చెప్పినట్లు వ్రాసికొనిన "నూనూగుమీసముల" యను పద్యములో లేనివి హరవిలాసమొక్కటి, శివరాత్రిమాహాత్మ్యమొక్కటి లోకమున కద్భుతముం గొల్పుచుండఁగా నీధనంజయ విజమొకటి వానికిఁ దోడగుచున్నది. అదియేమూలనున్నదో యేమహాత్ముల కంటఁబడునో.

ఇక్కవికవిత్వ ముభయభాషలయందు నిరుపమానముగానున్నది. సత్యముగాబాఁపరాజే రచియించినఁ బ్రభుకవిత్వమని దీనిని మెచ్చుక తీఱను. మృత్యుంజయ కవియే యయ్యేనేని వానిం దెలియనివారు లేరుగదా:

శైలికై కొన్నిపద్యములు :—

మ. తనయాసక్త మనోనివర్తనకు నై ధైర్యంబు పట్టేమియుం
గనఁగాలేక పయోజసూతి యఘయోగం బింతలేకుండ న
ప్పనిసాధింపఁ దలంచె నిట్లు జనకాపత్యాదిసంబంధముల్
తనుధర్మంబులుగాని యాత్మకును భేదం బింతయుం గల్గునే.

ఉ. పట్టుఁడు పట్టుఁడంచు సురపంక్తులు పల్కఁగ దైత్యపుంగవు
ల్పట్టఁగమాక శక్యమతిభారమటంచు వచించుచుండఁగాఁ
బట్టయినట్టి శేషఫణిపాశముతోన మునింగెనంతనె
వ్వట్టున నిల్వలేక గిరి భవ్యసుధాబ్ధిజలాంతరంబునన్.

శా. కైలాసాద్రిపయిన్వసించి కమలాకాంతామరేంద్రాది ది
క్పాలవ్రాతకిరీటకాంతిరచితప్రవ్యక్త నీరాజన
శ్రీలాలిత్యపదారవిందుఁ డగుచున్ సేవించు లోకంబులం
బాలించున్ శితికంధరుండు సదయభ్రాజత్కటాక్షంబులన్.

113. విష్ణుభక్తిచరిత్రము. గ్రం. సం. 1988.

ఇదియొక ద్విపదకావ్యము. దీనిని నలచరిత్రము ద్విపదగా వ్రాసిన రాఘవకవి రచియించెను. ఇదియు నలచరిత్రమువలెఁ బూర్వోత్తరభాగములు గలది. గద్యములోని పదములు సమానములే.

వలనొప్పఘటికాద్రివాసుఁడై నట్టి, నలినాక్షు డక్కారనారసింహునకును
వెలయసంకితముగా ద్విపదరూపమున, బలువైన శ్రీవిష్ణుభక్తిచరిత్ర
విరచింతు నానేర్చు విధమెల్లఁ దెలియఁ, గరమొప్పఁ దత్కథాక్రమమెట్టిదనిన.

విష్ణుభక్తిప్రభావము, విశిష్టాద్వైతప్రకారముగా మనోహరముగఁ జెప్పఁబడినది. కవిత్వము నలచరిత్రమువలెనే యున్నది. ద్విపదకావ్యము వ్రాయుట యీతనికి నల్లేరుపై బండి—ద్విపదలకుఁ బ్రసిద్ధులైన తాళ్లపాకవారికే మూలనైన బంధువుఁడైనఁ గా వచ్చునని "ఐనమూవారలనాళువారలను" నను నష్టమహిషీకల్యాణములోని చరణమిందు సందేహముఁ బొడమించుచున్నది. శైలి:—

ఆనతిమ్మనిన నష్టాక్షరీమంత్ర, మానుపూర్వకముగా నవుడానతిచ్చె
నిచ్చిన మునినాథుఁ డిచ్చలోమెచ్చి, యచ్చుగాసాష్టాంగ మతనికినొసఁగి
కూరేశ్వరాదులఁ గూడి వేవేగ, బోరునవచ్చి యాపురినున్న విష్ణు
సదనమండపమునఁ జయ్యననిల్చి, పదపడి యటనున్న ప్రజలెల్లవినఁగ
నామంత్రరాజంబు నవుడుచ్చరింప, ధీమంతుఁడగునంబి తెలిసివేవేగఁ
జనుదెంచి యతిరాజచంద్రుని గాంచి, యనఘాత్మనీవిటు లానతిప్పించి
తిప్పుడీమంత్రార్థ మిందఱువినఁగఁ, దప్పకపఠియింప ధర్మమేనీకు
ననవుడు దేవ మీ రందఱుముక్తిఁ, గనినఁజాలును నేను గడఁకనొక్కరుఁడ
నరకంబుగాంచెద నలినాక్షభక్త, వరులైనవారు భూవలయంబులోనఁ
గరుణమీఱఁ బరోపకారంబు చేసి, కరమొప్పసద్గతిఁ గనవలెఁగాక
తనుదానబ్రదుకుట ధర్మమే చెపుమ ... ...

ఈ గ్రంథమును చామర్లకోటలోని శ్రీమాన్ ప్రతివాదిభయంకరము వేంకటాచార్యులుగా రిచ్చినారు.

## 119. వీరనఛందస్సు. గ్రం. సం. 353.

భీమన ఛందస్సువలెనె యీవీరన తనపేరుతో నొకఛందమును మొదలిడెను. సర్వవిధములఁ బైఛందోమార్గముననే లఘురూపమున వ్రాయఁగడఁగినాఁడు.

క. వీరన యవరగుణాఢ్యులు, వీరనయసదృశమహత్వవిద్వత్కవిహం
వీరనయనాంచలకృపన్, వీరన లఘులక్షణంబు విరచించెదఁగన్.

ఉ. ఈలఘులక్షణంబు సులక్షేచ్ఛగ్రహించి యనంతరంబు ప
ద్యాలపదాలమర్మము లుదారతఁబూని పరామరించునా
వేళలనెల్ల లక్షణము వేయువిధంబుల సంగ్రహింపఁగాఁ
జాలుదురెట్టివారును నిజం బిదియేగద కీలు దీనికిన్.

గీ. పామరునకుఁ గావ్యభావంబు తెలియదు, చీఁకటింటిలోని చిత్రమట్లు.
కొంత తెలివియున్నఁ గొఱవివెలుంగగుఁ, బండితులకు దీపభాతియగును.

అని క్రింద యతిప్రాసలక్షణము వివరించెను.

గీ. ప్రాసమిరువదినాల్గింటివాసిఁగాంచి, షష్టివిధయతులందున స్పష్టమరసి
సర్వసాధారణంబగు జాడఁజూచి, తేటగను దేటయగునట్టి తెఱఁగొనర్తు.

ఇత్యాది ౧౦ పత్త్రములు మాత్రమే కలవు. ఎంత గ్రంథముండవలయునో తెలియదు. చివరఁగొంత యక్షరలక్షణమని వేఱుగా వ్రాయఁబడినది.

## 120. యువజనహృదయానందము. గ్రం. సం. 390.

ఇది తారాశశాంక విజయకథ—కవి బద్దెపూఁడిప్రభువగు నెఱ్ఱభూపాలుఁడు.

గద్యము. ఇది శ్రీమద్రామభద్రపాదారవింద సుందరమకరంద పాన తుంది లేందిందిరాయమాన మానస నిత్యసమారాధిత ప్రభాకరచరణసారస నిరంతరా వార్యశౌర్య మహదౌదార్య సముపార్జిత సంగ్రామార్జున జగనొబ్బగండ గండర గండ నిశ్శంకమల్ల చౌహత్తమల్లదోహత్త నారాయణగుజ్జరిదళవిదారణ సుకవిజ స్తుత్య పల్లవాదిత్య కలియుగ బేతాళ గాయగోవాళ జాళియామాళి యాబందీకార చంచుమలచూరకార బసవశంకర కేతనాంక సమరనిశ్శంక బలాత్కారాపహృత పాండ్యరాజసప్తాంగ త్రిభువనరాయ వేశ్యాభుజంగ ధనకనక మణిగణ ప్రపూరిత బుధజననికేతన పరభయద గరుడకేతన కేళాదిరాయకనకకర్పూర వసంతరాయాది మహనీయ బిరుదవిచక్షణ శ్రితజనసంరక్షణ పంటవంశపయఃపారావార తారకా కళత్ర కృష్ణమహీమహేంద్రపుత్ర దినేశ సంకాశప్రకాశ మధురదేశాధీశ విజయ రంగ చొక్కనాథ ధరానాథవితీర్ణసువర్ణదండ ప్రకీర్ణధ్వజ చ్ఛత్రపల్యంకికాప్రముఖ బహువిధ రాజలక్షణానుషంగ బుధవిధేయాంతరంగ బద్యపూఁడి పురవరాధ్యక్ష యెఱ్ఱభూపాలహార్యక్షప్రణీతంబైన యవజనహృదయానం దం బను శృంగార ప్రబంధము ...

రెండాశ్వాసములు మాత్రమే కలవు. ఇక్కవి తనవంశమునుజెప్పుచు నిష్ట దేవతలను సుకవీంద్రులను స్తోత్రము చేయురీతిగనే తనవంశపుఁ బెద్దలనెల్ల—

క. శ్రీరమ్యాసారవైభవ, గోరాణ్ణిభుఁ గలువకొండ గోత్రపవిత్రుఁ
సూరిజనస్తుతిపాత్రుని, భూరిగుణు ... ... పోతననెంతుఁ.

క. ... ... ... ... , మూర్తిపార్థివధుర్యున్
శ్రీవరపాదసరోరుహ, సేవానిధి రిపుమదేభసింహునిఁదలఁతున్.

గీ. ఎఱ్ఱభూవరతనూజు, మజ్జనకుఁ గృష్ణమహికాంతు మదిఁదలంతు.

గీ. అతులఘనకీర్తి, నమితశౌర్యాష్టమూర్తి
మూర్తినృపవర్యు, నుతియింతుముదముమీఱ.

క. వినుతింతు మీనమాంబన్, జనసన్నుత శుభచరిత్ర.

ఈరీతిగ వర్ణించియున్నాఁడు. ఇది కొంచెము క్రొత్తమార్గమే.

ఉ. పాయనిభక్తి మద్గురులపాదసరోరుహ యుగ్మమున్నుపా
ధ్యాయతనొప్పునప్పు రధరామరవర్యుఁదలంచి భారతీ
నాయకతుల్యు రేపురియనంతకవీంద్రునిఁ గొల్చిభూరితే
జోయుతులైన సత్కవుల సొంపుదలిర్ప నుతింతు నెప్పుడున్.

అని యొక్క రేపూరి యనంతయ్యనుమాత్రమే కవులలోఁ బేరొకనినాఁడు. ఈ యనంతయజ్వగాథేయోపాఖ్యానమను శృంగారప్రబంధమును శ్రీముష్ణ మాహాత్మ్యము, శివరహస్యఖండములను రచించినవాఁడు. సమకాలికుఁడో తనయాస్థానమునందుఁ బ్రసిద్ధుఁడో శృంగారగ్రంథముచేయుటలో సహకారియో కావలయును. కవిత్వము జటిలముగానుండునుగాని,

పొలుపగునని మదిఁబొగడుచుఁ, గలికొకతటినతని నెలమిఁ గలయఁగఁదలచున్,
మనసేకన్నికపైనీ, కెనసున్నది, చెప్పితేని యిప్పుడెదానిన్
నినుఁగూర్చి పెండ్లిసేసెద, ననిమెల్లనఁ జంద్రుతోడహాస్యమొనర్చున్

ఇత్యాదిఁ గొన్ని వికారములు చూపట్టును. శైలి—

చ. వనితయుఁ దానునేగి హిమవత్ప్రముఖాఖిల భూధరంబులన్
వినుతసరస్తటంబులను విష్ణుపదీముఖపుణ్యనిమ్నగా
ఘనపులినంబులన్ బదరికాగహనాది మహావనంబులన్
మునులరుదందునట్టి తపముల్సలిపెంగడు నిష్ఠమీఱఁగన్.

ఉ. అక్కజమైన ధైర్యమహిమాతిశయంబులు కల్గునింద్రునిం
గుక్కుటమై యహల్యకడఁగూయఁగఁజేసెఁ బ్రతాపశాలియై
మిక్కిలి నొప్పుదర్పకుఁడు మెత్తనివాని సుధాంశువేడ్కనా
ప్రక్కనుజొక్కి పాపురపుఁ బల్కులు వల్కఁగఁ జేయఁజాలఁడే.

రౌద్రి సం॥ వయ్యాసినెల ౧౮ తేది గురువారము బద్యభండారము వేంకటకృష్ణరాజువారికుమారుఁడు స్వామిరాజు వారితమ్ముఁడు తిరుపల్లిని వ్రాసినది.

## 121. శ్రీపర్వతపురాణము. గ్రం. సం. 2100.

ఇది శ్రీశైలపురాణమే.

గద్యము. ఇది శ్రీమల్లికార్జునకృపాలబ్ధమేదురాష్టభాషావిశిష్ట శివయోగగుణవర్య శేషనాథార్యప్రణీతంబైన శ్రీపర్వతపురాణమునందు ...

ఇందైదాశ్వాసములున్నవి. ఇంకను గొన్నియాశ్వాసములున్నట్లు పంచమాశ్వాసము చివరంబట్టి తేలుచున్నది.

క. శివజన్ముఁడ శివగోత్రుఁడ, శివలింగధ్యానపరుఁడ శీలవ్రతుఁడన్
శివపూజావరతంత్రుఁడ, శివయోగధ్యానపరుఁడ శేషాహ్వయుఁడన్.

అను దీనికంటె నీకవివిషయమిందించుకంతయుఁ గనఁబడలేదు. శైలిమొదలగునవి.

క. తెనుఁగైననేమి కవితా, జనితాలంకార చిత్రసంగతపదవ
ర్ణనవరచనలఁ జతురత, వినియోగ్యం బైనకృతియు వింద్రుమహాత్మల్.

చ. అహరహముం బికంబులును నంచలుఁగొల్వఁగ నుబ్బి ...
తహతహదీర నించువిలు దాయఁగ మారుఁడుగూర్చి కోయిలల్
కహకహనాదముల్మెఱయ గబ్బున నేసి యనంగుఁ డయ్యెఁబో
యహహ భవత్ప్రభావములు నల్పులకుం దెలియంగ శక్యమే.

శా. భూమాంహాఘానిలభుగ్విహంగము భవాంభోజాతమాతంగమున్
ధీమద్యోగినిషంగమున్ మునిమరుద్దివ్యాశ్రమోత్సంగమున్
సామర్థ్యోన్నతదిక్కుడుంగము మునిస్వాంతాబ్జసంసంగమున్
శ్రీమత్పర్వతశృంగముం బరిచితశ్రేయోంగనారంగమున్.

## 122. బృహజ్జాతకము. గ్రం. సం. 2104.

సంస్కృతబృహజ్జాతకమునకుఁ బద్యరూపము కావచ్చును. ఇందయనఫలము, ఋతు, వార, నక్షత్రయోగఫలములు మొదలగునవి గలవు.

క. శ్రీవిలసితనిజపదయుగ, సేవాగత దిగధిపాలశిఖరస్థలసం
భావిత నూతనరత్నస, మావృత రుచియాఢ్య వేంకటాచలనాథా.

గీ. అవధరింపుము జనితుల కవనినైన, ఋతువుపక్షము తిథివారఋక్షయోగ
కరణఫలములు శాస్త్రప్రసంగతులఁబట్టి, తెలియఁజెప్పెదఁజనులకుఁ దేటపడఁగ.
అని ప్రారంభించి పదేనుపత్రముల గ్రంథముఁవ్రాసి కడపట—
చ. "రవిశశిసౌమ్యమందులొకరాశిఁ జరింపఁగఁ బుట్టినట్టి మా
నవుఁ డతి దైన్యవృత్తిని ఘనంబగు లేమిఁ గృశించి యుండు నా
రవిశశి జీవశుక్రులొకరాశిని నున్నను రాజ్యమాన్యుఁడై
యవిరళసౌఖ్యసంపదల నర్థివనంబుల కేగులోలతన్."
"చంపకమురాగోవిందా, శ్రీరామానీపాదమేగతి।
శ్రీచిదంబరస్వామినేనమః, శ్రీనగరేశ్వరస్వామినేనమః॥ యాత్ర"
అని విడిచిపెట్టినాఁడు, కావున నాద్యంతములు రెండును లేవని తెలియవచ్చు
చున్నది. కవిపేరు తెలియదు. గద్యము కానరాదు.

123. ముకుందవిలాసము. గ్రం. సం. 2081.

దీనికి భద్రాపరిణయమను నామాంతరమున్నది. కాణాదపెద్దనార్యకృ
తము. మూఁడాశ్వాసములు, సంపూర్ణముగ నున్నది.

గద్యము. ఇది శ్రీమదుభయకవితా నిస్సహాయ సాహితీవిహార కాణాదా
న్వయయాతిమ్మనార్యకుమార వినయగుణధుర్య పెద్దనార్యప్రణీతంబైన భద్రాపరి
ణయోల్లాసంబగు ముకుందవిలాసంబను మహాప్రబంధము ... గ్రంథమునువ్రా
సిన వారికవిని కణజం పెద్దనసోమయాజియని వ్రాసిరి.

"ఈగ్రంథము తిర్మలరాయని సోమన్నపాలున కంకితమీఁబడినది."
ముష్టిపల్యన్వయున్, సోమున్ రాజలలాము నూర్జితకళాస్తోమున్ జయస్థేమునిన్
అను నిత్యాదులచే నీసోమరాజు నింటిపేరు ముష్టిపల్లివారని విశదమగుచున్నది.
"ననునందవరపురాన్వయవయోనిధిచంద్రుఁగాణాదవంశవిఖ్యాతసాంద్రు
నాశ్వలాయనసూత్రు నాత్రేయమునిగోత్రు"...
ఇత్యాదులచేఁ గవి గోత్రాదులు స్పష్టము.
పెద్దనార్యుఁగాంచి దయమించి పలికె సగౌరవమున.
గీ. కాదివర్ణంబు లిరువదియైదు విడిచి, చేసితి రపంచవర్గీయ చిత్రకృతిని
శేషశైలేశలీలాఖ్య చేనెసంగ, యాదిమితవర్ణనియతి శక్యంబె జగతి.
శా. శ్రీరమణీయతన్ సురపురీనగరీనగరీయదేశ భూ

భారధురీణుఁ డౌ బహిరపామన్నృపాలు సభాంతరంబునన్
మారమణాంకితంబుగను మత్స్యపురాణ మొనర్పఁబూనవే.

ఇత్యాదిపద్యములచే నీగ్రంథమునకు ముందు శేషశైలలీల మత్స్యపు రాణమును రచియించినట్లు గనఁబడుచున్నది. కవిప్రసిద్ధుఁడు. కవిత్వము శ్రేష్ఠమైనది. ఒకసందర్భములోఁ గవి తనసాహిత్యసామర్థ్యమును బ్రసంగవశంబున నొకరిచే నిట్లు పల్కించెను.

క. శిశువులకుం బశువులకు, న్వశమై సొక్కించు గానవైఖరిమధురా
తిశయము సాహిత్యమురుచి, భృశగతిసర్వజ్ఞుఁ డైననెఱుఁగంగలఁడే.

మ. సరసాలంకృతిబోధఁ జేకుఱుఁ గళాచాతుర్యముల్ వా
క్యరసజ్ఞత్వము గల్గుభావగతి నాహ్లాదం బిడుం జిత్రవై
ఖరిఁగావ్యంబు లొనర్పనేర్పుగలుగం గల్పించురాజప్రియం
బిరవై దుర్వ్యసనంబడంచు భువి సాహిత్యంబు సామాన్యమే.

క. ఆసాహిత్యశ్రీకిన్, భాసురకవితావిలాస పాండిత్యమును
ల్లాసింప సువర్ణమునకు, నాసౌరభ మొనసినట్టు లగునని మఱియున్.

మ. తనరన్ వ్యాకరణజ్ఞుఁ దంద్రియనుచుం దర్కజ్ఞునిన్ భ్రాంతియం
చును మీమాంసకుని న్నపుంసకుఁ డటంచు న్వేడి దూరంబునన్
గనియస్పృశ్యునిఁబోలె ఛాందసుని వేడ్కం గావ్యలీలారస
జ్ఞు నిజేచ్ఛం గవితావధూమణి వరించున్ భావగర్భంబుగన్.

చ. పలుకులరీతి యర్థములభంగి రసంబులపెంపు భావపుం
జెలువము లాశయంపురుచి శీతలవైఖరిప్రౌఢమార్గముల్
లలితచమత్కృతుల్దగ నలంకృతులుంగని సత్కవీంద్రులన్
మెలఁకువఁగాంచి భూవరులు మెచ్చినవిద్యలు విద్యలౌఁగదా.

నందన సం॥ చైత్ర శు ౧౦ మొదలు విజయ సం॥ ఫాల్గున శు ౧౧ వఱకు మహీమలు కోటప్పవ్రాసిన ముకుందవిలాసము.

## 124. నారదీయపురాణము. గ్రం. సం. 2011.

ఈపురాణమును రచించిన యతఁడు, అల్లాడు నరసింహకవి.

గద్యము. ఇది శ్రీమత్కంజర్లకొండమాచార్య పాదారవింద మిళిందాయ

మాన చెన్నయామాత్యపుత్ర కశ్యపగోత్ర పవిత్ర శ్రీమదల్లాడు నరసింహ ప్రణీతంబైన నారదీయపురాణంబునందు ...

ఏడాశ్వాసము లున్నది. సప్తమాశ్వాసము కడపట—

పూని గెలిచితిరేని యనూనశక్తి, మిమ్ము వెలయింతు మన్నింతు మేదినీత, లమున మీమతముననే హృద్యముగ నతండు. అని యాశ్వాసాంతపద్యము లున్నవి. కావున సంపూర్ణ గ్రంథమని తోఁపదు.

ఇక్కవి కరుణాకరమంత్రివంశములోనివాఁడు. ఈకవితండ్రి యల్లాడు చెన్నప్ప—

వెలసె, వైష్ణవమాత్రుఁడే విబుధకోటి, యాశ్రయింపంగసద్భక్తి నాదరించె
సిరుల నల్లాడు చెన్నప్ప శ్రీకరప్రభావ భావుకకీర్తి ప్రపన్నమూర్తి.

అనుటచే వైష్ణవమతస్వీకారము చేసినట్లు కనఁబడుచున్నది.

ఉ. అంబకుజోడు పంచవిశిఖాంబకు జోడు విదేహరాజజా
తాంబకుజోడు సాయకశయాంబకుజోడు పతంగలోకరా
జాంబకుజోడు మజ్జననియై భువనంబుల మించినట్టి కృ
ష్ణాంబ గుణావలంబ విబుధావళి మేలు బళీబళీయనన్.

అని వర్ణింపఁబడిన కృష్ణాంబ యిక్కవితల్లి.

"కలితవైభవులు సింగన యనంతనయు నాదిగాఁ బుత్త్రిలనందినాఁడ" నని మొందటో తనకుఁ బుత్త్రిలు గలరని సూచించినాఁడు.

ఇతండు, తనగురువు కొండమాచార్యులు స్వప్నంబునం గనఁబడి నారదీయ సాత్త్వికపురాణంబును లోకోపకారముగా నాంధ్రభాషను రచియింపుమని యాజ్ఞాపించుటచే దీనిని రచించినట్లు చెప్పుకొనియున్నాఁడు. "భగవంతుని మనంబున నిడుకొని రచియింపంబూనితిఁ దదవతారక్రమం బెట్టిదనిన" అని 18 పుటలు కృష్ణావతార ఘట్టమంతయు వర్ణించి యనంతరము షష్ఠ్యంతములువ్రాసి కథాప్రారంభమును జేసినాఁడు. శైలిచూడుఁడు.

క. అచ్ఛిద్రకోర్ధ్వపుండ్రం, బిచ్ఛావిధితోవహించు నెవ్వఁ డతండా
పచ్ఛటలం బొందిసదా, విచ్ఛిన్నోఘునిరమైకవింశతిమునుఁగున్.

గీ. కలితవిద్యాకులధనోద్ధగర్వపటల, జాతసంఛన్నదృష్టులమైతిమేని
నిన్ను నీక్షింపఁగలమెట్లు నిఖిలధర్మ, పదవిశేషోపరిష్టులై పరఁగియున్న.

క. ఇలయెల్ల దానమిచ్చినఁ, దొలఁగదునాపాతకంబు దూరతరంబై
తొలఁగునుహరివాసరమున, వెలసిన సుకృతంబువలన విమల చరిత్రా.

125. పద్మపురాణము. గ్ర. సం. 2057.

ఇప్పురాణము "నృసింహవరప్రసాదలబ్ధ కవితావిలాస భారద్వాజగోత్ర పవిత్ర అయ్యలామాత్యపుత్ర సరసగుణధుర్య సింగనార్యప్రణీతము. అబ్బయ్య (ఓబలయ్య) కుమారుఁడగు కందామాత్యునకుఁ గృతియీఁబడినది. ఈ కందామాత్యుని పూర్వికుఁడైన వెలిగందులామాత్యునకాశ్రయుండగు నుత్తమరత్నంబున కుపాశ్రయంబైన రామగిరి పట్టనాధీశ్వరుండైన ముప్పదిక్షోణీభూపాలుని యన్వయంబును మొదటవర్ణించి "యమ్మహారాజు మన్ననవడసి విశేషవస్తువాహన చ్ఛత్రచామరాందోళికాది రాజచిహ్నంబులం బెంపొందు కందనామాత్యు వంశావతారం బభివర్ణించెను. ఈకవి—

క. అపరమేశ్వరమకుట, వ్యాపృత గంగాప్రవాహ వరకవితాస
ల్లాపుఁ డగు మడికి సింగన, చేపట్టక కీర్తిగలదె శ్రీమంతులకున్.

చ. అనిపొగడంగఁ బెంపెసఁగు నయ్యలమంత్రికి సింగమాంబకున్
దనయుని విష్ణుమంగళ కథాసుముఖాత్ముని ...

ఇత్యాది పద్యములచేఁ దన వంశముం జెప్పుకొని—

ధాత్రిఁబద్మ పురాణఖండత్రయమున, సర్వసారాంశమై పుణ్యజననమగుచు
మండితంబైన యుత్తరఖండమిాను, తెనుఁగుగావింపునాపేర

నని కృతిపతి తన్నర్థించిన నీ పురాణమ్ముం గావించితినని నుడువుచున్నాఁడు. ౧౧ ఆశ్వాసములు సంపూర్ణముగానున్నది. శైలి—

క. ఏనెప్పుడు శీలముగల, దానన మైవేదములును దథ్యములగునేఁ
బూనిమదీశుని ముందట, నీనిఖిలము నెఱుఁగ మార్గమిమ్ము ధరిత్రీ.

చ. అని దయపుట్టనాడు జనకాత్మజ వాక్యములెల్ల నేర్పడ
న్వినిని ధరణీవధూటి కడువిస్తృతమైన బిలంబుసూపియు
త్యనుపమభూషణాంబర సమన్వితమై నిజదివ్యరూపు గై
కొని వెస సీత నెత్తుకొని క్రుంకె సురల్వొఱఁగంది చూడఁగన్.

క. బృందారకగణనుతులును, వందిజనస్తుతులు భాగవతగానములున్
సుందరులు పెర్గులలిమెడు, క్రందునఁ గృష్ణుండు మేలుకనియె భవానీ.

సీ. లలితనిరాతంకలంకాపురీమహాదాహక్రియాసముత్సాహసమయ
మందును లవలేశ మైన నార్తి నెఱుంగ కిరవొందు భానువంశ్యేంద్రురాణి
సుస్థితి రాణించుశుభచారణోక్తిచేఁ దెలిసిహర్షమునఁ దద్దేవి కెరఁగి
ప్రతియానవిధికిఁ దత్సతినియోగముఁగాంచి శీఘ్రింబె యారిష్టశిఖరి నెక్కి
గీ. భూరిగంభీరభీకరాంబునిధిదాఁటి, మఱి మహేంద్రధరాధరమధివసించు
కపికులాధీశ్వరులఁబూర్ణకాములుగను, బళిరెయొనరించెధృతిఁబూనిపావమాని.

— * మధువనభంగము. * —

క. వెండియుఁ దనవృత్తాంతము, చండాంశుకులేంద్రుదూత సైన్యేశులకున్
నిండుమనంబునఁ దెలిపె న,ఖండితబహుమానపూర్వకంబుగ నంతన్. 122
క. అనిలివాక్ప్రీముదితకపి, సేన యహంపూర్వికఁ జని (జితశేఖరుమా
ర్గాన) న్దధిముఖకృత మవ,మానము నిరసించి చలిపె మధుపానంబున్. 123
గీ. అపుడు మధువనభంగదృష్టప్రరుణముఖుఁడు
దధిముఖుఁడు వల్కె వాలినందనునిఁ జూచి
మొనసి మధుపానవిధిశిలీముఖము లైన
యీవలీముఖులను మాన్పు మీవె యనుచు. 124
వ. అంత గిరిశృంగతుంగనిజాంగుం డైన యంగదుండును దధిముఖుం గనుంగొని
యి ట్లనియె. 125
మ. కనుఁగొంటి న్రఘునాథవల్లభను లంకారాజధానీవనాం
గనమధ్యంబున నంచు నేఘనుఁడు మత్కర్ణామృతాభాషణం
బును జిల్కె న్మఱి వానిమాటకును దప్పం గల్గునే కీశవా
హిని తాఁగ్రోలు యథేచ్ఛగా మధువు నెంతే యీవనాంతంబునన్. 126
గీ. అనినయంగదోక్తి నాలించి భీతుఁ డై, దధిముఖుండు వోయి తపనసుతుని
తోడ విన్నవించె దుర్వారవనభంగ, మతఁడు రాము కెలన హర్ష మొందె. 127
ఉ. సానుమదగ్ర మెక్కి వరుసన్ డిగి ప్రాకులఁ గౌఁగిలించుచుం
గానలఁ బండ్లు మెక్కి మఱి గంతులువైచుచుఁ గూయుచు న్నదా
నూనతఁ దోఁకపట్టుకొని యొండొరుల న్వడిదాఁటి పాటవా
* పీన కపీశసేన గనిపించె నదూరత నద్భుతంబుగన్. 128
ఉ. నిద్దురలేమి శోణతరనిర్భరమై తగుకన్నుదోయిచే
నొద్దన యుండి యూర్మిళప్రియుండు గనుంగొన నాంజనేయుఁడుం

* పీన గపిసేన నప్డు గనుపించె నదూరత మద్భుతంబుగన్—మాతృక.

దద్దయు భక్తిఁ జూడమణి దాను గరంబునఁ దాల్చి మ్రొక్కి శ
శ్వద్దయమానుఁ డై నరఘువర్యునియంఘ్రులకు న్ముదంబునన్. 129

మ. నిరవద్యప్రభవద్గతాగతముల న్విస్తీర్ణవిస్తీర్ణదు
స్తరఘోరార్ణవుఁ డయ్యు నభ్రమణివంశ్యగ్రామణీదూత వా
నరసేనాసవిధంబునందుఁ బరమానందాపదేశాపగా
పరిణీమధ్యమున న్మునింగె జనదృక్ప్వాళీ విచిత్రంబుగన్. 130

క. హనుమంతుఁడు కలితమహా, ధనచూడారత్నసన్నిధానముదిత రా
మనృపాయుక్తుం డై చ,య్యనఁ దెలిపెను సతియుదంత మాద్యంతంబుల్.

ఉ. నైకనిశాచరీసముదయాన్వహబాధితయై ద్విషత్పురా
శోకవని న్వసించు పరిశుద్ధచరిత్రను సీతఁ జూచితిం
బ్రాకటపూర్వపాతకవిపాకముచేత సుపర్ణలోకబం
దీకృతయైన నాగతరుణీమణిఁ బోలినదీనమాననన్. 132

చ. అసదృశచిత్రకూటవిపినాంతరసీమ నుదీతమైన త్వ
ద్బిసరుహసంభవాశుగవిభీతజయంతదురంతకష్ట సా
హసమును దెల్పి యెంతయు నుదశ్రుముఖాంబుజ యైనసీత యిం
పెసఁగ నొసంగె మౌళిమణి నిత్తఱి నీ కిది యానవాలుగాన్. 133

గీ. పోవ నుద్యోగమొనరించి దేవ యిప్పు, డతులితాశావిశేషపాలితము లైన
సాధ్విప్రాణము ల్మీయభిజ్ఞానముద్ర, చేత ముద్రించి వచ్చితి శీఘ్రముగను. 134

చ. పటుగుణకారువీటిపురభాస్వదలంకరణాప్రసన్న వేం
కటపతిపాదపంకరుహగంధమిళిందమనోవిటంక వేం
కటపెరుమాళ్ళనృపాగ్రజ యగారచరిష్ణురమాంఘ్రినూపురా
రృటిమతికారి గృహ్యాకమరాళివిరావ యరాతిజిత్వరా. 135

క. కంఠేకాలపరాక్రమ, శుంఠీనవఖండయోగ శుభవాక్యవిరా
ట్కంఠీరవనుతసద్యః, కుంఠీకృతవిమతయత్న గుణరత్ననిధీ. 136

తోటకం. అరికాళమహాబిరుదాంక లస,త్కరికాళమహీభృదుదారకులా
భరణా శరణాగతపాలన జి,త్వరతాద్విరదావనదానఘనా. 137

గద్యము. ఇతి శ్రీమదుమామహేశ్వరవరప్రసాదసమాసాదిత సరసకవితావిలాస వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక తిరువేంగళార్య కలశరత్నాకరసుధాకర జగద్విఖ్యాతకవిరాజకంఠీరవబిరుదాంక వేంకటాచలపతి ప్రణీతంబైన చంపూరామాయణంబను మహాప్రబంధంబునందు

సప్తమాశ్వాసము.



# చంపూరామాయణము.

## అష్టమాశ్వాసము.

— * యుద్ధకాండము. * —

క. శ్రీమత్ప్రతాపతపనో,ద్దామ మహోదూరితారిధరణీపరిణీ
భీమాంధకారజాలా, రామాపాంచాల కసవరాజనృపాలా. 1

మ. ఇల యద్వీక్ష యదాటుగానయిన నెంతే వాణిప్రత్యక్ష మా
బలుసారస్యముసొం పెసంగు సభలం బ్రాగల్భ్యము న్పాటిలుం
గళలెల్ల న్బ్రభవిల్లు మర్త్యులకు దిగ్వ్యాప్తంబు లౌ సద్యశం
బులు చింతించు మదాత్మ యాగురుపదాంభోజద్వయిన్ భోజునిన్. 2

ఉ. భూరివచోధురీణుఁ డగుభోజనృపాలుఁ డపూర్తికంబుగాఁ
దా రచియించి నిల్పిన యుదారకృతిం బ్రతనూక్తి నిత్తఱిం
బూరిత మాచరించుటకుఁ బూనితి సిబ్బితిలేక యిమ్మహిన్
దారము పేరురమ్మునను దాల్పరె హారముతోడి కూటమిన్. 3

మ. మతిధుర్యుం డగులక్ష్మణుం డొగి శిరోమాణిక్యముం జూచి సం
తతమోహాకులుఁ డైనరాఘవుని ముద్రాముద్రితప్రాణప
ద్ధతి యా సీతను బల్మఱుం దలఁచి తత్పౌలస్త్యవిధ్వంస ము
ద్ధతిఁ గావింపఁ దొడంగె నుజ్జ్వలకథం దా నేకకాండంబునన్. 4

ఉ. హృష్టత సీత యున్న దని యింపుగ మారుతి విన్నవింప సం
తుష్టనిజాంతరంగుఁ డగుతోయజబంధుకులాధినాయకుం
డష్టదిశాభయంకరదశాస్యరుషాపరుషాయమాణ యా
దృష్టి శరాసనోపరిఁ బ్రతిష్ఠితఁ జేసె రణైకనిష్ఠుఁ డై. 5

సీ. అంత సుగ్రీవుఁ డుద్ధతదశగ్రీవదుశ్చరితరోషితరామచంద్రవదన
దర్శనద్విగుణితోదగ్రజాగ్రద్రణోత్సాహుఁ డై సాహాయ్యసమయ మాగ
తం బయ్యె నని ప్రమోదంబున సింధువు నంధువుచందాన నాత్మ నెంచి
యనివార్యధైర్యగాఢాంతరంగన్నిరాఘాటాధిరూఢత్రికూటశైల

గీ. శృంగ యగులంకఁ జేరంగ శీఘ్రముగను, సాహసోన్నతి మీఱి సన్నాహపఱిచె
వినతనీలనలాంగదద్వివిదకుముద, జాంబవద్రంభశరభాదిసైన్యములను. 6

క. తత్క్షణమున రఘువంశ్యా, ధ్యక్షఘనాపాంగధార నభిపూరితనై
దక్షిణవాహిన్యధిపన, మక్షంబున కేఁగెఁ దన్మహావాహినియున్. 7

వ. మఱియును బరిచలితసకలర్క్షసముదయామోదభాసియుఁ గుముదామోదకారియు శర
భాధికప్రసాదశీలశాలియు, నీలేందీవరానందసంధాతయు దశాననదిశాక్రమణ
వ్యగ్రతేజోవిరాజియు సమారూఢతారానందనలాక్ష్మణోదయానుగతి ప్రభా
వానుబంధియు సరయహనుమదుదయ సానుమత్సమారోహియు, నిశాచర
తిమిరహరణనిస్తంద్రుండును నగురామచంద్రుండు గనుపట్ట సమంతతఃకందళిత
బహుళహరిజాలకోలాహలభరితహరిదంతరంబును నిరంతరాస్కందిత నికట
కాంతారావళియు నగువలీముఖబలమహాంబుధి ససంభ్రమంబుగా విజృం
భించె నయ్యవసరమున. 8

— * కపిసేనలు మలయపర్వతమున విడియుట. * —

చ. తలఁకెడుదున్నలు న్నిలిచి ధైర్యముతో నెదిరించు సింగముల్
దొలఁగెడునేనుఁగు ల్చెదరుదుప్పులు బెళ్కెడుజళ్కుఁజూపులం
బలుదెసలం గనుంగొనుచుఁ బర్వెడులేళ్లును గల్గి యావన
స్థలి కపివీరఘోషములఁ జాల భయంకర మయ్యె నయ్యెడన్. 9

చ. బలములతో రఘూద్వహుఁడు వార్ధి నొకానొకపిల్లకాల్వఁగాఁ
దలఁచి వనుల్బయల్పఱిచి దారున సహ్యనగాధిరోహముం
జలిపి యసహ్యపాతఘనసౌరభనిర్భరశైత్యమాంద్యదో
హలమృదువాతపోతనిలయం బగునమ్మలయంబు గన్గొనెన్. 10

వ. కనుంగొని సుమిత్రాపుత్రునితోడ ని ట్లనియె. 11

ఉ. సారెకు నామనంబు కలఁచం దొడఁగెం దటనిర్ఝరోర్మివి
స్ఫారపయోజడీకృతవిశాలపటీరకుటీరవారసం
సారసమేతము ల్మలయశైలనితంబమహీవిహారసం
భారవనప్రియప్రియతమారుతమారుతపోతజాతముల్. 12

చ. అని యతిదీనభాషణము లాడుచు రామమహీమహేంద్రుఁ డిం
పొనర నిరుద్ధవేల మయి యున్నతిఁ గన్నమహేంద్రశైలమున్
ఘనతరసాలము న్దరిసి కాంచె జలభ్రమముద్రితస్వవం
శ్యనృపవిశాలకీర్తినిధిచందమునం దనరారువార్నిధిన్. 13

వ. కాంచి యుదంచితాశ్చర్యధుర్యాంతరంగుం డై యారాజపుంగవుం డి ట్లనియె.

ఉ. ఎవ్వనిలోఁతు చూడ నురగేంద్రుఁడు చాలఁడు నెల్ల మేరలం
దెవ్వని కెల్లదిక్కులును నెవ్వనిసై కతరాశి దీవు లిం
కెవ్వఁడు వాగగోచరుఁడు నిట్టిపయోధి నఖాళి నెవ్వరే
త్రవ్విరి నించి రట్టికులరాజులచర్యలకు న్నమస్క్రియల్. 15

క. అంతట సుగ్రీవుఁడు మహి, కాంతునియనుమతి మహేంద్రఘనవనవేలో
పాంతమునఁ జలువ తెమ్మెర, చెంతలఁ బొలయంగ సకలసేనల డించెన్. 16

చ. సరసపటీరకుంజవనసంజవనాభిపతన్మృగీమద
స్ఫురితసుగంధగంధవహశోభితసింధుతటాంతికంబునన్
సరవి రసాలతాళఫలచర్వణగర్వితచిత్తు లై చరిం
చిరి హరివీరు లెల్ల నిజచేష్టలు రాముని కింపు నింపఁగన్. 17

వ. అంత నిరంతరసమాక్రాంతహరిదంతరం బై నడయాడు రెండవసముద్రం బనంగ సముద్రతీరంబున రోదసీవిలంఘనవిశృంఖలలాఘవం బగురాఘవానీకం బనీకోన్ముఖం బగుట, చారముఖంబున నవధరించి ధార్యమాణహృదయాతంకుం డై పంకలీనచరణం బగునైరావణంబుకరణి రావణుండు కరణీయంబు నెయ్యది యెఱుంగక జనకరాజతనూజ నుజ్జగింపం జాలక మనోజపరతంత్రితుండై మంత్రులం గూడి కొలువుకూటంబునకు వచ్చి యచ్చట. 18

క. శ స్తవచస్తతు లై నప్ర,హస్తాదులఁ జూచి యస్మదభిలాష మిదే
దు స్తరవై రివధోచిత, నిస్తులభవదభిమతంబు నెదఁ దెల్పుండీ. 19

సీ. అనవుడు వార లి ట్లని రాశయ మెఱింగి స్వామితావకనిదేశం బొనర్చు
నేము ప్రాణములతో నివు డుండ నీవా ర్త లాడ నేమిటికి వజ్రాతికఠిన
భుజపంజరానీతభూజాత విడకుము నా విని లంకాధినాయకుండు
రంభాబలాత్కారసంభోగజం బైన యంభోజభవశాప మంతరాయ

గీ. మగుట వచియించె నిటులన్నయన్నఁ జూచి, విన్నప మొనర్చె విజ్ఞానవినయభూమ
ణుండు నురుసత్యసంభాషణుం డరోష, భీషణుండును నైన విభీషణుండు. 20

— * రావణునకు విభీషణుఁడు హితముచెప్పుట. * —

గీ. అకట దై వాజ్ఞఁ బరకళత్రానురాగ, లాలసుఁడ వై తివి దవాగ్నికీలఁ జూచి
యామిషగ్రాహమోహసంప్రా ప్తరసన, చాపలం బైనముగ్ధకేసరియుఁ బోలె. 21

క. అనఘుం బగునిజవంశం,బున సీతాహృతికళంకము న్వొని హాహా
ధ్వనిమీలితాత్ముఁ డగువిధి, యెనిమిదిచెవులెట్లుమూయు నీకఁ గేల్దోయిన్.22

ఉ. అక్కట వారిరాశి పరిఖావృత యై విలసిల్లులంక దా
నెక్కడ దుర్వచం బగుమెయిం గపిచేసినయయ్యుపద్రవం
బెక్కడ సీత జానకి మహీసుత నాఁజనుపేళ్ల దైత్యులం
గ్రక్కున నుక్కడంపఁగ నొకానొకమాయ జనించె నేమొకో. 23

మ. నరుని న్వానరునిం దృణంబుగను డెందానం దలంతేని సు
స్థిరదోశ్శౌర్యునిఁ గార్తవీర్యుని బలశ్రీశాలి యావాలిని
వరుసం జూడవె యింతలో మఱచితే నందీశుశాపంబును
న్నరవర్జ్యం బగుపద్మభూవరము నన్నా! దైవమి ట్లుండెనా? 24

వ. ఇత్తెఱంగునం దరంగితజ్ఞాతినీతివచనరచనై కనిష్ఠుం డగుకనిష్ఠునివమానించి యిజ్ఞాతి యరాతిపక్షపాతి శిక్షణీయుం డని కోపంబున దురాలాపంబు లాడు ఘాతుకు నగ్రజాతునిం బరిత్యజించి యరుంతుదాచరణరోషభీషణుం డగువిభీషణుండు నిరవద్యనీతివిద్యాచతుర చతురమాత్యసహితంబుగా నంబుధిఁ గడచి రా నప్పుడు తన్ను దవ్వుల విలోకించి కించిద్వితర్కంబున సుగ్రీవు లగుసుగ్రీవాదులం గుఱించి యంతరిక్షగతుం డై యి ట్లనియె. 25

— * విభీషణుఁడు రాముని శరణుసొచ్చుట. * —

గీ. వెక్కసములాడు నగ్రజు విడిచి బంధు, జనులఁ గా దని నేవిభీషణుఁడ నిదిగొ
రాము రిపుభేదనోద్దాముఁ బ్రణతదైన్య, హరణు శరణని వచ్చితి ననఘులార.

సీ. అనుచు నత్యంతదైన్యంబు మీఱఁగ సమీరితనిజోదంతుఁ డౌ నతని మఱి స
మీరకుమారాభిహితసాధుశీలతోన్నతుని లంకాపురీనాయకాను
జాతునిఁ గర్ణగోచరపథాన్వితునిఁ గావించియేతదాగమనమునకు
"కింకారణం" బని శంకాకులుం డౌచుఁ గీశపుంగవుఁ డెఱింగింప నప్పు

గీ. డినకులేంద్రుఁడు దయమానహృదయుఁడును ను
దంచితస్మయమానముఖాంబుజుండు
నగుచు మకరందబిందునిష్యందమాధు
రీనిగాఢోక్తి ని ట్లని యానతిచ్చె. 27

గీ. అభయ మని వచ్చు నితఁడు వైరియర్థ్య మిపుడు
కనిన రఘువులు లఘువులు గారె వైరి

కనుజుఁ డైనను తనుజుఁ డైనను సఖుండ!
ధరణి శరణార్థి కరుణాపదంబు గాఁడె? 28

క. అనుటయు హృదయజ్ఞుం డగు, హనుమంతునిచేత వేగ నానీతుఁడు స
ద్వినయాన్వితుండు నైరా,మునకుం బ్రణమిల్లె నసురముఖ్యుఁడు భక్తిన్. 29

ఉ. అత్తఱి రాముఁ డిట్లను నిశాటకులేంద్ర దశాస్యరాజ్యసం
పత్తికి నెల్ల నిన్నిపుడు పట్టముగట్టితి వైరిఁ గొట్టితిం
జిత్తమునందు సందియము సేయకు మిందునకు న్నిదర్శ నం
బుత్తముఁ డైనభానుతనయుండును వాలియుఁ గారె యారయన్. 30

గీ. దైవవశమున నరుఁడు పదాననుండి, కనుఁ బదాంతరము విభీషణునియెడ నిది
ప్రబలె రేఖాతపత్ర మహారామపదము, పట్టె యేకాతపత్ర మహా పదముఁ గనుట.

వ. అంత నాదశగ్రీవానుజుం డగ్రభాగంబునంద భరతాగ్రజాపాంగసుధాతరంగా
భిషిక్తుం డయ్యును బునరుక్తరాజ్యాభిషేకుం డై సుగ్రీవునికైవడి విశ్వాస
భాజనంబును నగుచు రావణబలంబు నఖిలంబును నెఱిఁగించి లంకపై విడి
యుటకు సేనాసముత్తరణహేతు వగుసేతువు నిర్మింప నతిగంభీరం బగుపారా
వారంబు నారాధింపు మని సవినయంబుగ విన్నవించిన. 32

క. అంబుధిని మదిఁ దలంచుచు, సంబుధితమహత్త్వదర్భశయనస్థలియం
దంబుధిహృదయేశయుఁ డపు, డంబుధిపై ననిలసఖుక్రియన్ శయనించెన్. 33

క. ఈదారి నతఁడు నియతి మ,హాదర్భాస్తరణమధ్యమధ్యాసీనుం
డై దివసత్రయ ముండిన, యాదఃపతి యప్రసన్నుఁడై వర్తిల్లెన్. 34

శా. భూపాలాగ్రణి రాఘవుండు కుటిలభ్రూభాగుఁ డంభోధిపైఁ
గోపోద్రేకవిపాకపాటలితచక్షుఃకోణ ముజ్జృంభిత
వ్యాపారంబుగఁ జాపముం గొనుటకై వాంఛించె వేగంబుతో
నాపాతాళపితామహప్రథమసర్గాటోపము న్మాన్పఁగన్. 35

— * శ్రీరాముఁడు సముద్రునిపైఁ గోపించుట. * —

వ. అంత. 36

మ. బలువి ల్లమ్ములుఁ దెమ్ము తమ్ముఁడ మదప్రారంభగంభీరునిన్
జలధిం గాల్చెడనేసెదంగవుల కస్మద్దోఃప్రతాపంబు ది
కుటలం బేరెక్కఁగ నంచుఁ బల్కుచు నతిక్రోధానురోధోద్ధతిం
బొలిచెం గార్ముకపాణి యత్తఱిఁ *దిరుప్పల్లాణి నుల్లాసియై. 37

---

* సేతువు.

క. విలు కేలఁ బూని యత్యు, జ్జ్వలవిశిఖము ననలశిఖము సంధించె మహా
బలశాలి రామభద్రుం, డిల యద్రువర్గ గిరులు గదల నినుఁడు వడంకన్. 38

క. మున్నీటిమీఁద రాజుల, మన్నీఁడిటు లస్త్రమేయ మది నూహింపన్
మిన్నేటిబోటి క్రన్నన, గన్నీటినెపాన నతనికడఁక మరల్చెన్. 39

ఉ. భానునిభుండు రాఘవుఁడు బాణముఁ బూని యమోఘలాఘవుం
డై నిగిడింప నిశ్వసదుదంచితనక్ర మవక్రకుంభికుం
భీనసనంప్రవిష్టగిరిమేదురకందర మయ్యె నమ్మహాం
భోనిధి యంతరంబు పరిభూతరసాతలభాగ్వసారమై. 40

క. జలరాశి తత్క్షణంబునఁ, బ్రళయానలబాడబాగ్ని భార్గవపరశూ
జ్జ్వలగరళతాప మోర్చియు, జ్వలననిభాస్త్రంబు వేఁడిసైఁపం డయ్యెన్. 41

క. శరణం బని యాశరధియుఁ, దరుణతరశరవ్యథానిదానం బగుదా
శరథిం జేరెను లోకులు, పరుషకులిశపాతి ఘనునిఁ బ్రార్థింపరొకో. 42

వ. ఇట్లు చేరి యారత్నాకరుండు నభోరత్నవంశ్యరత్నంబునకుఁ జిరత్నరత్నంబు లుపదగాఁ గొంచు వినీతవేషంబుతోఁ బరితోషంబుగ వినుతిఁ గావించి సేవించి దేవా తావకధనుస్సంహితామోఘవైధాత్రాస్త్రంబు వనచరధామం బగుమదంతర్వర్తిమరుసీమంబునం బ్రయోగింపుము, నియోగింపుము సేతునిర్మాణంబునకు విశ్వకర్మాత్మజు. నేఁ బనివినియెద నని యంతర్హితుం డయ్యె నంత.

చ. రవికులుపంపున న్వనచరచ్ఛట దెచ్చిన యాజగత్త్రియ
ప్రవితతమూలమధ్యశిఖరక్షితిభృత్తతి లోఁబడంగ న
ర్ణవము వహించెఁ గర్దమఘనత్వము తోడనె తన్మహోర్ఘురీ
భువనభరంబుచే నహహ పూరితమయ్యె నశేషదిక్కులున్ 44

చ. ద్రుతగతి వారిధిం బడియె దూరనిపాతవిశీర్ణవాఃశ్చర
ప్రతతివితీర్ణజీవనదబంధురగంధఘనౌషధు ల్విదా
రితధరణీవినిర్యదహిరేచితఫూత్కృతిజాతఖేదభా
గతులగుహాగృహాసికమహాహరు లాగిరు లద్భుతంబుగన్ 45

చ. ఉరువడి గట్లు కైకొనుట యుంచుటమర్చుట యించుకేని మె
వ్వరికి నెఱుంగకుండఁ గరపాటవ మొప్ప నలుండు సేతు వ
చ్చెరువుగ సంఘటించె నది సీతకు భూమి యభీతిహస్తమున్
దురుసుగఁ జాఁచెనో యనఁగఁ దోఁచె వనేచరవీరకోటికిన్ 46

వ. అంత నంతర్ముఖులుంబలె వలీముఖులు ప్రమోదంబునుం బలె సేతుపథంబును సంసారంబునుంబలె దుస్తరంబగు సకూపారంబునుం గడచి సద్యఃప్రకాశ మానవిస్ఫూర్తి యగుసువేలగిరిశమూర్తిం గనుంగొనుచు డెందంబున నమం దానందంబు నొంది రప్పుడు,                                                                                  47

చ. తపనకులాధినాయకుఁడు తావుగఁ గైకొనె నావృతస్ఫుర
ద్విపులతటోజ్జ్వలద్జ్వలనివేశనిరంతరసాలజాలముం
గపికులఘోషశీర్యదురుకందరమందిరగర్భసంత్రస
త్కుపితమృగేంద్రభీతమదధూర్వహవేలము నాసువేలమున్.                                   48

వ. ఆసమయంబున దశముఖుండు శుకముఖంబున నతీతనదీసార్వభౌముని నధి గతసువేలారాముని రాముని నెఱింగి వెండియుం దదీయబలంబు విశదం బుగాఁ దెలియుటకునై పరిప్రేషితులును, విదితవేషవిభీషణప్రేరణకుపితకపి లోకనియంత్రణ నితాంతఖిన్నులును విపన్నాధారదాశరథివిమోచితప్రాణులు నగుశుకసారణులవచనంబులవలన మహోత్సేధం బగుసౌధంబు నధిరోహించి వేర్వేఱఁ దదావేద్యమానులును బ్రవర్ధమానసమరసన్నాహమతులు నగువా నరసేనాధిపతుల నతిధీరతావశంబున సావధీరణంబుగ నవేక్షించి ప్రతిపక్షబల ప్రశంసను లైనయయ్యిరువుర నుపేక్షించి శార్దూలప్రముఖప్రౌఢగూఢచారు లచే నవగతాశేషవృత్తాంతుండును దాంతుండును నై పెద్దయుం బ్రొద్దు చిం తించుచు నంతికాసీనుండును నతివినీతిప్రహ్వుండును నగు విద్యుజ్జిహ్వునితో మంతనంబు నేమేమొ నొడివి ప్రాసాదంబువలన నవతీర్ణుండయ్యెఁ దత్క్షణంబున.

— * విద్యుజ్జిహ్వునిమాయకు సీతవిలపించుట. * —

గీ. అతఁడుసధనుశ్శరము రఘుపతిశిరమ్ము, మాయ నిర్మించి సమరసమాహృతమని జనకసుతమ్రోల వైవ వాసంతిలతకు, నశనికై వడి దుఃఖదం బయ్యె నదియు.50

క. రక్షోవరోధవసతియు, రాక్షసరక్షోవరోధరావణదుర్వా
గ్రూక్షత యదర్థమోర్చితి, తత్క్షయమునుం గనియు సీత తగునా బ్రతుకన్.   51

వ. ఇత్తెఱంగున నత్యాహితమత్యాకులతాసమేత యగుసీతనుం గనుంగొని చేరి యోజనకరాజకుమారీ, యీదశ యాదశముఖునిమాయ యందున కేమా యె, నీ మనంబున ధైర్యవైధుర్యంబు నొందకు మఖిలజగతీధుర్య భుజ బలాభిరాముం డైనరామునెడ నిట్టియకార్యం బవిచార్యం బని సుధాధారలు

గులుకం బలికిన విని యాసారావలంబిని మైనకాదంబిని ఘర్మోద్వేగిని మైన కేకినింబలె పరమ కర మాశ్వాసించె నంత. 52

చ. మతిగలమాల్యవంతుఁ డనుమంత్రి త్యజింపుము సీత నన్న చో
నతికుపితాత్ముఁ డౌనలదశాస్యుఁడు వాని లఘూకరించి తా
నతనుభుజప్రతాపయుతుఁ డౌటను దోస బహూకరించె స
మ్మతి నలయప్సరోయువతిమండలము స్నవమాల్యవంతమున్. 53

వ. అంత ననంతకల్యాణగుణాభిరాముం డగురాముండు కామరూపవిభీషణామాత్యవిదితరక్షోనగరరక్షోదంతుండును, హృదంతరోపజాతసమరసంరంభుండును నై, యంభోధిమేఖలాలంకారలంకాద్వారస్థుం డగుప్రహస్తునకుఁ బర్యస్తాహితప్రాణానిలతాభీలుని నీలుని, దక్షిణద్వారరక్షణదక్షు లగుమహాపార్శ్వలకు విశ్వత్రయవిజయధౌరేయుఁ దారేయునిఁ, బ్రత్యగ్ద్వారపాలనఖేలనాటోపుం డగుమేఘనాదున కవక్రపరాక్రమశ్రీమంతు హనుమంతుని, నంతర్వ్యూహవిహితరక్షుం డగువిరూపాక్షునకు రక్షఃప్లవగబుద్ధ్యాధ్యక్షులఁ బ్రతినిధులం గావించి యధిజ్యకోదండమండితభుజాదండుం డై తమ్ముండునుం దానును సమరాభిముఖదశముఖగుప్తోత్తరగోపురద్వారంబును నంతరంగంబగు బలయూథంబుతో నుపరోధించిన. 54

క. లంకఁ దనుజులు ప్లవగాతంకంబునకుం దలంకి తలుపులు వేయన్
శంకింపక యమపురిఁ ద,త్కింకరు లప్పుడు బెడానఁ దెఱచిరి తలుపుల్. 55

వ. తత్క్షణంబ లక్ష్మణాగ్రజుండు సుగ్రీవసహితుం డై సువేలాద్రికూటంబు నధిరోహించి త్రికూటావనీధరచూడామణియును, సింహాలద్వీపకమలకర్ణికయును విశ్వకర్మనిర్మాణకౌశలంబును, నిశాచరకేసరినివేశదరియును, ననారతబందీకృతామరపురంధ్రీబాష్పనదీమాతృకోపవనసీమయును, నిరంతరసేవాసమాగతదిక్పాలకులమాతంగమదాంబుపంకిలబాహ్యాంగనోత్సంగియు నగు లంకం గనుంగొనుచు నం దొక్కచోట సముత్తుంగసౌధంబున నధివసించి యున్నవాని సదేహబంధం బగునంధకారంబుచందంబునం దగువాని సేవాసమాగత సతారకవిభావరీవరోపమా నానుచరోదస్త విమలముక్తాతపత్రచ్ఛాయనుండువాని వైమానికవధూవిధూయమానధవళచామరద్వంద్వశోభితుం డై యభితశ్చలితమందాకినీపరీవాహం బగునంజనశైలంబుకరణి రాణించువాని నిఖిలజగద్విజయవర్ణావళీమతినిర్ణాయకానేకవివిధసమీకాభిఘాతమగ్నభుగ్న

రావతవిషాణకులిశాగ్రోత్కీర్ణవిశాలవక్షస్థలఫలకుం డగువాని నానీలత మాలసచ్ఛాయుండును నాచ్ఛాదితాభినవలోహితపటుండును నై యాపాటలసంధ్యారాగబంధురం బగుకంధరంబునుంబలె నున్నదశకంధరుం గనుంగొనియె నప్పుడు. 56

ఉ. మీఱె న్భానుజుఁ డుగ్రుఁడై యెగసి పేర్చి న్దైత్యయూథాధిరా
ట్కోటీరంబుఁ దటాన దోడనె కుదుర్కొఁ జేసె వైభీషణం
బాటోపంబునఁ బోరి మాయి యగులంకాధీశుతో మల్లెఁ ద
త్కోటిల్యంబు నెఱింగి రామసుగుణగ్రామాభిరాముం గనన్. 57

— * అంగదుని రాయబారము. * —

సీ. అంత రామునిచే సమాదిష్టుఁడై మంత్రి సమ్మతి సాధిష్ఠశౌర్యశాలి
వాలిసూనుండు సలీలంబుగాఁ గోట దాఁటి లంకారాజధానిఁ జొచ్చి
శంకావిహీనుఁడై హంకారి యగునసురేశ్వరు నీక్షించి యిట్టు లనియెఁ
బౌలస్త్య విను మేను భవదీయనిశ్వాసగంధివాలధి నైనకపికులేంద్రు
గీ. నందనుండను ఖరదూషణత్రిశీర్షు, లాదియగు యామినీచరాధ్యక్షులకును
నంతకుం డగుమారీచహంత కనుఁగు, బంట నంగదుఁడను దైత్యకంటకుఁడను.

క. తలఁచెద వసురా రఘుపతి, కిలను దృతీయాక్షి యగుమహీజను గడియన్
జలజ మని శివునొసలిచూ, పెలమిం బ్రాపించుగాంగభృంగముభంగిన్. 59

ఉ. ఒక్కమొగంబు హైహయనృపోగ్రపరాభవ మొంది వాడె వే
ఱొక్కటి దైత్యరాడవినయోన్నతి నొక్కటి మద్గురూద్ధతిన్
నిక్కము నీకతాన నజునెమ్మొగము ల్గడు స్రుక్కె రావణా
చిక్కినమోము నీవటులు సేయకు రామున కిమ్ము జానకిన్. 60

ఉ. కొట్టి కుబేరపుష్పకము గొంటెఁ బెగల్చితి వెండికొండ ని
ట్టట్టనరానిదిక్పతుల నందఱనుం బఱిగొంటి నంచు హా
యెట్టు వచించె దోరి తగవే విజనం బగు కాననంబులో
నెట్టన మానివేషమున నీవు హరింపవె యమ్మహీసుతన్. 61

చ. ఘనతరభక్తితోడ శితికంఠున కింపు ఘటింప వేఁడి యా
ననవకంబు ము న్బలియొనర్పవె యుం దవశిష్ట మాశిరం
బనుపమబాణపంక్తి కుపహారముగా నొనరింపనెంచె న
ద్దినకరవంశ్యమౌళి రణదేవతకు న్రజనీచరాధమా. 62

వ. అని తనయురంతుదభాషణంబుల సరోషోన్మేషుం డైనవోపాచరేంద్రుం డిక్కటుప్రలాపోత్కటు మర్కటుం బట్టుండు కొట్టుం డని పంప నాలంబితభుజ ప్రకోష్ఠు లగునసురశ్రేష్ఠుల నలువుర న్విహంగపుంగవుండు భుజంగంబుల భంగి నెత్తికొని గుప్పున నుప్పరం బెగసి తెప్పున నేలకుం బడవైచి పాదాఘాతం బునం బ్రాసాదశృంగం బరాతిశృంగంబు తెఱంగున విఱుగఁదన్ని తన కెదురు లేమి తెల్లం బగుటయు నుల్లంబునం బల్లవించునుల్లాసంబున రామసేనానివేశ ప్రవేశం బయ్యె నంత. 63

చ. కమలహితాన్వయుండు దశకంఠునిభావ మెఱింగి కిన్కతో
బొమ ముడివెట్టఁ దోన హరిపుంగవు లెల్లను లంక నుగ్రవి
క్రమమునఁ జుట్టుముట్టిరి యుగప్రలయావసరంబుల న్ననం
భ్రమముగ వార్ధిఁ జుట్టుకొను బాడబకీలలమాడ్కిఁ గ్రక్కునన్. 64

ఉ. భూవియదంతరంబు పరిపూర్తిగ నిండెఁ గపీంద్రఘోరసం
ద్రావితతత్క్షణక్షుభితరావణకింకరపాణికోణనా
నావిధతాడనంబుల ఘనాఘనగర్జితబంధుభావసం
భావితజైత్రదుందుభిసమగ్ర మహోగ్రధణంధణార్భటుల్. 65

వ. ఇట్లు సమంతతఃకందళజగద్దళనసంధాధురంధరం బగుదుందుభి గంభీరఘోషం బునరోషంబునం బ్రేరితు లై గిరికందరంబులనుండి ప్రబుద్ధంబు లై వెడలుసింగం బుల తెఱంగున మందిరంబులనుండి నిర్గమించినయుపత్యంబులుం బలె గత్యంత రాయసంధాయకంబు లగుదుర్నిమిత్తంబులం గనుంగొనక విమానాధిగత విబుధసీమంతినీవిహారణేచ్ఛలుం బలెఁ బ్రస్థానసమయపరిమ్లానముఖు లైన చంద్రముఖుల నెంచక నిరంతరజ్వలితకోపానల నయనకోణారుణాలాతశతని పాతవిత్రాసచలిత నిజవారణనివారణాదేశపరవశులును, దిశాముఖముఖరశివార వామ్రేడిత క్ష్వేళితవ్యాకులీకృతకులమహీధ్రులును, గృధ్రపక్షవిక్షేపకృతపతా కానికాయపౌనరుక్త్యసముత్తుంగశతాంగ సంఘాతపరిగతులును, నితాంతనిర్జిత కృతాంత దంష్ట్రిపట్టఖరనఖర పట్టసప్రాసపరశుగదాముసలపరిఘుద్ధృఢకృపాణ ధారులును, దారుణాజగరసంతానసంవీతంబు లగువింధ్యకూటంబులోయనంగ వ్యూఢఘాటికరాళకాలాయసకంకటులును, జాలాంబుదంబులకు వికల్పంబులును, గాళరాత్రికి నభివ్యక్తులును, గలికాలంబునకు వివర్తనంబును నగుచుఁ గాలు నకు సైతంబును భయంకరాకారంబులును నై సంగరాంగణంబునకుం జను

దెంచి వీరాలాపంబు లాడుచుఁ జాపంబులువ్రాని ధారాసంపాతంబులతో ధరాధరంబులం గప్పనంభోధరంబు లనంగ దూరాపాతు లగుశిలీముఖంబుల రక్షోభటు లఖిలవలీముఖబలంబును విక్షోభంబు నొందించి రాసమయంబున.

చ. కరజధుతాయుధంబు తరుఖండితతోమరము న్శిలాహత
స్ఫురదురుముద్గరంబు ఘనభూధరభిన్నమదావళంబు నై
కరము దివి న్స్వపక్షజయకాంక్షను బూని సురాసురుల్ గనన్
హరులకు దైత్యవీరులకు నయ్యె భయంకరసంగరం బొగిన్.　　67

వ. క్రమంబునం గుపితకపివీరదూరీకృతనైరృతబలం బగుదశగ్రీవభుజబలంబునుం బలె భానుమంతుం డస్తమయంబునొంద మథితాయుధికగళనాళప్రణాళీపరివాహి యగులోహితనదీపూరంబు తీరున దూరాంతరితహరిదాభోగం బగు సంధ్యారాగంబు గనుపట్ట విక్రాంతహరినఖాక్రాంతదంతావళవిపులకుంభస్థలముక్తముక్తాకలాపంబువడువున నుడుగణంబు వియత్ప్రదేశంబునం బ్రకాశింప రణరభసచలిత రథతురగపాదాతగజపాదాహతవిశ్వవిశ్వంభరాంతరాళసంభవం బగురజోవ్రజంబువిధంబునఁ దమస్తోమంబు దిక్చక్రంబు నాక్రమింప నిలింపవిమతానీకంబులుంబలెఁ జక్రవాకంబులు సశోకంబు లగుచునుండ దశరథకుమారచమూత్కారంబు తెఱంగునఁ గుముదాకరంబు ప్రమదాకరం బై రహింప నప్పుడు.　　68

— * ఇంద్రజిద్యుద్ధము. * —

మ. సరవిం గాలభుజంగభీకరశరాసారంబు వర్షించుచుం
బురుహూతాహితయోధయూథములకు న్మోదంబుఁ బుట్టించుచున్
సరసాహ్లాదుఁడు మేఘనాదుఁడు మహాసంగ్రామరంగంబునన్
హరుల న్నొంచెను మేఘనాదమొగిఁ జక్రాంగవ్రజంబు న్బలెన్.　　69

చ. ప్రతతభుజప్రతాపరిపుభంగదుఁ డంగదుఁ డొక్కవృక్షమా
యతముగఁ బూని దారుణరణాంగణభూమి హయాళి నొంచి యు
ద్ధతగతిఁ గూల్చె రావణిరథంబు సదైత్యమనోరథంబుగా
శితశతకోటిధారఁ గొని జిష్ణుఁడు పర్వతకూటము న్బలెన్.　　70

ఉ. డాయక యంబరంబుననె డాఁగి దశాస్యతనూభవుండు బ
ల్మాయ ఘటించి రాముని సలక్ష్మణు లక్ష్యముగా నొనర్చి య

త్త్యాయత జిహ్మగాకృతి నుదారము లైనయజిహ్మగంబులం
బాయనిరోషవేగమునఁ బై నిగిడించెఁ గపుల్ భయంపడన్. 71

గీ. పరసలక్ష్మణయోగనిస్తంద్రుఁడైన, రామచంద్రుని బంధించె రావణభీక
రంబు లగుతచ్ఛరంబు లౌరా సమస్త, బంధనిర్మోచనుండును బద్ధుఁ డయ్యె. 72

చ. చెలఁగుచు నింద్రజిత్తు పురిఁ జేరెను రావణునాజ్ఞఁ బూని మై
థిలియు విమాన మెక్కి నరదేవులఁ జూచి తపించె నంతలోఁ
దలఁగెను నాగపాశములు తార్క్ష్యగరుత్పవనాంకురంబుచేఁ
బొలిచిరి రాకుమారు లహిముక్తరవీందులమాడ్కిఁ జూడ్కికిన్. 73

ఉ. రాక్షసవానరేంద్రనికరంబును ఘోరరణం బొనర్ప ధూ
మ్రాక్షుని నయ్యకంపనుని మారుతసూతి వధించె వజ్రదం
ష్ట్రిక్షణదాచరుం గెడపె సాహసి యంగదుఁ డంత నీలుఁడు
దక్షిణమే ప్రహస్తనిధనం బొనరించె విని న్దశాస్యుఁడున్. 74

వ. ఇట్లనీకినీనాథవధంబు విని వినిద్రకోపోద్రేకజృంభమాణాయోధనోత్కంఠుం డగుదశకంఠుండు సకలజగదండభరితజయానకభయానకనినదబధిరితాశేష శేషాహిలోచనుండును రోచిష్ణుజిష్ణుకోదండధరుండును నై జలధరంబు సముత్తుంగం బగుసుమేరుశృంగంబునుంబలె శతాంగంబు నలంకరించుచు సర్వతశ్చలిత చతురంగసంఘుం డగుట ననుగమ్యమానలంకానగరుండునుంబలెఁ గ్రమంబునఁ బురతోరణం బతిక్రమించి పురతోరణవ్యాపారం బగువానరపరివారంబుం గనుంగొనియె. 75

గీ. ఇట్లు చనుదెంచునిఖిలదిగీశజేత, నసురనేతను జూచి యయ్యర్కకులుఁడు
నిజశిరము నూఁచెఁ దత్సవ్యభుజశిరంబు, నవుడ యదరెను జెదరెను గపిబలంబు.

వ. ఇత్తెఱంగున నప్రతిహతవిహారుండును మదగర్జితతర్జిత దిగంతదంతావళుండును నై మహార్ణవంబునం దిరుగు నాదివరాహంబుచందంబున వరాహవోన్ముఖుం డగుదశముఖుండు కందళితాస్కందనామర్షుండును నుపరిపరికలితగిరివర్షుండును నగుహరిపతి నిష్ఠురముష్టిఘాతప్రదాతయగు వాతాత్మజుని నమోఘులాఘవాక్రాంతధ్వజకిరీటాంచలుండగు నీలుని నిఖిలజగద్విజయోజ్జ్వలం బైన మహాబలంబున వాతూలంబు తూలరాశింబలెఁ దూలించుచు నవిరతశరాసారవర్షంబుతో నభ్యమిత్రీణుం డగుసౌమిత్రియురస్స్థలంబున మహాశక్తి నాటించి మూర్ఛితుం జేసె నంత. 77

క. అనుజుని నస్రశుజలంబుల, దనుజుని శరములను ముంచె దాశరథి మిళ
ద్ఘనకరుణవీరరసుఁడై, పొనరిచె శుక్పప్రిమదశబలముగఁ దనబలముల్. 78

గీ. అనుఁగుఁదమ్ముఁడుగత మోహుఁడగుచు ననికి, నెంతలోనున్ముఖుం డగు నంతలోన
దితిజపతిగెల్చి రఘుపతి యతనిచటుల,*ప్రాణము ల్గొని డిగవైచె బాణములను.

గీ. అపుడు రఘువీరశరనిహతాంగుఁ డగుచుఁ,బ్రథమయుద్ధంబునందు పరాభవంబు
నొంది గతవైభవత లంకఁ జెందె నలద,శాననుఁడు దినదీపదశాననుండు. 80

వ. అంత. 81

— * కుంభకర్ణయుద్ధము. * —

క. అసురపతి కుంభకర్ణుని, నసమయమున నిద్రలేపె నగ్రజునాజ్ఞన్
దెసచెడి యతఁడుర్ వెడలె, న్వెస నని కపునశప్రబోధనిద్రార్థంబై. 82

వ. ఇట్లంజనాచలనికాశుండును ప్రకాశమానకరతలభ్రమితత్రిశూలుండును నై జగత్త్రయోద్యుక్తుం డగుశూలధరుండునుం బలె నరుగుదెంచు నక్తంచర స్వామ్యనుజుం జూచి శామ్యత్సహభుజ తేజోవిశేషంబును నశేషదిగ్ధావమానంబును బవమానచలితజలదపారిప్లవంబును నగుప్లవంగమబలంబుం గనుంగొని యంగదుం డభంగురధీరవచోభంగి ని ట్లనియె. 83

క. కపులార కైకసేయులు, విపరీతమతి న్ఘటించు వెఱబొమ్మసుఁడీ
యిపు డింకఁ బ్రాకృతం బగు, నుపకృతభయువై కృతంబు నుమఁగుఁడు మీరల్.

గీ. అనిన విని యుద్ధసన్నద్ధు లగుచు హరులు
దిక్కరులమాడ్కి మరలుచు దివిజగజము
పగిది మత్తిల్లు ఘటకర్ణుపైనివైచి
రగములు లయానిలములు వింధ్యాద్రిఁబోలె. 85

చ. పొలిచె వలీముఖప్రహితపుష్పితవృక్షము లెల్ల స్విన్నతా
కలితసురారివక్షమున గంధవొడింబలెఁ జూర్ణితంబులై
పలుమఱు యుద్ధభూమి నలబల్లిదుపేరెదఁ దాఁకి నిష్ఠురా
చలములు కొన్ని వేమరలి సల్పెఁ బ్రహర్తకు ఖేదఖేదముల్. 86

క. నేల వడంకఁగ నొకచే, శూలము శిఖినిభముఁ ద్రిప్పుచు న్మత్తుండై
తూలించె గంధమాదను, నీలుని ఋషభు న్గవాక్షుని న్శరభునినిన్. 87

* ప్రాణముల్గొనక—యని యుండఁదగును.

సీ. అంతటఁ గపివీరు లతినైజచాపలాధిగతలాఘవు లౌచు దీనదశను
జెంది రాఘవు శరణొంద నేగుటఁగని యాశ్చర్యభుజవీర్యుఁ డగుచునజుఁడు
వారల నెల్ల నాశ్వాసించుచును జేరి వైరిపైఁ దరుగిరు లైవచికొనుచుఁ
జిత్రయుద్ధంబు సుస్థిరముగ నొనరించి తన్ముక్తఘనశైలతాడితాంగుఁ

గీ. డగుచుఁ గులిశాహతం బైనయద్రివోలె, వ్రాలెఁ జేతనహీనుఁడై వ్రాలునతని
ననుర కొనిపోవ వాలికృతావమాన,మడఁగ సురవైరిఁ గని తదీయబల మలరె.

వ. అం దమందకుసుమపరిమళఝరీమిళచ్ఛిశిరరథ్యోపచారసచేతనోద్రీవుం డగు సుగ్రీవుండు సచమత్కారంబుగా నుల్లంఘితప్రాకారుండును దారుణాకారుండును నగువక్త్రంచరవీరుని నఖముఖాకలితశూర్పణఖాముఖానుకారునిం గావించి యుచితలాఘవంబున రాఘవనదేశప్రదేశంబు చేరిన నంతఁ గుంభకర్ణుండు భానుసూనుం గానక ప్రతినివృత్తుండును మత్తుండును విషమతారేక్షణుండును బ్రతిక్షణంబునఁ బ్రతిపక్షబలంబులంబలె స్వపక్షబలంబును భక్షించుచు లక్ష్మణునిలక్షీకరింపక తుంగం బగుశైలశృంగంబునుం బ్రయోగించుచు నతివేగంబున రామునిం జేరిన. 89

శా. ఆయిక్ష్వాకుకులుండు సత్వరముగా నయ్యద్రిశృంగం బతి
స్ఫాయత్తీవ్రతరార్ధచంద్రనిహతిఁ భంజించి యామేటిపై
చాయం దూపులు వాలిసొంద ఖరదోశ్శౌర్యఘ్నుఁను జ్జాలమి
*న్వాయవైన్యంద్రములేసె శాత్రవవధూ వైధవ్యదంబు ల్వడిఁ. 90

సీ. అంత రాఘవబాణహతరాక్షసాంగంబు లం దొక్కభుజము మంథాద్రివోలెఁ
బడియె వానరసైన్యపాథోనిధానంబునందు వేఱొకభుజం బబ్ధిలోనఁ
బతితమై కనుపట్టె వితతమహా రెండవనలసేతురీతిచిహ్నాంబు లందు
మఱి తృతీయంబైనమస్తకంబు చెలంగె నింగిత్రికూటంబు శృంగముగను

గీ. నప్డు డాభీలశాఖామృగాతివేల, నవ్యకోలాహలాకర్ణనంబువలన
బవరమునఁ గుంభకర్ణునిపాటుఁ దెలిసి, తాంతముఖుఁడై పదంపడి దశముఖుండు.

వ. మహోదరమహాపార్శ్వల రావించి సహాయులం గావించి కుమారు లగు నరాంతకదేవాంతకాతికాయత్రిశీర్షులం బంప వారలును దరసాశనపతినిదేశంబు శిరసావహించి పితృపతినివేశనంబునుంబలె సమీకప్రదేశంబుం బ్రవేశించి రాసమయంబున. 92

---

* న్వాయవైన్యంద్రహుతాశ శాత్రవ—మాతృక.

క. తరుచరనిశిచరవరులకు, దురము సరోషహతశిరము దుష్కరము మరు
త్తరుణీప్రమోదకరము, స్సురమునికి నదృష్టచరము సొరిదిం గలిగెన్. 93

గీ. తరుచరాంతకుఁ డగునరాంతకుని దునిమె
నంగదుండు హనూమంతుఁ డంతఁ గడఁగి
యలసురాంతకుఁ గెడపెఁ బురాంతకుండు
భీకరాంతకు నడఁచినవీఁక దోఁప. 94

వ. వెండియు నసమసమరశీలుం డగునీలునిచే మహోదరుండును, మరున్నంద
నుచేఁ ద్రిశిరుండును, మహాపార్శ్వాదివాహినీపతులునుం దెగుటయు విషాద
రోషపరవశుం డై నిశాచరాకారం బగునంధకారనికాయంబునుం బలె నతి
కాయుండు సుమిత్రాపుత్రునిం గినిసి వృత్రాసురుండు సుత్రామునితోఁ బలెఁ
జిత్రాహవం బొనరించె. 95

గీ. అతఁడును భుజాభుజిఁ బెనంగి యితఁ డవధ్యుఁ
డనుచు ననిలోక్తిఁ దెలిసి బ్రహ్మాస్త్రమేయ
నప్పు డయ్యసురునిశిరం బవనియందుఁ
బడియె రాహువుబలె నతిభయద మగుచు. 96

వ. అంత. 97

— * ఇంద్రజిత్తు రెండవయుద్ధము. * —

గీ. విధురుఁ డగుతండ్రి నూరార్చి పృథురణధుర
రథియు సధనుశ్శరధియు నై రావణియును
దాశరథి కున్ముఖుం డయి తరలి వచ్చె
నాశరచమూశరధియుఁ దన్నాశ్రయింప. 98

వ. వచ్చి సమరంబున నరాతిజయమనోరథంబుకొఱకు రథరక్షార్థంబుగా రాక్ష
సుల నలుగడల నుండ నియమించి ప్రదక్షిణశిఖుం డగుశిఖావంతుని హవి
రర్పణంబున సంతర్పితుం జేసి మంత్రాధిగమవిచిత్రంబు లగునస్త్రంబులు ధరి
యించి తిరోహితుం డై నిశితముఖంబు లగుశిలీముఖంబుల నిఖిలమర్మాహతి
నిర్మాణాలంకర్మీణుం డై క్రవ్యాదుండు వ్యాధుండునుం బలె హరుల విధురులం
గావించి. 99

క. అకుటిలు రాము సలక్ష్మణు, వికలాశయు విధురసత్త్వ విరచించె నితాం
తకఠోరగ్రీష్మము త,మ్మికొలనిబలెఁ జేరె నంత మేఘై లంకన్. 100

చ. శ్రితరుచిరామచంద్రముగ శాస్త్ర్యదినోద్భవదీప్తి గాఁ గృతో
ద్ధతశరవృష్టియై ఘనుఁ డతం డరుగం జలజీవనంబు ను
ద్వృతకుముదంబు నస్తనల మాహతనీలమహోత్పలంబు జృం
భితవరలక్ష్మణం బయి తపించెను వాహిని తత్క్షణంబునన్. 101

గీ. వాయునందనుఁ డతివేగవంతుఁ డగుచు, జాంబవంతునియాజ్ఞ నౌషధనగంబుఁ
దెచ్చిన విశల్యమయ్యె నెంతేబలంబు, స్వర్గలమనంబును విశోకశల్య మయ్యె.

వ. మఱియును సహజతేజస్సముజ్జ్వలం బగుదవానలంబునుంబోని వానరబలంబు చెదరికొనువిధంబున దందహ్యమాన యగుపురినుండి దశాస్యనిదేశంబున హరిగతి న్వెడలునిఖిలలోకప్రకంపనుం డగునకంపనుండును నాహతప్లవంగ సంఘుం డగుప్రజంఘుండును నంగదప్రతాపానలంబునకు శలభంబులగుట విని మహారథు లగువిరూపాక్షయూపాక్షులు మైందద్వివిదవారితు లగుటఁ గనుంగొని కోపాటోపవిజృంభమాణసంరంభు లగుకుంభనికుంభులు సుగ్రీవ హనుమంతులతోడ మారీచసుబాహులు రాఘవునిభుజంబులతోవలె సముత్త భితభుజు లగుచు మహాద్భుతయుద్ధం బొనరించిన యనంతరంబ. 103

క. ఇనజునిచేఁ గుంభుం డని, మొనఁ దెగినఁ దదీయవిరహమును సైఁపక పా
వనిచే నికుంభుఁ డమరీ, స్తనకుంభావాస మొందెఁ దన్నామధృతిన్. 104

గీ. అంతనసురాధిపనియుక్తు లఖిలసైన్య, యుక్తుఖరసూను మకరాక్షుయుద్ధముఖరు
నిజవిపక్షు సపక్షతానిరత మగుచు, జనకుఁ జేర్చెను నైఋతోర్వీకసాయకంబు. 105

చ. జనకునియాజ్ఞ మాళి నిడి సంఖ్యముఁ జేరి మహేంద్రజేత యం
దనలుని వేల్చి యస్త్రచయ మంది దివంబుననుండి మాయచే
ఘనశరము ల్నిగిడ్చి బలగర్వము లెల్ల నడంచి రాము కో
పనత యెఱింగి భీతుఁడయి పట్టనముం జొఱఁబాఱెఁ గ్రక్కునన్. 106

వ. అంతఁ బ్రత్యక్ప్రతీహారంబుననుండి ప్రాతిహారికుండై నయతండు నిర్గమించి యాంజనేయసన్నిధానంబున మాయాసీతను నిశాతహేతిచేత విదారితం జేయుటయు నాకులితస్వాంతుం డైనహనుమంతుం డతథ్యంబు నాకస్మికంబు నయిన యది తథ్యంబుగాఁ దలఁచి యుద్ధం బొనర్చి నిరాశుండై దాశరథిస దేశప్రదేశంబునకుం బోవునవ్వేళ నయ్యింద్రజిత్తు పశువిశసనప్రారంభియై నికుం భిలాస్థలింజేరి విచిత్రసత్త్రప్రవర్తకుం డయ్యె నయ్యవసరంబున హనుమదావేదిత

మేదినీసుతావృత్తాంతుఁడై రామభూమీకాంతుండు వజ్రనిర్ఘోషంబున మానసచరం బగురాజహంసముంబలె విదీర్ణమానసుండై నేల వ్రాలి సౌమిత్రిచేత నాశ్వాస్యమానుం డగుచు సకరుణంబుగా బిట్టు నిట్టూర్పు నిగిడించుచు విలపింపం దొడంగె. 107

చ. అరణినిఁ గీలలీల జనకాధ్వరవాటమునందుఁ బొందుగా
ధరణినిఁ బుట్టినట్టి యతిధన్యవు మానవవంశ్యరత్నమై
గురుయశమొందుపంక్తిరథుకూరిమికోడల వెంచ నిట్టి నీ
కరయ విరామ మయ్యెఁగద హారఘురామున కేమి చెప్పుదున్. 108

క. పవనజుయత్నము వృథ నలు, నవసేతుక్రియ యథావినాశిని విశిఖం
బువిహతత నందె నీదృగ్భవదీయ శుగబ్ధి దాఁటఁగలనా? లలనా 109

ఉ. మానుగ నెందునేని బవమానతనూజునిపూన్కి వ్యర్థమెం
దేని నవీనసేతుకృతికి న్నలుఁడుం జతురత్వ మొందఁ డెం
దేని మదగ్నిబాణమును దీక్ష్ణముగా దిటువంటినీశుగం
భోనిధి నిస్తరింప ననుబోఁటికి శక్యమఁటే వధూమణీ. 110

వ. ఇత్తెఱంగున విలపించురామునిం గనుంగొని విదితాసురమాయావిశేషుం డగువిభీషణుండు దేవా నీవంటిమహానుభావునకు నస్థానంబున దీనం బగునవస్థాంతరం బేటికి నిరంతరాయమఖనిర్వర్తనార్థంబుగాఁ బురందరారి యొనరించిన కపటకృత్యం బిది, సత్యంబు గా దని తద్వధంబునకు లక్ష్మణుం బురస్కరించికొని నికుంభిలోపరోధంబు గావించిన. 111

చ. హరిపరివారఘోరనినదారభటిం జలితాంతరంగుఁడై
గిరిదరినుండి వెల్వడినకేసరియుంబలె రోషభీషణ
స్ఫురణముచేఁ దదధ్వర మపూర్ణముగా నెఱవేర్పఁ జేసె దు
ష్కరమగుసంగరంబు బలశాసనశాసనుఁ డద్భుతంబుగన్. 112

క. ఆవానరసేనకు ఝంఝూవాతూలంబు తూలచయమునకుబలెన్
రావణతనయాగ్రణి విద్రావణుఁడై సంచరించె రణరంగమునన్. 113

వ. ఇట్లనుపదంబును ననీకోన్మథనసంరబ్ధసంవర్తవర్తియగు సమవర్తిచందంబున నమందస్యందనారూఢుం డై వచ్చుసంక్రందనపరిపంథిం గని గంధవహానందనస్కంధవర్తి యై సౌమిత్రి ప్రవర్తితనిశితశరధారుం డై శతధారపాణి జంభాసురునింబలె స్తంభితుం జేసిన. 114

మ. అపు డన్యోన్యమదోత్కటంబును సముద్యద్వీరవాదోద్భటం
బు పరిత్రుట్యదుదారకంకటభరంబు న్భిన్నశస్త్రాస్త్రకం
బు పరిజ్ఞాతజయాశయంబును ద్రిలోకాత్యంతభీమంబుగా
ద్విపరాజంబులభంగి సంగరము నర్థిం జేసి రయ్యిర్వురున్. 115

క. పవిశిఖ విశిఖముల సహస్రవిఖండము గాఁగ మౌర్వి సవరించి యనిం
బ్రవిహతసారథిగా నిం, ద్రవిరోధి నొనర్చె దాశరథి యధికధృతిన్. 116

ఉ. మాయికి నేది యుక్తమొ సమగ్రభుజాబలశాలి కెద్ది యీ
డో యసురేంద్రనందనున కోపిక యెంతయొ యింద్రజేత కా
హా యిపు డేమి యొప్పగునొ యంతయుఁ జేసె నవార్యశౌర్యధా
రేయుఁడు రావణాత్మజుఁ డరీణరణోర్వి నిజోచితంబుగన్. 117

వ. అంత నరిభీషణంబుగా ఘోషించుచున్నవిభీషణుపై నక్తంచరేంద్రనందన విముక్తంబైనశక్తి నర్ధచంద్రబాణంబుచే నివారించి తదీయదుర్వినయంబు సైరింపక సుమిత్రాపుత్త్రుం డమోఘలాఘవ నిస్తంద్రంబైన యైంద్రాస్త్రంబుఁ బ్రయోగించిన.

క. వ్రాలెఁ దదస్త్రము మఱియును, వ్రాలె న్సశిరస్త్ర మయ్యరాతిశిరంబున్
వ్రాలె భువిఁ బుష్పవృష్టియు, వ్రాలె న్మఱి బాష్పవృష్టి రక్షోంగనకున్. 119

వ. తత్క్షణంబున సహస్రాక్షజిద్వధంబు నాకర్ణించి శోకోద్రేకంబున రక్షోఽధ్యక్షునిముఖంబులు నితాంతక్లాంతంబులును నిశ్శ్వాసధూసరంబులును నిర్గళదశ్రునిష్యందంబులును నిర్వేలాక్రందంబులును నిరవధికఫూత్కారంబులును నిగాఢకోపాటోపవిపాటలంబులును నిరూఢకుటిలితభ్రూవల్లికంబులును నిఖిలభీకరవృత్తేక్షణంబులును నిర్దష్టాధరోష్ఠంబులును నిష్ఠురాట్టహాసంబులు నయ్యె, ననంతరంబ పురందరారిప్రముఖవిక్రాంతు లపక్రాంతులును కుంభకర్ణాదిసోదరులు నిహతులును ప్రహస్తపూర్వకసచివులు విధ్వస్తులును విరూపాక్షప్రభృతిసేనాపతులు వ్యాపాదితులును నిఖిలబలంబు నిశీర్ణంబును లంక పౌరవధూజనకరుణపరిదేవనోత్తరంగ యగుటయు నాతంకాతిశయరోషణుం డై రావణుండు హర్యక్షంబు హరిణింబలె నిక్ష్వాకునాయకుదయితను హింసింప నిశ్చయించి యంతికగతమంత్రిచే నివార్యమాణుండై సారథిసంచోదితరథుండును దాశరథిజయవిహితసంగరుండును నగుచు సంగరాంగణంబున కరుగుదెంచి.

— * రామరావణయుద్ధము. * —

క. శరచాపపరిఘతోమరధరుఁ, డై నైకముఖభుజతఁ దానని లోనొ
క్కరుఁ డయ్యును లోచనగో,చరుఁ డయ్యెను బంధువర్గసహితునిభంగిన్. 121

క. దనుజేంద్రుఁడు ఖడ్గము గొని, వనచారులమస్తకములు వడి నేయుచు నో
య్యన నితఁడు నీకు నీకితఁ, డని యచ్చరలకును దెలుపునట్లు మెలంగెన్. 122

వ. తత్క్షణం బక్షోహిణీక్షోభకందళితామర్షుండును నతిపరుషవిశిఖదళితధ్వజుం
డును నర్ధచంద్రనికృత్తధనుష్కుండును, నస్త్రధారావిదారితసారథియు నతి
విస్మయనీయకరలాఘవుండు నగు నారాఘవానుజు నమర్షవేగముక్తం బైన
శక్తిచే యాతుధానుండు ముహూర్తమాత్రం బుపరాగంబున నిశాకరునింబలె
మూర్ఛానిమీలితుం జేసిన. 123

గీ. రాముఁ డంతట శక్తినిర్దళితహృదయు, ననుజుఁ గనుఁగొని శోకవిద్ధాత్ముఁ డగుచుఁ
గోపమునఁ జాపముం గొని కుండలించె, వెండి విధి దైత్యతలవ్రాలు కుండలించె.

చ. వలయితచిత్రచాపుఁడును వారితపంక్తిముఖుం డతిక్రుధా
విలమతి రాఘవుండు శరవృష్టి నిగిడ్చిన దైత్యకోటిలో
పల నొకఁడైనఁ దప్పిచని పట్టనముం జొరఁడయ్యె వేలుపుం
జెలువలలో నొకర్తు వరుఁ జెందకయున్నది లేదు చూడఁగన్. 125

వ. అప్పు డాంజనేయపురానీతమహీధరమహౌషధిసమేధిత జీవితానుజాశ్లేషసుఖ
లబ్ధమనోరథుండును బ్రవర్ధమానసమరకౌతుకోపలంభుండును సంరంభోదం
చితపులకకంచుకితగాత్రుండును నగు దాశరథి యుద్ధమధ్యంబునందుఁ బురంద
రానుగ్రహంబుచే మాతలిసమానీతం బైనరథంబును విశంకటం బగుకంకటం
బును బరిగ్రహించె. 126

పంచపాది. సరిజో దబ్బె నటంచుఁ జూపుదురు దోశ్శౌండీర్య మన్యోన్యముల్
సరవిం గాంతురు రోమహర్షమును శస్త్రాశస్త్రిఁ బోరాడ మె
త్తురు మే ల్మే లని సాహసించుతఱి నెంతో ప్రాణపర్యంత ని
ర్భరదుస్సంకట మైన నవ్వేదురు మూర్ఛ న్గొంత విశ్రాంతు లౌ
దురు ఘోరాజిని రామరావణు లమర్త్యు ల్విస్మయం బందఁగన్.

వ. అనంతరం బవిశ్రాంతవిముక్తదివ్యాస్త్రులును నాఖండలవృత్రసన్నిభులును
నగు నయ్యిరువురకును విచ్ఛిన్నంబు లగుమార్గణంబులును, విలూనంబు లగు
ధనుర్గుణంబులును వినిహతంబు లగుధురీణంబులును నిర్భిన్నంబు లగుసాం
యుగికరథంబులునుం గలుగునట్లుగా నిర్వైకల్యవిజయమనోరథంబు నిరతిశ
యవిశదయశోధనంబు నగు నాయోధనం బయ్యె. 128

క. పాదినుండి కొనుట పూన్చుట, తుది నేయుట తెలియ దయ్యె దురుసున నచ్చోఁ
బదపడి యచ్చోటనె యు,న్నది యన రాఘవునిహస్తములవడి యుండెన్. 129

చ. శరముల రాముఁ డర్థపరిజల్పితచారువివాదపంక్తికం
ధరముఖ మెద్దిద్రుంచె నది దారున మొల్చి వచించె శేషమ
త్తఱిఁ జతురత్వరీతి నలధన్వికి మాయికి సామ్య మై కనన్
ధరణిపతన్నిజాస్యములఁ దాఁ గని లజ్జితుఁ డయ్యె దైత్యుఁడున్. 130

చ. దనుజశరక్షతక్షరదుదంచితశోణితబుద్బుదాంకచం
కనదమరేంద్రకంకటవిగాఢసహస్రవిలోచనాఢ్యుఁ డై
కనఁబడె రాఘవుండు బలఖండనరోషకషాయితాత్ముఁ డై
తనరు ధరాధరాహితువిధంబున దారుణసంగరంబునన్ 131

వ. అంత వారుణంబున వైశ్వానరంబును నైనతేయంబున వాతంధయంబును వాయవ్యంబున వారిదంబును వైభాకరంబునం దామిస్రంబును మాహేంద్రంబున దానవంబును వైష్ణవంబున మాహేశ్వరంబునుం గాఁ బరస్పరంబు నిట్లస్త్రంబుఁ బ్రత్యస్త్రంబుచే భేదించునయ్యిరువురకును నాహవాగ్రహంబున నవిదితంబు లై సప్తవాసరంబు లతిక్రమించె. 132

— * రావణుమరణమునకు విభీషణాదులు దుఃఖించుట. * —

మ. ధనురామ్నాయగురుండు రాముఁ డురుశస్త్రాశస్త్రికౌతూహల
ప్రణయుం డయ్యు విచారకర్శితసతి న్భావించి తొల్వేల్పుతే
నినవాంకూరశిరోగణం బవునరు న్మేషంబుగాఁ ద్రుంచె మా
ర్కొని బ్రహ్మాస్త్రముచే జగద్భయముతోఁ గూడ న్నిమేషంబునన్. 133

చ. ఘనభుజుఁ డాదశాస్యుఁ డతికంటకుఁ డీల్గిన లబ్ధకాములై
యొనయఁగఁ బుష్పవృష్టిఁ గురియించునమర్త్యజనాళి కెల్ల శ్లా
ఘనపద మయ్యె రాముఁ డలకాముఁడు దా నటు మున్న చాలశ్లా
ఘనపదమై చెలంగెఁ బరికల్పితశూర్పణఖావికారుఁ డై. 134

వ. అనంతరంబ సమాలింగితరణవసుంధరుండును శరతల్పశయానుండును నధిగతనిషంగోపధానుండును నగుయాతుధానపతిం జేరి నేల వ్రాలి సోదరస్నేహసులభవైధుర్యుండఁ గదయ్యుండనే నని విహితనిజదూషణుం డగుచు విభీషణుండు పెద్దయుం బ్రొద్దు విలపింపం దొడంగె. 135

గీ. అన్న సమసుఖదుఃఖులై నట్టిబంధు, జనులఁదోఁబుట్టు వగునిన్ను సాహసమున
విడిచితిఁ గులక్షయనిమిత్తవిహితధర్మ, పరుఁడనై తి నకీర్తి నేఁ బాయఁగలనె?

క. అనిఁ బ్రోవఁ గుంభకర్ణుం, డనుజుం డొకఁడుండె నీకు నతఁ డిపు డీల్గెన్
నినుఁ జంపుకొంటి నాబ్రతు, కునకై యిది విధి సహించుకొని యుండెడిఁగా.

వ. అనుచు విభీషణుండు విలపించుచుండఁ దద్వృత్తాంతంబు విని శుద్ధాంతంబున నుండి దీనంబుగా మొఱవెట్టుచు నంతరితయూథనాథలగుకరేణులకరణిఁ బ్రేతృణీయ లగుతరుణీమణులతోడం గూడి వచ్చి సమరమధ్యంబున నశనిహతమందరవసుంధరాధరంబుచందంబునం బడియున్న దశకంధరు నిరీక్షించి నిహతోపప్లు మగులేఁదీఁగెకై వడి హా! నాథ! హా! నాథ యనుచు విషాదాకులయై నిషాదాహతదయితవిధురీకృత యైనకురరితెఱంగున మందోదరి యమందంబుగా నాక్రందింపం దొడంగె. 138

ఉ. సారెకుసారె దిగ్విజయసంభ్రమవేళలయందు నీవు ము
న్నారసి యేది చూచితివొ యాయమరాట్పురి సర్వలోకసా
ధారణవృత్తి వై మగిడి దైవవశంబునఁ జూడఁ బోయితే
ధీరవరేణ్య నాదురదృష్టము నింకిట నేమిచెప్పుదున్. 139

క. జనకుఁడు దనుజకులేశుఁడు, పెనిమిటి త్రైలోక్యవిజయబిరుదాంకుఁడు నా
తనయుఁడు మహేంద్రజైత్రుం, డని గర్వితనైన నన్నుహా విధి చెఱిచెన్. 140

ఉ. ధారణిలో రఘూద్వహుఁడు ధర్మవిదుండును నైనరాముఁ డే
దారినొ యట్ల యగ్రజుని తావునఁ దమ్ముని దెచ్చి పూన్చువాఁ
డై రహి వాలిమున్నుకొని యంతటఁ బోకిటువచ్చె నేమొ మ
జ్జారె కకుత్థ్సవంశసదృశం బొకొ యీదృశధర్మ మక్కటా. 141

గీ. లంక నీరయ్యెఁ బ్లవగవాలానలమున, మైథిలితపోఽనలమ్మున మడిసి తీవు
నింత శోకానలం బాత్మ నెటియు సుఖిత, నైన నినుఁ జంపునే యీచితానలంబు.

వ. అని మఱియు దివసావసానసమయంబున సవితృప్రభయుంబలె భగవంతుండైన వైశ్వానరునియందుఁ బ్రవేశించి చంద్రునిఁ జంద్రికయుంబలె మేఘుని మెఱుంగుతెఱంగున ని న్ననుగమించి నిరంతరవిరహదహనదందహ్యమానం బయిన యీశరీరంబు శాంతిం బొందించెద నని కరుణంబుగాఁ బరిదేవనం బొనర్చు మందోదరిని మందిరంబునకుం బనిచి నిజానుమతిని నిశాచరపతికి యథావిధి

గాఁ బిత్రృమేధంబు నిర్వర్తించి సవిధంబున సమేధమానవిషాదుం డై వర్తించు
విభీషణు నశేషరాజ్యాధిపతిఁగా రఘుపతి యఖిలతీర్థాహృతంబు లగుతోయం
బులఁ దోయదం బనలాకులం బగువనస్థలింబలె నభిషిక్తుం గావించె. 143

గీ. అంత రాఘవచరితపట్టాభిషేక, సముధిగతరాజ్యుఁ డగువిభీషణుఁడు పొలిచె
ననుదినవివృద్ధమండలుండగుచుఁజండ, రుచిసుధాపూరణమునఁజంద్రుండువోలె.

క. సీత న్నిభృతవిభీషణ, నీత న్సతులం దుదారనిర్మలశీలన్
ఖ్యాతం గనుఁగొని మనుకుల, నేతకు మది హర్షశోకనిబిడం బయ్యెన్. 145

— * సీత యగ్నిప్రవేశము. * —

వ. అనంతరం బరుంధతియుంబలె పవిత్రచారిత్రనిధి యన ధరిత్రీపుత్రి పతివ్రతా
శిరోమణి యని తెలియంబడియును మర్త్యధర్ముం డైనపరమపురుషునకును
లోకంబునకును బ్రత్యాయనంబునకై పురందరముఖు లగుబర్హిర్ముఖులును
భగవంతుం డగునరవిందాసనుండును సాక్షులుగాఁ బునరుదయంబునకై వన
రుహబంధునిం బ్రవేశించు నిందుకళయుంబలె సముజ్జ్వలజ్జ్వలనంబు ప్ర
వేశం బొనరించె. 196

గీ. పూతచారిత్ర యయ్యును భూమిపుత్రి, నిజవిశుద్ధికినై హవ్యభుజునిఁ జొచ్చె
నతఁడు నపవిత్రవస్తుసంగతనిజాఘు, దమనుఁ డగ్న్యెను దత్ప్రవేశమునఁజేసి. 147

క. అనలానుషంగమునఁ బావనఁగా జానకి నెఱింగి వైభాతికవే
ళను భానుఁడు ప్రభనుంబలె, నినకులుఁడు పరిగ్రహించె నెల్లరు మెచ్చన్. 148

వ. మఱియు దాశరథి యధిగతనిజప్రశంసావిధానుం డగువిధాతచేతఁ బ్రదర్శ్య
మానుండును నారూఢవిమానుండును మహారథుండు నగుదశరథునకుం బ్రణ
మిల్లి తదీయశాసనంబు శిరసావహించి దురంబునఁ గాలధర్మంబు నొందినవా
నరోత్కరంబును బాకశాసనవరంబునం బ్రతికించి వారిచే ననుగమ్యమానుం
డును బ్రమోదమానమానసుండును సుగ్రీవునితోఁ గృతసంభాషణుండును
నగుచు విభీషణుఁ గరుణారసంబుతో విలోకించుచు జానకీలక్ష్మణులతోడం
గూడ నయోధ్యాప్రయాణాభిముఖుం డై కామచరంబును గాబేరంబును నగు
విమానం బధిరోహించె. 149

క. మణిపుష్పకగతుఁ డై తత్క్షణమున లంకోపకంఠదశకంఠరణాం
గణములు సింధువు సేతువు, నణుమధ్యకుఁ దెలిపికొనుచు నవ్విభుఁ డరిగెన్. 150

గీ. పుష్పకం బది యెంతెంతపొడవు పోవు, నంతకును నింగి విరివయ్యె నతివ చూడు
పుడమి నొకపల్వలము బలె జడధి దోఁప, నగచరులు మారుతికిఁ దెల్పి నగెదరిందు.

క. ఎయ్యది దవుదవ్వులఁ గని, నెయ్యముతో నీకుఁ దెల్ప నేఁ గోరితినో
యొయ్యారి విచిత్రముగా, నియ్యెడ నది వెనుకఁబడి యదృశ్యతఁ జెందెన్. 152

వ. తరుణి ధరణీసుతా కనుఁగొను ముత్తుంగమహీరుహానీకం బగుబుశ్యమూకం
బిది యిందుముఖి బిందుసరోవరం బిది గంధసింధురగమనా కబంధనిర్గంధన
వసుంధర యల్లది కరభోరూ ఖరాదికలహస్థలం బిది మధురవర్ణాలాపా మన
పర్ణశాల యిది కురంగలోచనా కుహనామృగమృగయావనం బిది కుటిలా
యతకబరీ గోదావరీమహానది యిది కుంభికుంభస్తనీ కుంభసంభవాశ్రమం
బిది విలాసవతీ విరాధవిధ్వంసనభూమి యిది యంగనాలలామా యత్రిమునీ
శ్వరాశ్రమం బిది విదేహరాజపుత్త్రీ విచిత్రకూటం బైనచిత్రకూటం బిది యని
వీనులకు సుధలైన వింతవింతకథ లెఱింగించుచు భాగీరథీతీరంబునందుఁ బా
వనం బైనభరద్వాజతపోవనంబు చేరి మహీగర్భశుక్తిమౌక్తికమణి యగుమ
హిళామణిం జూచి మఱియు నిట్లనియె. 153

గీ. సకియ నిద్రాణబర్హిణశ్వాసపార,ణాసుఖిత మయ్యె నిదిగో ఫణాధరంబు
కంబుకంఠి కంఠీరవకరజముల మృ,గంబు కండూవినోదనోత్కంఠి కంటె. 154

వ. అంత. 155

— * భరతాదులు రాము నెదుర్కొనుట. * —

సీ. మహితభరద్వాజవిహితాతిథేయుఁ డై దవ్వుగాఁ జని యయోధ్యాసమీప
మొంది మ్రోల సమీరనందనావేదితోదంతుఁ డై గురుని ముందఱ నిడికొని
యానందబాష్పధారాపూర్యమాణలోచను లైనసన్మంత్రిజనులతోడ
వచ్చు పావనతపోవ్రతరతు నాజానభక్తిసంభరితుని భరతుఁ గాంచి

గీ. సమధికోత్సాహవాత్సల్యసౌహృదములు, డెందమునఁ గందలింప నమందగతిని
యక్షరాజవిమానంబు నవతరింప, మానవాధీశుఁ డుత్కంఠమానుఁ డగుచు.

వ. విదేహరాజపుత్త్రిం గనుంగొని వెండియు నిట్లనియె. 157

క. చదలుననుండి విమానం, బిది నాహృదయము నెఱింగి యెంత డిగియెనో
ముదితా యంతంతకు భువి, గదిసెడు నీమీఁదఁ బ్రేమగలుగుట ననఁగన్. 158

గీ. అతివతో నిట్లు ముచ్చట లాడికొనుచు, దండనిలిచినయినజునకై దండఁ బూని
ప్రణతుఁడైవిభీషణుఁడుమార్గంబుచూప,మండపమునకుడిగియెనమ్మనుజవిభుఁడు.

చ. ముదము దలిర్పఁ బాదుకలు ముందఱ నుంచి కడు న్వినీతుఁడై
పదముల మీఁద వ్రాలునతిభక్తిరతుః భరతు న్దయాళుఁడై
యదనున లేవనెత్తి యురమానిచి తా విడఁజాలఁడయ్యెఁ బో
పదపడి రాముఁ డాతనితపఃకృశదేహము సంస్పృశించుచుః. 160

గీ. ఆర్యసమ్మతసుఖదుఃఖుఁ డైనలక్ష్మ
ణునిని గౌఁగిటఁ జేర్చి కన్గొనుచు నలరె
భరతుఁ డతఁడును నలరె నాభరతు సుదృఢ
సహజభక్తివ్రతుని రాజ్యసౌఖ్యవిముఖు. 161

వ. అంత భరతుండును బురితోభివాదితపూర్వజోపలాలననిఘ్నుండగుశత్రుఘ్నుం డునుం దానును జనకనందనకుఁ బ్రణామం బొనర్చి యవరోధవధూసమేతు లగుసుగ్రీవదశగ్రీవానుజాదిరాజ్యాధిపతుల యథోచితోపచారవిధుల సంతోషితస్వాంతులం జేసి యామంత్రితమంత్రిలోకుండును నాలోకనానుగృహీత పౌరవర్గుండును నగునగ్రజన్మని నిజావసథంబుఁ జేర్చె నందు. 162

సీ. రమణీయసుగుణాభిరాముఁ డౌరాముండు జానకీసౌమిత్రిసహితుఁ డగుచు
ననుపమవాత్సల్య యైనకౌసల్యకు నపయశశ్శల్యశోకాతిరేక
యైనకైకేయికి నతిపవిత్రచరిత్ర యైనసుమిత్రకు నతులభక్తి
గరిమసాష్టాంగంబుగ నమస్కృతులు చేసి తగనిజాలోకని శాంతహర్ష

గీ. కందళితలైనవారిచేఁ గలశజలధి
లహరికలచేతఁ బ్రతిమాకలానిధి బలె
మఱియు మఱియును బరిరభ్యమాణుఁడగుచు
డెందమునయందు నిర్భరానంద మొందె. 163

— * శ్రీరామపట్టాభిషేకము. * —

ఉ. బంధురతేజుఁ డజ్జలజబంధుతనూజుఁడు పంప దైత్యవి
గ్రంధనుఁ డౌజగత్పతిని రామునిఁ దారభిషిక్తుఁ జేయఁగా
మంథరయానము న్విడిచి మంథర నాత్మఁ దలంచుచు న్వన
స్సింధులనుండి తీర్థములు సేనగఁ దెచ్చిరి వానరోత్తముల్. 164

గీ. అంత రాముఁ డలంకృతుఁ డై యమాత్య
క్లృప్తపట్టాభిషేక మంగీకరించి
పురమునకుఁ బోవ రథ మెుందెఁ బొందెనలమ
హారథుఁడు భరతుఁడును మనోరథమును. 165

వ. అప్పుడు నిజసేవావిచక్షణు లగుశత్రుఘ్నలక్ష్మణులచేత విధూయమానధవళవాలవ్యజనుండును బరిజనాచారనిరతభరతోద్దస్తవిమలముక్తాతపత్రుండును విచిత్రవిహితమనుజవేషచారులును నారూఢశతాంగమాతంగులును నలంకృతాంగులును నగునాశరప్లవంగపుంగవులచే ననుగమ్యమానుండును బ్రవర్త్యమానశేషాక్షతలాజోపచారుఁడు నగురఘువీరుఁడు పౌరపురంధ్రీకదంబసంరంభచలితమంజుమంజీరమణికాంచీవలయవాచాలితవాద్యమానమాంగళికభేరీమృదంగశంఖాదివివిధరవశ్రవణసముదంచితసామోదపౌరసంబాధంబును సౌధాంతరగవాక్షచలితశ్రీతరుణీకటాక్షచ్ఛటానీలోత్పలదామతోరణాభిరామరథ్యాంతరంబు నగునయోధ్యాపురంబుం బ్రవేశించి. 166

సీ. శ్రీతరుణీమణీస్థిరవిహారనికేత మై తనరారుసాకేత మొంది
భక్తివినీతిసంపన్ను లై కొల్చుతమ్ముల నాదరించుచు మోద మెసఁగ
భానుతనూభవప్రముఖుల నెల్లను నిజనిజపదముల నెలవుపఱిచి
జనకరాజన్యనందనతోడఁ గూడి స్వచ్ఛందుఁ డై సామ్రాజ్యసౌఖ్యములను

గీ. ననుభవించుచు ఘనసారహారజాల, పాదసితకీర్తివైభవామోదిని యగు
నిఖిలమేదినిఁ బాలించె నీతిప్రబల, ధన్యగుణహారి రామాభిధానశౌరి. 167

ఉ. దుష్కృతితానిరాకరణధూర్వహ చార్వహరాననోల్లస
త్పుష్కరపత్రనేత్ర మతిబోధన మానసుయోధనా మిళ
న్నిష్కపటప్రచార మనునీతిసరణ్యనుసార సారవ
ద్భుష్కరయణీపయోమధురభాషణ బంధుసమాజపోషణా! 168

క. బాలామానసమోహన, లీలామకరాంక కేరళీ కుకురీ బం
గాలీ ధృతముకురీతాం,బూలకరంకాసిఖేటముఖనృపచిహ్నా! 169

పంచచామరము. వరాటలాటభోటభోజవత్సమత్స్యగౌడగూ
ర్జరోత్కలాదిరాట్పరంపరాశిరఃకిరీటసం

ఖ్యరింఖదబ్జరాగరత్నకాంతిరంజితాంఘ్రియు
గ్మరోచమాన ! యాచమానమానవామరద్రుమా ! 170

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వరవరప్రసాదసమాసాదిత సరసకవితావిలాస వాసిష్ఠవంశకీర్తిప్రతిష్ఠాసంపాదక ఋగ్వేదికవి తిరువేంగళార్యకలశరత్నాకరసుధాకర జగద్విఖ్యాతకవిరాజకంఠీరవబిరుదాంక వేంకటాచలపతిప్రణీతం బైన చంపూరామాయణం బనుమహాప్రబంధంబునందుఁ బ్రబంధపరిపూర్తిశోభితవిలాసం బైనయష్టమాశ్వాసము. 171

సర్వము సంపూర్ణము.

# ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల.

నిడదవోలు, కృష్ణాజిల్లా.

## ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

నిడదవోలు, కృష్ణాజిల్లా.

ఇందు రెండుమాసముల కొకనవలచొప్పున వెలువడుచుండును. డెమ్మిసైజున నూఱుపేజీల ఫారణాలచొప్పున పోస్టేజిమేమే భరించి చందాదారులకును, పోస్టేజిగాక యితరులకు 0-8-0లు చొప్పున నిచ్చెదము. ఎన్నివందల పేజీలనవలలైన ఒకరూపాయికి మించియుండదు. ప్రవేశరుసుముగా 0-2-0లు ఈయవలయును అన్నియు క్యాలికోబయిండుగల చక్కని నవలలు.

### వెలువడిన నవలలు.

| | చందాదాగులకు. | | ఇతరులకు. | |
|---|---|---|---|---|
| * దుర్గేశనందని | 0 | 12 | 1 | 0 |
| * వసుమతీవసంతము | 1 | 0 | 1 | 8 |
| లలితచంద్రహాసము | 0 | 10 | 0 | 14 |
| * మృణ్మయి | 1 | 0 | 1 | 5 |
| * సీతారామ | 1 | 0 | 1 | 8 |
| * నూర్జహాను | 1 | 0 | 1 | 8 |
| రాజసింహ | 1 | 0 | | 8 |
| మాధవీలత | 1 | 0 | | 5 |
| మృణాలిని | 1 | 0 | | 5 |
| మనోరమ | 1 | 0 | | 5 |
| దురదృష్టవంతులు | 1 | 0 | | 8 |
| విషవృక్షము | 1 | 0 | | 5 |
| ప్రమదావనము | 1 | 0 | | 5 |
| వంగవిజేత | 1 | 0 | | 5 |
| నౌకాభంగము | 1 | 0 | | 8 |
| నవాబునందిని | 1 | 0 | | |
| దృఢప్రతిజ్ఞ | 1 | 0 | | |

* ఈగ్రంథములైదును, హైస్కూళ్లలోని 4, 5, 6, ఫారములకు పఠనగ్రంథములు (Text Books)గా, టెక్స్టుబుక్కు కమిటీవారిచే నామోదింపఁబడినవి

**N. B.** వసుమతీవసంతము 1916 సంవత్సరము పరీక్షకు ఇంటరుమీడియేటు క్లాసునకు టెక్స్టుబుక్కుగా యూనివర్సిటీవారిచే నిర్ణయింపఁబడినది.

## అనుబంధగ్రంథమాల.

అతిమనోహరంబులును, రసవంతములును, నీతిదాయకములును నగుచిన్ని చిన్నినవలలను ముద్రించి మా యాంధ్రప్రచారిణీ గ్రంథమాలికకనుబంధములుగాఁ బ్రకటించుచున్నాము. ఈ నవలలన్నిటిని జనసామాన్యమునకంతకు నందుబాటుగానుండునట్లు స్వల్పమూల్యమునకుఁ బంపుచున్నాము. ఇందును మాచందాదారుల కితరులకిచ్చు వెలకంటె తగ్గించి యిచ్చుచున్నాము.

| | చందాదారులకు. | | ఇతరులకు. | |
|---|---|---|---|---|
| | అ. | ప. | అ. | ప. |
| రాధారాణి ... | 4 | 0 | 4 | 0 |
| యుగళాంగుళీయకము... | 3 | 0 | 3 | 0 |
| రాజభక్తి ... | 2 | 0 | 3 | 0 |
| లీల ... | 3 | 0 | 4 | 0 |
| సాధన ... | 5 | 0 | 7 | 0 |
| ఇందిర ... | 3 | 0 | 4 | 0 |
| హారావళి ... | 3 | 0 | 4 | 0 |
| ప్రభావతి ... | 2 | 0 | 3 | 0 |
| మాలతి ... | 1 | 6 | 2 | 0 |
| కమలాకాంతుఁడు ... | 1 | 6 | 2 | 0 |
| పరిమళ ... | 6 | 0 | 8 | 0 |
| రజని ... | 6 | 0 | 8 | 0 |
| నీరద ... | 5 | 0 | 7 | 0 |
| సీతావనవాసము ... | 5 | 0 | 7 | 0 |
| ఉన్మాదిని ... | 3 | 0 | 4 | 0 |
| సంతాపకుఁడు ... | 4 | 0 | 5 | 0 |
| ఆరణ్యక ... | 6 | 0 | 8 | 0 |
| వియోగిని ... | 3 | 0 | 4 | 0 |
| కృష్ణకాంతునిమరణ శాసనము. | 6 | 0 | 8 | 0 |
| అమృతపులినము ... | 6 | 0 | 8 | 0 |
| వ్యాఘ్రాచార్య బృహల్లాంగూలము... | 2 | 0 | 2 | 0 |
| ఉన్మత్త ... | 2 | 0 | 2 | 6 |
| చంద్రసేనుఁడు ... | 3 | 0 | 4 | 0 |

# వి ష య సూ చి క

శ్రీరామ.

# విజయనగరసామ్రాజ్యాంధ్రవాఙ్మయచరిత్ర.

1. పండ్రెండవశతాబ్దాంతమందు మహమ్మదీయులు ఢిల్లీసింహాసనము నాక్ర మించుకొని పదుమూఁడవశతాబ్దమున నుత్తరహిందూస్థానమందలి హిందూరాష్ట్ర ములను గ్రమక్రమముగఁ దమవశముఁ జేసికొనిరి. దక్షిణహిందూదేశమందలి రాజ్యములు హిందూరాజుల పరిపాలనలోనే యుండి పరదేశీయులవలన భయముఁ బొందకుండినవి. ఇట్లుండ క్రీ. శ. 1293 సంవత్సరమున నానాఁటి ఢిల్లీసుల్తానగు జలాలుద్దీన్ ఖిల్జీ యనువానితమ్మునికుమారుఁ డగు అల్లాయుద్దీ ననుమహావీ రుఁడు దక్షిణమున నున్నహిందూరాజ్యముల జయింపసమకట్టి యనల్ప మైనసేన తో దాడివెడలెను.

2. ఆకాలమందు దక్షిణహిందూస్థానమున విఖ్యాతయశులును స్వతంత్ర పరిపాలనదక్షులు నగుహిందూరాజులు పరదేశీయులబాధ నెఱుఁగనివారై నిర్భ యముగా రాజ్యము చేయుచుండిరి. దేవగిరియందు యాదవశూరుఁ డగు రామ దేవుఁడు పరిపాలించుచుండెను. ఓరుగంటియందు కాకతీయవంశజుఁ డగు వీర ప్రతాపరుద్రుఁడు రుద్రునింబోలి వెలుంగుచుండెను. ద్వారసముద్రంబున భల్లాణ రాజులు ప్రబలియుండిరి. ఆనెగొంది యనుచిన్నిసంస్థానంబున ప్రతాపరాయఁడు ప్రఖ్యాతముగఁ బ్రభుత్వముఁ జేయుచుండెను. ఇంక మఱి దక్షిణమున చోళపాండ్య దేశాధీశులు సనాతనహిందూగరిమమునఁ బెంపొంది యుండిరి.

ఇట్లు హిందూరాజులు తమతమవ్యాపారములు చక్కఁగఁ జూచుకొను చున్నను బరస్పరమత్సరగ్రస్తులై యైకమత్యములేక తమలోఁ దాము వైరములు పెంచుకొని తఱుచు కలహించుచుండిరి. ఈయంతఃకలహముల మూలముననే గదా మనభరతవర్షము నాఁటనుండియుఁ బరదేశీయుల యధీనమయ్యెను.

3. అల్లాయుద్దీను తనసైన్యముతో దేవగిరిఁజేరి కుతంత్రములచే రామదేవుని జయించెను. తక్కిన హిందూరాజ్యముల నెదుర్కొనుటకుఁ దగినంత బలములే దని యోజించి యంతటితో ఢిల్లీకిఁ దిరిగిపోయెను. కాని దక్షిణదేశమును స్వా ధీనముచేసికొనెడు కోరికమాత్రము తగ్గలేదు. తరావాతఁ బెదతండ్రినిఁజంపి ఢిల్లీ

సింహాసన మెక్కినకొలఁదికాలములోనే మలిక్కాఫర్ అనుసైన్యాధిపతిని గొప్ప సైన్యముతో దక్షిణహిందూరాజ్యములపైఁ బంపెను. ఈయోధుఁడు క్రీ. శ. 1303 లో ఓరుగంటి రాజ్యముమీఁదికి దండెత్తి పరాభూతుఁ డాయెను. క్రీ. శ. 1306 లో దేవగిరిపైఁ బోయి జయమునొందెను. క్రీ. శ. 1309 లోఁ దిరిగి ఓరుగంటి మీఁదికి దాడివెడలి యారాజ్యమును లోపఱుచుకొనెను. క్రీ. శ. 1310 లో భల్లాణరాజుల నంతమొందించి దక్షిణదిగ్విజయముఁ బూర్తిచేసెను.

4. తరువాతఁ గొన్నిసంవత్సరములవఱకు ఢిల్లీరాజ్యములోఁ దఱుచు మార్పులు కలుగుచుండుటచేతను సమర్థులు లేనిహేతువునను మహమ్మదీయులవలన దక్షిణమున నుపద్రవము లంతగా లేకపోయెను. ఇప్పుడైనను దమలోఁదాము సఖ్యపడి యేకముఖముగా శాత్రవుల నెదుర్కొనుటకుఁ దగినయేర్పాటులను దక్షిణహిందూరాజులు చేసికొనుటలేదు. ఏదియెట్లయినను మహమ్మదీయులవలన బాధతమకుఁ దప్పక కలుగుచుండు నను చింత మనస్సున గాఢముగా నాటినది. ఐక్యసంధానమునకు ముందడు గెవరు వేయుదు రని యెదురుచూచుచుండిరి.

5. ఇట్లుండ ఢిల్లీసింహాసనమున కొకవిచిత్రపురుషుఁడు రాజాయెను. మహమ్మదుబిన్ తుగ్లక్, న్యాయైకధీమణి యయ్యును గాలానలునివలెఁ గోపావిష్టుఁడు. బహువిద్వాంసుఁడయ్యును రాజకార్యములయం దతిమూఢుఁడు. ఉదారస్వభావుఁ డయ్యును ప్రాణిహింసయందుఁ బరిమితిలేనివాఁడు. ఇట్టివాఁడు క్రీ. శ. 1326 సంవత్సరమున ఢిల్లీసింహాసనమెక్కి ప్రజలకు సంక్షోభము గలుగఁజేయుచుండెను. రాజ్యమం దెల్లెడలను దిరుగుఁబాటులు ప్రారంభించినవి. హిందూరాజులు స్వాతంత్ర్యాభిలాష గనఁబఱుపసాగిరి. ఈసమయమున మహమ్మదుబిన్ తుగ్లక్ యొక్క మేనల్లుఁ డగుబహాయుద్దీన్ అనువాఁడు తుగ్లక్పైఁ దిరుగఁబడి దక్షిణమునకుఁ బాఱిపోయి యానెగొందిరాజునొద్ద శరణుసొచ్చెను. తనమేనల్లుని లొంగఁదీయుటకును స్వాతంత్ర్యము వహించిన దక్షిణహిందూరాజులను లోపఱుచుకొనుటకును క్రీ. శ. 1334 సంవత్సరమున మహమ్మద్బిన్ తుగ్లక్ దండెత్తి వెడలెను.

6. తనమేనల్లుని నొప్పగించుమని సుల్తా నాజ్ఞాపింప శరణాగతత్రాణుఁ డగు ఆనెగొంది సంస్థానాధీశుఁ డాబహాయుద్దీనుని భల్లాణరాజులయొద్దఁ బదిలపఱిచి తాను ఘోరయుద్ధముచేసి సమరభూమిని వీరశయనము నొందెను. ఆతనిసంస్థానమందలి యార్గురు గొప్ప యుద్యోగస్థులను ఖైదీలుగఁ దీసికొని యచ్చట నొకతురక

ప్రతినిధిని నిలిపి మహమ్మదు తుగ్లక్ మరలిపోయెను. ఈ యార్గురు ఖైదీలలో హరిహరుఁ డనెడుమంత్రియు బుక్కరాయ లనెడుకోశాధ్యక్షుఁడు నుండిరి.

7. ఆనెగొంది సంస్థానము తురకల ప్రభుత్వములో విశేషకాల ముండలేదు. ఆదేశపుప్రజలు మ్లేచ్ఛప్రభువుపైఁ దిరుగఁబడి యతనిని దమదేశమునుండి తఱిమి కొట్టిరి. మహమ్మదుబిన్ తుగ్లక్ తనరాజ్యము నచ్చట స్థాపనచేయుట దుర్లభ మని యోజించి ఖైదీలుగ నున్న హరిహరుని బుక్కరాయని విడుదలచేసి యానెగొందిలో సామంతరాజులుగ రాజ్యము చేయుఁ డని పంపివేసెను. అన్న యగుహరిహరుఁడు రాజై తమ్ముఁడు బుక్కరాయలు మంత్రియై రాజ్యముచేయఁ బ్రారంభించిరి. ఇట్లు స్వాతంత్ర్యముకొఱకుఁ బెనఁగులాడి విజయ మొందిన యానెగొందె సామాన్యస్థలము గాదు. ఇదియే పూర్వము రామాయణకాల మందు మహావీరు లగు వాలిసుగ్రీవులు రాజ్యము చేసిన కిష్కింధ యని తెలియ వచ్చెడిని. ఈప్రాంతమునందు నున్నహంపీసరస్సు మున్ను రామలక్ష్మణుల కా తిథ్య మొసఁగిన శబరీనివాస మగు పంపాసరోవర మని గొప్పయైతిహ్యము కలదు. ఇటువంటి ప్రాచీనప్రతిష్ఠఁ గాంచిన యానెగొందిలోఁ బౌరాణికసంతతివా రగురా జులు చిరకాలమునుండి రాజ్యము చేయుచుండిరి. వారిలో నొకఁడగు విజయ ధ్వజుఁ డనెడురాజు క్రీ. శ. పంద్రెండవశతాబ్దమునఁ దుంగభద్రానదికి దక్షిణతీర మున విజయనగర మనెడు నొకపట్టనము గట్టి దానిని దనరాజ్యస్థానముగఁ జేసి కొనెను. ఈనూతననగర నిర్మాణమునకుఁ గారణ మూరయ నిట్లు తోఁచెడిని:—ఆనె గొంది తుంగభద్రకు నుత్తరతీరమున నుండుటచే మహమ్మదీయులబారికి నిరా టంక మైనగుఱి యై యున్నది. ఆనదికి దక్షిణతీరమున గట్టినపట్టనము మ్లేచ్ఛ శత్రువుల కంతసులభసాధ్యము కాదు. మఱియు దక్షిణముననున్న పర్వతపంక్తు లాయగాధస్రవంతి నంటుకొని నైసర్గికదుర్గమువలె నానగరమును గాపాడుచుం డును. ఇట్లు విజయనగరరాజ్యబీజము విజయధ్వజునిచే విజయసూచకముగ నాటఁబడినది.

8. అన్వర్థనామంబుగ వృద్ధినొందుచున్న విజయనగరంబున క్రీ శ. 1335 సం వత్సరమున హరిహరరాయలు రాజుగను బుక్కరాయలు మంత్రిగను రాజ్యము జేయఁ బ్రారంభించిరి. వీరిద్ద ఱన్నదమ్ములు. వీరివంశమునుగుఱించియుఁ బూర్వ స్థితినిగుఱించియు ననేకు లనేకవిధముల వ్రాసిరి. ఓరుగంటి ప్రతాపరుద్రునియొద్ద వీరిద్దఱుఁ గోశాధ్యక్షులుగ నుండి రనియు నారాజ్యము మ్లేచ్ఛులచే జయింప

బడినప్పుడు పాఱివచ్చి విజయనగరరాజునొద్దఁ గొలువునకుఁజేరి రనియు నొకా నొకరు వ్రాసియున్నారు. ఇదియే కడువిశ్వసనీయ మగువృత్తాంత మని తోఁచు చున్నది.

9. వీరు యాదవవంశములో నొకశాఖవా రని పరిగణించుకొనుచుండిరి. వీరి తండ్రి సంగమరాజు. ఆయనకు నయిదుగురు కుమారు లుండిరి. అందు హరి హరుఁడు జ్యేష్ఠుఁడు. తరువాతఁ గ్రమమున కంపభూపతి, బుక్కరాయలు, మా రప్ప, ముద్దప్ప యనెడుకొమరు లుండిరి. పూర్వకాలమున శ్రీరామునికి లక్ష్మ ణుఁడు దో డైనట్లు హరిహరునకు బుక్కరాయలు ప్రబలసహకారి యై కుడిభుజ ముగా నుండెను.

10. తురుష్కులవాతఁ బడినతమరాజ్యము పులినోటనుండి జాఱినకండవలెఁ దిరిగి తమచేతిలోనికి వచ్చినది. తురుష్కు లెప్పుడైనను దిరిగివచ్చి తమ కుప ద్రవము కలుగఁజేయవచ్చు ననియు నట్లు గాకుండఁ దగుప్రయత్నములు తరుణముననే చేయవలసియున్న దనియు వీరియాశయము. రాజ్యము సుస్థిరముగా నుండుట కైకమత్యము ముఖ్యావశ్యకము. తురుష్కుల విజృంభణ మరికట్టుటకు హైంద వుల సమీకరణమువంటిది యేదియుఁ గాదు. ఈ పరమార్థమును విశదముగాఁ దెలిసికొనిన యీరాజనీతివిశారదు లైన సోదరద్వయమున కొకమహాపురుషుఁ డమేయ మైనసాహాయ్య మొనరించెను.

11. మాధవాచార్య విద్యారణ్యులవారు జగద్విఖ్యాతిఁ బొందిన మహాపురు షులలో నొకరు. ఈయన సత్కులప్రసూతుఁ డగుబ్రాహ్మణోత్తముఁడు. అనూన వైదికసంపత్తియు, నప్రమేయపాండిత్యమును, నద్వితీయరాజనీతినైపుణమును, నిశ్చలవైరాగ్యమును, నతిశయితమతాభినివేశమును వీనియం దమిత మైన తేజో విశేషంబును గాంచినవి. ఈమహనీయుఁడు హరిహరరాయలయొద్దను దరువాత బుక్కరాయలయొద్దను మంత్రిత్వము వహించి విజయనగరరాజ్యమునకు స్థిర మైన స్వభావ మిచ్చి యుత్తరోత్తరశ్రేయోఽభివృద్ధిగ నుండునట్లు చేసెను. విద్యా రణ్యులవా రొనరించిన యీరాజ్యసంస్థాపనమహత్కార్యమును జిరంతన స్మరణీ యముగఁ జేయుటకు, నభేదాధ్యవసాయం బగుకృతజ్ఞతాసూచకంబుగ విజయ నగర మనెడినామము విద్యానగరముగ మార్పఁబడినది.

12. విద్యానగరము క్రమముగ హిందూవిద్యల కెల్ల నాలవాల మయ్యెను. మాధవాచార్యులవారు స్వయముగ ననేకగ్రంథములు వ్రాయుటయే గాక పండిత

వర్యులను గవీశ్వరులను గళాభిజ్ఞులను బహువిధముల సత్కరించి హిందూసనాతన ధర్మము నొకచేతను హిందూసారస్వతప్రపంచము నొకచేతను నుద్ధరించెను. ఈయమాత్యశేఖరుని సోదరుం డగుసాయణాచార్యులవారు సాయణభాష్య మనెడువిశిష్టనామమును వహించిన గ్రంథరాజమును వ్రాసిరి. ఈభాష్యము చతుర్వేదముల సంహితలకును బ్రాహ్మణములకును సంపూర్ణ మైన వ్యాఖ్యానము. గీర్వాణదేశభాషాసేవయు హిందూమతోద్ధరణమును రాజ్యాంకురమందు మొలచిన కోరకములవలెఁ బ్రారంభమునుండియే వికసింపసాగినవి.

13. ఇట్లు సమయానుకూలంబుగ స్థాపిత మై హైందవలక్ష్మి కాకర మై మహనీయుం డగుమాధవునిచేఁ బోషిత మై మ్లేచ్ఛనిచయంబుల కభేద్య మై, కల్పశాఖవలె దక్షిణహిందూదేశమున నల్లుకొని విలసిల్లిన యీవిజయనగరసామ్రాజ్యమందలి యాంధ్రవాఙ్మయచరిత్రము నాశక్తికొలఁదిని వ్రాయఁబూనితిని.

14. విజయనగరరాజ్యమును క్రీ. శ. 1335 సం॥ మొదలు క్రీ. శ. 1350 వఱకు హరిహరరాయలు పరిపాలించెనని కొందఱు చరిత్రకారులు వ్రాసిరి గాని యీకాలనిర్ణయ మింకను నిర్వివాదాంశము కాలేదు.

పూర్వకాలమునుండియు మనహిందూరాజులు తమతమయాస్థానములలో విద్వాంసులను శాస్త్రజ్ఞులను గవీశ్వరులను నిలిపి వారికిఁ దగినవృత్తుల నేర్పఱిచి వారివలనఁ గృతులను బొంది శాశ్వతయశస్సుఁ గాంచుచుండుట యాచారముగ నున్నది. అట్లే హరిహరరాయలును జేసియేయుండు నని మనము నిస్సంశయముగా నమ్మవచ్చును. ముఖ్యముగా విద్యారణ్యబిరుదాంకితుఁ డగుపండితవర్యుఁడు మంత్రిశిరోమణిగా నుండినప్పు డారాజు వాఙ్మయసేవఁ జేయకపోవు టెట్లు తటస్థించును ?

15. అయినను హరిహరరాయనికిఁ గృతినిచ్చిన కవీశ్వరునిపేరు గాని గ్రంథము గాని యింకను జరిత్రలోనికిఁ జేరలేమ, కావున నాతనిరాజ్యకాలమందలి వాఙ్మయభాగము మేఘచ్ఛన్నగగనమండలమువలె మనకింకను స్పష్టముగఁ గానరాకున్నది. ముందుముం దేమహనీయుల పరిశ్రమపరిశోధనలచేనైన నీ రాజ్యకాలమందలి గ్రంథములు వెలువడినఁగాని యిదమిత్థమని చెప్పుట కవకాశములేదు.

16. హరిహరరాయలతరువాత బుక్కరాయలు రాజ్యమునకు వచ్చెను. విజయనగరరాజ్యమేలిన రెండవవంశము (సంగమవంశము) వారిలో నితఁడే యగ్ర

గణ్యుఁడు. అప్రతిమప్రతిభాశాలియు మహాసేనానియు నగునీయనచే రాజ్యము చాలవఱకు విస్తరిల్లి యితరస్వతంత్రరాజుల గౌరవమున కాస్పదమాయెను. ఈ రాజు విద్వాంసుఁడును విద్వదభిమానియు నై విద్యలకెల్లఁ గల్పవృక్షముగా నుండెను. పుష్పవంతులవలెఁ దనయాస్థానమునఁ బ్రకాశించుచుండిన సాయణమాధవులవేదభాష్య మీరాజున కంకితము చేయఁబడినది. గీర్వాణభాషాయోష నిట్లలంకరించిన యీమహామహుఁ డాంధ్రసరస్వతిని గూడ ననూనగౌరవము చేసి యాంధ్రదేశమునకు శాశ్వతమహోపకార మొనర్చెను.

17. కవిసార్వభౌముఁడును గవివంద్యుఁడును గావ్యకల్పవల్లి యనఁదగు నుత్తరహరివంశమును రచించిన మహాకవియు నైననాచన సోమనాథకవినిఁ జాల గారవించి యగ్రహారములిచ్చి తనయాస్థానము నలంకరింపఁజేసిన మహనీయుఁ డీ బుక్కరాయలే.

— నాచనసోమనాథకవి. —

18. ఈ సోమనాథకవిచే రచియింపఁబడిన యుత్తరహరివంశమునందలి యవతారికభాగ మిప్పటివఱకు లబ్ధమైనప్రతులలో లేకపోవుటచేఁ గలిగినకొఱంతను మ-రా-రా-శ్రీ, చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు కొంతమట్టు తీర్చిరని చెప్పుట కెంతయు సంతసించుచున్నాను. ఆంధ్రపత్రికయొక్క ప్రథమ ఉగాది సంచికలో పంతులుగారు ప్రకటించిన బుక్కరాయనిశాసన మీ కవిపుంగవుని గూర్చి యనేకసంగతులు వ్యక్తపఱుచుచున్నది. హరిహరరాయలయు, బుక్కరాయలయు రాజ్యకాలనిర్ణయమున కిది గొప్పయాధార మనుమాట యటుండ నిండు. నాచనసోమనాథకవియొక్క కాలమును స్థానమును వంశమును సర్వతోముఖసామర్థ్యమును విశదీకరించుచున్న దని చెప్పుట మనప్రస్తుతాంశము.

19. ఈశాసనమందలి ప్రస్తుతోపయోగ్యము లగుభాగముల మాత్ర మిచ్చట నుదాహరించెదను.

... ... ... ...

ఆసన్ హరిహరః కంపో బుక్కరాయమహీపతిః
మారపో ముద్దప శ్చేతి కుమారా స్తస్య భూపతేః
పంచానాం మధ్యగ స్తేషాం ప్రశస్తే బుక్కభూపతిః
ప్రచండవిక్రమో మధ్యే పాండవానా మి వార్జునః.

... ... ... ...
బుక్కరాయోఽభవ చ్ఛ్రీమాన్ భుజార్జితపరాక్రమః
మేదినీచ ప్రజా యేన స్వపుత్రాయివ రక్షితః.

... ... ... ...
విద్యాభిధాననగరీ విజయోన్నతిశాలినీ
విద్యారణ్యకృతా తస్యాం రత్నసింహాసనేస్థితః
యస్మిన్ షోడశదానానాం ధారాయాం పరిశోభితం
దానాంబుధారయా తస్య వర్ధతే ధర్మపాదపః
అలంకృతశకస్యాబ్దే రసార్తునయనేందుభిః
తారాణాబ్దే చైత్రమాసే నవమ్యాం శుక్లపక్షకే
పంపాయాం భాస్కరక్షేత్రే విరూపాక్షస్యసన్నిధౌ
ఆపస్తంబాఖ్య సూత్రాయ భారద్వాజాన్వవాయినే
యాజుషానాం వరేణ్యాయ సకలాగమవేదినే
అష్టాదశపురాణానా మభిజ్ఞాతార్థవేదినే
అష్టభాషాకవిత్వశ్రీ శ్రీవాణీజితసంపదే
సోమాయ నాచనాంభోధి సోమాయామితతేజసే.

... ... ... ...
పినాకినీతటే పంచాకలదిన్నాహ్వయం పురా
బుక్కరాయపురాఖ్యాత ప్రతినామ్నాచ శోభితం

... ... ... ...
సహిరణ్యపయోధారా పూర్వకం దత్తవా న్ముదా
శ్రీమాన్ నాచనసోమాఖ్య మహాకవివరోప్యధాః
రాజానమాసీ శ్చైవచిరంజీవీ భవత్వితి
స్వయం అన్యత్రోద్వృత్తం దశోత్తరశతంకవిః
షడ్వింశదత్రభాగాస్య ర్యజమానవ్యయస్థితః.

... ... ... ...
... ... ... ... శ్రీవిరూపాక్ష.

20. ఈ పైశాసనముఁబట్టి సోమనాథకవి ఆపస్తంబసూత్రుఁడనియు, భారద్వాజసగోత్రుఁడనియు, యాజుషబ్రాహ్మణుఁడనియు, సకలాగమవేది యనియు, అష్టా

దశపురాణాభిజ్ఞాతార్థవేది యనియు, అష్టభాషామహాకవియనియుఁ దెలియవచ్చు చున్నది. ఉత్తరహరివంశగ్రంథకర్త యని ప్రత్యేకముగా వ్రాయకపోయినను నీకవివర్యుఁడు మఱియొకఁడని సందేహింపఁబనిలేదు. ఈయనకు శా. శ. 1266 సం॥ (క్రీ. శ. 1344 సం.) లో విద్యానగరమునందు బుక్కరాయలు శ్రీవిరూపాక్ష స్వామిసన్నిధిని బుక్కరాయపురమను నామాంతరముగల పంచాకలదిన్న యను గ్రామమును అగ్రహారముగ నొసఁగెను. కావున నీమహాకవి విద్యానగరమందు బుక్కరాయలకాలములో 1344 సం॥ ప్రాంతమున అష్టభాషామహాకవి యని వాసినొందినట్లు స్పష్టమగుచున్నది. కావున అద్దంకిలో క్రీ. శ. 1340—1366 వఱకుఁ బరిపాలించిన అనవేమారెడ్డి యాస్థానకవియును భారతకవిత్రయములో నొకఁడును హరివంశముఁ దెనిఁగించినవాఁడు నగు నెఱ్ఱాప్రెగడకవివరునితో సమకాలికుఁ డని చెప్పవచ్చును.

21. ఇట్లుండ నిటీవల మ-రా-రా-శ్రీ, వంగూరి సుబ్బారావుపంతులుగారు నాచనసోమనాథునిఁగూర్చి మఱియొకశాసనము వెలిపుచ్చిరి. తమశాసనమునకును వీరభద్రరావుగారి శాసనమునకు నించుక భేదమున్న దనియును దమశాసనమందు "రసాభ్రనయనేందుభిః" యనుపాఠము కానవచ్చుచున్న దనియు వారునుడివిరి. వారియభిప్రాయమును గుఱించి సువర్ణలేఖ తే 27-10-1914 ది సంచికను జూచిన సంపూర్ణముగాఁ దెలియును. వీరిపాఠమే నిజమైనచో నాచనసోమనాథకవి శా. శ. 1206 (క్రీ. శ. 1284 సం.) నాఁటివాఁ డగును. అనఁగా నెఱ్ఱాప్రెగడ కీయన సుమా రేఁబదిసంవత్సరములు వెనుకటివాఁ డగును. ఈసిద్ధాంతమే స్థిరమైనయెడల బుక్కరాయలకును విద్యారణ్యులకును విద్యానగరనిర్మాణమునకును జరిత్రకారులు నిర్ణయించినకాలము తప్పగును. వీరందఱు సుమా రేఁబదిసంవత్సరములు వెనుకకుఁ బోవలసివచ్చును. సోమనాథకవియును వారిమార్గమునే యనుసరింపవలసియుండును. వేయేల విజయనగర రాజ్యోత్పత్తిని గుఱించి వ్రాసినవ్రాఁత లన్నియుఁ బూర్తిగ మార్చుకొనవలసివచ్చును. కావున సుబ్బారావు పంతులుగారు ప్రకటించిన కాలనిర్ణయము తప్పని నిరసింపక పునర్విచారణీయ మగునంశముగా భావింపవలసినదని నాయభిప్రాయము. సోమనాథకవియు విద్యారణ్యులవారును నెఱ్ఱాప్రెగడయుఁ గొంచెము హెచ్చుతగ్గుగా సమకాలికు లనియే నాయభిప్రాయము.

22. సోమనాథకవియొక్క కులగోత్రములును పాండిత్యకవిత్వప్రాభవంబులును పైనిఁ జేర్కొనఁబడినవి. ఇంకనాయన కుటుంబవిషయ మేమైన మనకుఁ

దెలియఁగలదా యని విచారింతము. పైనుదాహరించిన శాసనములో “సోమాయ నాచనాంభోధి” యనుశబ్దము నాచన యనెడు వంశమని గాని లేకనాచనయొక్క వంశమని గాని యర్థమీయవచ్చును. అనఁగా నాచనయనుమాట యింటిపేరైనను లేకతండ్రిపేరైనను గావచ్చును. ఈసంశయమును విచ్ఛేదించుచు మ-రా-రా-శ్రీ, సుబ్బారావుగా రిట్లు వ్రాయుచున్నారు. “శాసనమునందే ‘నాచనాత్మజః’ అని చెప్పఁబడియున్నది. నాచనవంశమై యుండు నని యది చూడకయే వీరభద్రరావుగారు, ‘నాచనాంబుధిః’ అనుమాటను దీసికొని నాచన యనునది వంశనామమనిరి. కాని యీక్రిందిపద్యము ననుసరించి సోముఁడు నాచనకొడు కని కనఁబడుచున్నది.

చ. ‘వినుతియొనర్తు నాంధ్రసుకవీంద్రుల నాచనసుతు సోము భాస్కరుణ్.’

(సకలనీతికథానిధానము = యఱ్ఱయకవి) ‘నాచనాత్మజః’ యనుశాసన వాక్యము మఱియుబలము.” దీనినుండి గ్రహింపఁదగిన దేమనఁగా సుబ్బారావు గారు చూచినశాసనములో ‘నాచనాత్మజః’ యనియున్నట్లు వారు ఘంటారవ ముగాఁ జెప్పుచున్నారు. శాసనలిఖితవిషయము నిరాక్షేపణీయము. సిద్ధాంతము. కావున నిర్వివాదాంశము. నాచన, తండ్రిపేరుగాని యింటిపేరు కాదు.

23. సోమనాథుఁడు నియోగియా వైదికియా యనుసంశయ మిపుడు కొంత మంది యాధునికులమనంబులఁ గలఁతఁ బెట్టుచున్నది. జుగుప్సాకర మగునీశుష్క వివాదము నాకంత రుచింపకపోయినను నిదివఱలోఁ గొందఱు మహనీయులు వారివారియభిప్రాయముల వెల్లడిపఱిచినందున నేనును నాయభిప్రాయ మిచ్చుటఁ గ్గుత్తపఱిచెద. సోమనాథునికాలమునకుఁ బూర్వమునను నించుక తర్వాతయును నియోగులు వైదికులు ననుభేద మున్నట్లు గాన్పింపదు. పదునైదవశతాబ్దమధ్య మునుండి యీకేవలవ్యాపారభేదోత్పాదిత మైనశాఖాభేదము పొడసూపినట్లు దృష్టాంతములు కానవచ్చెడిని. అనంతామాత్యుఁడు తన ‘భోజరాజీయము’లో నిట్లు వ్రాసికొనినాఁడు :—

క. ఈయార్వురు నొక్కొక్కఁడు, వేయిండ్లకు మొదలుగాఁగ వెలయుదురని కా
దే యాఱువేలపేరిడి, రీయన్వయమునకు నేష్యమెఱిఁగినపెద్దల్.

అమాత్యశబ్దము నామాంతమున నుండిన మాత్రమున నియోగి యని చెప్పుటసాహసము. సామాన్యముగా నాంధ్రకవీశ్వరులు లౌకికవ్యాపారములలో

నుండినవారు కాని వైదికవృత్తులలో ననఁగా స్మార్తకర్మాదివిధులను జేయించుటలో నుండినవారు కారని మనము చెప్పవచ్చును. అయిన నాకాలమందలి లౌకికవైదికవృత్తిభేదము లిప్పటికాలమువలెఁ బరస్పరసంబంధబాంధవ్యములకు నడ్డుగానుండ లేదని నానిశ్చితాభిప్రాయము. నాచనసోమనాథుఁడును, తిక్కయజ్వయు, నన్నయభట్టారకుఁడును, నియోగులా వైదికులా యనివివాదపడుట గగనకుసుమ మేవర్ణముగానుండు నని మీమాంసపడుటవంటిది.

24. సోమనాథుఁ డుత్తరహరివంశమును దెనిఁగించినాఁడు. ఉత్తరహరివంశము గీర్వాణభాషయం దున్నహరివంశమునందలి యుత్తరభాగము. గీర్వాణోత్తరహరివంశము మాతృకగా నుంచికొని యీకవివరుఁడు తనగ్రంథమును బ్రబంధశైలిని రచించె నని చెప్పుట కెంతమాత్రము సందేహింప నక్కఱ లేదు. ఈకవిశిఖామణి యుత్తరభాగము మాత్రమే తెనిఁగించెనా లేక పూర్వభాగమును గూడ నాంధ్రీకరించెనా యనునంశ మించుక విచారణీయము.

25. మ-రా-రా శ్రీ, కం. వీరేశలింగము పంతులుగారు తమకవులచరిత్రలో నిట్లు వ్రాసిరి :—“యెఱ్ఱాప్రెగడ చేసినహరివంశము ప్రౌఢముగా నుండలే దను నభిప్రాయముతో నీతఁ డీయుత్తరహరివంశమును రచించినట్లు కనఁబడుచున్నది.” ఎఱ్ఱాప్రెగడయు సోమనాథుఁడును సమకాలీను లని పైనిఁజెప్పఁబడినది. పంతులవారు వ్రాసిన ట్లెఱ్ఱాప్రెగడ తనహరివంశమును సోమనాథునికి ముందుగ వ్రాసెనో లేక తరువాత వ్రాసెనో నిశ్చయముగాఁ జెప్పుట కేవియు సాధారములు లేవు. అది యట్లుండనిండు. ఈయంశమునుగూర్చి యుత్తరహరివంశమున నేమైన నాధారమున్నదా యని పరిశీలించినచో నచ్చటను నిశ్చితవిషయ మెద్దియుఁ గానరాదు. ప్రథమాశ్వాసములో మూఁడవపద్యమునం దిట్లున్నది.

క. “హరివంశప్రథమకథాం, తరమునఁ గలవింత లెల్లఁ దప్పక మదిలోఁ
దిర మయ్యెఁ గదా మీఁదట, నరవర యేకథలొకో వినం బ్రియ మనుడున్.”

ఇట్లు వైశంపాయనుఁడు జనమేజయుని నడిగినట్లున్నది. దీనినిబట్టి మన మేమియు నూహింపలేము. ఆశ్వాసాంతగద్యలలోఁగూడ నుత్తరహరివంశము మాత్రమే కవి వ్రాసి నట్లున్నది. పూర్వభాగముఁ దెనిఁగింపక యుత్తరభాగము మాత్రమే తెనిఁగించుటకుఁ గారణ మొండు తోఁచుచున్నది. పూర్వభాగమున బలరామకృత్యములును గృష్ణుని బాలక్రీడలును దప్ప కృష్ణుఁ డొనరించిన ఘోర

రాక్షస సంహారములు లేవు. నరకాసురవధ యాదిగ దుష్టసంహార శిష్టపరిత్రాణము లన్నియు నుత్తరభాగముననే యున్నవి. కాక మహాప్రబంధమునకు యుక్త మగుసామగ్రియుఁ బుణ్యాత్మక మగుకథలును నున్నయుత్తరభాగము మాత్రమే యేతత్కారణమునఁ దెనిఁగించె నని స్ఫురించుచున్నది.

26. తిక్కన సోమయాజి భారతమును నెల్లూరిలో నుండినహరిహరనాథున కంకితము చేసెను. అట్లే సోమనాథుఁడును దనయుత్తరహరివంశము నాహరిహరనాథునకే యంకితమిచ్చెను. మరియుఁ దనయాశ్వాసాంతగద్యయందుఁ దిక్కన సోమయాజిని నాయన రచించినభారతమును బేర్కొని తదనుసరణముగఁ దా నీ గ్రంథమును జెప్పినట్లు వ్యక్తపఱిచెను.

27. తిక్కనసోమయాజి కేవలము శివభక్తుఁడుగాక కేవలము విష్ణుభక్తుఁడుగాక శివకేశవులిద్దఱుఁ బరమాత్మయొక్క నామమాత్రభేదస్వరూపు లనిభావించి హరిహరాత్మక మగునాపరమాత్మ నారాధించెను.

ఉ. శ్రీయన గౌరి నాఁ బరఁగుచెల్వకుఁ జిత్తము పల్లవింపభ
  ద్రాయితమూర్తి యై హరిహరం బగురూపముఁ దాల్చి విష్ణురూ
  పాయ నమశ్శివాయ యని పల్కెడు భక్తజనంబు వైదిక
  ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

(భారతము, విరాటపర్వము)

ఇట్లే 'సకలాగమవేదియు, నష్టాదశపురాణాభిజ్ఞాతార్థవేదియు' నైన సోమనాథకవియు శివకేశవులసమానస్వరూప మైనహరిహరనామచిహ్నిత మగు పరమాత్మనే భజించెను. ఈయభిప్రాయమును ధృవపఱుచుట కుత్తరహరివంశములో ననేకపద్యములను జూపవచ్చును. ముఖ్యముగా ద్వితీయాశ్వాసములో నున్నహరిహరినాథస్తవముఁ జదివిన నెల్లవారికిఁ దెల్లమగును.

క. ఏ మిరువురు నేకం బిది, సామర్థ్యజరాది తత్త్వసారము
... ... ... ... (ఆశ్వా. 2—214.)

గీ. ఆద్యబీజాయ విశ్వకర్త్రే౽క్షరాయ, నిర్గుణాయ గుణాత్మనే నిర్మలాయ
  హరిహరాత్మనే ప్రవరదివ్యాయయజ్ఞ, సూకరాయ నమోయనుచున్నుతింతు.

(ఆశ్వా. 2—219.)

ఏతద్గ్రంథనిర్మాణమందును సకలపురాణేతిహాస పఠనవికసితమానసంబు నను, హరిహరనాథలక్ష్యైక్యతాత్త్వజ్ఞాననిరూపణమందును, మఱియు నెన్నియో యంశములయం దీమహాకవు లిద్దఱకును గలసాదృశ్యము కడు విస్మయజనకము గా నున్నది. ఆంధ్రసారస్వతమండలమున నిరుపమాన తేజోవిరాజి యగు తిక్కనసోమయాజి తనప్రతిభావిశేషంబున నెందఱు మహనీయులయుల్లములఁ బ్రభావోన్మీలనము గావించెనో చూడుఁడు.

28. సోమనాథుఁడు రచించిన యుత్తరహరివంశ మాఱాశ్వాసముల గ్రంథము. నరకాసురసంహారము మొదలు బాణాసురవధపర్యంతము శ్రీకృష్ణుఁ డొనరించిన శిష్టరక్షణదుష్టశిక్షణము లభివర్ణింపఁబడినవి. ఈగ్రంథము కేవలము భాషాంతరీకరణము కాదు. మాతృకయందలి కథాభాగములఁ దీసికొని నూతనాంశములఁ జేర్చియు నధికప్రసంగములఁ గుదించియు రసానుగుణ్యముగఁ గథాప్రణాళికను మార్చియు మిగుల మనోహరముగా నుండున ట్లీకవి వ్రాసినాఁడు. గ్రంథమందలి కథాంశములను గ్రుచ్చి వేఱేవ్రాయ నవసరము లే దని యూహించెద.

29. ఆశ్వాసాంతగద్యములోఁ గవి తన్నుఁగూర్చి తా నిట్లు వ్రాసికొనియె :—
"శ్రీమత్సకలభాషాభూషణ సాహిత్యరసపోషణ సంవిధానచక్రవర్తి సంపూర్ణ కీర్తి నవీనగుణసనాథ నాచనసోమనాథ"...అత్మ్యాత్మస్తుతిసూచకంబు లగునీపదములు మఱియొకసామాన్యుఁడు వ్రాసికొనినఁ బరిహాసాస్పదముగా నుండును. కాని మహాకవి సోమనాథున కివి యొకించుకయు నతిమాత్రములు గావు. బహుశః, యివన్నియుఁ బరిపాలకసభలలోఁ గాని పండితవర్గములలోఁ గాని కవి కొసంగిన బిరుదము లనవొప్పు.

30. సోమనాథునికవిత్వమును గుఱించి యిదివఱలోఁ బండితులు వ్రాసిన యభిప్రాయములఁ బొందుపఱిచి తరువాత నాయభిప్రాయమును సంపూర్ణముగా వ్రాయ నుద్యమించెదను.

బహుజనపల్లి సీతారామాచార్యులవా రీకవిని గుఱించి యిట్లు వ్రాసిరి.

"ఆగ్రంథ (సోముని హరివంశ) మిక్కడ సమగ్రముగాఁ జిక్కకపోయి ననుఁ జిక్కినంతమట్టు పరికించి చూడఁగా నది మిక్కిలి ప్రౌఢముగాను భారతము కంటె నెల్లవిధముల విశేషించినదిగాను గానంబడుచున్నది. ఇతనిని సర్వజ్ఞుఁ డందురు. అట్లనుటకు సందేహింపఁ బనిలేదు."

కం. వీరేశలింగము పంతులుగారిట్లు వ్రాసియున్నారు. "సోమనాథుని కవిత్వము మిక్కిలి ప్రౌఢముగాను సర్వవిధముల నెఱ్ఱాప్రెగడ కవిత్వముకంటె మే లైనదిగాను నున్నది. ఒక్క యెఱ్ఱాప్రెగడకవిత్వమే కాదు. భారతము రచించిన కవిత్రయములో ననేకుల కవిత్వమును గొన్నివిషయములలో సోమునికవనముతో సరి రా దని నాయభిప్రాయము. ఇతనికవిత్వపటుత్వసంపదనుఁ బట్టి యీతనికి సర్వజ్ఞుఁ డని బిరుదుపేరు వచ్చినది. ఆపేరున కీతఁడు తప్పక తగినవాఁడే."

31. కవిత్వవిషయములో నెంచిచూడఁగ నాంధ్రకవీశ్వరు లందఱిలో సోమ నాథుఁ డగ్రగణ్యుఁడు. తిక్కనసోమయాజి గ్రంథరచనాబాహుళ్యమునను సర్వ తోముఖ సామర్థ్యమునను నాంధ్రవాఙ్మయ సేవాప్రోత్సాహమునను, దేశీయాం ధ్రభాషాప్రయోగ మార్గదర్శిత్వమునను, నాంధ్రవాఙ్మయచరిత్రమున నద్వితీయుఁ డనుప్రసిద్ధికిఁ దగినవాఁడు. భాషాపాండిత్యమునను, సాహితీప్రపంచసర్వజ్ఞత్వ మునను, గవితారసికత్వమునను, సోమనాథకవి నిరుపమానుఁ డని నిక్కముగఁ జెప్పవచ్చును. అనర్గళ కవితాధారయు, ననమానభావనాశక్తియు, నిరుపమవా క్ప్రౌఢిమయు, సమయోచిత రసస్ఫూర్తియు, మృదుమధుర శబ్దజాలప్రయోగం బును, నీకవివరుని కవిత్వంబున నెల్లెడలఁ గాన్పించుచున్నవి. చక్కనిలోకోక్తు లతో విరాజిల్లుచు నత్యుచితశబ్దవిలసితం బై ప్రతిపద్యహృద్యం బైనయీయన కవనధోరణి నిరంతరాహ్లాదకరంబుగ నున్నది. ఏ సందర్భంబున నేభావములు స్వభావసిద్ధములో యాసందర్భముల నాయాభావములనే తప్పక ముద్దులు గుల్కు పలుకులతో సంక్షేపముగాఁ జెప్పును. రసభావములను వ్యక్తపఱుచుటయందుఁ బిచ్చిపిచ్చిగను దుద మొదలు లేనివ్రాఁత లెక్కడను గానరావు. ఒక్కొకరంగ మునుగాని యొక్కొకవిషయమునుగాని వర్ణింపఁదలఁచినచో విస్ఫుటముగాఁ దన మనంబున గోచరింపఁజేసికొని పటమునఁ జిత్రిత మగునిర్మలాకృతిమాడ్కిఁ గొలఁది తేటమాటలతో విషయము నంతయు విశదీకరించును. భారతకవులవలెఁ గాక యీకవి యర్థాలంకారములయందును, శబ్దాలంకారములయందును, సమాన గౌరవమునే చూపినాఁడు. యమకములు, అనుప్రాసములు, అంత్యనియమ ములు, శ్లేషలు మున్నగునవి తత్తదుచితస్థలములఁ దఱుచు కాన్పించినను బోతన, మల్లన, కవులయందువలె వినుగుఁ గలుగఁజేయునట్లుగాని, యనవసరముగాఁ గాని, యత్యధికముగాఁ గాని ప్రయోగింపఁబడి యుండలేదు. తనపాండిత్యపారీణ తయుఁ, దనకవితావైచిత్ర్యమును బ్రకటనచేయుట కీయన యలంకారములు వాడి

యుండలేదు. కేవలము రసపుష్టికొఱకె వాడుకచేసినాఁడు. అందువలనే యీ యనకు "సాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి" యనుబిరుదము తగినది.

32. అష్టభాషామహాకవి యగునీకవిపుంగవుఁడు గీర్వాణభాషయం దత్యధిక సాహిత్యము కలిగినవాఁడయ్యును గేవలము సంస్కృతపదజటిలసమాసభూయిష్ఠ మగుకవనశైలిఁ బాటింపక దేశీయపదములను మృదుతరముగను బాహుళ్యము నను, రసోచితముగను వాడుచువచ్చినాఁడు. ఈవిషయమునఁ దిక్కనసోమయాజి ననుకరించియు నామహనీయునికంటె నెక్కుడు స్వారస్యమును జూపినాఁ డని నాయభిప్రాయము. ఈకవీశ్వరుని కవనశైలియందు మఱియొకవైచిత్రి యున్నది. పద్యముల యర్థము తెలియనివాఁడును నందలిలలితపదకలిత మైనమృదులస్వన మును విని వేణుగానము విన్న నెట్టియానందము నొందునో యట్టియానందాబ్ధిలో నోలలాడును. పైసంగతులను నిరూపించుటకుఁ బ్రబంధమందలి యనేకపద్యముల నుదాహరణముగఁ దీయవచ్చును గాని గ్రంథవిస్తరభీతిచే స్థాలీపులాకన్యాయముగఁ గొన్నిపద్యముల మాత్ర మెత్తి వ్రాసెదను.

ఉ. తోరపుఁజన్నుదోయిపయిఁ దొంగలిఱెప్పలు దాఁటి చూపు లా (నీ)
హారము లేనిక్రొమ్మెఱుఁగులై నిలువం గొలు వల్లఁ జొచ్చి య
చ్చేరువకంబముం గదిసి చిత్తరువో యన నిల్చి యున్నబం
డారపుబొమ్మవోలె నచటం గద లించుక లేకయుండఁగన్.

ఉ. నవ్వులమాటలో నిజమె నాకమునందు ననేకకన్యకల్
మువ్వపుదీఁగెలం దెగడుమానిను లుండఁగ నంత నెన్నఁడో
జవ్వన మమ్ముకొన్నగడసాని ననున్ గవయం దలంచితే
పువ్వులు వేడుకైన గడివోయినవే న్ముడువం దలంతురే.

ఉ. కదిసితి మంత దంతపరిశుద్ధ్విపఖండితదేవదారువున్
మదనవినోదకందళితమానసమానసహాసభీరువుం
బ్రదరపదాచ్యుత క్రకచపాటితలస్తకదేశచారువున్
ముదితచమూరువున్ ఫలితమూలనమేరువు నాసుమేరువున్.

మ. పరివాదాస్పదవాదమోద మదిరాపానంబుచే మత్తులై
హరి మేలంచు హరుండు మేలనుచు నాహా కొందఱీపొందెఱుం

గరుకైలాసనగంబునందు మును లేకత్వంబు భావించి రా
మురవైరిం బురవైరిఁ బాపుట మహామోహంబు ద్రోహంబగున్.

సీ. కోటసింగారించి కొత్తళంబుల నెల్ల నట్టళ్లు పన్నించి యాళువరికిఁ
బందిళ్లు వెట్టించి పైకొమ్మవెట్టించి గుండుదూలము వసికొయ్య దూర్చి
యగడిత లీఁతనీ రలవడఁ ద్రవ్వించి వెలిఁజుట్టిరాములు వెలుగు వెట్టి
దంచనంబులును దద్దడములు నెత్తించి బలుగాడితలుపులు బలుపునేసి
గీ. పాళెములువెట్టి కొంకులు బ్రద్దబరులు, గత్తిగొంతంబు లొడిసెల్లు గత్తళములు
నారసములును విండులు నగరిలోనఁ, బెట్టి పెట్టుఁడు నడునెట్టి మట్టిలావు.

సీ. కుజము కుంజరముచేఁ గూలునో కూలదో కూలుకుంజరము నీకుజము గూల్చె

... ... ... ...

సీ. వంకదారకుఁజేరి వాకిటి దద్దడంబులు సేర్చి కొమ్మల ద్రోకువైచి ...

చ. కనిరి కుమారు లంత శశికాంతశిలాతలశీతలస్థలీ
వనఘనపాదపాదపనివారితవారితరంగరంగన
ర్తనపరివర్తనద్విరదదానసదానమదాళిమాలికా
తనువనజాతనూతనపతాకముఁ బుష్కరమున్ తటాకమున్.

మ. కలరా యింతకుమున్ను యాదవులచేఁ గప్పంబు దెప్పింపఁగాఁ
గలరా రాజులు గాజులం దొడవుఁగాఁ గల్పించిరా కాకులం
గలకంఠంబులఁ జేసెనా కటకటా గౌరీశ్వరుం డేమిగాఁ
గలవారో యిటమీఁద హంసడిచికుల్ గర్వాంధకారంబునన్.

సీ. పసిగ్రేపుఁ బెనుచునేపాడిమొల్లంబెట్టు మెకముదాఁటదుగదా మేఁపుగలదె
తొడకాలితరుపుల విడుతురా తోడితోడి జన్నెల తరివట్టు జాడ గలదె
వెలికల్లువైతురా వేల్పులఁ గుడుపుచోఁ గదుపులోఁ నేబోతు గడవబాఱు
సలిగపన్నులు గొన్ని జట్టిచూపరుగదా బెదరిన నిలుగూఁతఁ బెట్టఁగలదె
గీ. వల్లెవైచువా రెవ్వరు మల్లరాల, లంపుగలతొఱ్ఱులను గూయలావుగలదె
యేర్పుదాటులలో దొఱ గెలుఁగఁబడునె, పరికరము కోడె లమ్మెడుపాటి గలదె.

చ. తలిరులఁజోఁకెనో దొనలఁ దాఁకెనొ తొండపుఁ బిండుబ్రాఁకెనో ...

చ. గెలిచినవాఁడు నేఁడు రణకేళిఁ బురందరుఁ దద్గజేంద్రమున్
వెలిచినవాఁడు దేవతలనెట్టికిఁ బట్టినవాఁడు ధూర్జటిన్

నిలిచినవాఁడు భక్తిమయవిత్తమునన్ ధర నేకవీరుఁడై
నిలిచినవాఁడు శౌర్యమున నీజనకుండు భయంబి దేటికిన్.

ఉ. నావుఁడు రోషవహ్నివలనం బొగరేఁగినభంగి మోమునన్
గావిరి పర్వ నంగమునఁ గంపము నివ్వటిలంగ బాణుఁ
డత్యావిలచిత్తుఁడై మనుజుఁడట్టె మదీయపురంబుఁ జొచ్చె న
చ్చేవయ కాక నానగవు చెర్చె నిసీ మగమాట లేటికిన్.

సీ. బాలార్క-బింబంబు పరఁగించి లేయెండ మనమీఁదఁ జల్లినమాయ లేదు
కొంతంబుమెఱుఁగులుగుప్పించి మెఱుఁగులు మనమీఁదఁ బొలసినమహిమ లేదు

.. ... ... ...

చ. భయరసమగ్నులం బ్రధనభగ్నుల దుర్భరదైన్యభుగ్నులన్
నయనవిలగ్నుల న్నివసనాయితనిర్వృతనగ్నులం బరా
జయపరివిగ్నులం బ్రణతిసారవలగ్నుల నగ్నులం బిలే
శయశయనుండు చూచి చనసాగె గిరివ్రజరాజధానికిన్.

శా. రాకాచంద్రికఁ దేల్చినట్లు ఘనసారంబుం బయి గూర్చిన
ట్లాకాశాపగనీర వ్రాల్చినటు లాత్మానందయోగామృతం
బేకాంతస్థితిఁ గ్రోల్చినట్లు హరిచే నింపారునాలింగన
స్వీకారంబున శీతలాంగధరుఁడై సీరాయుధుం డుండఁగన్.

ఉ. బాణుఁడు వీఁడె మంత్రయుతబాణుఁడు దానవశూరసైనిక
త్రాణుఁడు శంకరస్తుతి పరాయణుఁ డుజ్జ్వలరోషదీప్తదృ
క్కోణుఁడు సంగరస్ఫురితకోపపరాబ్ధఘటావళీజగ
త్ప్రాణుఁడు యుద్ధవిశ్రుతపరాక్రమరౌద్రరసప్రమాణుఁడున్.

ఉ. ఏమిర బాణ వ్రీళలవహీన భయాతురమానసంబుతో
నే మని పెకు-లాడెద వి దేటికి మాటలచేత నీవు సం
గ్రామము గెల్వవచ్చునె వికారవుమాట జయంబ యైన నిం
కేమియు నేల భాషితము లెక్కుడుగాఁ బచరింపు మాజిలోన్.

సీ. మానినీమంజుల మంజీరకరరవకేళీసరోహంసకేలితంబు
కామినీకాముకకలహప్రసాదనపండితశారికాభాసురంబు ...

ఓరుమళ్ల అచ్యుతరావు.

# బ్రహ్మసూత్రసారము.

సబ్ జడ్జిపదవిలోనుండి కొలఁదిదినములక్రింద విరమించి పూర్వసేవార్థ వేతనమును బొందుచున్న బ్రహ్మశ్రీ వావిలాల శివావధానులుగారు "బ్రహ్మసూత్ర సార"మను నొక తెనుఁగుగ్రంథము ప్రకటించిరి. అది వారు 1915 సం॥ ఏప్రిల్ నెలలో దివ్యజ్ఞానసమాజము వారి సభలో నిచ్చిన యుపన్యాస సత్రయముయొక్క వివరణమని వ్రాసిరి. ఆ వివరణమును 133 విషయములుగా విభజించి 133 ఖండము (పేరా) లుగా నేర్పఱిచిరి. మొదటి తొమ్మిదిఖండములు భూమిక. పది యవది మొదలుకొని తుదవఱకును బ్రహ్మసూత్రములమీఁద శ్రీ శంకరాచార్యులు వారు చేసిన భాష్యములోని ముఖ్యాంశముల నధ్యాయపాదాధికరణముల వరుస నెత్తివ్రాసిన సంగ్రహము. అచ్చటచ్చట గ్రంథాంతరములలోని సంగతులు గూడఁ జేర్పఁబడెను. గ్రంథకర్తగారు విషయములను విరళముగాఁ జర్చించి స్వా భిమతమును గూడఁ జూపుచువచ్చిరి. గ్రంథారంభమున ఖండములవరుసను విషయసూచికయు నంతమందు రెండనుబంధములును జేర్పఁబడెను. ప్రథమాను బంధములో శ్రీశంకరాచార్యుల కాలనిర్ణయమునుగూర్చి చర్చింపఁబడెను. కాని యాకాల మింతవఱకు విపక్షనిరాసకముగా నిర్ణీతము కా లేదని చెప్పవచ్చును. రెండవ యనుబంధము బ్రహ్మసూత్రములు. అచ్చు మంచికాగితములమీఁద సుం దరముగా నొత్తఁబడి యట్ట రమ్యముగాఁ జేయఁబడెను. కాని యాఱుపుటల శుద్ధాశుద్ధపత్త్రిక యిందుండవలసి వచ్చుటమాత్రము శోచనీయము.

గ్రంథమంతయుఁ జదువరులకు విస్పష్టముగాఁ దెలియునటులును, హృద యంగమముగా నుండునటులును మంచిశైలిలో వ్రాయఁబడినది. బ్రహ్మసూత్ర ములమీఁది శాంకరభాష్యములోఁ బ్రతిపాదింపఁబడిన విషయములను సామాన్య ముగాఁ దెలిసికొనుటకును గాణాదాదిమతములను విశిష్టాద్వైతసిద్ధాంతములను సంగ్రహముగాఁ దెలిసికొనుటకును నాంధ్రభాషలో నీగ్రంథము చాలియున్నది. కావునఁ గడునాదరణీయము. వెలగూడ సులభము. ౧ రూపాయి.

ఈ గ్రంథకర్త దివ్యజ్ఞానసమాజములోఁ జేరినవారును దదభిమానులునై యున్నారు. ఇదిగాక గ్రంథసమర్పణ మొనర్పఁబడిన వారిగురువుయొక్క గురుసం

ప్రదాయములో శాంకరమతనిరసనము, విశిష్టాద్వైతమతాభిమానమును మెండు గాఁగలవని యాంధ్రద్రావిడదేశములలోని పండితబృందమునకు సువిదితమయి యున్నవిషయము. ౨౦౨ వ పుటలోఁ జేర్కొనఁబడిన రామసుబ్రహ్మణ్య శాస్త్రుల వా రాసమర్పణగురువులకు గురువులు. శంకరులవారి సాక్షాచ్ఛిష్యులును దత్ప్ర భృతినేఁటివఱకును లోకమంతయును శంకరులవారిమత మని గ్రహించియున్న కేవ లాద్వైతము శంకరులవారి హృదయము కా దనియు, వారిభాష్యమునకు భేద మందే తాత్పర్యమనియు నొకపుస్తకముగూడ వ్రాసిరి. వారు దాని నమ్మియే వ్రాసిరో, యితరులకు శాంకరమతమందు బుద్ధిభేదము కలుగవలయు నని వ్రాసి రో సంశయము. ఎట్లైనను మనగ్రంథకర్త తదుభయసంప్రదాయ వాసనారూఢు లగుటవలన బ్రహ్మసూత్రసారము నద్వైతభాష్యము ననుసరించి చెప్పఁబూనినను శాంకరమత మని యొప్పఁగూడని విషయములుగూడ నచ్చటచ్చట వారిమత ముగాఁ జేరుట కలిగినది. విష్ణుపరాత్పరత్వము సూచిత మయినది. ఎంతటి వారి కైనఁ దాముపట్టినది శంకరులవా రొప్పినదేయనుట యుత్కర్షావహముగదా ?

కర్మభక్తిజ్ఞానములనుగుఱించి వ్రాసినదానిలో గ్రంథసాంకర్యమును సంప్రదాయ సాంకర్యమును గలిగినవి. శ్రవణాదినవకములోని సఖ్యము ఆత్మనివే దనము, సాధ్యభక్తియనియు, సాధ్యభక్తియు నిర్గుణజ్ఞానము నేకమనియు, నిర్గుణ జ్ఞానమునకు నిర్గుణోపాసనకును భేదము లేదనియు, నిర్గుణజ్ఞానమున "కనన్యభక్తి యని గీతలలో నొక పే రున్నదనియు, విశిష్టాద్వైతు లొప్పిన ప్రపత్తి, శరణా గతి, అద్వైతుల నిర్గుణజ్ఞానము, అనన్యభక్తియు సమానార్థకము లనియు, నవ ధానులవారు నుడివిన కొన్నియంశములు చింత్యములు. భక్తియనఁగా నీశ్వరుని యందు "పరానురక్తి" (శాం. సూ. ౨) "పరమప్రేమ" (నా. సూ ౧) ఇది భక్తి శబ్దముయొక్క ముఖ్యార్థము. అట్టిప్రేమ కలుగుటకును, గలిగినది వృద్ధిఁబొంది రూఢమగుటకును సాధనములుగలవు. అది సిద్ధించినపిదప నాసాధనములు లక్షణ ములుగా నుండును. ఆసాధనములు భక్త్యంగములనియు, భక్తియొక్క యుపాధు లనియుఁ గొందఱువాడిరి. ప్రహ్లాదుఁడు చెప్పిన "శ్రవణము, కీర్తనము" మున్నగు నవి తొమ్మిదియు సాధనములలోఁ జేరినవి. ఈసాధనములకుఁగూడ భక్తిశబ్ద మౌ పచారికముగా వాడుటకలదు. అందు సాధనములను సాధనభక్తియనియు వానిచే సాధ్యమగు నీశ్వరునియందలి పరమప్రేమ సాధ్యభక్తియనియుఁ గొందఱు వాడిరి,

కొందఱు వానినే యపరభక్తి పరభక్తియనిరి. ఆచెప్పిన నవవిధభక్తులలోఁ దుద నున్నసఖ్యము, ఆత్మనివేదనము సయితము సాధనభక్తిలోనివే యని భాగవత ములోనే కనిపట్టవచ్చును.

మఱియు వానిలోఁ బ్రత్యేక మొక్కొకటి దానివలన నొక్కొక్కరు కృతార్థులైన నైతిహ్యము గలదు. పరమప్రేమరూపమగు సాధ్యభక్తియు, నిర్గుణజ్ఞానము నొకటేయని కపిలుఁడు దేవహూతికిఁ జెప్పియుండలేదు. సాత్త్విక రాజసతామస భక్తులకంటె విలక్షణముగాఁ గపిలుఁడుచెప్పిన యుత్తమభక్తి యగు నిర్గుణభక్తి సయితము వృత్త్యాత్మకము, పరమ ప్రేమరూపము. అహేతుకప్రేమ యొక్క పరమదశయందు భేదము తోఁపదు. అందుచే "అవ్యవహితా" యని కపిలుఁ డాభక్తికిఁ జేర్చిన విశేషణ మన్వర్థము. ఆభక్తియుఁ దత్త్వజ్ఞానమును వేఱనుటకు "భక్తిః పరేశానుభవో విరక్తిరన్యత్ర" మున్నగు భాగవతశ్లోకములు ప్రమాణములు. అచ్చటఁ జెప్పినసాధ్యభక్తి ప్రేమరూపమని శ్రీధరులవారు వ్రాసిరి. మఱియు నాభక్తి జ్ఞానసాధనముగా భాగవతములో నచ్చటచ్చటను భగవద్గీతలు 13 అధ్యాయము 10 శ్లోకమందును జెప్పఁబడియున్నది. అంతియ కాని యదియు నిర్గుణజ్ఞానము నొకటికాదు. భక్తి వృత్తిరూపము. జ్ఞాన మనుభవరూపము. అవి రెండు నొకటే యెట్లగును? అజ్ఞానము అనఁగా జీవపరమాత్మైక్యబోధము. దానినే యపరోక్షజ్ఞాన మనియెదరు. అదికలిగినపిదప సర్వకల్పనారహితమయిన స్వాత్మయందు నిలిచిపోవుట జ్ఞాననిష్ఠ. భక్తిజ్ఞానములు స్వరూపమిట్టిద్విధము. అయినను "చతుర్విధాభజంతే మామ్" అను గీతా శ్లోకములో నాలవదియగు జ్ఞానభజన మనుదానిచే నాజ్ఞాననిష్ఠ వివక్షితమని శ్రీశంకరుల వారు నిర్ణయించి, యోగీతలలో జ్ఞాననిష్ఠుల ప్రకరణములో వచ్చినభక్తిశబ్దమునకు "భగవద్గీతలు అ 8 శ్లో 22, అ 12 శ్లో 22, అ 18 శ్లో 54, జ్ఞానపరముగా భాష్యమువ్రాసిరి. వారితాత్పర్య మాస్థలములలో భక్తిశబ్దమునకు జ్ఞానమర్థమని కాని, స్వరూపములో భక్తిజ్ఞానము లేక మనికాదు. అజ్ఞానార్థక మని వ్రాసినభక్తి భక్తియోగములోఁ జెప్పిన యేభక్తియుఁగాదు. "అనన్యభక్తి" యను నొక దానిని గీతలలో నెచ్చటనుగానము. "అనన్యయాభక్త్యా" యని రెండు శ్లోకములలోఁ (అ. 8. శ్లో 22, అ 11 శ్లో 54) గలదు. వానిలో (8-22లో) శంకరుల వారంతకుముందు రెండు శ్లోకముల వెనుకనుండి జ్ఞాననిష్ఠుల ప్రకరణముగా విభ

జించి "అనన్యయా = ఆత్మవిషయమైన, భక్త్యా = జ్ఞానముచేత), నని యర్థము వ్రాసిరి. అచ్చటనే యావెనుక 14 శ్లోకము మొదలుకొని యేకప్రకరణముగా నన్వయించిన మధుసూదనస్వామి ప్రేమపరముగా ముఖ్యార్థమునే చెప్పిరి. రెండవ శ్లోకము (11—54)లో భగవదేకనిష్ఠమగు ప్రేమపరముగా ముఖ్యార్థమునే యం దఱుఁ జెప్పిరి. కాని "యనన్యభక్తి" యని యొకభక్తివిశేషముగాఁ జెప్పినట్లు కానము. కాఁబట్టి విశిష్టాద్వైతులు చెప్పుప్రపత్తికి నిర్గుణజ్ఞానము ననన్యభక్తియు నామాంతరము లనుట సరికాదు. మఱియు నిర్గుణజ్ఞానమునకును నిర్గుణోపాసన మునకును భేదము లేదనునది సయితము సరిగాఁ దోఁపదు. ఉపాసనమనఁగాఁ బ్రత్య యావృత్తి. క్రియారూపము. నిర్గుణోపాసనముకూడ నిట్టిదే. భక్త్యుపాసనాశబ్ద ములైన నేకార్థములు కానేరవు. పైఁజెప్పినగీతా శ్లోకములలో సందర్భమునుబట్టి భక్తిశబ్దమునకు జ్ఞానపరముగా నర్థముచెప్పిన ట్లాచార్యులవా రుపనిషత్తులలో గొన్నిచోట్ల జ్ఞానార్థకమగు విదిధాతువునకు ముఖ్యార్థమును వదలి యుపాస్తిపర ముగా నర్థముచెప్పిరి. అంతియకాని జ్ఞాన ముపాసనాస్వరూపమం దొకటియని వారి తాత్పర్యముగాదు. భక్తిజ్ఞానోపాసనల స్వరూపములను జక్కఁగా విమర్శిం చినచో వానిభేదము విస్పష్టమగును.

"ఈశ్వరాధికార" మను 126 వ ఖండములోఁ బూర్వకల్పములయందు మహాపుణ్యముఁ జేసికొన్న యొకానొకజీవుఁ డీకల్పమం దీశ్వరుఁ డయ్యెనని వ్రాసిరి. ఇది దివ్యజ్ఞానసమాజమువారి సిద్ధాంతము. ఆనిబెసంటమ్మగారి కది యభిమత మయినను గావచ్చును, కాని శ్రుతిస్మృతులకును, భాష్యకారులకును సమ్మతముకాదు. "అధికృతః" అను జగద్వ్యాపారవర్జన సూత్రభాష్యములోని పదము నధికారము కలుగఁ జేయఁబడినవా" రనునర్థమం దవధానులవారు గ్రహించిరి. ఇది కేవలము పొరపాటు "అధికృతః" అనఁగా "ప్రకృతః" అని యచ్చట నర్థము. ఇది మూలసూత్రమువలనఁ బూర్వోత్తరభాష్యపంక్తులవల నను స్పష్టమే. ఆనందగిరియు నిట్లే గ్రహించెను. మఱియుఁ బరమేశ్వరుఁ డనఁగా "జన్మాద్యస్యయతః" అనుసూత్రములో జగత్కారణముగాఁ జెప్పఁ బడినవాఁడు, సగుణబ్రహ్మము. 213 పుటలోఁ జెప్పినట్టు లాధికారికజీవులను దత్తదధికారములందు నియమించువాఁడు, ఆతనినే తిరిగి యాధికారికజీవుఁ డనుట యసంగతము కాదా. అపరమేశ్వరుఁడు సిద్ధజీవుఁ డని యవధానులవారు చెప్పి, "యే యుపనిషత్తులలోఁగాని, యేమసయితరగ్రంథములలోఁగాని లేదు.

ప్రాకృతజనుల కీయర్థంబు బోధకాదుకావున నాచార్యులవారు దీనిని వివరింప లేదు. అని కడుం గృపతో నాచార్యులవారి యజ్ఞతను గ్రమ్మివేసి యాభావముం గనిపట్టినవారి యప్రాకృతత్వమును బయికిం దెచ్చినసాహసము విస్మయావహము. ఇట్లద్వైతు లొప్పనట్లు లేని యంశములు కొన్నికొన్ని యచ్చటచ్చటం జేరియున్నను, భాష్యార్థమును సంగ్రహముగా ననువదించినంతవఱకు గ్రంథము సరిగానే వెళ్లినది. కావునం దజ్జిజ్ఞాసువు లగునాంధ్రుల కీగ్రంథమత్యంతోపకారక మని చెప్పవచ్చును.

జం. గా.

126. భారతవచనము. (గ్రం. భాం. సంఖ్య. 1548.)

ఇదియొక సంక్షేపభారతవచనము. మొదటినుండి శల్యపర్వము తుదకుఁ గలదు. వర్ణనములు ననవసరవిషయములను దగ్గించి కథమాత్రము వ్రాయఁబడి యున్నది. వ్రాసినవారిపేరిందుఁ గానరాదు. సంస్కృతము, భారతకథ, యందలి యితిహాసములు, చమత్కారములు, విశేషములు మొదలగునవి తెలిసినవాఁడె కాని తెనుఁగు బొత్తిగా రానివాఁడని పుస్తకములోని వ్రాఁత తెల్పుచున్నది. ఇది తెనుఁగుభారతమును జదివి వ్రాసినదిగాఁ గనఁబడదు. సంస్కృతముంగాంచికూడ వ్రాసినట్లు నిశ్చయింపఁ గూడకున్నది. ఉదాహరణములు.

(1) వకదివసం అక్కడికి దూర్వాసుం డనే రుషీశ్వరుండు రాగాను భోజుడు అతంని విచారించకనుండగాను కుంతిభయపడి తనతండ్రిని శపించీని అని తాను బొమ్మలు ఆడేగృహమందు ఆయనకు వుపచారంచేసి ఆయనకు భోజనం చేయించను. ఆదూర్వాసుడు కుంతిని మెచ్చి ఆకుంతికి ఆరుమంత్రాలు వుపదేశం చేశను. ఆమంత్రాలలోను నీకు సరిపోయిన దేవతలను స్మరిస్తేను ఆదేవత వొచ్చి నీకు వరమిచ్చీ నని చెప్పి ఆదూర్వాసముని తన ఆశ్రమానకు పాయను ఆమీాద బొమ్మలను ఆడించెటందుకు కుమారుడు కావలె నని గంగాతీరానకు పోయి స్నానంచేసి......కుంతిభయపడి కుమారుని యెత్తుకొని గంగను ప్రార్ధన జేసి నీవు యీాశిశువును చంపక రక్షించమని నదిలో వేశను.

(2) నెత్తురుదాగి భీముడు రణాగ్రానకు ద్రౌపదిని పిలుపించి వానిరక్తమందు స్నానంచేయించ్చి వెనులు ముడిపించ్చి వానిపంఢ్లు పీకి దువ్వెనచేసి తలదువ్వించ్చి.

127. గరుడపురాణము. గ్రం. సం. 2057.

గరుడపురాణమని సాధారణనామ ముంచినను "నారచియింపఁ బూనిన గరుడపురాణ శతాధ్యాయి శ్రీరంగమాహాత్మ్యం బను మహాప్రబంధంబునకుం గథావిధానం బెట్టిదనిన" యనియు, గద్యమున—

ఇది శ్రీవేంకటేశ్వర వరప్రసాదాసాదిత చాటుధారానిరాఘాట సరసచతుర్విధ చతురకవిత్వ రచనాచమత్కార సకలవిద్వజ్జనాధార కట్టహరిదాసరాజ గర్భాబ్ధి చంద్ర వరదరాజేంద్రప్రణీతంబైన గారుడపురాణ శతాధ్యాయి శ్రీరంగమాహాత్మ్యంబను మహాప్రబంధంబునందు ... ... అనియు దీనిని బ్రబంధముగాఁ

జెప్పుచున్నాఁడు. కాఁబట్టి గరుడపురాణ మని యెవ్వరో యితరులుంచిన పేరు, శ్రీరంగమాహాత్మ్య మనునది నిజనామ మని మనము నిశ్చయింపవలయును.

ఇక్కవిరాజు స్వప్నంబున శ్రీవేంకటేశ్వరుఁడు సాక్షాత్కరించి.

గీ. మున్ను నాపేరనంకితంబుగనొనర్చి, తవనిఁబొగడొందఁ బరమభాగవతచరిత
మిపుడొనర్పుప్రబంధంబు నిమ్మునాకు, నంకితంబుగ నేవేంకటాధిపతిని.

క. నీకవితవిన్నవీనుల, నాకడఁ బెఱకవులకృతులనరుచిజనించున్.

ఉ. చేయరె తొల్లి సత్కవుల శేషపురాణములం దెనుంగులన్
నీయితిహాసమెందు రచియింపమితావక పుణ్యమింతె యా
మ్నాయచతుష్కసారము సనాతనగారుడ సంహితాశతా
ధ్యాయి తెనుంగుసేయ నొకఁడర్హుఁడె నేఁటికవీంద్రకోటిలోన్.

అనిపొగడి కోరినాఁడఁట. సూర్యవంశస్థుఁడగు కరికాళచోళుని వంశములోఁ దెలుంగు బిజ్జలరాజు, వీనికుమారుఁడు రంగరాజు, వీనికుమారుఁడు శ్రీరంగరాజు. వీనియైదుగురు తనయులలో కట్టహరిదాసరాజనొకఁడు. ఈకవి యీతని కుమారుఁడైనట్లు స్వవంశవివరణమునఁ దెల్పుకొని యున్నాఁడు శైలి—.

క. జీవిత మీాయక నేరము, లేవెదకుచుఁ దగినపనులు లెక్కింపని ధా
త్రీవరు విరక్తియెఱుఁగన్, సేవకులకుఁ బట్టపగలు చీఁకటి గాదే.

క. కర్మఫల మనుభవించెదఁ, గర్మముఫలమిచ్చు నింతె కాశీశ్వరుఁడీ
కర్మము సేయించుననం, గర్మంబీశ్వరుని నంటుఁగదవె పిశాచీ.

గీ. విత్తుచేఁ జెట్టువెట్టిన విత్తుగలిగెఁ, గడయెఱుంగని చందానఁ గర్మవర్య
జీవులకు నాదివాసన చెడదుగాన, వదలికర్మంబు జ్ఞానిగావలయుఁ జుమ్ము.

128. శివవిలాసము. గ్రం. సం. 2177.

ఇప్పొత్తమును రచించినది తరిగొండ వెంగాంబ. ఈమెతన్నుఁగూర్చి కడపట నిట్లు చెప్పుకొన్నది.

ద్విపద......వలనొప్పఁగా నందవర కులోద్భవుఁడు
వరకీర్తికానాల వంశవర్ధనుఁడు, గురుతరవాసిష్ఠగోత్ర పావనుఁడు
వసుధమీాఁదనుగీర్తివంతుఁ డైనట్టి, రసికుఁడు శేషార్యరమణి మంగాంబ
వరపుత్రి వెంగమాంబధరిత్రిమీాఁద, నరుదుగాఁ దరిగొండ హరికటాక్షమున
సరసతశివ విలాసంబనుకథను, కరమర్థితో యక్షగానంబు చేసి
పరమభక్తిని వీరభద్రున కొసఁగె.

తిరుపతిలోఁ బ్రసిద్ధురాలైన, రాజయోగసారము, వేంకటాచలమాహాత్మ్యము, ద్విపదభాగవతముచేసిన వేంగమాంబ పుట్టినింటివారిగోత్రము వాసిష్ఠగోత్రమేకాని తండ్రి కృష్ణార్యుఁడని యున్నది. ఇంమెతండ్రి శేషార్యుఁడని కలదు. ఈమె యత్తవారి యింటిపేరు మొదలైనవి చెప్పుకొనలేదు. తరిగొండ వారికోడలు కావచ్చును.

ఇందలికథ కృష్ణపారిజాతము లనుయక్షగానముల ననుసరించి వ్రాయఁబడినట్లు—

ద్వి. చేడెరో నామాటచెప్పెదవినుము, మూఁడుదినములనాఁడు మునియొకఁడువచ్చి
అతులితమనిరత్నహారంబుదెచ్చి, హితవుగా నీసవతి కిచ్చిన సతఁడు
నీసవతికి నిచ్చి నినుమదిఁ దలఁచి, భాసురాంగిరో చాలభయపడినాఁడు...
ఆరత్నహారంబు ననెంత పెద్ద, రాణింప మునుపరబ్రహ్మమియిచ్చినది
మాణిక్యహారంబు మక్కువమీఱ.

ఇట్లు పారిజాతపుష్పమునకు మాఱు రత్నహారము మొదలైన వానింబట్టి తోఁచును. కావుననే దీనిని సాధారణముగా శివపారిజాతమని లోకులు వాడుచున్నారు. గ్రంథము ప్రారంభమునఁ గడపట శివపారిజాతమనియే వ్రాసినారుకాని చదువుకొనిన కవయిత్రిమాత్రము శివవిలాసమనియే గ్రంథాంతమునఁ జెప్పుకొనినది. ఇందు వ్రాఁతతప్పులు మెండుగఁ గలవు.

ఆ 1880 సం॥ యేప్రిల్ నెల ది 16 తేదిని సరియైన విక్రమనామసంవత్సర చైత్ర శు ౭ శుక్రవారమువఱకు వంగిమళ్ల గ్రామములోనుండు తిరుమలసెట్టి వేంకటచిన్నయ్యకు, తిరుపతి మారెళ్ల సుబ్బన్న వ్రాసి యచ్చిన పుస్తకము.

## 129. జాహ్నవీవిలాసము. గ్రం. సం. 2175.

ఇది మూఁడాశ్వాసముల పద్యకావ్యము. మారెళ్ల సుబ్బరాయ దాస కవిప్రణీతము. ఇక్కవి మొన్నమొన్నటివాఁడు. ఈతఁడు (1) అనసూయావిలాసము, (రెండాశ్వాసములు) (2) భద్రాద్రిక్షేత్రమాహాత్మ్యము (రెండాశ్వాసములది) (3) గరుడాచలవిలాసము (ఏకాశ్వాసము) (4) మార్కండేయవిలాసము (మూఁడాశ్వాసములు) (5) హరిశ్చంద్రవిలాసము (రెండాశ్వాసములు) ననుపద్యకావ్యములనుగూడ రచియించియున్నాఁడు.

ఈకవి జాహ్నవీ విలాసమున “మఱియును, నీకృతికవీశ్వరుండనైన చతుర్థవర్ణుండనగు నేను శశి. అష్ట, గగన, లోచనంబులని యెడిదగునేటి విషు

నామాబ్దంబున శ్రావణమాసంబున శుక్లపక్షద్వాదశీ భానువాసరంబున నీజాహ్నవీవిలాసంబు సంపూర్తిగా...కైలాసవాసుండగు సర్వేశ్వరున కర్పించితి"నని చెప్పకొనియెను. దీనికి వివృతి "౧౮౭౧ సం॥ జులాయినెల తే ౭ దికి సరియైన విషునామసంవత్సర శ్రావణ శు. ౧౨ ఆదివారమువఱకు, తిరుపతిమాలేశ్వ సుబ్బన్న తనస్వంతమునకు వ్రాసికొన్న జాహ్నవీవిలాస"మని యున్నది. వ్రాఁతలోను గవనమునందునుఁ బెక్కులు లోపములు కనఁబడుచున్నను, బ్రస్తుతకాలమునం దిన్ని గ్రంథములకు సంగ్రహములుగను విరివిగను బద్యకావ్యములు వ్రాసినవారు శూద్రులలో లేరనియె చెప్పవచ్చును. శైలి, జాహ్నవీవిలాసములో.

క. శ్రీకౌసల్యా తనూభవ, సంక్రందనప్రముఖ నిఖిలసురముని వినుతా
రాకేందుద్యుమణినేత్రా, కాకుస్థకులాబ్ధిసోమ కోదండరామా

క. శ్రీరుక్మిణీమనఃప్రియ, నారదగానంబులోల నర్జునమిత్రా
క్షీరాబ్ధివాసయదుకుల. వీరావసుదేవపుత్ర గిరిధరకృష్ణా.

అనసూయావిలాసములో—

క. ఏచోటనైనమిక్కిలి, యీచెలులకు నెక్కుడైన యింతులుగలరా
చూచితివోయిలలోపల, దాఁచక చెప్పంగవలయుఁ దాపసవర్యా.

మార్కండేయవిలాసము—

క. అడిగిన వరమునునిచ్చితిఁ, గడుమోదము నెంది నీవుగైకొనుమనుచున్
నుడివినవాక్యములు మృకం, డుఁడు విని కైకొంటిననని కడునమ్మదమొందెన్.

భద్రాద్రిక్షేత్రమాహాత్మ్యము—

చ. మునివరులార మీరదుగముఖ్యముగాఁ దగఁదెల్పుదుం జుమీ
వినుఁడు పరాత్పరుండు ఘనవిష్ణుఁడు నిర్జరకోటిఁగూడి దా
ననిశమునద్రిపై నిలిచి యందఱభీష్టమొసంగుచుండినం
దుననువికుంఠమై పరఁగె ధీయుతులార మఱొండు లేదుగా.

హరిశ్చంద్రవిలాసము—

క. తనసతిని విడిచియైనను, దనసుతుని న్విడిచియైన ధాత్రీతలము
న్ననరున విడిచిననైనను, దనపూనిక సూనృతంబుఁదప్పనె యెపుడున్.

గరుడాద్రివిలాసము—

క. సిరినీచిత్తంబునఁ గని,కరమును గలుగంగవలయుఁ గాకన్యులకున్
మఱికలుగునె యనిపల్కిన, కరుణను శ్రీలక్ష్మివారికనియెం బ్రీతిన్.

## 130. శ్రీరామకుమారవిజయము. గ్రం. సం. 2550.

ఇది పైపేరునన్పొప్పు కుశలవచరిత్రము.—ద్విపదకావ్యము. మూఁడాశ్వాసములు. దీనిని రచించినయతఁడు :—చిదంబరకవి.

గద్యము.

" అని రామనామక హరికృపాలబ్ధ, ఘనసంస్కృతాంధ్ర సత్కవితారహస్య విదుఁడు భారద్వాజ విమలగోత్రజుఁడు, పదవాక్యనిధి చిదంబరకవీంద్రుండు రుచిరసాలంకారరూఢులు మెఱయ, రచియించినట్టి శ్రీరామకుమార విజయప్రబంధంబు... అనియుఁ, గృత్యాదిని—

" గురుఁడు భారద్వాజగోత్రవంశజుఁడు, పరమవిఖ్యాతుండు భాగయార్యుండు తనతపంబులపంట తఱఁబండెననఁగఁ, దనయుఁడుగల్గె నాధన్యాత్మునకును నరనుత వేంకటనరసింహసూరి, యురుయశోనిధియుర్వి నుదయించిమించి యనుపమ మహిముఁడై యంబుధివిధునిఁ, గనినచందంబునఁ గనియె ... నారాయణాఖ్యుని నరనాథపూజ్యు, నారూఢమతిఁగనె నమ్మహాత్ముండు దనధర్మపత్నియై తనరక్కమాంబ, యనసూయకెనయగునా సాధ్వియందు సుతులనల్వురఁగాంచె నతులవిశ్రుతుల, సతతశ్రీహరిభక్తి సంసక్తమతుల నానల్వురందు నేనవరజన్ముండ.

అని చెప్పుకొనుటచే నీతనివంశాదికము విశదపడుచున్నది. గ్రంథము పూర్ణముగనున్నది. శైలికై యొక్క కథాసందర్భభాగము—

" మునురాజుతనకిచ్చుముద్దుటుంగరము, ననువందనాయన్నయాడుకొమ్మనుచు

* * * * * * *

నదిపూనియొకనది నతఁడుగ్రుంకుటయు, మదిదప్పినదిఁబడె మణిముద్రికంత తడయకయొకమీను దానిమ్రింగుటయుఁ, గడఁగిబాలురువచ్చి గాలానమీను బట్టిదట్టపుఁగాంతిఁ బరఁగినదీని, గట్టిగారాజుకుఁ గానుకవెట్టుదము దొరమెచ్చునని వారు దుష్యంతరాజు, కిరవొందనిడవారికి ప్రార్థమొసఁగి మీనోదరంబున మెఱుఁగుటుంగరము,మానుగాఁగాంచియుమదిఁజోద్యమంది మునుశకుంతలకిది పొసఁగనిచ్చితిని, ననుఁజేరెమగిడియు నాతినాకేమి గురుతుదెచ్చునో దాని గుణగౌరవముల, నరయుదునని చాలనాత్మలోనెంచి మణిముద్రికటుదాఁచి మహినాథుఁడుండె, మణిముద్రికెందేని మాయమైతల్లి

పోయినదని తనపుత్రుండుచెప్పఁ, దోయజాక్షికి మదితోరమైపర్వ
మదివింత నొందుచుమానిని పల్కెఁ.

ఇందు సందర్భానుసారముగ శకుంతలచరిత్రము నభిజ్ఞానశాకుంతలాను సారముగఁ జెప్పుచునుఁ గొంతభేదమును జూపుచున్నాఁడు.

131. ఋశ్యశృంగచరిత్రము. గ్రం. 2401.

నాగులరామకవి విరచితము. దక్షిణామూర్తికిఁ గృతి యీఁబడినది.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర కాశ్యపసగోత్ర శ్రీరామమంత్రోపాస్తిసావ దుత్తారక ధీసంప్రాప్త సుచర్య తత్కరుణాశ్రయీభూత నాగుల వేంకటాచలార్య తనయ విజితపరవాద యద్వాణీవైఖరీలసితస్వశిష్యపుమర్థ చతుష్టయోత్పాదక శ్రీమేధాదక్షిణామూర్తి మహాదేవప్రసాదలబ్ధ కవితాచాతురీవిశేష రమారమణీ మనోరమాంకిత శంకరాంకితశతకోపకావ్యరత్నద్వయప్రణయన ప్రసిద్ధ శ్రీ రామకవ చాప్పయార్య దేశికోత్తమ ప్రసాదప్రచుర విజ్ఞానదీపికా నిస్తమస్తమ హృద్వీథికోల్లసదక్షరతత్త్వైక్య ప్రాప్తిసంస్ఫురదర్థసంసిద్ధమోహారూఢభావ దేహ యాత్రామాత్ర క్రియమాణ ప్రాపంచికస్వకులార్హక్రియాకలాప నాగులరామాభి ధాన సుకవీంద్రప్రణీతంబయిన శృంగారరసప్రధానకావ్యంబగు ఋశ్యశృంగ చరిత్రంబను నితిహాసము. ఇది గద్యము.

దక్షిణామూర్తి మహాదేవుఁడు స్వప్నమున సాక్షాత్కరించి "వైయాసిక భారతామ్నాయాంతర్భూతంబగు నారణ్యపర్వంబున నృశ్యశృంగుండను మహా మునిచరిత్రంబుగలదు. అది యష్టభాషావాగనుశాసనుండును, భారతాంధ్రిభాషా కల్పనలాలస మనీషావిశేషుండును నగునన్నయార్యునిచే యథోక్తంబుగా సంక్షేప రూపతఁ జెప్పంబడియె, దానినాంధ్రింబును సంస్కృతంబు నను నిరుదెఱంగుల మాటలకూటమి న్వాట మగునటుల సమగ్రంబుగఁ జతురాశ్వాసంబుల నెసఁగఁ గృతి యొనర్పు" మని యానతిచ్చుటయే యీగ్రంథనిర్మాణమునకుఁ గారణ మంట. శైలి.

చ. తనదగు రాజతంత్రతతిదాఁచు పరుల్దెలియంగలేమిచేఁ
బెనఁగెడు చిత్తవృత్తిగనఁ బెద్దయుఁ దత్కృత తంత్రసంతతిం
గొనముల సొంపుదీరఁగను గూఢచరప్రకరంబుచేఁ గనుం
గొనినటులంతయుం దెలియు గొప్పగఁ బార్థివనీతివేత్తయై.

గీ. విప్రసంబంధమబ్బుట వెలఁదిమెట్టి, పుణ్యులకునగు నే రాజపుంగవులకుఁ
దనకుఁ దానఘటించె నీతఁడిన యేక, కృతియు రెండర్థములకుఁగా నెసఁగెమనకు.

చ. రవిపరవార్ధిఁగ్రుంకి తనరక్తమయూఖము లీయఁదాల్చి వే
భువికరుదెంచు పావకు వపుఃప్రభ యీగతినాకసంబునం
దివురుచుఁ బర్వెనో యనఁగ దీటయి వాటపు సంజకెంపుడాల్
దవెఁ బరభూమిభృచ్ఛిఖరతత్పరపద్మమణిప్రభోన్నతిన్.

132. కపోతవాక్యము. గ్రం. సం. 2485.

కొప్పోలు జగన్నాథదాసమంత్రి ప్రణీతము. శిబిచక్రవర్తి చరిత్రము. రాజనీతి రత్నాకరంబను నామాంతరముగలదు. ఆఱాశ్వాసములది; మొదటి యాశ్వాసము లేదు. దీనిగద్యము.

"ఇది శ్రీమచ్ఛిరుసనగండ్లపట్టన శింశుమారగంధర్వ కాష్ఠావిరాజిత సువర్ణాహార్యధీకృతపర్వతేంద్ర సన్మందిర రామచంద్ర కరుణాకటాక్షవీక్షణాలబ్ధ కవిత్వవైశారద కొమ్మాండూరి శేషాచార్య దేశికేంద్ర చరణారవింద ద్వంద్వనిరంతర వందనాభిలాష మనీషాప్రాభవ అపస్తంబసూత్ర కౌశికసగోత్ర వేంకట నారసింహాహ్వయమంత్రి శేఖరతనూభవ, అనవరత నారాయణ ధ్యానామృతానుభవ వావిలికొలనునగరవరనివాస కొప్పోజగన్నాథదాసాభిధాన ప్రధాన ప్రణీతంబైన కపోతవాక్యంబను రాజనీతి రత్నాకరంబునందు."

ద్వితీయాశ్వాసములోని కథను జూడఁ బ్రథమాశ్వాసమునందు రామాయణములోని సుందరకాండమువఱకుఁ గల కథ వర్ణించినట్లు తెలియుచున్నది. ద్వితీయాశ్వాసమున విభీషణుఁడు రాముని శరణు చొచ్చుట మొదలుకొని రాముని పట్టాభిషేకమువఱకును వర్ణింపఁబడినది. తృతీయాశ్వాసమున రెండుకపోతములు వలలోఁ జిక్కియుండాఁడుపిట్ట చలిచే బాధపడు నెఱుకునకు నగ్నిగావించి బాధయుడిపి తా నగ్నిప్రవేశ మొనర్చిన చరిత్రము వర్ణింపఁబడినది. దీనియందే శిబిచక్రవర్తి చరిత్రముకూడ వర్ణింపఁబడినది. తక్కినవానిలో వైష్ణవసంప్రదాయములు, శ్రీరంగమహత్త్వము, కావేరీమాహాత్మ్యము మొదలగు స్థలపురాణములుగూడఁ జేర్పఁబడినవి.

శైలి తెలియుటకుఁ గొన్ని పద్యములు.

శా. లంకాపట్టము నవ్విభీషణునకు న్లాలించి యారాముఁడుక్
శంకొక్కింతయులేక గట్టుతటి భూచక్రంబున న్మింట్రిపై

సంకోచింపక మేలుమే లనెడి యాశబ్దం బపారంబునై
పంకేజాసను కర్ణమూలములఁ దాఁ బర్వె న్మహాధ్వానమై.

సీ. మొదటఁ గాంతాజనమ్ముల బాధలొందించి పరివేషమిషమునఁ బాశమూని
యుగ్రుఁబాయక యెప్పుడుండి సాంద్రజ్యోత్స్న యనునిప్పుకలుగాయవలలనేర్చి
కిరణంబులనియెడి పరివారమును బన్చి విరహిణీజనముల వెస నలంచి
దోషాటనుండను దుష్టనామముగాంచి కాలంబుకొలఁదిని గల వహించి

గీ. నట్టి నీకును నయ్యమునాగ్రజునకు, నంతరంబేది నీకంటె నతఁడెమేలు
నదియెటన్నను ధర్మాత్ముఁ డతఁడధర్మ, పరుఁడవీవెల్ల జగముల భామలకును.

ఉ. మంగళసూత్రమాదిగళమానిత వస్తువులెల్లఁజూచి యి
య్యంగన భర్తభార్యయని యాత్మల జారులు భీతిబొందిన
ట్లుంగుడు యోగ్యమైన కమలాలయ వల్లభునాయుధంబు చి
హ్నాంగని సౌరిభృత్యులు భయాకులు లౌదురు మేనకాత్మజా.

రుధిరోద్గారినామసంవత్సర కార్తీక శుద్ధ ౧౪ యిందువారం యామం ప్రొద్దు అయ్యేవఱకు కందాళ శేల్లపిళ్లాచార్యులగారి శిష్యుండైన వానమామల చాత్తనిపంతులు వెంకట పరాంకుశం గ్రంథము చెప్పినవారు వ్రాసిన ప్రతిలో చూచి వ్రాశిన కపోతవాక్యం సంపూర్ణం, అని చివరనున్నది.

## 133. ఉదాహరణపద్యములు. గ్రం. సం. 2226.

(ఈపేరు మేము పెట్టినది. గ్రంథములోఁ బేరు కనఁబడలేదు.)

ఇందుఁ బూర్వులెవ్వరో పూర్వప్రబంధములనుండి వివాహము, పంచాక్షరి, గర్భచిహ్నములు, విష్ణుస్తుతి, లక్ష్మి, సుదర్శనము, గరుత్మంతుఁడు, అర్ధనారీశ్వరము, త్రిపురవిజయము, వినాయకుఁడు, షణ్ముఖుఁడు, నందికేశ్వరుఁడు, బ్రహ్మ, నారదుఁడు, కామధేనువు, కవినుతి, వసిష్ఠుఁడు, సముద్రము, పుష్పాపచయము, చకోరవిహారము, సూర్యోదయము నిత్యాది శీర్షికలక్రింద ననేకపద్యములను వ్రాసికొని యుండిరి. ఎవరువ్రాసినదియు వ్రాయించినదియుఁ దెలియవచ్చుటలేదు. ఇంచుమించు 100 పుటలు గలవు. ఇందు, ఎఱ్ఱాప్రెగడ హరివంశము, నరసింహపురాణము, భారతము, నైషధము, భీమేశ్వరపురాణము, భాగవతము, రెడ్డిపల్లి ముద్దమరాజు అష్టమహిషీకల్యాణము, పద్యకావ్యము చందలూరి చిక్కన్న నాచికేతూపాఖ్యానము, నాచనసోముని హరివంశము, బైతరాజు ముమ్మయ్య

విష్ణుకథానిధానము, పోతరాజుభైరవుని శ్రీరంగమాహాత్మ్యము, భావన పెమ్మనం గారి అనిరుద్ధచరిత్రము, దగ్గుపల్లి దుగ్గన శివకంచి మాహాత్త్వము, కుంటము క్కల తిమ్మయ్య శైవాచారసంగ్రహము, ఆంధ్రకవిరామయ్య విష్ణుకాంచీ మహాత్త్వము, భైరవుని శ్రీరంగమహాత్త్వము, చెన్నమల్లు శ్రీగిరన్న శ్రీరంగ మాహాత్మ్యము, నిశ్శంకుని కొమ్మయ్య వీరమాహేశ్వరము, పెదపాటి సోమయ్య కేదారఖండము, పోతరాజు వీరయ్య త్రిపురవిజయము, కామకోలిని అన్నమ రాజు అమరుకము, పేరమరాజు జక్కన్న విక్రమార్క చరిత్రము అంబికా శతకము, చిమ్మపూడి అమరేశ్వరుని విక్రమసేనము, విజయసేనము, కాకమాని గంగాధరుని బాలభారతము, పోతరాజు భేతాళపంచవింశతి, నిశ్శంకల కొ మ్మయ్య, వీరమాహేశ్వరాచార సంగ్రహము, గంగరాజు చౌడన్న నందచరి త్రము, పిల్లలమఱ్ఱి వీరయ్య శాకుంతలము, పద్మపురాణము, చిరుమురి గంగరాజు కుశలవోపాఖ్యానము, కుడిచెర్ల తిప్పరాజు కాంచీమహాత్త్వము, పిల్లలమఱ్ఱి వీరయ్య పురుషార్థసుధానిధి, మంచెన కేయూరబాహుచరిత్రము, దేవరాజుభట్టు హరిశ్చంద్రకథ, అధర్వణాచార్యులు భారతము, కేతనప్రెగ్గడ కువలయాశ్వచరి త్రము, వాసిరాజు రామకవి బృహన్నారదీయము, పొన్నాడ పెద్దిరాజుప్రద్యుమ్న చరిత్రము, పురాతనచరిత్రము, ఇంద్రసేనము, పద్మకవిజినేంద్రపురాణము సోముని వసంతవిలాసము, ఆదిపురాణము, రావర ఉడిచి రాజు, పశుపతి నాగనాథుని విష్ణు పురాణము, కేతనప్రెగడకాదంబరి. సోమయాజి ఉత్తరరామాయణము, మొద లగు గ్రంథములలోని యనేకపద్యములు గలవు. ముఖ్యముగ గొన్నిపద్యం బులఁ బొందుపఱుచుచున్నారము. "వికృతిసంవత్సర శ్రావణబహుళ అమా వాస్య సోమవారము వొండుగండ్ల తిప్పయ్యగారి ప్రతిననుసరించి తిప్పరాజు ఓబన్నవ్రాసినది."

అథర్వణాచార్యుని భారతము.

సీ. రాజమండల పూర్ణరాజమండల విధిరత్నగర్భామల రత్నగర్భ
గంధర్వ గంధర్వ గంధర్వనగరంబు నాగపున్నాగ పున్నాగవనము
మార్గణ మార్గణ మార్గణ పీఠముత్తుంగ భుజంగ భుజంగ భూమి
కాంతకాంతారాతి కాంతకుంతస్థలి వీరకుమార కుమారసరసి

గీ. యనఁగఁబొగడు కెక్కు నలకాపురంబుదే, వేంద్రుపురము దానవేంద్రుపురము
శ్రేణిసేయు లలితశోణాంశు మణిబద్ధ, గోపురంబు హస్తినాపురంబు.

మ. నతనానావని నాథయూథ మకుటన్యస్తాబ్జ రాగోజ్జ్వల
ద్యుతి విభ్రాజితపాదపీఠు లలనాదోశ్చామరోద్ధూతమా
రుతలోలాలి వినీలకుంతలుఁ బ్రభారుద్ధాముఁ గేయూరశో
భితబాహాపరిఘున్ సువర్ణధరణీభృద్ధైర్యు దుర్యోధనున్.

ఇంద్రసేనము.

చ. పుడిసిటిలోన డొంకి కడుఁబొల్పరి యమ్మున నింకి చల్లినం
గడపలఁగాన వచ్చి వెసగైకొని త్రచ్చిన జోళ్లఁజొచ్చి య
జ్జడనిధి భంగపడ్డఁ గని స్రష్ట యుపాయములేని వార్ధిగాఁ
గడఁగి యొనర్చెనో యన నగడ్త పొగడ్తల నొప్పునప్పురిన్.

విక్రమసేనము.

సీ. " చూపులకట్టు పూఁదూపులచేపట్టు నబలలచూడ్కులయాయుధములు
తాయంబునకు గండుఁగోయిలఁగూయించు బాలలపలుకులు మూలమంత్ర
మెదిరికిఁ దేఁటుల నెడయాటలాడించు నబలలయలకల యాప్తబలము
సవరణలకుఁ జంద్రుఁజాలించు మగువల మొగములసేనకుఁ దగినమొగము
గీ. భావభవునకు నటుగాక బలమెబలము, గాఁగఁ దిరిగెనె పెట్లచేగాసిఁ బడఁడె
యనఁగ సౌందర్యసంపదలభినవముగ, వఱలు దురు దత్పురంబునవారసతులు.

ఉ. పూవులప్రోవులై చిలుకబోదలు కోయిలపిండుపొందలై
తావులక్రోవులై యలివితానము గానము తానకంబులై
కావను బండఁజాలుటఁ ద్రికాలముఁగల్గవరంబుఁ గన్నయ
ట్లై వనరాజి పొల్పగుఁ బురాంతికభూములనెల్లఁ జూడఁగన్.

శా. దానానేకప బృంహితస్వనము గంధర్వావలీహేషిత
ధ్వానంబున్ మృదువేదనాదమును గాంతానూపురారావమున్
గానానూనరవంబుఁ దూర్యబహుశంఖస్ఫారశబ్దంబుఁ బె
ల్లై నీరాకరఘోషమో యనఁగ నిత్యంబుం జెలంగుం బురిన్.

క. హరగిరి సురగిరి రోహణ, గిరులీనినకొదమ లనఁగ గృహములు పురి న
చ్చెరువగునకుప్యరత్న, స్ఫురణల విలసిల్లి తగిన పొడవులతోడన్.

గీ. నూఱుక్రతువులు నేయనిపాఱుటిల్లు, కోటిపడగలులేని కిరాటగృహము
జాతిరత్నంబుగాని పాషాణకులము, వెదకిచూపిన వీటఁ బన్నిదము గలదు.

మ. అది కైలాసము దిగ్విలాసము విహాయశ్చారిణీసమ్మద
ప్రదవిన్యాస ముదగ్రభాసము మరుద్వ్యామాసదాభ్యాస మ
భ్యుదయన్యాస మసన్నిరాసము మయూరోదారనిధ్వాన బి
భ్యదహివ్రాతకృతప్రవాసము త్రినేత్రావాస మురీశ్వరా.

శా. ముత్తా కేకుజముల్ నడల్చె మొగడల్మన్నే మహీజంబులం
దెత్తెం బువ్వులు నిండఁగాఁ బెరిఁగె నేయుర్విజముల్ పూపలన్
మొత్తంబై విలసిల్లె నేధరణిజంబుల్ కాయలం బండులం
జిత్తానందముఁ జేర్చె నేక్షితిజముల్ చెల్వొందఁగాఁ జెప్పుమా.

అనిరుద్ధచరిత్రము.

చ. కులకుధరావహాసి పురగోపుర శేఖరరత్నదర్పణం
బుల వలరాచపోఁడుములు పోలఁగఁజూచి తలంపుప్రాణనా
థులదెసఁ గూర్చి యంతటన తోడివయస్యలు సూడ సిగ్గునం
జెలువెసలార నుస్సురుల చిక్కులు దీర్తురు సిద్ధకామినుల్.

శా. విఘ్నధ్వాంతనిరాస వాసవపతిన్ వేదండరాజాననున్
విఘ్నాధీశ్వరునిం గపోలఫలకా విర్భూత దానచ్ఛటా
విఘ్నాళి న్నిరుపాధికాధిక కృపానిత్యోదయోపఘ్నుఁ గ్రొం
చఘ్నజ్యేష్ఠు భజింతుఁ గావ్యరచనాచాతుర్యసంసిద్ధికై.

సిద్ధనప్రెగడ శాకుంతలము.

ఉ. నీరజమిత్రుతో బయలనిల్చి చలంబున గిట్టి మై మెయిం
బోరుట దుర్లభం బనుచు భూరితమఃపటలంబు లొక్క మై
నూరెలఁగోటపట్టి పొడసూపఁగ నొక్కొ-యెదిర్చె నాఁగఁ బ్రా
కారనిబద్ధనీల మణికాంతి గనుంగొనవొప్పు నెంతయున్.

భైరవుని శ్రీరంగమహాత్త్వము.

చ. లలనలు కేళికందుకములం దెగిరాలిన హారరత్నముల్
జలధరవేళఁ బెన్వడగలం జని తత్పరిఘూతలంబులన్
వెలుఁగఁగఁ గాంచి వానిఁగడు వేడుకఁ గైకొనిపూని వింత చె
న్నొలయఁగఁ బల్మఱు న్మరియుచుందురు పన్నగరాజకన్యకల్.

బాలభారతము.

శా. ధారాపాతవిభాతి శీతకరకాంతిస్ఫారగేహంబు లీ
యారం జంద్రికమీఁదఁ బర్వనురుచుల్ వ్యాధాంబుధారాళతం
జేరం జాతకపంక్తి చిత్రములు రంజిల్లన్ మయూరంబులున్
సారస్యంబుల లాస్యముల్ మెఱయు నుత్సాహించి భూపాలకా.

రాయకవి రామయ్య కాంచీమహత్త్వము.

సీ. పడియలలోపలఁబడి యలందురుఁగాక గండుమీనము లంబకముల సరియె
పొదలుమాటుగ నేచి పొదలుట గనుఁగాక యలరుగుత్తులు కుచావలుల సరియె
గహనంబు లోనగహనమై చనుఁగాక చమరవాలములు కేశముల సరియె
ఘనముల యొద్దనఘనములై మనుఁగాక తలుకులు మించుగాత్రముల సరియె
కలువలొండెను జక్రవాకంబు లొండెఁ, దేఁటులొండెను బువ్వారుఁదీఁగలొండెఁ
గాకయనిప్రస్తుతింప నాకాంచిలోన, సతులు విలసిల్లుదురు హేమలతలువోలె.

సోమునివసంతవిలాసము.

ప్రాలేయప్రతివీరసేనఁ బఱపెన్ బైపై వసంతం బిలం
గాలోన్మీలితకోరకోదరపరాగప్రౌఢకోపాగ్నియై
హాలాపానవిహారపౌరమహిళాహంకారదోస్సారమై
హేలాపల్లవహేతిఖండితమహాహేమంతసామంతమై.

పశుపతి నాగనాథుని విష్ణుపురాణము.

ఉ. మాసర మయ్యెనంత మధుమాసము పాంథవిలాసినీజన
త్రాసము పుష్పబాణనవరాజ్యవిలాసము వల్లరీవధూ
హాసము మత్తకోకిలసమంచిత పంచమనాదమంజిమ
వ్యాసము జీవలోకహృదయంగమసౌఖ్యవికాస మెంతయున్.

అష్టమహిషీకల్యాణము.

ఉ. రామకథాసుధారసము బ్రహ్మపయోఽంబుధి మున్నియుండఁగా
నే మునివాక్యమందరమహీధరసన్మథనంబుచే సము
ద్దామత సంగ్రహించి విబుధప్రకరంబున కిచ్చె నర్థి మై
నామహితుం బ్రచేతసునియాత్మజుఁ గొల్చెద నాదిసత్కవిన్.

పిల్లలమఱ్ఱి పీరన పురుషార్థసుధానిధి.

సీ. భర్గభట్టారకుపర్యాయమూర్తికి షాణ్మాతురుని కూర్మిజనకునకును
మేషరాజము నెక్కు మేటిరౌతున కమరాధీశుపొరుగు దిశాధిపతికి
హరిణవాహనుని నెయ్యపుసంగడీనికి సామిధేనీప్రియస్వాంతునకును
యాయజూకులయిండ్లయనుఁగుఁజుట్టమునకు స్వాహాస్వధాప్రాణవల్లభునకు
దండములు పెట్టెదము మోడ్చెదముకరములు
సేవయొనరించెదము మమ్ముఁగావుప్రోవు
యాగవేదికి విచ్చేయు మారగింపఁ
బ్రథమజన్ములయింటి కల్పద్రుమంబ.

వాసిరాజు రామయ్య బృహన్నారదీయము.

సీ. వల్లికానవసముత్ఫుల్లపాటలపుష్పవల్లరీసౌరభ్యవాసితంబు
కాసారనీరజవ్యాసక్తమధుకరీఝంకారముఖరితాశాముఖంబు
పద్మాప్తకిరణప్రభావలీసంతప్యమానసర్వంసహామండలంబు
దహనహేతిచ్ఛటాదందహ్యమానదుర్గమఘోరకాంతారసముదయంబు
చటులతరనిర్భరోష్ణసంసక్తవాత, శోషితాశేషనిమ్నగాస్తోమజంతు
సంచయంబునునగుఘర్మసమయమేచి, పర్వెనతిసాంద్రమగుచుదిగ్భాగములకు.

కేతన కాదంబరి.

సీ. దీనిలోపలఁ గొన్ని దినములుండిన నుష్ణకరుఁడైన నట శీతకరుఁడు గాఁడె
దీనిపైఁ బెట్టఁగినఁ దా నంబురాశిలోఁ గాదని జలశాయి కాఁపురాఁడె
దీనితీయని నీరు దివిజులు త్రాగిచూచినఁ దమయమృతంబు చేఁదునారె
దీనితోయము తలపై నల్కినంతనె పాపాత్ములును మోక్షపరులుగారె
యనుచుఁ గొలఁకునీటి యతిశీతలత్వంబుఁ, బఱుపు పెంపుఁదీపు పావనతయుఁ
గడుముదంబుఁ బెంపఁగా వాజిపడివాఁగె, త్రాటఁదిగిచికొనుచుఁదరియఁజొచ్చె.

చవుడన్న నందనచరిత్రము.

సీ. బచ్చెనయోవాలి బంధాలమేల్కట్టు సకినలమంచంబు జమలిపఱపు
నిలువుటద్దము హరినీలంపుగద్దియ పటికంబుగిండి పొంబట్టుసురటి
పసిఁడిపావలు వెండిపడిగంబు ముత్యంపు జాలవల్లిక కెంపుసానరాయి
పవడంబు దివియగంబము వజ్రముల తట్ట మరకతమయమగు మధువు కుడక

గరగ పోఁకయొత్తు బరణి సున్నపుఁగ్రోవి, కప్పురంపుఁ బెట్టె గాజుఁగోర
తనువు నునుపుగలిగి తడియొత్తుమడుఁగులు, నాదిమైనవాని నలవరించి.

కేదారఖండము.

ఉ. కన్నియయూవుగోరు కనకంబులు గోరును దల్లి బుద్ధిసం
పన్నతఁగోరుఁ దండ్రి కులభవ్యత గోరును బంధుకోటి ప
క్వాన్నఫలాది భక్షణము లన్యులు గోరుదు రిట్లు లిన్నియుం
బన్నుగ నొక్కచో నొదవె భాగ్యము నేసితిఁ గన్య నిచ్చెదన్.

134. వీరమాహేశ్వరాచారసంగ్రహము. గ్రం. సం. 2635.

ఇందాఱవయాశ్వాసము మొదలుకొని యున్నది. ద్విపదకావ్యము. దీనిలో శంఖచక్రోత్పత్తి, మార్కండేయచరిత్రము, భృగుమహామునిశాపము, శరభావతారము, వ్యాసభుజస్తంభము ననుభాగములు గల యైదాశ్వాసములు గలవు. ఇక్కడికిది ప్రథమోల్లాసమని వ్రాసినాఁడు. కవి. పర్వతరాజు లింగన్న.

గద్యము. ఇది శ్రీగిరీశవిశ్వేశ్వరధ్యాన, విదితలోకాచార విశ్రుతజ్ఞాన
పండితారాధ్యశ్రీపాదాబ్జభృంగ, ఖండేందుధరభక్తకామ్యాంతరంగ
శివకృపాంచితగాత్ర శ్రీవత్సగోత్ర, ప్రవిమలనిగమోక్త భవ్యచారిత్ర
శైలజేశ్వరభృత్య జనభృత్యభృత్య, లీలపర్వతరాజు లింగనామాత్య
విరచితమై సర్వవేదోక్తమగుచు, ధరణి నాచంద్రార్కతారకంబగుచు
శ్రీరమ్యమై సర్వసేవ్యమై భక్తి, సారమై సన్నుతాచారమైధరణి
నమరువీరమహేశ్వరాచారసంగ్ర, హముపేరఁజెలువారు నట్టియీచరిత
మందున శంఖచక్రాయుధోత్పత్తి, నందమైతగషష్ఠమాశ్వాసమయ్యె.

సాధారణస్ఖాలిత్యము లిందును గలవు. శైలికై కొన్నిబంతులు—

నిటలాక్షుఁబలుమాఱు నిందింపనేల, యిటనెల్లసృష్టిఁ బుట్టింపరక్షింపఁ
బరమస్వతంత్రుఁడు భర్గుఁడేకాక, పరికింప మఱియొండు ప్రభుఁడెందుఁ గలఁడె
లాలితమైన కులాలకచక్ర, లీలఁద్రిప్పినయట్లు లింగాంగమూర్తి
యెల్లజగచ్చక్రమేపారఁ ద్రిప్పు, నెల్లరీతులఁజేయు నెఱుఁగవే నీవు
భృగుపత్నిఁజంపి యాభృగునిశాపమున, జగమున బహుమూల జన్మమొందుదువు
మత్స్యమై నీవునిమ్మహిఁ బాయకున్న, మత్స్యకేతనవైరి మర్దించెఁగాదె
కూర్మరూపముననుఁ గుంభినిమీఁద, దుర్మతివై యున్న ద్రుంచి యాశిరము

మహితమాశిరము కపాలికామధ్య, సహజరత్నము నేసె శంభుండు మొదల
వరహమై నీవున్న వాఁడిదంష్ట్రిములు, పెఱికి పెంపణఁచఁడే పేర్చిషణ్ముఖుఁడు
కేశవనీశిరః కేశసంచయము, ... ...
తొడరి పద్మజుతల ద్రుంచి చేఁబూని, కడునుగ్రుఁడై పోయి కాలభైరవుఁడు
వడినడ్డమైన విష్వక్సేనుఁ బొడిచి, సడలింపకున్నాఁడు శవము శూలమున.

విక్రమనామ సం॥ అధికజ్యేష్ఠ శు ౧౫ లు చందలూరి వీరన్నకు వ్రాకే
బాపిరాజు వ్రాయించిన ప్రతి.

ఇందుఁ గడపటఁ గొన్ని రెట్టమతములోని వర్షప్రశ్నములు మొదలైనవి గలవు.

135. తారకబ్రహ్మరాజము. గ్రం. సం. 2692.

ఇదియొకపద్యకావ్యము. రాధామాధవకవికృతము. గ్రంథాదిపద్యము.

శా. శ్రీరాజీవదళాక్షి కౌస్తుభమణీ సింహాసనంబెక్కి యు
ర్వ్యారూఢస్ఫుటదీప్తియుం బలెనె, పెంపార న్నభోమండలా
ధారశ్రీవిలసిల్లు విష్ణుఁడు జగత్కల్యాణచారిత్రగం
భీరుఁడా నంజయ తిమ్మమంత్రివరులక్ష్మీవంతునిం జేయుతన్.

గద్యము. ఇది శ్రీమదనగోపాల చరణకమలసేవాధురీణ సత్కళాపారీణ
కృష్ణభట్టారకపౌత్ర చింతలపూఁడి కామయప్రభుసుపుత్ర శుద్ధసారస్వత విభవ
రాధామాధవప్రణీతంబైన తారకబ్రహ్మరాజంబను మహాప్రబంధము.

ఈతిమ్మరాజువిషయ మీక్రింది విధముగా నిందుఁ దెల్పఁబడినది.

సీ. పద్మాప్తరుచిమించు పద్మరాగపురవి గూర్చిన పదక మక్కున నెలుంగఁ
బసిఁడిఁబ్రాఁతల పచ్చపట్టు పచ్చడ మొనపరివన్నెయై కటిఁ బరిఢవిల్ల
బహురత్నదీప్తులుప్రసరించు మేలుకుల్లా కిరీటము కంటె జోకగాఁగఁ
గస్తూరికాతిలకము పుష్పమాల్యంబు మిండతుమ్మెదల కామెతయొనర్ప
దండనుత్కళయవనాంధ్రి ధరణినాథు
లర్థి సేవింప రత్నసింహాసనమునఁ
గొలువుగూర్చుండుఁ గృష్ణుని చెలువుమీఱ
రాజదేవేంద్రుఁ డచ్యుత రాయవిభుఁడు.

ఉ. కుంభినిదాల్చి తానిరవుకొల్పిన యచ్యుతరాయశాసన
స్తంభము మేరుశైలముఁ బ్రతాపయశోరవిచంద్రమండలీ

సంభృతలక్షణంబనుచు సంతసమారఁగఁజూచు చందమా
జంభవిరోధిముఖ్యులు దిశావలయస్థితులౌట యేర్పడున్.

క. ఆరాయలకృపగంధా, సారము వ్రాయుచును గీర్తి సంపాదించెన్
ధీరగుణాఢ్యుఁడు కంధా, సారము నంజరుసుతిమ్మసచివుఁడు సిరులన్.

చ. తిరువళిగట్టి పాండ్య నరదేవుని బట్టముగట్టి యుత్కళే
శ్వరుఁగరుణించి మ్రొక్కినసవాయికిఁ దా నభయంబొసంగి పెం
పరుదుగఁ గీర్తిచేకొనిన యచ్యుతరాయల మంత్రిరత్నమై
తిరముగ నున్న నంజవిభుతిమ్మరుసుం దగుఁ బ్రస్తుతింపఁగన్.

వ. అమ్మహామంత్రీశ్వరుం డొక్కనాఁడు చతుస్సముద్రమధ్యభూభువన సింహా
సనాధీశ్వర సార్వభౌముండగు నచ్యుతదేవరాయల కొలువుచేసి వచ్చి నిజ
నివాసభాసురచంద్రశాలాప్రాంగణ మణిమండపంబున విజయనగరరాజధానిం
గల బంధువర్గంబును విద్వత్కవులు దిగంత రాయబారులు వంది ... ...
శ్రీవేంకటేశ్వరునకు నతాంర్వ్యప్రబంధవాక్ప్రసూనాంజలి సమర్పించుచుఁ
గీర్తిసుకృతంబులు నిర్వహించుకొనుచున్నవాఁడు ... ...

దీనికి మూలమును, "పరమభాగవతోత్తముండు ప్రయాగక్షేత్రవాసి నా
రాయణాశ్రమియను మహాయతీశ్వరుండు సంస్కృతంబున రచించె, దానిని దె
నుంగున సకలజనులకుఁ దెలియున"ట్లీకవి వ్రాసినాఁడు. శైలి—

ఉ. భారతకావ్యహార మొకభాగము నన్నయభట్టుగూర్చె ము
క్తారమణీయవాక్యములఁ దక్కినభాగము సోమయాజి సాం
పార నొనర్చె రెంటిఁ గలయ న్నవదాసుఁడు మధ్యనాయక
శ్రీరచియించె శారదధరింపఁ గవిత్రయకీర్తి మించఁగన్.

చ. పనివడి యేవిధంబునఁ దపంబొనరించెనొ లక్ష్మియాసనా
తను సుఖమూర్తి విష్ణుఁ బరతత్త్వముఁ గూడిసుఖించుచున్న ద
త్యనుపమలీల నిట్లు మనమందఱ మింతులమై రమింతు మీ
వనజదళాక్షు రాముని నవశ్యము గూడి తదర్చనారతిన్.

కృష్ణదేవరాయల కొలువులోనికి రాధామాధవ కవి వచ్చినట్లును, పెద్దనా
ర్యుఁడు నగరు వగరు పగరు తొగరు నను పదములతో రామాయణ భారత భాగ
వత పరములగు పద్యములు చెప్పుమనినఁ జెప్పినట్లును గలగాథలీరాధామాధవ
కవినిగుఱించియే యగునేమో.

## 136. హరిశ్చంద్రునికథ. గ్రం. సం. 2693.

గట్టయ్య వ్రాసిన కావ్యము.

గద్యము. ప్రజలకు వినిపించెఁ బ్రఖ్యాతిగాను, ప్రథమకవుల పాదపద్మములసేవ నిత్యము సేవించి నీతిమార్గమున, పరఁగవినుకొండపల్లి ప్రత్యక్షమందు వీరటారాజు యేలిన వినుమత్స్యపురికి, సిరిగల యాదవసింహ బిరుదుండు శ్రీపతిదయను కన్నెసిరులగోత్రుండు, బడబానలుఁడు కనకబండి కొండ పుడమిసింగమపాపపుత్రరత్నంబు, పాటిబలంపన వేగగట్టయ్య [య్య హరిశ్చంద్రుని కథ విన్నవించె.

దీనింబట్టి యీతనికులగోత్రములు కవిత్వవిషయమును స్పష్టము. ఇది యొక పాటకావలయు, ద్విపదవలెఁ గనఁబడుచున్నది. శైలికి—

ఇప్పుడు నీమాట యిదినిజంబౌను, ఇమ్మాఱుమమ్మాఱు యిల్లాలుతన్ను
నమ్మించిరోకట నడినెత్తి పగుల, గొట్టినచో గాయకాసి యున్నాది
కడుజాలియయ్యాని దైవము తనపాల దానవు అదియు
రండకూఁతురు అది రాక్షసి ఆమె, దిండుతిట్టక తల దీయకమ్రింగు
ఈమెనుగొన్న మాటెంచుకవిన్న, చావుగడంతెకాని సాగి కడముట్టనియ్యాదు.

## 137. ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య. గ్రం. సం. 2607.

ఇందు మొదట.

శ్లో॥ వందేహం సంస్కృతాద్యష్టభాషావాగనుశాసనమ్ ।
రాజరాజనరేంద్రస్య బోద్ధారం నన్నపం బుధమ్॥

అని ప్రారంభించి మూలమైదు పరిచ్ఛేదములువ్రాసి వ్యాఖ్యానాదిని—

శ్లో॥ నమస్కృత్యాన్నపాఖ్యార్యమ్ మథర్వణవిపశ్చితమ్ ।
తత్రైవాప్పకవిం చాంధ్రసూత్రవ్యాఖ్యావిరచ్యతే॥

అని వ్రాసినాఁడు. కడపటి పరిచ్ఛేదముకొనను "బాలసరస్వతీయ టీకా సహితాంధ్రశబ్దచింతామణిగ్రంథస్సంపూర్ణః.

అని యున్నది. బాలసరస్వతి యప్పకవిని స్తుతించుటెట్లు. కావున నిది యేమని వెదుకఁగా సంజ్ఞా పరిచ్ఛేదాంతమున, "దుర్భాన్వయదుగ్ధాబ్ధి సముద్భూత ద్విజరాజాశ్వత్థాభిధ విద్వన్మణికృతేవ్యాఖ్యానే సర్వంకషాఖ్యానే ఇత్యర్థో భూత్" అని యున్నది. బాలసరస్వతి సంస్కృతవ్యాఖ్య వ్రాసినట్లు ప్రతీతిలేదు,

ఈవ్యాఖ్యాన మహాబలీయమువలె విస్తరముగానుండక మూలమునకు యథా శ్రుతార్థము మాత్రమే.

"సూత్రకారాస్తు పదాదాయకారోస్తీతి వదంతిస్మ, అథర్వణాచార్యప్రభృతయః పదాదాయత్వాభావ మంగీకృత్య ఎవఁడు ఏమి యిత్యాదావజాదిపాత మంగ్యకుర్వన్ యథోత్తరంమునీనాం ప్రామాణ్యమితి సూత్రకారోక్త్యపేక్షయా వార్తికకారోక్తేర్బలవత్త్వా ద్యథాగృహ్యతే అతాప్యథర్వణాచార్యోక్తి స్తథా తస్మాత్పదాదావెకార ఏవసాధుః."

"సంబంధార్థేదిః, దివర్ణకస్యాత్. యథారాజుది బంటుది. ఇత్యాదయః."

"యుష్మదస్మదాత్మభ్యః. ఏతచ్ఛబ్దేభ్యః పరతః ద్వితి వర్ణకః దు ఇతి వర్ణకస్యాత్. నీ, నా, తా, ఇతిదేశ్య శబ్దేభ్యః పరతః ఇత్యర్థః. నాదు సొమ్ము, నీదు కీర్తి, తనదు మహిమ ఇత్యాదయః."

138. నృసింహవిలాసము. గ్రం. సం. 2616.

వీరరాఘవకవి విరచితము. మూఁడాశ్వాసముల ప్రబంధము.

గద్యము. "ఇతి శ్రీమత్కరుణాసాంద్ర రామచంద్ర కృపాలబ్ధ సారసద్గుణోపేత కృష్ణపాటికుల కలశపాథోధి హిమకరాహార్యధైర్య చొరువయార్యకుమార సంతతస్వాంతసన్నిహిత వీరరాఘవ ప్రణీతంబైన నృసింహవిలాసం బను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము." దీనివలనఁ గవికులము మొదలగునవి విదితములు.

దీనియందు నృసింహరూపుఁ డగు మహావిష్ణు వొక చెంచెతను వలచి పరిణయమయిన కథ వర్ణింపఁబడినది. శైలి—

చ. తలఁపఁగ బాల్యమాదిగను దంపతు లౌమిముఁబూజసేయు స
త్ఫల మిపు డబ్బె శ్రీహరికి దాస్యము సేసితి నీపదద్వయం
బలవడఁగంటిఁ జాలుబెడగాసెలతోఁ బనియేమి యింక నెం
దులవసియించి నన్ భయము దూరదు శ్రీనరసింహ యింక ని
శ్చలగతినేలి నీదగుప్రసాదముచే నను సాగనంపుమా.

శా. ఆలోచించినలేవు శ్రీహరికి దుర్వ్యాపారసంసారతా
వ్యాలోలప్రకృతి ప్రవాదగతు లవ్యాపారుఁ డత్యంతుఁడై
లీలామానుషవేషుఁ డౌటను జనాళిన్ మాయచేఁ గప్పి తా
జాలిం జెందినవానికై వడి వడిం జాతుర్యముం జూపెడిన్.

“ప్రమాదీచనామసంవత్సర పుష్యశుద్ధ ౨ ల సరికి వడ్లమాని వేంకట నరుసు వ్రాసుకొన్న శబరకన్యాపరిణయం. సంపూర్ణం.” అని యుండుటచే నికావ్యమునకు శబరకన్యాపరిణయమని పేరు కూడనున్నదేమో ?

### 139. అభిమన్యుకల్యాణము. గ్రం. సం. 2631.

ఇది మైదాశ్వాసములద్విపదకావ్యము. కవి శేషము చెన్నుభట్టారకుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. గద్యము.

అని యిట్లు శేషాన్వయాంబుధి చంద్రుఁడనఘ వేంకటదేశికాగ్రణిసుతుఁడు
పరమశోభన రామభద్రకారుణ్య, పరిణత కవితాప్రభావయుక్తుండు
పావనుండగు చెన్నభట్టారకుండు, గావించునభిమన్యుకల్యాణమనఁగఁ
దనరినయీద్విపద ప్రబంధమున—

ఈతనితండ్రి యగువేంకటదేశికుఁడు భట్టరాచార్యునికి రాగమ్మకును సుతుఁడు. తారాశశాంకకర్తవేంకటపతి కృష్ణయామాత్యుని కుమారుఁడు. కావున నీతఁడు నాతఁడు నొకఁడుకాఁడు. కవిత్వము బాగుగ నున్నది. శైలి—

అనుచుగురుద్రోణులర్థతత్త్వజ్ఞు, లనువొందఁ జెప్పిన నపుడు రారాజు
మోము మోపెట్టుచు ముసముసమనుచు, తామసంబునఁ బలెెఁదగవారు వినఁగ
నెఱుఁగుదు మీరివు డింతననేల, పరఁగఁబాండవపక్షపాతుల రగుట
దీవనలావంకఁ దిట్టుటీవంక, జీవనమీవంకఁ జెలిమి యావంక
మనసుండు టావంక మనుటయీావంక, తనువులీవంకఁ దాత్పర్యమావంక
నేదిదలంచిన నెదురుగావచ్చి, కాదుకాదనుచు విఘ్నములు చేసెదరు
పొండన్న నడవికిఁ బోయిరికాని, పాండునందను లింత పట్టకపడరు.
... ... ... వీచిపల్కెదరు మావెనువెంటఁ దగిలి
కులవృద్ధులమటంచు గురువులమంచు, నిలిచినచోటను నిలువంగనీరు
నెరను లెన్నుదురు మానెలవుననిలిచి, యరయంగగోముఖవ్యాఘ్రము ల్మీర
లేమును యాదవులేకీభవింప, నీమేలు మీకేల హితముగాదయ్యె.
జయసంవత్సర ఆషాఢ శు ౫ లు. వ్రాసినదినము.

### 140. సింధుమతీవిలాసము. గ్రం. సం. 2660.

ఇది యొకశృంగార రసప్రధాన మగురెండాశ్వాసముల ప్రబంధము. గోపనమంత్రి విరచితము. ఈకవితండ్రి నరసామాత్యుఁడు. తమ్ముఁడు రామమంత్రి. భారద్వాజసగోత్రము.

గద్యము. ఇది శ్రీమదాపస్తంబసూత్ర భారద్వాజసగోత్ర నరసనామాత్య పుత్ర శ్రీవేంకటేశ్వరకరుణాకలితకవితావిలాస శ్రీమత్ప్రతివాదిభయంకర వేదాంతదేశికోపదేశ విమలీకృతశిక్షిత శ్రీమదష్టాక్షరీమంత్రరాజ జపవిరాజమాన నిజహృదయకమలకర్ణికాకర సుకవిజనవిధేయ

అనుటచే బాపకానసహస్రంబు రచించిన వేదాంతదేశికాచార్యుని డగుట స్పష్టము. కవిత్వము మిగుల శృంగారముననొప్పును. మధురాపురమునం దుండు జయుం డనువానికిని సింధుమతియను నొక వేశ్యాంగనకును గలసంబంధమే యిందువర్ణింపఁబడినది. మధ్యమధ్యమున సంస్కృతశ్లోకములుఁగూడఁ గలవు. అవికవిచే రచింపఁబడినవో గ్రహింపఁబడినవో. శైలికి—

శ్లో॥ యోయంశింధుమతీవిలాసమఖిలం శృంగారసంపత్కరం
వాచామంజుద్రవీయకం సకుముదం నానావిధోద్వాహకమ్ ।
పశ్యన్సాధుజన స్సుకార్యరచనః కోవాక్షమస్వాపిచసన్
బిందుర్వాయది గీతివా బహువిధాః పాతుర్క్షమైవాయది॥

ఉ. కడుభ్రమఁ జెంది గొంకుచు వికారము నొందుచు భిన్నమూర్తియై
పొడమినవెవ్వగ న్విభుఁడు భూరిదయారహితాత్ముఁడైనఁ దా
నడరెడు పద్మినీముదితయందమునాఁ బటుసాంద్రనాదమై
కడువడిఁ గేకి సంఘము కెకారవ మంటి చెలంగె దిక్కులన్.

ప్రమోదూతనామ సం॥ శ్రావణ బ ౫ భౌమవారము సంపూర్ణముగా వ్రాయంబడెను. చందా నాగలింగము వ్రాసికొన్నది.

## 141. సరసహృదయానందము. గ్రం. సం. 2666.

ఇది మైదాశ్వాసముల పద్యకావ్యము. దీనిని రచించిన కవి వేమనారాధ్యుల పాపయ్య. ఇతనికే ములుగు పాపయ్య యనియు, వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యులనియు నామాంతరము లున్నటులు ప్రతీతి. ఈకృతి వాసిరెడ్డి వారి మంత్రియగు పొత్తూరికుశలవరామామాత్యునకుఁ గృతియీఁబడినది.

ఇందు, మోహినీరూపంబుతోనున్న విష్ణునిఁజూచి శివుఁడు మోహించుటయుఁ దరువాత వారికిఁ గాలభైరవుఁడు జనించుట మొదలగు కథలు వర్ణింపఁబడినవి. ఈకవి యీగ్రంథముకాక యింకను వేమనారాధ్యచరిత్రము మున్నుగాఁ గల కృతులనేకములు రచించెను. ఈ సరసహృదయానంద ముచ్చుపడినదేశాని

యిప్పుడెక్కడ నాగ్రంథము లభింపదు. పరిషత్తునం దున్నది మిక్కిలి ప్రాచీన ముద్రితప్రతి. ఏయంత్రాలయమున ముద్రితమో తెలియదు. ముద్రాపకులు తెలియరు. శైలి—

ఉ. ఆదరణీయమాఁగద మహాత్ములు వారియనన్యలభ్యముల్
వాదసహంబు నై తగిలివచ్చిన సౌఖ్యకరంపుటోజ యొం
డేది విచారణీయ మెద నెంచ సఖీమణి వచ్చుమేలుని
ర్వాదముగా లభించునని వస్తుగతిం గుహుఁడెంచు నంతలోన్.

గీ. ఇల్లు వెండి కొండ విల్లుబంగరుకొండ, పట్టినట్టి శివుని చెట్టఁబట్టి
నట్టియన్నపూర్ణ యఖిలలోకేశ్వరి, కన్నయింటి సిరులుగాంచి పొంగె.

ఉ. డాఁగఁగఁ జోటుఁగాంగ మకటాముసు పారడి పోతిమింకఁబై
మూఁగిరియూర్పు రాదనుచు మోడ్చుచుఁ జేతులు కొండఅందులో
నీఁగఁగ నీడ్చితెచ్చి భరియించిరి పూర్ణవసంతధారలన్
గాఁగులనెత్తి... తటకాపడి చూపరు లెల్లఁ జూడఁగన్.

గ్రంథాంతమున (ఐదాశ్వాసములకుఁబిదప) సంస్కృతశ్లోకములతో నీ గ్రంథమందలి కథయేకలదు. అది యేదేని పురాణములోనిదో లేక యీతని చేతనే రచింపఁబడినదో తెలియదు.

# చమత్కారచాటుపద్యములు.

[ఆంధ్రదేశమునందుఁ బండిత పామర సాధారణముగా నెల్లరు నీ క్రింది పద్యముల విని యే యుందురు. అనేకుల కీపద్యముల యర్థము తెలియకుండ వచ్చును. పరిషత్తునకు లభించిన యొకతాళపత్రగ్రంథములో వీనియర్థము విస్పష్టముగను ననతిదుష్టముగను బ్రమాణజుష్టంబుగ సహృదయాకృష్టంబగు నటులు వ్రాయఁబడి యున్నది. ఇట్టి పద్యంబులు సారంబుగఁ బ్రకటించుట సార్థకము కాకపోదు.]

సీ. రాజనందనరాజరాజాత్మజులు సాటి తలఁప నన్నయవేమధరణిపతికి
రాజనందనరాజరాజాత్మజులు సాటి తలఁప నన్నయవేమధరణిపతికి
రాజనందనరాజరాజాత్మజులు సాటి తలఁప నన్నయవేమధరణిపతికి
రాజనందనరాజరాజాత్మజులు సాటి తలఁప నన్నయవేమధరణిపతికి
గీ. భావభవభోగసత్కళాభావములను, భావభవభోగసత్కళాభావములను
భావభవభోగసత్కళాభావములను, భావభవభోగసత్కళాభావములను. 1.

(ఈపద్యమున గీతపాదములు నాలుగింటికిని నాలుగు సీసపాదములతో యథాసంఖ్యముగ నన్వయము) (1 వ సీసచరణము.) తలఁపన్=ఆలోచింపఁగా, అన్నయవేమధరణిపతికిన్=అన్నయవేమనృపాలునకు, (1 వ గీతచరణము) భావభవభోగసత్కళాభావములను; భావ=బుద్ధి, భవ = ఐశ్వర్యము, భోగ = వైభవము, సత్కళాభావములను=మంచివిద్యలయొక్క యతిశయము, వీనియందు, రాజనందనరాజరాజాత్మజులు సాటి; రాజనందన = చంద్రునికొడుకగు బుధుఁడును (బుద్ధికి) (ర + అజ = రాజ) ర = సమర్థుఁడగు, అజ = ఈశ్వరుఁడును, (ఐశ్వర్యమునకు) రాజ = ఇంద్రుఁడును (వైభవమునకు) ఆత్మజులు = బ్రహ్మదేవుఁడు (విద్యాతిశయమునకు) ననువీరు, సాటి = సరియగువారు.

(2 వ సీసచరణము) తలఁపన్, అన్నయవేమధరణిపతికిన్, (2 వ గీతచరణము) భావ ... భావములను, భావ = ఆయువు; భవ = ధనము, భోగ = పాలనము, సత్కళా = మంచికాంతి, వీనియొక్క, భావములను = అతిశయమునందు, రాజనందన ... సాటి; (ర + అజ + నందన = రాజనందన) ర = మనో

హారుఁడగు, అజ=ఈశ్వరుని, నందన=పుత్త్రుఁడగు కుమారస్వామి (ఆయువునకు) రాజ=కుబేరుఁడు (ధనమునకు) ర + అజ = శ్రేష్ఠుఁడగు, అజమహారాజు (పాల నమునకు) ఆత్మజులు = చంద్రుఁడు. (సతేకాళకు) సాటి = సమానులు.

(3 వ సీసచరణము) తలఁపఁ, అన్వయవేమధరణిపతికిఁ. (3 వ గీత చరణము) భావ... భావములను, భావ=ఆత్మజ్ఞానమునను; భవ=పుట్టుకయందును, భోగ=అనుభవమున, సత్కళా = మంచివిద్యలను గ్రహించుటయందలి, భావ= పద్ధతియందును (ర+అజ+నందన) ర=బంగారువంటి కాంతిగల, అజ = బ్రహ్మ యొక్క, నందన=పుత్త్రుఁడగు సనత్కుమారుఁడు (ఆత్మజ్ఞానమున) రాజ=క్షత్త్రి యుఁడు (పుట్టువున) రాజ=(ర + అ + జ) బ్రహ్మకొడుకగు వసిష్ఠుఁడు (అను భవమున) ఆత్మజులు = బృహస్పతికొడుకు కచుఁడును (విద్యాగ్రహణపద్ధతి యందు) సాటి=సమానులు.

(4 వ సీసచరణము) తలఁపఁ, అన్వయవేమధరణిపతికిఁ, (4 వ గీతచర ణము) భావ...భావములను, భావ = ఆకారము, భవ = సంసారము, భోగ = సంభోగము, సత్కళాభావములను = సౌందర్యముయొక్కరీతి, వీనియందు (ర + అజ+నందన) ర= గౌరవర్ణుఁడగు అజ = ప్రద్యుమ్నుని, నందన = కొడుకగు నని రుద్ధుఁడును, (ఆకారమున) (ర+అజ) = సర్వవ్యాపకుఁడగు విష్ణువును, (సంసార మున) రాజ = యక్షుఁడును (భోగమున) ఆత్మజులు=మన్మథుఁడును (సౌందర్య రీతికి) సాటి.

అనవేమనృపాలునకు బుద్ధియందు బుధుఁడును, నైశ్వర్యమున నీశ్వరుఁ డును, వైభవమున నింద్రుఁడును, విద్యలందు బ్రహ్మయు, ఆయువునందుఁ గుమార స్వామియు, ధనమునందుఁ గుబేరుఁడును, బాలనమున నజమహారాజును, గాంతి యందుఁ జంద్రుఁడును, నాత్మజ్ఞానమున సనత్కుమారుఁడును, జన్మమందు క్షత్రి యుఁడును, అనుభవమునందు వసిష్ఠుఁడును, విద్యాగ్రహణమునఁగచుండును, నా కారమున ననిరుద్ధుఁడును, సంసారమున సర్వవ్యాపియగు మహావిష్ణువును సంభోగ మున యక్షుఁడును సౌందర్యమున మన్మథుఁడును సమానులని తాత్పర్యము.

(పై పద్యమునకు సంబంధించిన నిఘంటుప్రమాణములు.

రాజాప్రభౌ నృపేచంద్రే యక్షేక్షత్త్రియశక్రయోః—విశ్వనిఘంటు.

రఃపుమాన్ పావకే హేమ్ని క్షయే వజ్రే శయేద్యుతౌ। గౌరవే నిపుణే లేశే—నా నార్థరత్నమాల.

రా స్త్రియాంహేమ్ని శాలాయాం ప్రశంసాయాం గతావపి—నానార్థరత్నమాల.

రఃపుమాన్ కనకేఽగ్నౌచ సమర్థేఽతిశయేబలే—శుభాంగనిఘంటు.

అజఃపితామహేవిష్ణౌ కందర్పే చైడకేషుచ—అజనిఘంటు.

అజఃపితామహేఽనాద్యా భాగేపీఠాహరేఽబ్జజే—వైజయంతీ.

అజోవిధిరజోవిష్ణు రజశ్శంభురజస్తుభః, అజా స్త్రీవార్షికోవ్రీహి రజోను చ పితామహః—ధనంజయనిఘంటు.

ఆకారో భూషణేచాద్రేఽంతఃపురేగౌరవేఽంగణే । విధివిష్ణుమహేశానకమఠేష్వబికేజ్యయోః । ప్రకాశేఽతిశయే శ్రేష్ఠే మనోజ్ఞే కారణే రణే—ఏకాక్షరనిఘంటు.

ఆకారోబ్రహ్మవిష్ణీశ కమఠేష్వంగణేరణే । గౌరవేఽంతఃపురే కేతౌ భూషణేఽంఘ్రిపుమేజ్యయోః—నానార్థరత్నమాల.

---

ఉ. వీరరసాతిరేక రణవిశ్రుత వేమనరేంద్ర నీయశం
బారభమానతారకరహారసమానము నీభుజామహం
బారభమానతారకరహారసమానము నీనికేతనం
బారభమానతారకరహారసమానము చిత్రమిద్ధరన్. 2

అర్థ. వీరరసాతిరేక = వీరరసముయొక్క అతిశయము గలిగినట్టియు, రణవిశ్రుత = యుద్ధములందుఁ బ్రసిద్ధుఁడ వగునట్టియు, వేమనరేంద్ర = వేమభూపాలా! నీయశంబు నీకీర్తి, ఆరభమానతారకరహారసమానము= ఆర= పాదరసము, భ=నక్షత్రములు, మాన = తుల (సాటి) లేని, తార = వెండి, కర=వడగండ్లు, హార=ముత్తెపుసరులు, వీనితో, సమానము=సమమగునది. నీ భుజామహంబు= నీభుజబలము, ఆర = అంగారకుఁడు, భ = అగ్ని, మాన = పవడము, తారకర = శ్రేష్ఠమగుమేరుపర్వతము, హార = బంగారము వీనితో, సమానము = సమాన మగునెట్టునికాంతిగలది. నీ నికేతనంబు= నీస్థానము (ఇల్లు) ఆర=ధనమునకు, భ = ఈశ్వరునియొక్క, మా = సంపదలవంటి సంపదలుగలవారైనను, ఆనత = నమ్రిలగు = ఆర = శత్రుసమూహములచే నీయఁబడు, కర = కానుకలకును, హా = వీణయొక్క, రస = గానమునందలి, మా=లక్ష్మికిని, ఆనము = ప్రాణపద మగునది.

తాత్పర్యము. వేమనరేంద్రా! నీకీర్తి పాదరసము నక్షత్రము వెండిమొదలగు వానివలెఁ దెల్లనై ముత్తెపు సరులవలెఁ జల్లఁగాఁ వెలుంగుచున్నది. నీదోస్సారము మేరుపర్వతమువలె నక్షీణంబై పవడము మొదలగువానివలె నెఱ్ఱగాఁ బ్రకాశించుచున్నది. (ప్రతాపమున కెఱుపుకాంతి నాలంకారికులు చెప్పిరి. దానినే యీకవిగూడ నిక్కడఁ బొందుపఱిచెను) నీశత్రులీశ్వరునివలె నైశ్వర్యబలాదులు గలవారయ్యు వారికంటెఁ గడు నధికుఁడ వగుటంజేసి నీకు విధేయులై యున్నారు. నీయింటియందెప్పుడును వీణలు మ్రోగుచుండును, నీయింట నేచోటయినను ధనమునకు గనివలె నున్నది.

వీనికి నిఘంటుప్రమాణములు.

ఆరస్తు పారదే భౌమే విత్తే వాయుసుతే రవౌ॥ శాశ్వతనిఘంటువు.

భశ్శంభౌభ్రమరే భావే శుక్రేఽగ్నౌ జలదే పుమాన్—నానార్థరత్నమాల.

భస్స్యాన్నఘూకే శుక్రేచ ... ... ... విశ్వప్రకాశిక.

మానస్తు నిస్తులే హేమ్ని విద్రుమేజ్వలనే ద్యుతౌ। చిత్తేఽభిమానే ప్రమదే విమానే పరిమాణకే—కేశవనిఘంటువు.

మానః ప్రమాణేకనకే విమానే నిద్రుమేద్యుతౌ। గర్వేప్రమాదే హృదయేనిస్తులేనికరేఽనిలే—విశ్వనిఘంటువు.

హారోహింసామతౌ హారే వాసవేకనకేఽంబరే॥ కేశవనిఘంటువు.

హారశ్శ్రేవరేవస్త్రీ ఘాతుకేహేమ్ని మౌక్తికే ... ఉత్పలమాల

తారో ముక్తాఫలే శుద్ధేరజతే కనకేఽపిచ। నక్షత్రే తరశేశ్రేష్ఠేకాంతౌరం హాసి లక్షణే దశనిఘంటు సారము.

(అన) ప్రాణనే, ధాతువు.

కరోవర్షోపలేహస్తే భానౌతటతివారిధౌ। ఉపధాయాంద్యుతౌ శ్రేష్ఠేశుండాయాం ప్రత్యయే ధనే॥ హైమనిఘంటువు.

హాత్యాగే గతి వీణయోః. నానార్థరత్నమాల.

రస = శబ్దే, ధాతువు.

ఇందిరా లోకమా- మా—అమరము.

---

ఉ. భండనభీము నిన్నెదిరి పాఱక నిల్చిన శాత్రవు ల్బృహ
న్మండలపుండరీకహరినాకనివాసులు, పాఱియు న్బ్రహ

న్మండలపుండరీకహరినాకనివాసులు, చచ్చియు న్బృహా
న్మండలపుండరీకహరినాకనివాసులు చిత్రమిద్ధరన్. 3

అర్థము. భండనభీమ=యుద్ధములందుగొప్పభయమును జేయునోకృష్ణదేవరాయా! నిన్ను, ఎదిరి = యుద్ధమున కెదురొని, పాఱక = వెనుకకుఁ బాఱి పోకుండ, నిల్చిన, శాత్రవుల్ = శత్రువులు, బృహన్మండలపుండరీకహరినాక నివాసులు, బృహత్ = గొప్పవియు, మండల=వర్తులములు నగు, పుండరీక= తెల్లని గొడుగులు గలవారును, హరి = గుఱ్ఱములందు, నాక= సుఖముగా, ని = అత్యంతమగు, వా = గమనమునకు, ఆసులు = స్థానమగువారు, (అగుదు రని యధ్యాహార్యము) పాఱినశాత్రవుల్, బృహన్మండలపుండరీక హరినాకనివాసులు, బృహత్ = గొప్పవగు, మండల = సర్పభేదములకును, పుండరీక = పులులకును, హరి= సింహములకును, నాక = స్థానమగు నడవు లందు, ని= పోఁగొట్టుకొనఁబడిన, వాసులు = బట్టలుకలవారు (అగుదురు.) చచ్చిన శాత్రవుల్, బృహన్మండలపుండరీకహరినాకనివాసులు, బృహత్ = అదనమైన (అధికమైన) మండల= ఎఱ్ఱనికాంతిగల, పుండరీక=పద్మమువంటి, హరి = సూర్యునియందును, నాక = స్వర్గమునందును, నివాసులు = ఉనికి గలవారు (అగుదురు.)

తాత్పర్యము. వెనుదిపియక నీతో యుద్ధము సేయఁదలఁచు శత్రువులు వారిధైర్య మునకు మెచ్చి నీ యిచ్చు సమస్తరాజచిహ్నములతోఁ దులలేని సంపదల నను భవింతురు. వెఱచి పాఱిపోయినవారు భయంకరములగు నడవులలోఁ గట్టు టకు బట్టలులేక బాధలనందుదురు. నీచేఁ జచ్చినవారు, సూర్యమండలము నందును స్వర్గమునందును వసింతురు. (యుద్ధములందుఁ జచ్చినవారు సూర్య మండలమును భేదించి దానియందు వసింతు రని స్మృతిసిద్ధ మగునదియే. "ద్వావిమౌ పురుషౌలోకే సూర్యమండలభేదినౌ." నిఘంటువులు :—

మండలంవర్తులేరాష్ట్రే శ్రోణేద్వాదశరాజకే। దేశేదేవాలయే బింబే స్థలేశునికదంబకే ... ... ... శాశ్వతనిఘంటు.

పుండరీకస్తు శార్దూలే దిగ్గజే సర్పపుంగవే। మునౌఛత్రేరాజభేదే కుష్ఠేక్లీబేతు పంకజే॥ ... ... దశనిఘంటుసారములోని తారపాలనిఘంటువు.

యమానిలేంద్రచంద్రార్క విష్ణుసింహాంశువాజిషు। శుకాహికపిభేకేషు హరిర్నా కపిలేత్రిషు ... ... ... అమరము.

నాకస్తు గగనేస్వర్గే వైకుంఠేభూతలేసుఖే । తారపాల నిఘంటు.
ని, ఉపసర్గ. వా, గతిగంధనయోః, ధాతువు, అస, ఉపవేశనే, ధాతువు.

ఉ. అబ్జముఖీమనోజ నరసాధిపనందన కృష్ణ నీయశం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము నీపరాక్రమం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము నీవిహాయితం
బబ్జకరాబ్జజాబ్జనయనాబ్జవిలాసము చిత్రమిద్ధరన్. 3

టీక. అబ్జముఖీ మనోజ= చంద్రునివంటి ముఖములుగల స్త్రీలకు మన్మథునివంటి వాఁడవగునట్టియు, నరసాధిపనందన = నరసరాజుకుమారుఁడవగునట్టియు, కృష్ణ ! = కృష్ణదేవరాయ, నీయశంబు= నీకీర్తి, అబ్జ+కర, అబ్జ=అమృతమును, కర = చేయునట్టి చంద్రునియొక్కయు, అబ్జజ + అబ్జనయనా = బ్రహ్మదేవుని భార్యయగు సరస్వతియొక్కయు, అబ్జ=శంఖముయొక్కయు, విలాసము = విశేషకాంతివంటి కాంతిగలది. నీపరాక్రమము, అబ్జ + కర, అబ్జ= అగ్ని, కర= చేతియందుఁగల శివునియొక్కయు, అబ్జజ= అగ్నియందుద్భవించిన కుమారస్వామియొక్కయు, అబ్జనయన = విష్ణునియొక్కయు, అబ్జ= అర్జునునియొక్కయు, విలాసము = పరాక్రమమువంటిది, నీవిహాయితంబు=నీదాతృత్వము, అబ్జ+కర=సముద్రములలో నెల్ల శ్రేష్ఠమగు సముద్రమును, అబ్జ+జ = సూర్యునివలనఁ బుట్టిన కర్ణుని, అబ్జ + నయన=నిధిని బొందిన కుబేరుని, అబ్జ= చంద్రుని, వి+ల+ఆసము= విశేషముగ, స్వీకరించుటకు, స్థానమగునది.

తా॥ ఓకృష్ణదేవరాయ ! నీకీర్తి చంద్రుఁడు, సరస్వతి, శంఖము వీనిశోభను గలిగినది. నీపరాక్రమము శివుఁడు, కుమారస్వామి, విష్ణువు, అర్జునుఁడు వీరిపరాక్రమము వంటిది. నీదాతృత, క్షీరసముద్రమును, కర్ణుని, గుబేరునిఁ, జంద్రుని మించియున్నది. ఇది చిత్రము !

దీనికై కావలసిన నిఘంటుప్రమాణములు.

అబ్జ శ్శశాంకే విజయే జ్వలనే జలజేంబుధౌ—శుభాంగనిఘంటు.
అబ్జః పద్మేర్జునేహేమ్ని మీనేచంద్రే ప్రభాకరే—అజయః.
అబ్జః పద్మేసుధాయాంచ తపనే పావకే దరే—స్కంధేచంద్రే శ్వేతవాహే సముద్రేశనకేనిధౌ, తారపాలః.

అబ్జస్సుధాయాంమిందౌచ నిధౌశక్తి ధరేఽనిలే.—ఉత్పలనిఘంటు.

అబ్జోధన్వంతరౌశంఖే శశాంకేచషడాననే—వైజయంతి.

కరోవర్షోపలేహస్తే భానౌతటిని వారిధౌ। ఉపధాయాం ద్యుతౌ క్రైష్ఠే శుండా
యాం ప్రత్యయేధనే,—హైమనిఘంటు.

నయనం లోచనే ప్రాప్తౌ జటాయామంశుకే యుగే—భాగురి.

బలిహస్తాంశవఃకరాః—అమరము.

(ల ఆదానే, అస ఉపవేశనే, ధాతువులు.)

ఈనాలుగు పద్యముల యర్థములయందు నుదాహరింపఁబడిన నిఘంటువులు కొన్ని మనవాడుకలో నున్నవి కావు. అవి యెందున్నవో.

# ఉ దా హ ర ణ ము.

[ శ్రీతిరువేంగళనాథదేవునికి, తాళ్లపాక అన్నమాచార్యుల కొమారుఁడు పెదతిరుమలాచార్యులు విన్నపముచేసినది.]

ఉ. శ్రీకరుణాకరుం డగుచు జీవులఁ దీవులఁ బ్రోచి కాచుచుం
గైకొని లోకము ల్మనిపి కర్తయు భర్తయు నైమును ల్సురా
నీకము లోకముం బొగడ నీరజజాతుని తాత యైనసు
శ్లోకుఁడు వేంకటేశ్వరుఁడు చూడఁగ నొప్పెడు బ్రహ్మ మింతకున్. 1

కళిక. మఱియు నెఱుకల కెల్ల నెల్లగు మహితహితజనకల్పభూజము
మెఱుపు లొఱపులుఁ జెలఁగు వెలుఁగుల మించుమించుల మొదలితేజము
మడుగువెడలనిచిలువచెలువము మాయఁజేయు మహానుభావుఁడు
జడధినడుమను తెరువు విరివిగ జరపి పఱపిన దేవదేవుఁడు
[illegible]ము లురులఁగ బాణప్రాణము గాచియేఁచిననాఁటి నేర్పరి
[illegible]ాఁడి బిరుదుల యసురవిసరముస్రుక్కఁ ద్రొక్కిన వేల్పుఁదీర్పరి
[illegible]డఁగ లడరెడు శయ్యనెయ్యపుభామఁ బ్రేమరమించు చెలువుఁడు
[illegible]తికి గొడుగుగఁ గేలశైలము చాఁటువీటికిఁ జేయుబలువుఁడు. 2

ఉత్కలిక. దురితవిరహితగురుఁడు వేదపుశరధినురుతరశాస్త్రవాదపు
నగము సుగుణపుగుణముఁ జుట్టుచుఁ బొగడఁదగు సత్త్వమునఁ బట్టుచుఁ
గెరలి తఱవఁగ నరుదుమీఱఁగ సురల దొరలకు నోరులూరఁగ
నందిపొడమిన యమృతసారము నందవనితానందపూరము. 3

ఉ. ఏటికి వేల్పులార చదలేటికిఁ బోయెద రిందు రండు కో
నేటికి వచ్చుఁ దీర్థచయ మేఁబదిలక్షలతోడఁగూడు ము
క్కోటియు నంచుఁ బల్కు మునికోటులమాటలు నేర్చి కీరముల్
చాటు తటాటవి న్నటన సల్పెడు వేంకటభర్తఁ గొల్చెదన్. 4

కళిక. మఱియు నెఱిఁగినబుధుల, మనసు లెనసినవాని
మెఱుఁగులకు గుఱి యైన, మేనుఁ బూనిన వాని
గొల్లెతల నిల్లెడఁగఁ, గూడి మాడినవాని

## ఉదాహరణము.

మల్లులను విల్లునటు, మట్టిఁగొట్టినవానిఁ
జక్రమున నక్రమును, జదియ నడఁచినవాని
శుక్రుఁ డొకవక్రగతిఁ, జూపఁ జోఁపినవాని
వీరుఁడగు కౌరవుని, వీడనాడినవాని
శూరుఁ డగుసీరితో, జోడుగూడినవాని 5

ఉత్కళిక. మేడెములు గూడుకొని, వాడలను దాడికొని
పుట్టలును జెట్టులును, దెట్టెలుగఁ గొట్టి చని
యాటలను బాటలను, జోటులను మాటుకొని
కలసి మెలసినవానిఁ దులసి వలసినవాని. 6

ఉ. తీఱు నఘంబు లెల్ల నిలు తీర్థము వచ్చినయంత సంపదల్
మీఱు సుఖంబుగూఱు మతిమిక్కుటమై శ్రుతి వీథిఁదూఱు వే
నూఱులు చెప్పనేల సుమనోవిభుచేఁ దిరువేంకటేశుచేఁ
జూఱలుగా వరంబు లిలఁ జొప్పడఁ గొందము రండు మానవుల్. 7

కళిక. మఱియు వఱలు సుజనభజన, మాన లేని వానిచేత
వెఱపు మఱపులేక జోఁక, విడువకడకు వానిచేత
శ్రుతులగతుల నడువనుడువఁ, జొక్కిచిక్కువానిచేత
యతులమతులఁ జెలఁగిమెలఁగు, నట్టిగుట్టువానిచేత
సగముమొగము చాయదాయఁ, జదియ నడఁచువానిచేతఁ
బొగులమగువ వలువలొలువఁ, బ్రోచి కాచువానిచేత
ఱాతినాతిఁజేసి వాసి ఱట్టు పెట్టువానిచేత
వాతజాతు పనులుగొనుచు వసుధ నెసఁగు వానిచేత 8

ఉత్కళిక. పురము లెరియ శర మనంగఁ, బరఁగి దురము పురికొనంగఁ
బగతు రగల మిగులఁ గొట్టి, నగజమగఁడు పొగడునట్టి
గెలుపునిలుపు తలఁపులెంచి, బలము చలము కలిమి మించి
జనుల మనుపు ఘనునిచేత, వనజతనుజజనకుచేత. 9

ఉ. భావజుతండ్రియై కుసుమబాణునిమామమఱంది యై చకో
రావలి మిత్రుఁగన్న యల్లుఁడునై జలరాశి నాత్మమా
యావటపత్రశయ్య నఖిలాబ్జభవాండపుగ్రుచ్చ వెట్టునం
చై విలసిల్లు వేంకటవిహారునకై నుతు లే నొర్చెదన్ 10

కళిక. మఱియును గొఱగల పుడమికి నొడికవు, మగఁడై నెగడెడు నఖిలేశునకై
కఱకఱి మెఱయ సృగాలునిఁ గాలుని, గనుఁగొనఁ బనిచెడు విజితాశునకై
కన్నుల వెన్నెల యెండయు మెండుగఁ, గాయఁగఁ జేయఁగఁ గలవిష్ణునకై
జన్నము లెన్నెడు చదువులపదవుల, సరణులఁదిరిగెడు వర్ధిష్ణునకై
జగములమగఁటిమిఁ గావఁగఁ బ్రోవఁగఁ, జాలినయేలికయగు మూర్తికినై
తగులము మిగులఁ బ్రపన్నులసన్నిధిఁ, దరలక మరగిన వరకీర్తికినై
నరులకుసురలకు ముంగిటఁ జెంగట, నమ్మినసొమ్మగు నగధీరునకై
యురమున సిరి గడుఁ జెలఁగఁగ మెలఁగెడు, నున్నతసన్నుత మణిహారునకై.

ఉత్కళిక. ధారణి భారనివారణకలనకై, శౌరవిహార విచారమనెడి కై
తవమున జవమున బవిరిదిరుగుకై, దువుకొని వివిధసవిధదానవకై
కసరుధిరసలిల మెసఁగ విసరికై, వసముగ సురవిసరమునేలినకై
లాసనివాస సతీవంద్యునకై, హాసనమున్నతబుధనంద్యునకై. 12

ఉ. కొండలవంటిసంపదలఁ గొండని వేగమె చాగ మిచ్చుచో
గండరగండఁడై పసిఁడికంబమునం బడగెత్తి యుల్లస
త్కుండలి మండలాధిపతి గోత్రవిచిత్ర నివాససౌఖ్యముల్
దండిగఁ గాంచువేల్పు వలన న్సుఖిమొందెద మెల్లకాలమున్. 13

కళిక. మఱియు గుఱుతగు గుణసుమణులు గలపతివలన
మఱుఁగు మొఱుఁగులు లేనిమానవుల గతివలన
గురువరునిగతసుతులఁ గూర్చుశూరునివలనఁ
బురహరునిపగతుఁ దెగఁ బోరు ధీరునివలనఁ
గమలమునఁ దనయుఁ గను గరుడవాహనువలన
నమితహితయువతితతి నవ్యమోహనువలన
నలువనెల వవలధ్రువునకు నొసఁగు హరివలనఁ
గలువచెలిచెలియలిని గలయు బిత్తరివలన. 14

ఉత్కళిక. తెఱఁగు లెఱుఁగనిబండి విఱిగి యొఱఁగఁగఁ జెండి
యుద్దిమద్దులవ్రాల్చి గ్రుద్దియొద్దులఁ గూల్చి
ఘాతఁ బూతనఁ జేర్చి చేతనేతులు గార్చి
యున్న వెన్ననివలన నున్నతోన్నతువలన. 15

ఉ. మానిసిదిండ్ల నెత్తి నెఱమంటల పిల్లలకత్తి వేల్పుపెం
బోనపుముద్ద నిద్దములపొల్పు దొలంకెడు సంకుగల్గు నె
వ్వానికి వానికి న్నతభవానికి వేంకటశైలశృంగస
న్మానికి భక్తిసంపదభిమానికి నేశరణంచు మ్రొక్కెదన్. 16

కళిక. మఱియు మెఱయుమంత్ర తంత్రమంత్ర ధర్మకీలకునకుఁ
జిఱుతయుఱుతభక్తిశక్తిఁ జెలఁగిమెలఁగు పాలకునకు
సోమధామనూత్న రత్నసుకర మకరకుండలునకు
సామభూమగానమాన సక్తభక్తమండలునకు
బంతిగొంతితనుజునను జుబండి నుంపుమాధవునకు
జంత యింతి గండమండి చక్కనొక్కభూధవునకు
రాజితాజికుంభికుంభరక్త సిక్తభీకరునకు
భోజరాజపుత్రిమైత్రిఁ బొదలుమెదలు శ్రీకరునకు. 17

ఉత్కళిక. భువనసువన ఫలములలమి జవనపవన బలముకలిమి
మొదలఁబొదల మరిగితిరిగి చదలతుదల కరిగిపెరిఁగి
రేపుమాపు మించిపొంచి రూపుచూపి సంచరించు
యోగరాగ కీరమునకు యాగభాగ సారమునకు. 18

ఉ. కోరిపదాఱువేలయిన కొమ్మల నెమ్మదిఁ బెండ్లియాడియుం
ధారణి బ్రహ్మచారి నని తప్పకపల్కి పరీక్షితు న్మహా
దారతఁ బ్రాణమెత్తుచుఁ బ్రతాపము మీఱఁగఁ బ్రోచుమోహనా
కారుని యందు వేంకటశిఖామణియందు మనంబు నిల్పెదన్. 19

కళిక. మఱియు శోభిగుణాభిమానియందుఁ, దఱినాభిజనుతాభిధానియందు
శతపత్రసమనేత్రశౌరియందుఁ, దతచిత్రతరగోత్రధారియందు
శతకోటిశతకోటిసారియందుఁ, గ్రతువాటిరిపుధాటికారియందు
భుజగేంద్రఘనసాంద్రభుజునియందు, రజనీంద్రరుంద్రగోవ్రజునియందు. 20

ఉత్కళిక. భువియుఁ బవనంబు, దివియు భవనంబు
రుచులు నచరంబు, ఖచరనిచయంబు
నలరు బలుసొంపు, గలుగు చెలువంపు
ధరణీధరునందుఁ, బరమగురునందు. 21

ఉ. వాలిన నీప్రభావములు వర్ణనసేయఁగరావు కీలికిన్
శూలికిఁ దమ్మిచూలికిని సోలికినున్న సురాళికిం బ్రభా
మాలికి నాకు నెన్నవసమా యసమానగుణాఢ్యధన్య గో
పాలకబాలకా నిగమభాషణ కీలక వేంకటేశ్వరా ! 22

కళిక. మఱియుఁ దఱచగుసిరు లమరుల కొసఁగెడుదాత
కఱకు విలు నెఱిపిఱుచు ఘనజనకజామాత
వెకరిసపు రక్కసుల వేచి కాంచినవాఁడ
యుక్కడర నక్కడలి యుబ్బు గెల్చిన ఱేఁడ
విదురుఁ డెదురుగఁ జేయు, విందుపొందుల జాణ
ముదురు వెదురునఁ బాట మూటగట్టిన గాణ
లేఁటిశరకోటి నెడలించి త్రుంచిన రామ
యేటినాగేఁటిఁ గదియించి చించినరామ ! 23

ఉత్కళిక. ఘనవనధి యనుపాఁదు, నను మునుఁ బలుకుప్రోదు
లలో మొలచినది మొదలు, కలిమిచలువలఁ బొదలు
ప్రమదసుమములఁ దొల్లి, యమరిన రమావల్లిఁ
జెలఁగునోయెలఁదేఁటి, కలికితనముల మేటి. 24

శా. నీ వీశుండవు నిన్నుఁ గొల్తు వరము ల్నీచేతఁ గైకొందునేఁ
గైవారం బొనరింతు నీకొఱకు సంకల్పింప నీడేఱె మ
త్సేవ ల్నీవలన న్సహాయశము నిల్చె న్నీకు నీయందు ల
క్ష్మీశ్వాల్లభ్యముఁ గంటి భక్తవరదా శ్రీవేంకటాద్రీశ్వరా. 25

ఉ. ఆరవితారకంబుగ నుదాహరణంబు రచించె భక్తి వి
స్తారతఁ దాళ్లపాకపురశాసనుఁ డన్నయతిమ్మనార్యుఁ డిం
పారఁగఁ జక్రనందకగదాంబుజధారికి శ్రీవధూమనో
హారికి వేంకటాచలవిహారికి శౌరికి నంకితంబుగన్. 26



# నలనామసంవత్సరము.

(పంచమసంపుటము)

ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికయందుఁ బ్రచురింపఁబడిన
వ్యాసములును—దత్కర్తలును.

---

# జ్యోతిశ్శాస్త్రసారము.

## విన్నపము.

కొన్నిసంవత్సరముల క్రిందట శ్రీయుత వేమూరి విశ్వనాథశర్మ ఎం. ఏ. గారి ప్రోత్సాహమున నాంధ్రసాహిత్యపరిషత్పత్రికకు హిందువుల గణితశాస్త్రమును గుఱించి యొక వ్యాసము నంపితిని. పత్రికాధిపతులు దాని నామోదించి వేర్వేఱుశాఖల గుఱించి ప్రత్యేకవ్యాసములఁ గోరినందున "ఆర్యభటీయము" "మహాసిద్ధాంతము" "లీలావతి," "బీజగణితము" "గణితసారసంగ్రహము" మున్నగు సంస్కృతగణితగ్రంథములఁ బరిశీలింపవలసి యుండెను. మొదట నాకు లభించినగ్రంథముల కన్నిటికి నాంగ్లభాషా వ్యాఖ్యానము లేనందునఁ బారిభాషిక సంజ్ఞలనుగ్రహించుటకే కొన్నివారములు గడపవలసి యుండెను. పిదప బీజగణిత క్షేత్రగణితములను గుఱించి ప్రత్యేకముగ నాంధ్రసాహిత్యపరిషత్పత్రికకు మఱి కొన్ని వ్యాసముల నంపఁ గలిగితిని. గణితమున మన యార్యులజ్ఞానమున కాశ్చర్యమందుచు జ్యోతిశ్శాస్త్రమున వారిజ్ఞానభాగమును విమర్శింపఁబూని యచ్చోటఁ గూడ వారి యప్రమేయజ్ఞాన విషయమై మఱియొకవ్యాసము నాపత్రికలోఁ బ్రకటించితిని. ఈతరుణమునఁ "త్రిలింగ" పత్రికా సంపాదకులచే జ్యోతిశ్శాస్త్రవిషయకవ్యాసములఁ గొన్ని వ్రాయుటకుఁ బ్రోత్సాహపఱుపఁబడి యొకటి రెండువ్యాసముల నాపత్రికలోఁ బ్రకటించితి. ఇట్లు విడివిడిగ వ్యాసముల వ్రాయుటకంటె నొకచిన్నగ్రంథరూపమునఁ బ్రాక్పశ్చిమసిద్ధాంతంబులందు నేనుగ్రహించినవిషయములఁ బ్రకటించిన బాగుగనుండు నని నామిత్రులు ప్రోత్సాహపఱిచినందున నాలుగు దినములలో నీపుస్తకము వ్రాసినాఁడను. దీనిలో గుణము లెవ్వియైన నుండిన వాని నామోదించి సదయహృదయులగు చదువరులు దోషములఁ దెలియఁజేసిరేని సమయము తటస్థించునపుడు వానిని సవరించువాఁడను.

ఇట్లు :
సుజనవిధేయుఁడు,
క. కృ.

తిరుపతి.

— * శాస్త్రవృద్ధి. * —

సర్వశక్తుఁడైనభగవంతునిసృష్టికి విస్మయమందుచు, మనుష్యుఁడు తన శక్తికొలఁది నా సృష్టివైచిత్ర్యముల విమర్శింపఁ బూని కొంచెము కొంచెముగ నందలి తత్త్వముల గ్రహింపఁగలిగి యున్నాఁడు. ప్రతి తత్త్వవిమర్శకుఁడు నప్పు డప్పుడు తానుగ్రహించిన తత్త్వములను గ్రంథరూపమున నిడినందున నవి యన్నియు నాయాశాఖలయందుఁ బ్రమాణశాస్త్రములుగఁ బరిణమించినవి. ఇతరశాఖలయందువలె జ్యోతిశ్శాఖ (Astronomical branch) యందుఁగూడ ననేకతత్త్వములు బయలువెడలియున్నవి.

పూర్వకాలమున నాగరకతగల దేశములలోనివారు స్వయముగనో యన్యులసాహాయ్యముననో తమకు సాధ్యమయినంతవఱకు జ్యోతిశ్శాస్త్రమున (Astronomy) బరిశ్రమపడుచుండిరి. ఇట్లు మన హిందూదేశమునఁగూడ నార్యులు స్వయముగ జ్యోతిశ్శాస్త్రమును ఋగ్వేదకాలమునుండియే యభ్యసింప నారంభించిరి. తుదకు నన్యదేశీయుల సంపర్కముచే నూతనాంశములఁ గొన్నింటిని దెలిసికొని కాలక్రమమున నీశాస్త్రమును బుంఖానుపుంఖముగ వృద్ధిపఱిచిరి. బేబిలోనీయులును, గ్రీసుదేశీయులును, చీనాదేశీయులును, హిందువులవలె స్వయముగ ననేకవిధముల నీశాస్త్రమునఁ బరిశ్రమపడుచుండిరి.

అక్కాలపువారు లోకమునంతయు దైవమయముగఁ జూచుచుఁ బ్రతివస్తువునకు నధిష్ఠానదేవత యొకటి యుండు ననియు, ఆదేవత మనుష్యునిసుఖాసుఖప్రవర్తక మనియు నెంచుచుండిరి. నవగ్రహములకు నధిష్ఠానదేవతలు కల రనియు, నీగ్రహముల సంచారములు మనుజుని కష్టసుఖములకు సూచకము లనియు దృఢముగ నమ్మి వాని సంచారతత్త్వముల విమర్శింపఁ బూనిరి. ఇట్లు చాలకాలము పరిశ్రమచేసి జ్యౌతిషమను (Astrology) మఱియొకశాఖ నేర్పఱిచిరి. జ్యోతిశ్శాస్త్రము నవలంబించి యుండుటచే నీశాస్త్రము జ్యౌతిషమనఁబడెను. జ్యౌతిషమునఁ బరిశ్రమ పడుటచే జ్యోతిశ్శాస్త్రమునఁ గూడ నప్పు డప్పుడు కొన్ని నవీనాంశములఁ గనుఁగొనఁ గలిగిరి. ఇట్లు జ్యౌతిషము (Astrology) జ్యోతిశ్శాస్త్రము (Astronomy) ఈరెండును బరస్పరసాహాయ్యమునఁ గొంత యభివృద్ధిఁ గాంచినవి. ప్రకృతము మనకు జ్యౌతిషము నిరపేక్షితము కావున జ్యోతిశ్శాస్త్రమునే విచారించెదము.

## భూమి.

ఆకృతి :—ప్రథమమున మనకు నివాసభూత మగుభూమినిగుఱించి విచారించి పిదప నన్యవిషయమై విచారించుట యుక్తము. భూమి గోళాకృతిగ నున్న దనియుఁ, దనంతటఁ దాను భ్రమించుచున్న దనియు నెల్లరకుఁ దెలిసియే యుండెను. అయిన నీ విషయమును గ్రొత్తగఁ గనుఁగొనుట మిగులఁ బ్రశంసనీయము కదా? మన దేశమున నిప్పుడు దొరకు సిద్ధాంతగ్రంథములకు (Astronomical works) ననేకశతసంవత్సరములకుఁ బూర్వమే పారాశర్యాది సిద్ధాంతము లుండినవి. ఈ సిద్ధాంతగ్రంథకర్తలకు భూమి గోళాకృతిగ నుండునని తెలిసియుండెను.

భ్రమణము :—భూమి యొకదినమున నప్రదక్షిణముగ నొక భ్రమణము (rotation round its axis) చేయుచున్న దనియు, నందుచే సూర్యచంద్ర నక్షత్రాదులు ప్రతిదినముఁ దూర్పున నుదయించి పడమట నస్తమించుచున్న వనియుఁ గ్రీస్తుశకమునకుఁ గొన్నివందలసంవత్సరములకు మునుపు గ్రీసుదేశీయ సిద్ధాంతులగు (Astronomers) పైథాగొరస్ (Pythogoras) అరిస్టార్కస్ (Aristarchus) అనువారికిఁ దెలిసియుండిన దని విమర్శకులయభిప్రాయము. మన దేశమున ననేక సిద్ధాంతులు భూమి యచలముగ నున్న దని చెప్పుచుండినను, ఆర్యభటుఁ డొక్కఁడే (క్రీ. శ. 427) యది భ్రమించుచున్న దని సోదాహరణముగ నొక్కి చెప్పియున్నాఁడు.* ఆర్యభటునకు నర్వాచీనులగు "మహాసిద్ధాంత" గ్రంథకర్త్రాదులు (క్రీ. శ. 10 వ శతాబ్దిది) కూడ నార్యభటునిమతము నవలంబింపక ప్రాచీనమతమునే యవలంబించిరి. ఇట్లు తనకు ముందువారును దన్నువెంబడించినవారును భూమి యచలమై యున్న దని యుద్ఘోషించుచుండఁ దా నొకఁడే యది భ్రమించుచున్న దని నొక్కి వక్కాణించిన యార్యభటు నేమని పొగడుదుము?

భూమి యాదిశేషుని శిరస్సుపైని, దిగ్గజముల భుజములమీఁద నున్న దనుట పౌరాణికుల యపవాదము. అది నిరాధారముగ నాకాశమున నున్న దని యనేకసిద్ధాంతులకు బాగుగఁ దెలిసియుండెను.

ప్రాచీనులలో ననేకులు భూమి బ్రహ్మాండమధ్యమున నున్న దనియు, దానిచుట్టుఁ గ్రమముగఁ జంద్ర, బుధ, శుక్ర, సూర్య, అంగారక, బృహస్పతి, శనై

---

* అనులోమగతిః నౌస్థః పశ్య త్యచలంవిలోమగం యద్వత్ ।
అచలాని భాని తద్వత్ సమపశ్చిమగాని లంకాయామ్॥

శ్చరులు తిరుగుచున్నా రనియు నమ్మియుండిరి. వీరిలోఁ గొందఱు భూమి యచల మనియు, మఱికొందఱు చల మనియు నెంచుచుండిరి. మన దేశపు సిద్ధాంతులలో నార్యభటుఁడు రెండవతరగతిలోనివాఁడు. సూర్యుఁడు మధ్యమున నున్నట్లును, వానిచుట్టుఁ గ్రమముగ బుధ, శుక్ర, భూమి, అంగారక, బృహస్పతి, శనైశ్చరాదులు తిరుగునట్లును నాధునికులయాశయము. చంద్రుఁడు గ్రహము కాదనియు, భూమి చుట్టుఁ దిరుగు నొకయుపగ్రహ మనియు (Satellite) నిప్పటి శాస్త్రజ్ఞుల యభిప్రాయము. సూర్యుఁడే బ్రహ్మాండమధ్యమున నుండునట్లు పైథాగొరస్, అరిస్టార్కసు లూహించినను, వారిమతము నవలంబించువారు లేకపోవుటచే నది వారివెనుక సుప్రసిద్ధుఁడగు "టాలమీ" (Ptolemy) యను నీజిప్టుదేశీయుని మతమునకు ముందు విలీనమై పోయెను. భూమియే బ్రహ్మాండమధ్యమున నచలమై యున్నదనియు, దానిచుట్టు సూర్యచంద్రాదులు తిరుగుచున్నా రనియు టాలమీ యభిప్రాయము. ఈమతము క్రీ. శ. 16 వ శతాబ్ద్యాదివఱకు లోకమున వ్యాపించి యుండినది. పిదప "పోలాండు" (Poland) దేశీయుఁడగు "కోపర్నికస్" (Copernicus) ఈసిద్ధాంతమును ఖండించి, సూర్యుఁడే మధ్యమున నున్నాఁడనియు, భూమియు సూర్యునిచుట్టుఁ దిరుగు గ్రహములలో నొక్కటి యనియు, సహేతుకముగ నిర్ణయించెను. ఈగ్రహము లన్నియు సూర్యుని చుట్టు నప్రదక్షిణముగఁ (బ్రాఙ్ముఖముగఁ) దిరుగుచున్న వని శాస్త్రజ్ఞులు కనుఁగొనియున్నారు.

భగణము :—భూమినుండి చూచునపుడు సూర్యబింబప్రమాణము దినదినమును మాఱుచున్నది. సంవత్సరమున కొకదినమున నది మిగుల గొప్ప దిగ నగపడుచున్నది. ఆదినమునుండి యాఱునెల లయినపిదప నొకదినమున నది మిగులఁ జిన్నదిగ నగపడుచున్నది. ఈయంశము మనసిద్ధాంతులకుఁ దెలియును. దీని నుండియే కాఁబోలు సూర్యుఁడు భూమిచుట్టుఁ బోవున ట్లగపడు సాంవత్సరికమార్గము (annual path) సమవృత్తమై యుండక (not circular) ఆయత వృత్తాకృతిగ (elliptical) నుండవలయు నని యార్యభటుఁడు తీర్మానించెను. అటు లుండుటచే సంవత్సరమున నొక్కదినము సూర్యుఁడు భూమికి మిగుల సమీపమున నుండును. ఆఱునెల లయినపిదప మఱియొక దినమున మిగుల దూరమున నుండును. సంవత్సర మంతయు సూర్యుఁ డొకరీతిగనే పోవున ట్లగపడక, సమీపమున నుండుకాలమున మిగుల వేగముగఁ బోవునట్లును, దూరమున

నుండుకాలమున మిగుల మెల్లగఁ బోవునట్లును దెలియుచున్నది. ఈవిషయములు కూడ నార్యభటాదులకుఁ దెలిసి యుండిన వని చెప్పవచ్చును.

సూర్యుఁడు భూమికి దూరముగ నుండుస్థానము "ఆపొజి" (Apogee) యనియు, సమీపముగ నుండుస్థానము "పెరిజి" (Perigee) యనియు నాంగ్ల భాషలోఁ జెప్పఁబడును. అర్థసామ్యముచేతను శబ్దసామ్యముచేతను వానిని "అపజ్య" మనియు, [జ్యాం భూమి మపక్రమ్య] "పరిజ్య" మనియుఁ, [జ్యాం పరితః] బిలిచెదము. భూమినుండి గణనము చేయునపుడే యీనామము లుపయోగింపఁబడును. సూర్యునుండి గణనము చేయునపుడు గ్రహములు సూర్యునకు దూరముగ నుండుస్థానమును ఉచ్చ మనియు (Aphelion) సమీపముగ నుండు స్థానమును నీచ మనియు (Perihelion) మనసిద్ధాంతు లనియెదరు.

16 వ శతాబ్దిమధ్యకాలములోని జోహాన్ కెప్లరు (John Kepler)అను జర్మనీదేశస్థుఁడు గ్రహములు సూర్యునిచుట్టుఁ బోవుమార్గములను స్వయముగ నూహించి నిర్ధారించెను. గ్రహమును సూర్యునికిఁ జేర్చు త్రిజ్య (radius) సమాన కాలమున సమానక్షేత్రభాగముల నిర్మించుచున్న దని గ్రహముల శీఘ్రమంద గతులచే నీతఁ డూహించెను. (The radius joining the planet to the sun sweeps out equal areas in equal intervals of time).




1. పటము.

పై పటములో సూ - సూర్యునిస్థానమును దెలియఁజేయుచున్నది. అ. ఆ. ఇ. ఈ. లు ఒక గ్రహకక్ష్యలో ననఁగా గ్రహము చలించుమార్గములో (orbit) నాలుగుచోట్ల నాగ్రహస్థితులఁ దెలియఁ జేయుచున్నవి. ఇచ్చట సూ. అ. ఆ; సూ. ఇ. ఈ; అని రెండు త్రికోణక్షేత్రము లేర్పడియున్నవి. ఈక్షేత్రఫలములు, అనఁగా విస్తీర్ణములు (areas) సమముగ నున్న వని యెంచెదము. ఈక్షేత్రములలో నౌన్నత్యవ్యత్యాసము (difference of altitudes) కాన్పించుచున్నది.

అందుచే నీక్షేత్రములకు భూవ్యత్యాసము (difference of the bases) లుండ వలయును. ఔన్నత్య మధిక మయినచో భూమి (base) స్వల్పముగను, నౌన్న త్యము స్వల్ప మయినచో భూమి యధికముగ నుండవలయును. కావున సూ. అ. ఆ. యనుక్షేత్రమున నౌన్నత్య మధికమగుటచే దాని భూమి (అ. ఆ.) స్వల్ప ముగను సూ. ఇ. ఈ యనుక్షేత్రమున నౌన్నత్యము స్వల్ప మగుటచే దాని భూమి (ఇ. ఈ) యధికముగ నుండవలయును. ప్రస్తుతగ్రహము అ. ఆ ; ఇ. ఈ ; యను భూములను సమకాలమున నతిక్రమించినయెడల ఆ. అ. ను నతిక్రమించు నపుడు మందగమనముగను, ఇ. ఈ. ని నతిక్రమించునపుడు శీఘ్రగమనముగ నుండవలయును. ప్రకృతము గ్రహము లాలాగున మందశీఘ్రగమనములఁ గలిగి యుండుటచేఁ బైని నిర్వచించినతత్త్వము సాధువుగ నుండవలయు నని కెప్లరు మహాశయుఁడు నిర్ణయించెను.

ఆంగ్లేయగణితానుసారముగ భూమి కుచ్చకాలము జూలై 1 వ తేది య నియు, నీచకాలము డిసెంబరు 31 వ తేది యనియు గ్రహించునది.

క్రిందఁ జెప్పఁబడు పారిభాషికసంజ్ఞల నీపటము సూచించును.

2. పటము.

[అపమండలము లేక క్రాంతిమండల మనునది సూర్యునిసాంవత్సరిక మార్గము ; విషువద్వృత్తము దక్షిణోత్తరధ్రువముల మధ్యనుండునది ; అనఁగా వాని నుండి 90° దూరమున నుండునది.]

అక్షస్థితి:—సంవత్సరమున భూలోకములో నచ్చటచ్చట దివారాత్రములయందు వ్యత్యాసము లున్న వని పూర్వికసిద్ధాంతులకుఁ దెలియును. ఒకప్పు డుదయించినసూర్యుఁడు సురాసురాలయములలో (at the north and south poles) నాఱునెలలవఱకుఁ బ్రకాశించుచుండు ననియు, సురలదినమున నసురుల రాత్రి యనియు, నసురుల దినమున సురలరాత్రి యనియు, మేషరాశి మొదలు కన్యారాశివఱకు సూర్యుఁడు విషువద్రేఖకు, అనఁగా భూమధ్యరేఖకు (equator) నుత్తరమున నుండు ననియుఁ, దులారాశిమొదలు మీనరాశివఱకు విషువద్రేఖకు దక్షిణమున నుండు ననియు మనసిద్ధాంతులు కనుఁగొనియుండిరి. ఈయంశములనే పర్యాయముగ విషువద్రేఖలో అక్షోన్నతి (elevation of the earth's axis) తెలియు దనియు, విషువద్రేఖనుండి యుత్తరధ్రువము (north pole) వైపునఁ బోవునపుడు క్రమక్రమముగ ధ్రువనక్షత్రము (pole star) ఆకసమున కెగయుచుండు నట్లును, నక్షత్రమండలి క్రిందికి దిగుచుండునట్లు నగపడుచుండు ననియుఁ గూడఁ జెప్పుచువచ్చిరి. అందుచే భూమ్యక్షము (Axis of the earth) ధ్రువనక్షత్రదిశనేయెల్లప్పుడు సూచించుచుండు నంశము వీరలకు బాగుగఁ దెలియు నని చెప్పనగును. భూమ్యక్షము క్రాంతిమండలము (ecliptic) వైపునఁ గొంత వ్రాలియున్న దని యిప్పటిశాస్త్రజ్ఞులు కూడ నమ్మియున్నారు. అట్లు వ్రాలి యుండుటచే సుమారు $66\frac{1}{2}$ డిగ్రీల పరిమితిగల కోణము భూమ్యక్షక్రాంతిమండలములమధ్యమున నేర్పడుచున్నది. భూమ్యక్షమునకును విషువద్వృత్తమునకును మధ్యమునఁ గోణము 90 డిగ్రీ లుండును. అందుచే విషువద్వృత్తమునకును (equator) అపమండలమునకును (ecliptic) మధ్య $23\frac{1}{2}°$ పరిమితిగల కోణము కాన్పించుచున్నది. అపక్రమమండలమును (ecliptic) నిరక్షరేఖయు (equator) నిట్లు పరస్పరమును రెండు సమభాగములుగ విభజించుచున్నవి. కావున సూర్యుఁడాఱునెలలు విషువద్రేఖకు (equator) నుత్తరమునను, మఱి యాఱునెలలు దక్షిణమునను బోవుచుండునట్లు కాన్పించును. ఉత్తరమున $23\frac{1}{2}$ డిగ్రీలు వఱకును, దక్షిణమున నాదూరమునను మాత్రమే సూర్యుఁ డపక్రమించున ట్లగపడును.

భూమి సూర్యుని కుత్తరమున నుండెనేని యుత్తర ధ్రువమున (about the north pole) దీర్ఘరాత్రియు దక్షిణధ్రువమున (about the south pole) దీర్ఘదినము నుండును. ఆసమయమున భూమియొక్క నిరక్షరేఖ కుత్తరభాగములలో

అందుచే నీక్షేత్రములకు భూవ్యత్యాసము (difference of the bases) లుండ వలయును. ఔన్నత్య మధిక మయినచో భూమి (base) స్వల్పముగను, నౌన్నత్యము స్వల్ప మయినచో భూమి యధికముగ నుండవలయును. కావున సూ. అ. ఆ. యనుక్షేత్రమున నౌన్నత్య మధికమగుటచే దాని భూమి (అ. ఆ.) స్వల్పముగను సూ. ఇ. ఈ యనుక్షేత్రమున నౌన్నత్యము స్వల్ప మగుటచే దాని భూమి (ఇ. ఈ) యధికముగ నుండవలయును. ప్రస్తుతగ్రహము అ. ఆ; ఇ. ఈ; యను భూములను సమకాలమున నతిక్రమించినయెడల ఆ. అ. ను నతిక్రమించునపుడు మందగమనముగను, ఇ. ఈ. ని నతిక్రమించునపుడు శీఘ్రగమనముగ నుండవలయును. ప్రకృతము గ్రహము లాలాగున మందశీఘ్రగమనములఁ గలిగి యుండుటచేఁ బైని నిర్వచించినతత్త్వము సాధువుగ నుండవలయు నని కెప్లరు మహాశయుఁడు నిర్ణయించెను.

ఆంగ్లేయగణితానుసారముగ భూమి కుచ్చకాలము జూలై 1 వ తేది యనియు, నీచకాలము డిసెంబరు 31 వ తేది యనియు గ్రహించునది.

క్రిందఁ జెప్పఁబడు పారిభాషికసంజ్ఞల నీపటము సూచించును.




2. పటము.

[అపమండలము లేక క్రాంతిమండల మనునది సూర్యునిసాంవత్సరిక మార్గము; విషువద్వృత్తము దక్షిణోత్తరధ్రువముల మధ్యనుండునది; అనఁగా వాని నుండి 90° దూరమున నుండునది.]

అక్షస్థితి :—సంవత్సరమున భూలోకములో నచ్చటచ్చట దివారాత్రములయందు వ్యత్యాసము లున్న వని పూర్వికసిద్ధాంతులకుఁ దెలియును. ఒకప్పు డుదయించినసూర్యుఁడు సురాసురాలయములలో (at the north and south poles) నాఱునెలలవఱకుఁ బ్రకాశించుచుండు ననియు, సురలదినమున నసురుల రాత్రి యనియు, నసురుల దినమున సురలరాత్రి యనియు, మేషరాశి మొదలు కన్యారాశివఱకు సూర్యుఁడు విషువద్రేఖకు, అనఁగా భూమధ్యరేఖకు (equator) నుత్తరమున నుండు ననియుఁ, దులారాశిమొదలు మీనరాశివఱకు విషువద్రేఖకు దక్షిణమున నుండు ననియు మనసిద్ధాంతులు కనుఁగొనియుండిరి. ఈయంశములనే పర్యాయముగ విషువద్రేఖలో అక్షోన్నతి (elevation of the earth's axis) తెలియ దనియు, విషువద్రేఖనుండి యుత్తరధ్రువము (north pole) వైపునఁ బోవునపుడు క్రమక్రమముగ ధ్రువనక్షత్రము (pole star) ఆకసమున కెగయుచుండు నట్లును, నక్షత్రమండలి క్రిందికి దిగుచుండునట్లు నగపడుచుండు ననియుఁ గూడఁ జెప్పుచువచ్చిరి. అందుచే భూమ్యక్షము (Axis of the earth) ధ్రువనక్షత్రదిశనే యెల్లప్పుడు సూచించుచుండు నంశము వీరలకు బాగుగఁ దెలియు నని చెప్పనగును. భూమ్యక్షము క్రాంతిమండలము (ecliptic) వైపునఁ గొంత వ్రాలియున్న దని యిప్పటిశాస్త్రజ్ఞులు కూడ నమ్మియున్నారు. అట్లు వ్రాలి యుండుటచే సుమారు $66\frac{1}{2}$ డిగ్రీల పరిమితిగల కోణము భూమ్యక్షక్రాంతిమండలములమధ్యమున నేర్పడుచున్నది. భూమ్యక్షమునకును విషువద్వృత్తమునకును మధ్యమునఁ గోణము 90 డిగ్రీ లుండును. అందుచే విషువద్వృత్తమునకును (equator) అపమండలమునకును (ecliptic) మధ్య $23\frac{1}{2}°$ పరిమితిగల కోణము కాన్పించుచున్నది. అపక్రమమండలమును (ecliptic) నిరక్షరేఖయు (equator) నిట్లు పరస్పరమును రెండు సమభాగములుగ విభజించుచున్నవి. కావున సూర్యుఁడాఱునెలలు విషువద్రేఖకు (equator) నుత్తరమునను, మఱి యాఱునెలలు దక్షిణమునను బోవుచుండునట్లు కాన్పించును. ఉత్తరమున $23\frac{1}{2}$ డిగ్రీలు వఱకును, దక్షిణమున నాదూరమునను మాత్రమే సూర్యుఁ డపక్రమించున ట్లగపడును.

భూమి సూర్యుని కుత్తరమున నుండెనేని యుత్తర ధ్రువమున (about the north pole) దీర్ఘరాత్రియు దక్షిణధ్రువమున (about the south pole) దీర్ఘదినము నుండును. ఆసమయమున భూమియొక్క నిరక్షరేఖ కుత్తరభాగములలో

సూర్యుని కభిముఖ మైనప్రదేశమునకంటెఁ బరాఙ్ముఖ మైనప్రదేశ మధిక మగుటచేఁ బగటికంటె రాత్రి దీర్ఘతరముగను, దక్షిణభాగములలో సూర్యుని కభిముఖ మైనప్రదేశమునకంటెఁ బరాఙ్ముఖ మైనప్రదేశము స్వల్ప మగుటచే నచ్చోట రాత్రికంటెఁ బగలు దీర్ఘతరముగ నుండును. భూమి సూర్యునికి దక్షిణమున నుండెనేని యుత్తరధ్రువమున దీర్ఘదినమును దక్షిణధ్రువమున దీర్ఘరాత్రియు నుండును. ఆసమయమున నిరక్షరేఖ కుత్తరమున రాత్రికంటెఁ బగలు దీర్ఘతరముగను, దక్షిణమునఁ బగటికంటెఁ రాత్రి దీర్ఘతరముగ నుండును. భూమి సూర్యునికిఁ దూర్పు పడమర దిక్కులలో నుండె నేని భూలోకమున నెల్లెడలను రాత్రియుఁ బగలును సమముగ నుండును. దినరాత్రిదైర్ఘ్యమున నీమార్పులు భూమ్యక్ష ముత్తరాభిముఖముగ వ్రాలి యుండుటచేఁ గలుగుచున్నవి. అది వ్రాలియుండక తిన్నగ నుండెనేని భూలోకమున నెచ్చోటనైన నెల్లప్పుడును దివారాత్రములు సమముగనే యుండియుండును. ఇవి యన్నియు నీ క్రిందిపటముచే విశదమగును.




3. పటము.

భూమి సూర్యునికి దక్షిణమున నుండెనేని (భూ 1.) యాసమయమున భూమ్యుత్తరభాగమున నుండు మనకు సుమారు జ్యేష్ఠమాస మగును; తూర్పున నుండెనేని భాద్రపదము; ఉత్తరమున నుండెనేని మార్గశిరము; పడమటనుండెనేని ఫాల్గునము, అనియు నీలాగున నూహించునది. ఇచ్చట జ్యేష్ఠమాసమున

భూమికిని సూర్యునికిఁ గలయంతరము సంవత్సరములో నితరమాసములఁ గల యంతరములకంటె నధికతమము; మార్గశిరమాసమునఁ గలయంతర మల్పతమ మనియుఁ జదువరు లింతవఱకే యూహించి యుండవచ్చును.

ఆంగ్లేయగణితమున సుమారు మార్చి 21 వ తేది సూర్యుఁడు విషువ ద్రేఖకు దక్షిణముననుండి యుత్తరమునకును, సెప్టెంబరు 23 వ తేది యుత్తరమున నుండి దక్షిణమునకును మాఱున ట్లగపడును. ఆదినములలో నాతఁడు విషువ ద్రేఖమీఁదుగాఁ బోవునట్లు కాన్పించును. విషువద్రేఖలోని యాస్థలముల కయ నము లనిపేరు. (equinoxes) ఇచ్చోట్లులనే విషువద్రేఖయు నపక్రమమండల మును సంధించును.

అయనచలనము :—ఈ యయనము లతిమందముగఁ బ్రదక్షిణామై చలిం చుచున్న వని యిప్పటి శాస్త్రవేత్తలు నమ్మి యున్నారు. మనసిద్ధాంతులలో నార్యభటాదులకు నీయయనచలనము (precession of the equinoxes) తెలిసి యుండెను. అయనము లిట్లు వెనుకకుఁ బోవుచుండినయెడల సుమారు 26,000 సంవత్సరములలో నొకపూర్ణభ్రమణము చేయఁగలవు. ఈ యయనచలనము క్రీ. శ. ముందు రెండవశతాబ్దిలో గ్రీసుదేశీయుఁ డగు హిప్పారఖస్సునకుఁ (Hipparchus) దెలిసియుండె నని పాశ్చాత్యులు చెప్పుచున్నారు. దీనిని గుఱించి ముందు సవిస్తరముగఁ జర్చింపఁబోవుచున్నాఁడను.

భూప్రదక్షిణము :—భూమి దినమున నొకభ్రమణముఁ జేయుచుండు టచే భూమిచుట్టుఁ బ్రాఙ్ముఖముగనో పశ్చిమముఖముగనో తిరిగివచ్చినవారల దినసంఖ్యలలో నొక్కదినము వ్యత్యాస ముండునట్లు తోఁచును. ప్రాఙ్ముఖ ముగఁ బోవువారి కొక్కదిన మధికమయినట్లును, బశ్చిమముఖముగఁ బోవు వారి కొక్కదినము తగ్గినట్లును గాన్పించును. తూర్పున నుండుదేశములలోఁ బశ్చిమమున నుండుదేశములకంటెఁ బూర్వపూర్వము సూర్యోదయాదు లగు చుండును. కావున నొకదేశము విడిచి తూర్పునఁ బోవుచుండు వారికిఁ దమదేశ ములో కంటె ముందుగ సూర్యోదయ మగును. అందుచే నొక సూర్యోదయ మున నొకదేశము విడిచి ప్రాఙ్ముఖముగఁ బోవుచుండు వారికి 24 గంటలకు మునుపే మఱియొక సూర్యోదయ మగును. సూర్యోదయాది సూర్యోదయాంత మాయాత్రికు లొకదినముగ గణించుచుండుట చేతను, క్రమక్రమముగ బయలు

దేఱిన చోటులనుండి ప్రాఙ్ముఖ మగుదేశములలో సూర్యోదయకాలము శీఘ్రతరముగ సంభవించుచుండుట చేతను, ప్రయాణము పూర్తియగుకాలమున వీర లొక్కదిన మధిక మయినట్లు గణింతురు. ఒకపూర్ణభ్రమణములో సూర్యోదయకాలవ్యత్యాసముల మొత్త మొక్క దినము. అట్లే పశ్చిమమునఁ బోవు వారికి దినదినమును బ్రయాణకాలమున సూర్యోదయసమయము 24 గంటల కధికముగా సంభవించుచుండుటచే మొత్తమునఁ బ్రయాణాంతములో నొక్కదినము తగ్గినట్లును గనఁబడును. వస్తుతత్త్వమున నాయాచోట్లకుమాత్రము వ్యత్యాసము లెవ్వియు లేవు.

పరిమాణము:—భూమండలపరిమాణమును విచారించుచు నార్యభటుఁడు భూవ్యాసము (diameter of the earth) 1050 యోజనము లని వ్రాసి యున్నాఁడు. యోజన మనఁగ $7\frac{1}{2}$ మైళ్లు. కావున 1050 యోజనములకు 7875 మైళ్లు. ఇప్పటి సిద్ధాంతులయభిప్రాయము నించుమించుగ నిదియే.

ఆకర్షణశక్తి:—భూమిపైఁబడువస్తువులు భూమిచే నాకృష్టములై యట్లు పడుచున్న వని 17 వ శతాబ్దిలో "న్యూటన్" మహాశయుఁడు కనుఁగొని యాయాకర్షణశక్తి (gravitation) ప్రమాణమును నిర్ణయించుమార్గమునుగూడఁ జెప్పియున్నాఁడు. ఈయాకర్షణశక్తిని 12 వ శతాబ్దమున భాస్కరాచార్యుఁ డూహించి యున్నాఁడు.

## → సూర్యుఁడు. ←

ప్రాముఖ్యము:—మనప్రపంచములోని తేజోమూర్తులలో సూర్యుని ప్రాముఖ్య మెల్లరకుఁ దెలిసినదియే. సృష్ట్యాదినుండియు మనుష్యుఁ డీయంశమును గ్రహించి యున్నవాఁడు. సూర్యుఁడే జీవకోటులకు నాధారమయినవాఁడు. సూర్యుఁడు లేనిచో మనభూమండలము నివాసయోగ్యము కానేరదు. అందుచే సూర్యుఁడు "జగచ్చక్షువు" "దినమణి" ఇత్యాది గుణగ్రామసంవాదు లగు నామములచేఁ బిలువఁబడుచున్నాఁడు. సూర్యుఁడు భగవత్స్వరూపుఁ డని మన శాస్త్రము లుద్ఘోషించుచుండుట కిదియ కారణము. ఇట్లు ప్రాముఖ్యము వహించిన సూర్యునిఁ బ్రపంచమధ్యమున నిడక, భూమి నచ్చోట నిడి దానిచుట్టు సూర్యుఁ డొకసామాన్యగ్రహమువలెఁ దిరుగుచున్నాఁ డని మనయార్యులు చెప్పుచుండినది వారికి భూమియందుఁ గలయభిమానమును దేటపఱుచుచున్నది.

సూర్యకుటుంబములో (Solar system) నన్య సాహాయ్యమునఁ దేజరిల్లు మూర్తము (body) సూర్యబింబ మొక్కటియే. చంద్రబింబాదిమూర్తములు సూర్యునిప్రకాశముచేతనే వెలుఁగుచున్నవి.

స్వరూపాదివిచారము :—పూర్వకాలమున నాయాదేశముల లోనఁ గొందఱు సిద్ధాంతులు సూర్యమండలస్వరూపాదులఁగూర్చి విచారింపఁదొడఁగిరి. కొందఱు సూర్యమండల మొకగొప్ప యగ్నిగోళముగ (Sphere) నుండవలయు నని యూహించిరి. మఱికొందఱు దాని ప్రమాణమును, దానికిని భూమికినిఁ గలయంతరమును విచారింపఁబూనిరి. గ్రీసుదేశమున క్రీ. శ. మునుపు నాల్గవశతాబ్దిలో అనెక్సగోరసను సిద్ధాంతి సూర్యమండలము విస్తారమున సుమారు గ్రీసుదేశమంతపెద్దదిగ నుండవచ్చు నని తలఁచెను; అతనివెనుక క్రీ. శ. మునుపు మూఁడవశతాబ్దిలో అరిస్టార్కస్సు సూర్యునికిని భూమికినిఁగలయంతరమును నొకవిధమున నిర్ధారించెను గాని యవి తథ్యమైనవి కావు.

ప్రస్తుతము గణితశాస్త్రజ్ఞులు సూర్యునకును భూమికినిఁ గలదూరము సుమారు 930 లక్షల మైళ్లుండవచ్చు నని నిర్ణయించి యున్నారు. సూర్య భూమండలముల పరస్పరపరిమాణతారతమ్యములఁ జర్చించి సుమారు 15 లక్షల భూమండలములు చేరిన నొక్కసూర్యమండల మగు నని యాధునికు లభిప్రాయపడుచున్నారు. సూర్యమండలవ్యాసము, అనఁగా మధ్యము కొలత (diameter of the Sun) సుమారు 850,000 మైళ్లు. సూర్యమండల మింత గొప్పదై యున్నను, దానిభారము సుమారు 3 లక్షల భూమండలములభారముకంటె నధికముగ నుండ దని యూహించుచున్నారు. అందుచే సూర్యుఁడు ఘనీభూతమైన యగ్నిపిండము కా దనియు, జాజ్వల్యమాన మైన ధూమమయుఁడుగనే యుండవలయు ననియుఁ దీర్మానించి యున్నారు. ఈధూమము (Vapour) భూలోకమున మనకుఁ దెలిసిన ధూమములవలె బరమాణువులకుఁ బరస్పరసామీప్యము లేక యుండక, తనపరమాణువులలోఁ బరస్పర మొక యనిర్వాచ్యసంబంధవిశేషముఁ గలిగియుండవలయు ననియుఁ దీర్మానించియున్నారు.

కళంకములు :—దూరదర్శినీయంత్ర (Telescope) సాహాయ్యమున సూర్యునిఁ జూచితిమేని యందు నల్లని కళంకములు కొన్ని కానవచ్చును. ఇవి చంద్రకళంకమువలె స్థిరాకృతులు కావు. ఒకప్పు డుండునవి మఱి యొకప్పుడు లేకపో

వును, కొన్నివేళల నవి సూర్యబింబమున స్థానాంతరమునకు మాఱిన ట్లగపడును. ఈకళంకమును మొట్టమొదట నిటాలియాదేశీయుఁడగు "గాలిలియో" (Galileo) క్రీ. శ. 16 వ శతాబ్దిలోఁ దన దూరదర్శిని సాహాయ్యమునఁ గనుఁగొనఁ గలిగె నని పాశ్చాత్యవిద్వాంసులు చెప్పుదురు.

వాల్మీకిరామాయణములో యుద్ధకాండమున ననేక స్థలముల శ్రీరాముఁడు లక్ష్మణునితో "సూర్యబింబమునఁ గళంకమొకటి కాన్పించుచున్నది; మహానర్థము జరుగఁబోవుచున్నదేమో?" యని చెప్పినట్లు వ్రాసియున్నది. * సూర్యబింబమునఁ గళంకము లప్పు డప్పుడు మాత్రము విశదముగ నగపడు నని యు, నితరసమయములందుఁ గానరాక యుండవచ్చు ననియు శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. సుమారు 11 సంవత్సరముల కొకపర్యాయ మివి మిగుల గొప్ప విమై క్రమముగ క్షీణించుచున్న వనియుఁ గూడఁ జెప్పుచున్నారు. కావున యంత్రసాహాయ్యములేని చక్షువులకు నపురూపముగ నివి యగపడు నని ఫలితాంశము. పూర్వకాలమున ధూమకేతువులు, గ్రహణములు మొదలైనయపురూపపు దర్శన మనిష్టావహ మని జనులు భయమందుచుండిరి. కావుననే యపురూపముగ నగపడు సూర్యకళంకమును గూడ నీగోష్ఠినిఁ జేర్చియుందురు. అందువల ననే రామాయణములోని వాక్యమున నీకళంకదర్శనము దేశానర్థకర మని యున్నది.

ఇచ్చట రామాయణశ్లోకములోని సూర్యకళంకము ప్రస్తుత మాధునికులు చెప్పునట్టిదియు, "గాలిలియో" నిర్ధారించినట్టిదియు నగు సూర్యకళంకము కాదనియు, నది శుక్రబింబము భూమికిని సూర్యునకును మధ్యనుండు కాలమున నాశుక్రబింబచ్ఛాయయే యైయుండు ననియు (Transit of Venus across the Sun) నాక్షేపము కలుగవచ్చును. అట్లు శుక్రబింబచ్ఛాయయే యగునేని యది స్వల్పకాలమువఱకే యుండును. రామాయణయుద్ధరంగమున రెండుమూఁడు చోట్ల నుండుటచే నది సూర్యబింబస్వాభావికకళంకమనియే చెప్పవలయును.

ఈకళంకములు సూర్యబింబమున నేర్పడియున్న కొన్ని మహాగుహాలని చెప్పుచున్నారు. ఒక్కొక్క గుహాలో మన భూమివంటి యనేకలక్షల భూములు పట్టునంత స్థలమున్న దఁట. ఇవి సూర్యమండలములోనఁ బరమాణువు లెన్నియో

* "ఆదిత్యే విమలే నీలం లక్ష్మ లక్ష్మణదృశ్యతే"॥ యుద్ధకాండము, 23 వ సర్గ.
"ఆదిత్యమండలే నీలం లక్ష్మ లక్ష్మణ దృశ్యతే"॥ " 41 "

శక్తులచేఁ (Forces) బరస్పర మాకృష్టములై యతివేగమున నిటునటు పరుగిడు చుండుటచే నేర్పడుచున్నవని యొక సిద్ధాంతి నమ్ముచున్నను, అనేకులుమాత్రము వాని తత్త్వము లింకను బాగుగఁ దెలియవనియే యభిప్రాయ పడుచున్నారు. ఛాయాపట (Photography) సాహాయ్యమున నిప్పుడీకళంకప్రతిమల ననేక నక్షత్రశాలలలోఁ (Observatories) బ్రకటించియున్నారు.

సమగ్రబింబము:—సాధారణముగ మన దృష్టికి నగపడు వర్తుల బింబమే (Circular disc) సమగ్రసూర్యబింబము కాదు. ఈవర్తులబింబమునుండి నలు దిక్కులఁ జక్రాకారపంక్తులవలె లక్షలకొలఁది మైళ్లదూరమున వ్యాపించియుం డుశాఖలున్నవి. ఇవి సంపూర్ణ సూర్యగ్రహణమున సూర్యునితేజస్సు మఱుఁగు పడినప్పుడు విశదముగఁ గాన్పించును.

ద్రవ్యములు:—సూర్యబింబములోని ద్రవ్యములలో (Elements) ననేక ముల నిప్పుడు శాస్త్రజ్ఞు లూహింపఁగలిగి యున్నారు. రశ్మివిభాజనీ యంత్ర (Spectroscope) సాహాయ్యమున నాయాద్రవ్యజ్వాలల విభజించి పరీక్షఁజేసి యీ నిర్ధారణముఁ జేయుచున్నారు. సూర్యమండలములోని యనేకద్రవ్యములు మన భూమిలోఁ గూడ నున్నవి. ఇచ్చట నవి ఘనీభూతములై (in a solid state) యున్నవి; అచ్చట ధూమమయమై (in a gaseous state) యున్నవి.

శక్తి:—సూర్యుఁడు ప్రపంచమధ్యమునునుండి తనవంక గ్రహముల నాక ర్షించుచున్నాఁడు. గ్రహములును దమ కనుగుణముగ సూర్యు నాకర్షించుచు న్నవి. ఇట్లు పరస్పర మవి యాకర్షించుటచేతను, సూర్యుని యాకర్షణము ప్రబల మగుటచేతను నవి సూర్యునిచుట్టుఁ దిరుగునట్లు సంభవించినదని గణితశాస్త్ర ధౌ రేయుఁడగు "న్యూటన్" మహాశయుఁడు నిర్ణయించి యున్నాఁడు. ఈ శక్తుల పరిమితిఁగూడ నతఁడు నిర్ణయింపఁ గలిగెను.

భూభగణహేతువులు:—భూమియు గ్రహములలో నొకటి యనియు, నందుచే నదియు సూర్యునిచుట్టుఁ దిరుగుచున్నదనియు మనము చెప్పియుంటిమి గదా? మన వాక్యము యొక్క తత్త్వాతత్త్వముల నిచ్చటఁ గొంత విమర్శించె దము. సంవత్సరమంతయుఁ బ్రతిదినము నొక్క కాలమునఁ గొన్ని నక్షత్రములఁ బరీక్షించెదము. సుమారు ప్రతిరాత్రియు 9 గంటలప్పుడు మన పరీక్ష నారంభిం చెదము. మొదటిరాత్రి నే నక్షత్రములఁ బరీక్షించితిమో యా నక్షత్రముల నే

ప్రతిరాత్రియుఁ బరీక్షింపవలయు. ఒకకాలముననే పరీక్షింప వలయునంటిమి గదా? అదియేల, తెలియునా? ఒకకాలమున సూర్యుఁడు సుమారు ఒక స్థానముననే యుండును. దినదినమును రాత్రి 9 గంటలప్పుడు సూర్యుఁడు పాతాళమున (below the horizon) నొకస్థానముననే యుండును. చాల దినములు పరీక్షింపఁగ మననక్షత్రములు ప్రథమమున దాముండిన చోటు విడిచి పశ్చిమాభిముఖముగ వచ్చుచుండున ట్లగపడును. సుమారు దినమునకు నొక డిగ్రీ వంతున నవి కదలు నట్లుండును. అందుచే రాను రాను సూర్యునికిని మన నక్షత్రములకును గల యంతరము తగ్గుచుండును.

ఇప్పుడు సూర్యుఁడే యాకాశమునఁ దూర్పుముఖముగ వచ్చుచుండినను, లేక నక్షత్రములే పశ్చిమాభిముఖముగఁ బోవుచుండిన నిదియ ఫలితాంశము. ఒకవేళ నక్షత్రములే పశ్చిమాభిముఖముగఁ బోవుచున్నవని తలఁచెదము. ఈనక్షత్రము లిట్లు పోవుచుండున ట్లగపడినను, వానిలో మాత్రము పరస్పర మంతర మెప్పటివలెనే యుండును. ఈ నక్షత్రములకే కాక యితరనక్షత్రము లన్నిటికిఁ గూడ నంతరములలో మార్పులెవ్వియు లేవు. కావున నక్షత్రమండలియంతయుఁ బశ్చిమాభిముఖముగ దినమునకు నొక డిగ్రీ వంతునఁ బోవుచున్నట్లు తీర్మానింప వలయు. మఱియు నక్షత్రములన్నియుఁ బరస్పర మెన్ని కోట్లమైళ్ల దూరమునో యుండుటచే నత్యంత దూరమున నుండునవి మనస్సునకుఁగూడ నగోచరమగు వేగమునఁ బరుగిడుచుండవలయు. సూర్యుఁడు కూడ నొక నక్షత్రమనియే తెలియుచుండుటచే నీ నక్షత్రము లన్నియు నొక నక్షత్రముచుట్టునే తిరుగుచుండు ననుట యవిశ్వసనీయము. కావున సూర్యుఁడే ప్రాఙ్ముఖముగ నడుచుచుండవలయు. అనఁగా సూర్యుఁడు భూమిచుట్టుఁ బ్రాఙ్ముఖముగ దినమునకు నొక్క డిగ్రీవంతున నడచుచు సంవత్సరమున నొకపూర్ణభగణము (revolution) చేయవలయునని తీర్మానింపవలయు.







4. పటము.

యంత్రసాహాయ్యమున సూర్యుఁడు భూమికంటె మిగుల గొప్పవాఁడని తెలియుచున్నది. స్వల్పమూర్తము (body) గొప్పమూర్తముచుట్టుఁ దిరుగుట స్వాభావికము. కావున భూమియే సూర్యునిచుట్టుఁ బ్రాఙ్ముఖముగఁ దిరుగుచుండ వలయు. ఇట్లది తిరుగుటచే సూర్యుఁడుకూడ భూమిచుట్టునదే దిఙ్ముఖముగఁ దిరుగున ట్లగపడునని పై పటముచేఁ దెలుచున్నది.

సూర్యభ్రమణము :—భూమిస్వాక్షభ్రమణము (rotation) చేయుచుం డునట్లు సూర్యుఁడుకూడ స్వాక్షభ్రమణము చేయుచున్నాఁ డని తెలియుచున్నది. అతని భ్రమణకాలము సుమారు 27 దినములు.

## → చంద్రుఁడు. ←

బింబస్వరూపాదులు :—పగటియందు సూర్యుఁడు మనకు వెలుతురు నిచ్చుచుండునట్లు రాత్రియందుఁ జంద్రుఁడు వెలుతురు నిచ్చుచున్నాఁడు. సూర్య బింబము తేజోమూర్తియనియు నత్యుష్ణముగ నున్నదనియు మనము తెలిసికొని యున్నారము. చంద్రబింబ మట్లు కాక స్వయముగఁ బ్రకాశహీనముగను, నత్యంతశీతముగ నుండును. చంద్రబింబమునుండి మనకువచ్చు తేజస్సు సూర్యు నిది. ఇది సూర్యబింబమునుండి బయలువెడలి చంద్రబింబమునఁ బ్రతిహతమై (being reflected) భూమివంకఁ దిరుగుచున్నది.

చంద్రబింబము భూమిచుట్టుఁ బ్రాఙ్ముఖముగఁ దిరుగు నుపగ్రహము (satellite) ఇదిభూమికి మిగుల సమీపమున నున్నది. దీనికిని భూమికినిఁ గల దూ రము సుమారు ముప్పది భూవ్యాసములు. ఈ బింబము భూమికంటె నధికస్వ ల్పము. చంద్రబింబవ్యాసము (diameter) భూవ్యాసములో సుమారు మూఁ డవ భాగముండును. అరిస్టార్కస్సు, ఈ యంశమును బ్రథమమునఁ గనుఁగొనె నని పాశ్చాత్యవిద్వాంసులు చెప్పుచున్నారు.

చంద్రమండలమును, నందలి కళంకమును మన దేశములోని మహాకవుల యొక్క యుల్లేఖలకుఁ బాత్రమై యుండినవి. పూర్ణచంద్రునిఁగాని యర్ధచంద్రునిఁ గాని వానికళంకమునుగాని వర్ణింపని మహాకవియే లేఁడు.

కళంకస్వరూపము :—దూరదర్శినీయంత్రనిర్మాణానంతరము పాశ్చాత్య విద్వాంసులు చంద్రకళంకమును బరిశీలింప నారంభించిరి. చంద్రబింబము శీత మగుటచే నీ బింబపరిశోధనము సూర్యబింబపరిశోధనమంత కష్టసాధ్యముకాదు.

చంద్రబింబకళంకములు సూర్యబింబకళంకములవలె మహాగుహాలు కావనియు, నత్యున్నతపర్వతశ్రేణులనియుఁ దెలిసినది. వీనిలోఁ బెక్కు చోటుల నగ్నిపర్వత ముఖము (craters) లున్నవి. ఈయగ్నిపర్వతము లిప్పుడు నిస్సారములు. ఛాయాపట (Photography) సాహాయ్యమున నీచంద్రబింబకళంకప్రతిమలఁగూడ ననేకనక్షత్రశాలలు ప్రకటించియున్నవి.

వాతావరణప్రసక్తి :—సూర్యునితేజస్సు చంద్రమండలమునఁ గొంత భాగమునఁ బ్రసరించి మఱికొంతభాగమునఁ బ్రసరింపని సమయమునఁ దేజోంధకారవిభాగరేఖ స్పష్టముగఁ దెలియుచున్నది. సంధ్యాప్రసక్తి నచటఁ గానము. అందుచేఁ జంద్రమండలమున వాతావరణము (atmosphere) లేదని విద్వాంసు లూహించుచున్నారు. వాయువులేదు కావునఁ జంద్రమండలము నివాసానర్హమై యూషరముగ నున్నది.

భ్రమణము :—ఎప్పుడు చూచినఁ జంద్రమండలములోని యొక భాగమె భూమికి నభిముఖమై యున్నది. కావునఁ జంద్రుఁడు భూమిచుట్టుఁ దిరుగునంత కాలములోఁ దాను నొకభ్రమణము (Rotation) చేయుచున్నాఁ డని యూహింపఁదగియున్నది.




5. పటము.

ఒక భాగమె యెల్లప్పుడు భూమివంకఁ దిరిగియుండుటచే 'క' అనుభాగము పూర్వము తిరిగియుండిన దిక్కునకుఁ బరాఙ్ముఖముగ రెండవచోటఁ దిరిగియున్నది. కావునఁ జంద్రుఁడు భూమిచుట్టు నర్ధభగణముఁ (Revolution) బూరించుకాలమున నాతనిబింబము ప్రథమదిక్కునకుఁ బరాఙ్ముఖముగఁ దిరిగినది. అతఁడు భూమిచుట్టుఁ బూర్ణభగణముచేయు కాలమున నాబింబము ప్రథమదిక్కునకు నభిముఖముగఁ దిరిగియుండును, అనఁగా నొకభ్రమణము చేయునని యీపటముచేఁ దెలియును. ఈయంశము తెలిసి యుండియె కాఁబోలు "సూర్యసిద్ధాంత" గ్రంథకర్త్రాదులు భూమండలమున నొకపక్షము చంద్రమండలమున నొకదినమనిరి.

శ్రీరస్తు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

## (TELUGU ACADEMY.)

# నలనామసంవత్సరకార్యనివేదనము.

— * సభ్యులు. * —

1. పరిషత్ప్రతిష్ఠాపకు లిరువురిలో నొక్కరగు మహారాజా సర్ వెలుగోటి శ్రీ రాజగోపాలకృష్ణ యాచేంద్రబహద్దరు జి. సి. ఐ. ఇ. పంచహజారీ మన్సబ్దార్ వేంకటగిరి మహారాజావారీసంవత్సరమునఁ గాలధర్మము నొందిరని చెప్పవలసి వచ్చినందుకుఁ జింతిల్లుచున్నాము. వీరిమృతిచేఁ బరిషత్తునకే కా దాంధ్రలోకమునకే యమిత మగునష్టము సంభవించినది. వీరియాంధ్రభాషాపాండిత్యము, భాషాభిమానము, విద్వద్గౌరవము, దేశాభిమానము సువిదితంబులు. వీరియాత్మకు సర్వేశ్వరుఁడు నిత్యానంద మొసంగుఁగావుత! వీరితనుజులును బ్రస్తుత వేంకటగిరి సంస్థానాధిపతులు నగు శ్రీరాజాగోవిందకృష్ణయాచేంద్రబహద్దరువారు పితృప్రతిష్ఠితమగు పరిషత్తును సహజానురాగముతో వీక్షింతురని నమ్ముచున్నారము.

2. పోషకులసంఖ్య యథాప్రకారముగానే యున్నది.

3. యావజ్జీవ సభ్యులసంఖ్య రాక్షససంవత్సరమున 31 రు. వీరిలో దీ. బ. ముట్నూరి ఆదినారాయణయ్యగారు మృతినొందుటచే వారిపేరు తొలఁగింపఁబడినది. క్రొత్తగా ముగ్గురుచేరిరి. మొత్తము సభ్యులు 33 గురు.

4. సాధారణ సభ్యులసంఖ్య ప్రాఁతవారు 136 గురు. ఇందిరువురు మృతినొందిరి. ముప్వురు చందాదారులుగా మాఱిరి. పదునొకండుగురు చందా లీయనికారణమునఁ దొలఁగింపఁబడిరి. క్రొత్తగ 37 గురు చేరిరి. మొత్తమిప్పటిసంఖ్య 157 గురు.

5. గౌరవార్హసభ్యులు క్రొత్తగా ముప్వురు చేర్చుకొనఁబడిరి. ప్రాఁతవారు 36 గురు. మొత్తము 39 గురు.

— * కార్యనిర్వాహకసభ. * —

1. కార్యనిర్వాహక సభ్యులలో నిరువురు గతసంవత్సరమునఁ గాలధర్మము నొందుటవలన వారికిబదులుగ, పురాణపండ మల్లయ్యశాస్త్రిగారిని, కొండ వేంకటప్పయ్య బి.ఎ., బి.ఎల్. గారిని నియమించుటయైనది.

2. ఈసంవత్సరమున మ-రా-శ్రీ. పానుగంటి రామారాయణింగారు ఎం.ఎ. గా రగ్రాసనాధిపతులుగ నుండిరి.

— * పత్రికాప్రకటనము. * —

పరిషత్పత్రిక పూర్వమర్యాదానుసారముగనే ప్రకటింపఁబడుచున్నది. ముద్రాయంత్రాలయమువారు సకాలములో ముద్రింపకపోవుటచేఁ బత్రికవెలు వడుటలోఁ గొంతకాలవిలంబము తటస్థించినది. ఈయేఁట, చంపూరామాయ ణము ముగిసినది. తాళ్లపాక తిరుమలయ్యరచించిన నీతిసీసపద్యశతకముగూడఁ బత్రికలోఁ బ్రకటింపఁబడినది. ఈరెండు గ్రంథములును శీఘ్రముగఁ బుస్తక రూపమునఁ బ్రకటింపఁబడును. పత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసముల శీర్షిక లనుబంధములోఁ జూపియున్నారము.

పత్రికకుఁ జందాదారులు ప్రాఁతవారు 111 గురు. వీరిలో 11 గురు తగ్గిరి. క్రొత్తగా 22 చేరిరి. మొత్తముసంఖ్య 122.

— * పుస్తకభాండాగారము. * —

ఈ సంవత్సరమున సంపాదింపఁబడిన పుస్తకములు.

1. అచ్చుపుస్తకములు :—పరిషత్తున కుచితముగావచ్చినవి 59. కొని నవి 26. మొత్తము 85. ఉచితముగ వచ్చినవానివెల రు. 31—2—0 కొనిన వాని వెల రు. 110—10—0 మొత్తమువెల రు. 141—12—0 ఈ సంవత్సరాంత మునకు భాండాగారముననున్న ముద్రితప్రతుల సంఖ్య. 639.

2. వ్రాఁతపుస్తకములు :—ఈసంవత్సరమున గ్రంథసంపాదకులు నియ మింపఁబడలేదు. పరిషత్తుపైని నాంధ్రభాషపైని నభిమానముగల పొత్తూరు లక్ష్మయ్యగారు, (గుంటూరు) కొన్నిగ్రంథముల నొసఁగిరి. మల్లాది సూర్య నారాయణ శాస్త్రిగారును రాళ్లపల్లి గోపాల కృష్ణశర్మగారును అనంతపురము మండలములోఁ గొన్ని గ్రామములందు గ్రంథములను సంపాదించి తమపరిషదభి

మానమును వెల్లడించినారు. వీరికిని, పొత్తూరి లక్ష్మయ్యగారికిని గృతజ్ఞతా పూర్వక వందనము లర్పించుచున్నారము.

ఈయేఁటఁ గ్రొత్తగాలభించిన వ్రాఁతప్రతులు 257. వీనిలో 1. సశేషామరము (మామిడి వెంకయ్యరచించిన తెనుఁగువ్యాఖ్యతో) 2. భాగవతము షష్ఠస్కంధము. (పోతరాజవిరచితము) 3. రాధామకుందము. (మల్లయకవికృతము) 4. శరభరాజీయము, వైద్యము, (తుల్జూరి శరభరాజకవికృతపద్యకావ్యము) 5. కంసవిజయము (అచ్చతెనుఁగు, పాటిబండ పురుషోత్తమకవి విరచితము) 6. గీతగోవిందము, సాంధ్రపద్యగీతద్విపదము 7. అమరము (ఆంధ్రపద్యకావ్యము, (కోమాండూరి కృష్ణమాచార్య విరచితము) 8. సాంధ్రపద్యభగవద్గీతలు. (నరహరికవికృతము) 9. అష్టమహిషీకల్యాణము (తాళ్లపాక తిరుమలయ్య రచించినది) 10. జయవిజయాభ్యుదయము. (రాజవోలు సుబ్బరాయకవి) ఆంధ్రశబ్దచింతామణిభాష్యము (ఎలకూచి బాలసరస్వతికృతము) మొదలగునవి కలవు. ఇందుభాగవత షష్ఠస్కంధము ముద్రితప్రతులలో నున్న ఏర్చూరి సింగనమంత్రి రచితము కాదు. పురాతన తాళపత్రగ్రంథములలో నితరులురచించిన భాగవత భాగములనుగూడఁ బోతనామాత్యుఁడే రచించినట్లుండుటంజూచి కొన్ని ప్రతులను ముద్రితప్రతులతో సంప్రతించితిమి. అందేకాదశ, ద్వాదశస్కంధములు వెలిగందల నారపరాజు రచించినట్లుండక పోతనామాత్య కృతములనియె కొన్నింటిలోఁ గాన్పించుచున్నది. నడుమనక్కడక్కడఁ బద్యములు, పాదములు, పదములు, వాక్యములుఁగూడ ముద్రితాముద్రిత పుస్తకములలో భిన్నములుగానున్నవి. ఈ షష్ఠస్కంధము ముద్రితస్కంధముకంటె విలక్షణమైయున్నది. సింగరాజుషష్ఠస్కంధమునకు దీనికిం బోలికయే లేదు. కథలో నభిప్రాయభేదములును గలవు. సింగరాజుది సంస్కృతము ననుసరించుచున్నది. ఇది కొంతదూరముగానున్నది. ఆశ్వాసారంభమునఁ గొన్నిపద్యములు లేవు. కన్యాకుబ్జపురవర్ణనముకడనుండి ప్రారంభింపఁబడినది. ప్రతుల నన్నింటిని సవిమర్శముగఁ బరిశీలించి పోతరాజకృతస్కంధము లెవ్వియో యితరులురచించిన వెవ్వియో తిరుగ నిర్ణయింపవలసియున్నది. జయవిజయాభ్యుదయము కళాపూర్ణోదయముం బోలిన పద్యప్రబంధము, కథ కల్పితము. బాలసరస్వతీయ మిదివఱలో నచ్చుపడినదానికంటె విపులముగా నున్నది. అవతారికా పద్యములంబట్టి మూలగ్రంథము విరూపాక్షక్షేత్రము, అనఁగా, బళ్లారి మండలమందలి హంపిలో నొకానొక శివయోగి

వలన బాలసరస్వతికి లభించినట్లు కన్పట్టుచున్నది. ప్రత్యంతరమును సంపాదించి యీగ్రంథము ముద్రింపించి ప్రకటించుట మేలని తోఁచుచున్నది.

సంవత్సరాంతముననున్న వ్రాఁతప్రతులసంఖ్య 4107 ఈగ్రంథముల కకారాది విషయానుక్రమణిక పరిషత్పత్రికలోఁ బింగళసంవత్సరమునుండి ప్రకటింపఁబడును.

గ్రంథముల నిచ్చినవారి నామములు రెండవయనుబంధమునఁ జూపఁబడినవి.

— * నిఘంటునిర్మాణము. * —

భారతప్రయోగానుక్రమణికానిర్మాణమునకుఁ బూర్వాంగముగా విడి విడిగా నెత్తి వ్రాయఁబడినపదము లకారాదిగా సమకూర్పఁబడుచున్నవి. నిఘంటు నిర్మాణపద్ధతి విషయమై ముఖ్యసంపాదకులమతమును సూచించుటకై నూఱు పదములు మచ్చునకు వ్రాసి యచ్చున కిచ్చి యున్నారని గతసంవత్సరకార్యనివేదనములోఁ జెప్పి యుంటిమి కదా? ఆపదములఁ గొందఱుపండితుల కంపఁగా వారు తమయభిప్రాయములం దెలిపినారు. ఈయభిప్రాయముల నన్నిటిని విమర్శించి నిఘంటుసంఘమువారు కార్యక్రమము నిర్ణయించిరి. ఆనిర్ణయప్రకారము నెలకు ముప్పదిరూపాయల జీతముమీఁద నైదుగురుపాఠకులు నియమింపఁబడిరి. వారు, ప్రమాణగ్రంథములుగా గ్రహింపఁబడిన గ్రంథములలో నొక్కొక్కటి చదివి యందలిపదముల విడఁదీసి వ్రాసి వాని నకారాద్యనుక్రమణికరూపముగా సమకూర్చుచున్నారు. వారు చదివినగ్రంథము లేవియన :—

1. మార్కండేయపురాణము.
2. జైమినిభారతము.
3. శృంగారశాకుంతలము.
4. ఎఱ్ఱాప్రెగడ హరివంశము (2 భాగములు.)
5. భాస్కరరామాయణము.
6. ఉత్తరరామాయణము (పాపరాజుది)
7. ప్రభావతీప్రద్యుమ్నము.
8. రంగనాథరామాయణము.

ముఖ్యసంపాదకులు భారతము, హరివంశము, కుమారసంభవము మొదలగు పెక్కుపుస్తకములు చదివి యందలి ప్రయోగవిశేషముల నెత్తి వ్రాయుచున్నారు. నిఘంటు సంబంధకార్యములు పరామర్శించుటకై యొకయుపసంఘమేర్పఱుపఁబడినది. ఆసంఘమువారు రప్పుడప్పుడు సమావేశమయి పని చూచుచున్నారు.

— * గ్రంథప్రకటనము. * —

పూర్వసంవత్సరమునఁ బ్రకటింపఁబడిన రెండుగ్రంథములలో జైమిని భారతము 1918-19 సంవత్సరములలో మధ్యమపరీక్ష (Intermediate Examination) కు బఠనీయగ్రంథముగా విశ్వవిద్యాలయాధికారులు విధించినారు. కవిజనాశ్రయ మీసంవత్సరము ప్రకటింపఁబడినది. పత్త్రికలోఁ బ్రకటింపఁబడిన చంపూరామాయణము, తాళ్లపాకవారి నీతిసీసపద్యశతకము నచిరకాలముననే పుస్తకరూపముగాఁ బ్రకటింపఁబడును. భారతోద్యోగపర్వములో రెండాశ్వాసములకు మాత్రమే పాఠభేదములెత్తివ్రాయుట జరగినది. మిగిలినవానికిఁ బని జరగుచున్నది. శీఘ్రకాలముననే సాంత మగు నని నమ్ముచున్నారము. అది యయిన పిదపఁ బాఠముల విమర్శించి యచ్చునకు శుద్ధప్రతి సమకూర్పవలసియున్నది. అనుకొనినప్రకారము రాయవాచకము పుస్తకరూపముగాఁ బ్రకటింపఁబడలేదు. ముందుసంవత్సర మాపని జరగును.

— * ఆయవ్యయములు. * —

నలనామ సంవత్సరమున సర్వాయము రు. 17687—4—1 సర్వవ్యయము. రు. 17570—9—0.

పూర్వసంవత్సర కార్యనివేదనములో సూచింపఁబడిన పోషకులింతవఱకుఁ జందాల నిచ్చియుండలేదు.

యావజ్జీవసభ్యులలోఁగూడఁ గొందఱు చందాల నీయవలసియున్నది. చందాల నంపుఁడని వ్రాసిన పత్రిక లింతదనుక నిష్ఫలములైనవి. జాగుసేయక చందాధనమంపి పోషకులును సభ్యులును దమ భాషాభిమానమును జూపెదరని నమ్ముచున్నారము.

ఆయవ్యయముల వివర మీప్రక్క పట్టికలోఁ జూడనగును.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు, నళనామసంవత్సరము

### వ్యయము.

| | | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| జీతములు | ... | | | | 1035 | 11 | 10 |
| ప్రయాణ వ్యయములు | ... | | | | 185 | 15 | 6 |
| ఆడిటరు ఫీజు | ... | | | | 50 | 0 | 0 |
| కార్యస్థానము బాడుగ | ... | | | | 351 | 12 | 0 |
| కాగితములు మొదలైనవి | ... | | | | 36 | 0 | 3 |
| చిల్లర యచ్చుకూలి | ... | | | | 66 | 7 | 0 |
| పోస్టేజీ | ... | | | | 64 | 0 | 0 |
| తంతులు, రిజిస్టరులు | ... | | | | 3 | 14 | 6 |
| బైండింగు | ... | | | | 5 | 8 | 0 |
| వ్యాసలేఖనబహుమానము | ... | | | | 200 | 0 | 0 |
| బ్యాంకివ్యయము | ... | | | | 4 | 5 | 0 |
| చిల్లర వ్యయములు | ... | | | | 84 | 4 | 8 |
| పుస్తకభాండాగారము చిల్లరవ్యయములు | ... | 27 | 14 | 6 | | | |
| పుస్తకసంపాదనమునకు | ... | 10 | 2 | 0 | | | |
| | | | | | 38 | 0 | 6 |
| పత్రికకు కాగితములు | ... | 357 | 4 | 2 | | | |
| చిత్తరువులు అచ్చుకూలి మొదలైనవి | ... | 310 | 4 | 0 | | | |
| పత్రికకు పోస్టేజీ | ... | 115 | 6 | 0 | | | |
| ,, చిల్లరవ్యయములు | ... | 2 | 14 | 9 | | | |
| | | | | | 785 | 12 | 11 |
| మినహాయింపులు :— | | | | | | | |
| చందాలు | ... | 195 | 0 | 0 | | | |
| కుర్చీలు మొదలగు సామానులు | ... | 43 | 9 | 0 | | | |
| పత్రికలు | ... | 216 | 3 | 0 | | | |
| పుస్తకభాండాగారము | ... | 86 | 10 | 0 | | | |
| వి. పి. బాకీలు మినహా | ... | 3 | 11 | 6 | | | |
| గతసాలు పత్రికలనిల్వ మినహా | ... | 660 | 12 | 0 | | | |
| | | | | | 1205 | 13 | 6 |
| ప్రచురింపఁబడిన పుస్తకములు గతసంవత్సరాంతమున నిలువ | ... | | | | 837 | 4 | 0 |
| హాలుసాలుకు నిలువ ఆదాయము | ... | | | | 3551 | 14 | 3 |
| | | | | | 8506 | 11 | 11 |

జి. నరసింహాం, ఆడిటరు.

మద్రాసు. 30-3-17.

## ఆయవ్యయములను దెలిపెడుపట్టిక.

### ఆయము.

| | రూ. | అ. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| సభ్యులచందాలు | 1160 | | | | |
| పత్రికలచందాలు | 363 | 12 | | | |
| | | | 1523 | 12 | |
| విడిసంచికల విక్రయము | 10' | 12 | | | |
| పత్రికలు నిలువ | 864 | 12 | | | |
| | | | 972 | | |
| పుస్తకముల విక్రయము | | | 66 | 10 | |
| పుస్తకముల నిలువ :— | | | | | |
| 161 విప్రనారాయణచరిత్రములు (బైండు) | 80 | | | | |
| 119 జైమినిభారతములు (బైండు) | | 0 | | | |
| 300 విప్రనారాయణచరిత్రములు (బైండుకావలసినవి.) | 96 | | | | |
| 700 జైమినిభారతములు (బైండుకావలసినవి.) | 434 | | | | |
| | | | 628 | 13 | |
| ప్యాకేజీలఅమ్మకము | | | 7 | 12 | |
| ఉచితముగవచ్చిన పుస్తకములు (అచ్చువి) | 32 | | | | |
| ,, తాటియాకుపుస్తకములు | 4158 | | | | |
| | | | 4190 | | |
| విరాళములు | | | 418 | 11 | |
| | | | 8506 | 11 | 11 |

పురాణం నాగభూషణం.
నెమలి పట్టాభిరామారావు. కార్యదర్శులు.
ఆచంట లక్ష్మీపతి.

ఆంధ్రసాహిత్యపరిషత్తు, నళనామసంవత్సరాంతము

అప్పు.

| | రూ. | అ | రూ. | అ. | పై |
|---|---|---|---|---|---|
| **పరిషత్తు జనరల్ ఫండు :—** | | | | | |
| అడ్వాన్సు చందాలు పత్రికకు | | | | 0 | 0 |
| **ఇవ్వవలసిన బాకీలు :—** | | | | | |
| కాగితములకుఁగాను | | | 540 | | |
| **పరిషత్తు ఫండు :—** | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | 72290 | 0 | 0 | | |
| ఈసంవత్సరమున జమ | 3551 | 14 | 3 | | |
| | | | 75841 | 14 | |
| **నిఘంటుఫండు :—** | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ | 630 | 13 | | | |
| ఈసంవత్సరమున జమ | 469 | | | | |
| | | | 11000 | | |
| | | | 87384 | 14 | 3 |

పైనిఁదెలుపఁబడిన జమాఖర్చు నిల్వలెక్కను ఆంధ్రసాహిత్యపరిషత్తువారి నళనామసంవత్సరపు లెక్కలతో తనిఖీచేసి సరియైనట్లు తెల్పుచున్నాను.

(ది 23-3-17)నకున్న జమాఖర్చు నిలువలెక్క.

ఆస్తి.

| | | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| పరిషత్తు జనరల్ ఫండు ;— | | | | | | | |
| 3½% గవర్నమెంటుపత్రములు ... | | 10000 | 0 | 0 | | | |
| మద్రాసుబ్యాంకిలో ఫిక్సెడ్ డిపాజిట్టు ... | | 5000 | 0 | 0 | | | |
| ,, కరెంటు అక్కౌంటునిలువ ... | | 2843 | 5 | 5 | | | |
| మేనేజరునొద్ద నిలువ ... | | 116 | 11 | 3 | | | |
| | | | | | 17960 | 0 | 8 |
| వసూలు కావలసిన చందాలు ... | | | | | 6108 | 8 | 0 |
| కుర్చీలు మొదలగు సామానులు (అసలు) ... | | 525 | 8 | 0 | | | |
| గతసంవత్సరాంతమున మినహా | 89-13-0 | | | | | | |
| ఈసం॥ మినహాయింపు | 43-9-0 | 133 | 6 | 0 | | | |
| | | | | | 392 | 2 | 0 |
| కాగితముల నిలువ ... | | | | | 614 | 6 | 10 |
| పత్రికల నిలువవెల ... | | 864 | 12 | 0 | | | |
| 25% మినహాయింపుగా ... | | 216 | 3 | 0 | | | |
| | | | | | 648 | 9 | 0 |
| ప్రచురింపబడినపుస్తకముల నిలువ ... | | | | | 698 | 8 | 0 |
| ప్రచురించుచున్న పుస్తకములకుగా నింతవఱకు వ్యయము ... | | | | | 111 | 4 | 0 |
| వి. పి. పోస్టేజి వసూలుకావలసినది ... | | | | | 3 | 0 | 0 |
| పుస్తకభాండాగారము. ముద్రితప్రతులు :— | | | | | | | |
| గతసంవత్సరాంతమున నిలువ ... | | 1006 | 5 | 6 | | | |
| ఈసంవత్సరమున ఖర్చు ... | | 91 | 4 | 0 | | | |
| ఉచితముగా వచ్చినవి ... | | 32 | 1 | 0 | | | |
| | | 1129 | 10 | 6 | | | |
| గతసాలాఖరునకు మినహా | 263-12-2 | | | | | | |
| పోలుసాలు మినహా | 86-10-0 | 350 | 6 | 2 | | | |
| | | | | | 779 | 4 | 4 |
| పుస్తక భాండాగారము :—వ్రాతప్రతులు. | | | | | | | |
| గతసంవత్సరాంతమునకు | | 46981 | 8 | 0 | | | |
| ఈసంవత్సరమున వచ్చినవి. ... | | 4164 | 6 | 6 | | | |
| | | | | | 51145 | 14 | 6 |
| నిఘంటుఫండు :— | | | | | | | |
| జీతములు మొదలైన వ్యయములు ... | | 7509 | 15 | 11 | | | |
| భారతానుక్రమణిక ... | | 1101 | 14 | 0 | | | |
| పుస్తకభాండాగారము ... | | 146 | 14 | 0 | | | |
| సామానులు మొదలైనవి ... | | 164 | 9 | 0 | | | |
| | | | | | 8923 | 4 | 11 |
| | | | | | 87384 | 14 | 3 |

పురాణం నాగభూషణం. }
నెమలి పటాభిరామారావు. } కార్యదర్శులు.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు నళనామసంవత్సరముయొక్క-

### జమ.

| | రూ. | అ. | పె | రూ. | అ. | |
|---|---|---|---|---|---|---|
| సంవత్సరాదిని నిలువ | | | | | | |
| బ్యాంకినుండి తెచ్చినది | 7863 | 8 | 5 | | | |
| బ్యా[illegible] | 628 | 13 | 5 | | | |
| డిపాజిట్లు | 2546 | 3 | 0 | | | |
| | | | | 11038 | | 10 |
| యావజ్జీవసభ్యులచందాలు | | | | 200 | | |
| సాధారణసభ్యులచందాలు | | | | 553 | | |
| పత్రికచందాలు | | | | 191 | 12 | |
| విరాళములు | | | | 418 | 11 | |
| నిఘంటు విరాళము | | | | 4697 | 3 | |
| విడిపత్రికల విక్రయము | | | | 107 | 12 | |
| పుస్తకముల విక్రయము | | | | 66 | 10 | |
| ప్యాకేజీల విక్రయము | | | | 7 | 12 | |
| వి. పి. పోస్టేజీజమ | | | | 21 | | |
| బైండుచార్జీలు జమ | | | | 6 | 12 | |
| రిజిస్టరులు టెలిగ్రాములు | | | | 0 | | |
| చేబదుళ్లు | | | | 285 | | |
| అద్దె జమ | | | | 12 | | |
| | | | | 17687 | 4 | 1 |

కె. నరసింహం, ఆడిటరు.

మద్రాసు. 30-3-17.

## నగదు జమా ఖర్చు గోష్వారా.

### ఖర్చు.

| | రూ. | అ. | పై. | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|
| 1. బ్యాంకికిఁ బంపినది :— | | | | 9428 | 15 | 5 |
| 1. జీతములు ... | 1035 | 11 | 10 | | | |
| 2. ప్రయాణవ్యయము ... | 185 | 15 | 6 | | | |
| 3. ఆడిటరుఫీజు ... | 50 | 0 | 0 | | | |
| 4. కార్యస్థానము బాడుగ ... | 363 | 12 | 0 | | | |
| 5. కాగితములు కలములు మొదలైనవి ... | 36 | 0 | 3 | | | |
| 6. చిల్లర యచ్చుకూలి ... | 66 | 7 | 0 | | | |
| 7. చిల్లర పోస్టేజీ ... | 64 | 0 | 0 | | | |
| 8. తంతులు రిజిస్టరులు ... | 4 | 5 | 6 | | | |
| 9. సామానులు ... | 42 | 0 | 0 | | | |
| 10. బైండింగు ... | 12 | 4 | 0 | | | |
| 11. యుద్ధవ్యాస బహుమానము ... | 200 | 0 | 0 | | | |
| 12. బ్యాంకివ్యయము ... | 4 | 5 | 0 | | | |
| 13. చిల్లరవ్యయము ... | 84 | 4 | 8 | | | |
| 14. పుస్తకప్రకటనమునకు ... | 111 | 4 | 0 | | | |
| 15. వి. పి. పోస్టేజీ ... | 28 | 1 | 6 | | | |
| | | | | 2288 | 7 | 3 |
| 2. పుస్తకభాండాగారము :— | | | | | | |
| 1. పుస్తకములు వ్రాయించుటకు ... | 6 | 6 | 6 | | | |
| 2. అచ్చుపుస్తకములు ... | 91 | 4 | 0 | | | |
| 3. చిల్లరవ్యయము ... | 27 | 14 | 6 | | | |
| 4. పుస్తకసంపాదనమునకు ... | 10 | 2 | 0 | | | |
| | | | | 135 | 11 | 0 |
| 3. పత్రికవ్యయము :— | | | | | | |
| 1. కాగితములు ... | 289 | 0 | 0 | | | |
| 2. అచ్చుకూలి ... | 297 | 8 | 0 | | | |
| 3. ప్రతిమలు ... | 12 | 12 | 0 | | | |
| 4. పోస్టేజీ ... | 115 | 6 | 0 | | | |
| 5. చిల్లరవ్యయము ... | 2 | 14 | 9 | | | |
| | | | | 717 | 8 | 9 |
| 4. నిఘంటు వ్యయము :— | | | | | | |
| 1. జీతములు ... | 4127 | 1 | 5 | | | |
| 2. అద్దె ... | 342 | 12 | 0 | | | |
| 3. సామానులు ... | 61 | 3 | 6 | | | |
| 4. అచ్చుకూలి ... | 63 | 8 | 0 | | | |
| 5. పోస్టేజి .. | 13 | 4 | 0 | | | |

ఖర్చు.—(continued.)

| | రూ. | రూ. | అ. |
|---|---|---|---|
| 6. పుస్తకభాండాగారము | 19 | | |
| 7. చిల్లరవ్యయము | 87\|11 | | |
| | | 4714 | 14 |
| చేబదుళ్లు తిరిగియిచ్చినవి | | | |
| కార్యస్థానమున నిలువ | | 116 | 11 |
| | | 17687 | 4\| 1 |

పురాణం నాగభూషణం.
నెములి పట్టాభిరామారావు. కార్యదర్శులు.
ఆచంట లక్ష్మీపతి.

కర్ణాటాంధ్రభాషల కత్యంతసంబంధ ముండుటవలనను మహిసూరుదేశమున నాంధ్రుల నేకు లుండుటవలనను నూతనముగా నేర్పఱుపఁబడిన మహిసూరు విశ్వవిద్యాలయములోఁ గర్ణాటగ్రంథములతోఁబాటుగా నాంధ్రగ్రంథములు కూడఁ బఠనీయములుగా నిర్ణయింపవలయునని కోరుచు గతవార్షికోత్సవసమయమున మనపరిషత్తుపక్షమున మహిసూరు సంస్థానాధీశ్వరులకు విజ్ఞాపనము నంపికొనియున్నాము. ఆప్రకారమే మహిసూరుదేశమందును, చెన్నపట్టనమందును గలయాంధ్రులుకూడ మనవిచేసికొని యున్నారు, మహిసూరుదొరతనమువారీమనవి నంగీకరించి రనుటకెంతయు సంతోషమగుచున్నది. తెలుఁగులోఁ బూర్వమువలె, ఎమ్.ఎ. పరీక్షలు జరపుటకుఁ దగినయేర్పాటులు చేయుట యుచితమని మనవిశ్వవిద్యాలయాధికారులకు మనవిచేసికొని యున్నాము. కాని వారింతవఱకు నావిషయమయి జోక్యము కలిగించికొని యుండలేదు. ఈనాటి పాఠశాలలలోఁ జదివి యాఱితేఱినవారలకు దేశభాషాపరిచయ మత్యల్ప మని యనేకుల యభిప్రాయము. ఈయనర్థము తొలఁగింప దేశభాషాభిమానులు కొందఱు యత్నించుచున్నారు. పరిషత్తువారుకూడ నిందులకుఁ దోడ్పడవలసి యున్నది.

# అనుబంధములు.

## 1-వ యనుబంధము.

### నలసంవత్సరపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడిన వ్యాసముల శీర్షికలు, తత్కర్తలు.

1. పరిషత్పంచమవార్షికసభావృత్తాంతము.
2. పరిషత్సభావిషయక పద్యములు.
3. చంపూరామాయణము, ఋగ్వేదికవి వేంకటాచలపతికవి.
4. పరిషత్పుస్తకభాండాగారము.
5. రాక్షససంవత్సరకార్యనివేదనము.
6. ఆంధ్రభాషావాఙ్మయము, శ్రీరాజా మంత్రిప్రెగడ భుజంగరావు బహద్దర్ గారు.
7. ఆంధ్రసాహిత్యపరిషత్సమాజోద్యోగాంశయుతోత్పలమాలిక—కె. వి. శేషాచార్యులుగారు.
8. సంస్కృతాంధ్రముల పరస్పరసంబంధము—ఆకొండి వేంకటశాస్త్రిగారు.
9. అనంతవాహిని, బాలాంత్రపు వేంకటరావుగారు.
10. ఆముక్తమాల్యదను రచించినది కృష్ణదేవరాయలగునా కాదా? శ్రీకోటగిరి వేంకటకృష్ణారావుగారు
11. బాలవ్యాకరణము—సులక్షణసారము, వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు.
12. వేంకటమంత్రిశతకము, అడిదము సూరకవి.
13. ప్రాచీనాంధ్రభాషాస్వరూపము, జయంతి రామయ్య పంతులుగారు బి.ఎ., బి.ఎల్.
14. ఆయనచలనము—కపిస్థళము కృష్ణమాచార్యులుగారు, బి.ఏ. యల్.టి.
15. కలము } భువనగిరి విజయరామయ్యగారు.
16. కవిహృదయము } భువనగిరి విజయరామయ్యగారు.
17. నీతిసీసపద్యశతకము—తాళ్లపాక తిరుమలయ్య.
18. తెలుఁగునందలి దేశ్యాన్యదేశ్యపదజాలము—చిలుకూరి నారాయణరావుగారు, ఎం.ఏ.
19. నన్నయభట్టీయము—బాలసరస్వతీయభాష్యము. { మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు. రాళ్లపల్లి గోపాలకృష్ణ శర్మగారు.
20. గ్రంథవిమర్శనము—పత్రికాధిపతి.
21. స్త్రీవాచకము—ఇతరేతర రోగద్వంద్వము—వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు.

22. ద్వంద్వయుద్ధోపశమనము—మహామహోపాధ్యాయ తాతాసుబ్బారాయశాస్త్రిగారు.

23. గ్రంథస్వీకారము.

24. ఆముక్తమాల్యదయోగ్యత—వి. కృష్ణమోహన్ గారు ఎం.ఏ. హానర్సు బి.ఎల్.

25. విజయనగరసామ్రాజ్యాంధ్రభాషాచరిత్రము—పేమమ్లి అచ్యుతరావుగారు, బి.ఏ.

26. బ్రహ్మసూత్రసారవిమర్శనము.

27. జ్యోతిశ్శాస్త్రసారము—కపిస్థళము కృష్ణమాచార్యులుగారు, బి.ఏ.యల్.టి.

## 2-వ యనుబంధము, (గ్రంథములిచ్చినవారి పేరులు.)

1. యమ్. నరసింహాచార్యులుగారు.
2. పొత్తూరి లక్ష్మయ్యగారు—గుంటూరు.
3. దేవగుప్తము భారద్వాజముగారు—పిఠాపురము.
4. దుర్గరాజు శేషగిరిరావుగారు.
5. కొణకంచి ఉమామహేశ్వరశాస్త్రిగారి కొడుకు నరసయ్యగారు కొప్పులకొండ.
6. తిరిమెల తిరుమలాచార్యులుగారు, కొప్పులకొండ.
7. చియ్యేడుగ్రామకరణము బాలప్పగారు.
8. తిరిమెల నరసింహాచార్యులుగారు, చియ్యేడు.
9. అల్లసాని సీతారామప్పగారు, పాతురాయి గ్రామకరణము.
10. అంబు కొండమాచార్యులుగారు—చియ్యేడు.
11. రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.
12. వీరరాఘవాచార్యులుగారు, బూదేడు కృష్ణాపురాగ్రహారము.
13. యస్. అప్పారావు పంతులుగారు, ఛత్రపురము.

S. V. & CO., MADRAS.

